శ్రీ

# ఆధునిక కవిజీవితములు,

అను

# హైమవతీ పరిణయము.


| నామము. | పేజీ. |
| --- | --- |
| ... ... | 1 |


ఇది


లక్కవరము, వెల్లఙ్కి గైరా ముస్తేట్లజమీందారగు

శ్రీరాజా మంత్రిప్రెగడ భుజంగరావుచే

రచియింపఁబడెను.

ఏలూరు.



మొదటికూర్పు 1000 ప్రతులు.

యస్. మూర్తి అండు కంపెని, కపాలి ముద్రాక్షరశాల

30వ, తంబుశెట్టి వీధిలో ముద్రితము.

1916.

Price Re. 1-8-0.] [వెల రు. 1-8-0 లు.

శ్రీరస్తు.

ఆధునిక కవిజీవితములు,

అను హైమవతీ పరిణయము.

# విషయసూచిక.


| వరుస నెంబరు. | నామము. | పేజి. |
| --- | --- | --- |
| | విజ్ఞాపనము, పీఠిక ... ... | 1 |
| 1 | వేదము వేంకటరాయశాస్త్రిగారు ... ... | 11 |
| 2 | శొంఠిభద్రాద్రి రామశాస్త్రిగారు ... ... | 13 |
| 3 | వడ్డాది సుబ్బారాయఁడుగారు ... ... | 15 |
| 4 | కొక్కొండ వేంకటరత్నశర్మగారు... ... | 18 |
| 5 | పేరి కాశీనాథ శాస్త్రిగారు ... ... | 22 |
| 6 | అయ్యగారి ఉమామహేశ్వరశాస్త్రిగారు ... | 24 |
| 7 | వేమూరి శ్రీరామశాస్త్రిగారు ... ... | 27 |
| 8 | కొప్పరపు కవిసోదరులు ... ... | 31 |
| 9 | ముప్పాళ్ల జానకి రామశాస్త్రిగారు... ... | 37 |
| 10 | వల్లూరి వేంకటరామలింగశర్మగారు, పాపరాజు వీర రాఘవశర్మగారు ... ... | 39 |
| 11 | పాపరాజు వీరరాఘవ శర్మగారు ... ... | 42 |
| 12 | నందగిరి శేషగిరిరావుగారు ... ... | 43 |
| 13 | వల్లూరిరాజకవిగారు ... ... | 46 |
| 14 | చెములూరి వెంకట శాస్త్రిగారు ... ... | 51 |
| 15 | కార్యముపూడి రాజమన్నారు కవిగారు ... | 53 |
| 16 | చిల్లరిగె యోగానంద కవిగారు ... ... | 57 |

| వరుస నెంబరు. | నామము. | పేజీ. |
| --- | --- | --- |
| 17 | పోలరాజు లక్ష్మీనరసింహకవిగారు... ... | 59 |
| 18 | గోపాలుని హనుమంతరాయశర్మగారు ... | 63 |
| 19 | వేలేశ్వరపు సుబ్రహ్మణ్య శాస్త్రిగారు ... | 64 |
| 20 | చిల్లర వేంకటేశ్వర కవిగారు ... ... | 68 |
| 21 | వేంకటరామకవులు ... ... | 70 |
| 22 | కూచి సత్యనారాయణ శాస్త్రిగారు ... | 72 |
| 23 | కురుగంటి సూర్యనారాయణశాస్త్రిగారు ... | 76 |
| 24 | పులవర్తి అన్నపూర్ణయ్య శాస్త్రిగారు ... | 81 |
| 25 | అల్లమరాజు రంగశాయికవిగారు ... ... | 83 |
| 26 | వేమూరి విశ్వనాథ శర్మగారు, యమ్. ఏ. ... | 84 |
| 27 | నంబూరి తిరునారాయణస్వామి శర్మకవిగారు బి. ఏ. | 85 |
| 28 | కార్లమూరి సాంబశివరావుగారు, బి. ఏ. ... | 86 |
| 29 | కలువలపల్లి రంగనాథశాస్త్రిగారు ... ... | 88 |
| 30 | శ్రోత్రిపల్లి సుందరరామయ్యగారు ... ... | 89 |
| 31 | శ్రోత్రిపల్లి రామచంద్రమూర్తిగారు ... ... | 94 |
| 32 | శ్రోత్రిపల్లి సోమసుందరముగారు ... ... | 96 |
| 33 | స్వయంపాకల లక్ష్మీనారాయణశాస్త్రిగారు ... | 99 |
| 34 | శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు ... ... | 100 |
| 35 | ఉపాధ్యాయుల వేంకటేశ్వరశాస్త్రిగారు ... | 102 |
| 36 | కొప్పరపు వేంకటరత్నకవిగారు ... ... | 103 |
| 37 | కొప్పరపు కామరాజకవిగారు ... ... | 104 |
| 38 | కొప్పరపు బుచ్చిరామకవిగారు ... ... | 106 |
| 39 | దేవగుప్త సన్న్యాసి రాజాగారు ... ... | 109 |
| 40 | విడదవోలు సుందరముగారు ... ... | 114 |

| వరుస నెంబరు. | నామము. | పేజీ. |
|---|---|---|
| 41 | అడవి సాంబశివశర్మగారు ... ... | 119 |
| 42 | నందగిరి వేంకటప్పారావు పంతులుగారు ... | 121 |
| 43 | నోరిసీతాకాంత శాస్త్రిగారు ... ... | 123 |
| 44 | దువ్వూరి సూర్యనారాయణగారు ... ... | 125 |
| 45 | కాళ్లకూరి నారాయణరావుగారు ... ... | 127 |
| 46 | రాళ్లపల్లి అనంత కృష్ణశర్మగారు ... ... | 131 |
| 47 | మోచెర్ల హనుమంతరావుగారు ... ... | 135 |
| 48 | సింగుమహంతి పార్థసారధిగారు ... ... | 136 |
| 49 | శేట్టలూరి రాఘవఅయ్యంగారు ... ... | 138 |
| 50 | గాడేపల్లి సూర్యనారాయణ శర్మగారు ... | 139 |
| 51 | దామరాజు శోభనాచలముగారు ... ... | 142 |
| 52 | వడ్లమూని సుబ్బావధానికవిగారు ... ... | 143 |
| 53 | పెమ్మరాజు సత్యనారాయణమూర్తిగారు ... | 145 |
| 54 | సూరవరపు పురుషోత్తమావధానికవిగారు ... | 148 |
| 55 | పోచిరాజు సీతారామయ్యగారు ... ... | 149 |
| 56 | మున్నంగి లక్ష్మీనరసింహశర్మగారు... ... | 152 |
| 57 | వాడపల్లి పట్టాభిరామశర్మగారు ... ... | 153 |
| 58 | మంగిపూడి వేంకటశర్మగారు ... ... | 155 |
| 59 | మిన్నకంటి గురునాథకవిగారు ... ... | 155 |
| 60 | పోతరాజు విశ్వనాథకవిగారు ... ... | 157 |
| 61 | మన్నవ నరసింహముగారు... ... ... | 158 |
| 62 | ... ... ... ... | |
| 63 | ద్రోణమరాజు సీతారామారావుగారు ... | 160 |
| 64 | వందివాడ జగన్నాథకవిగారు ... ... | 162 |

| వరుస నెంబరు | నామము. | | పేజీ. |
|---|---|---|---|
| 65 | శ్రీమత్కిడాంబి వెంకటశేషాచార్యులుగారు | ... | 165 |
| 66 | గొల్లపూడి లక్ష్మణశాస్త్రిగారు ... | ... | 167 |
| 67 | చెలకుపల్లి వెంకటరామయ్యగారు ... | ... | 169 |
| 8 | జంధ్యాల వెంకటప్పయ్య శర్మగారు | ... | 171 |
| 2 | జంధ్యాల శివన్నశాస్త్రిగారు ... | ... | 171 |
| 22 | శ్రీమాన్ వింజమూరి వీరరాఘవాచార్యకవిగారు | ... | 173 |
| 23 | కర్నూలు నాయనకవిగారు ... | ... | 176 |
| 24 | కొత్తూరి సుబ్బయ్యదీక్షితులుగారు ... | ... | 178 |
| 25 | శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ... | ... | 180 |
| 26 | ఇంటూరి సుందరయ్యగారు ... | ... | 181 |
| 27 | గోరుగంటు వెంకట్రామశాస్త్రిగారు | ... | 182 |
| 28 | చింతలపాటి లక్ష్మీపతిశాస్త్రిగారు ... | ... | 184 |
| 29 | మారంపూడి సీతారామమూర్తిగారు | ... | 187 |
| 3 | లక్కావఝ్ఝుల వెంకటకృష్ణశాస్త్రిగారు | ... | 190 |
| 5 | చివుకుల వెంకటాచలశాస్త్రిగారు ... | ... | 191 |
| 80 | ద్విభాష్యం పుల్లకవిగారు ... | ... | 194 |
| 81 | సూరి సుబ్బారాయశాస్త్రిగారు ... | ... | 198 |
| 82 | కాలవాగభట్ల నారాయణశాస్త్రిగారు | ... | 200 |
| 83 | మైనముపాటి హనుమంతరావుగారు | ... | 201 |
| 84 | ఎడపల్లి శంకరసోమయాజిగారు ... | ... | 203 |
| 85 | ఓంకారము గురునరాజకవిగారు ... | ... | 205 |
| 86 | గుండు సోమనాథశాస్త్రిగారు ... | ... | 206 |
| 87 | ద్వివేది నారాయణశాస్త్రిగారు ... | ... | 207 |
| 88 | బొగ్గవరపు శ్రీరామశర్మగారు ... | ... | 209 |

| వరుస నెంబరు. | నామము. | పేజీ. |
|---|---|---|
| 89 | బొగ్గవరపు రామకృష్ణశర్మగారు ... ... | 213 |
| 90 | బుల్బుమల్లు సోమయాజులుగారు ... ... | 214 |
| 91 | భువనగిరి విజయరామశాస్త్రిగారు ... ... | 215 |
| 92 | జోస్యుల వెంకటశాస్త్రిగారు ... ... | 218 |
| 93 | అల్లమరాజు సోమకవిగారు ... ... | 219 |
| 94 | ముక్తినూతులపాటి గోపాలకృష్ణశర్మగారు ... | 221 |
| 95 | శ్రీపాద శివరామసిద్ధాంతిగారు. ... ... | 222 |
| 96 | ఉపాధ్యాయుల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. ... | 223 |
| 97 | చేతపూడి ప్రకాశముగారు. ... ... | 224 |
| 98 | తోపల్లి వేంకటరామసిద్ధాంతిగారు.... ... | 227 |
| 99 | శివలెంక లింగయ్యశాస్త్రిగారు. ... ... | 229 |
| 100 | గిబ్బిట యజ్ఞనారాయణశాస్త్రిగారు. ... | 230 |
| 101 | వెంపటి వేంకటనారాయణగారు. ... ... | 232 |
| 102 | నందివాడ వేంకటశేషకవిగారు. ... ... | 233 |
| 103 | అఖండం భానుమూర్తిశాస్త్రిగారు.... ... | 234 |
| 104 | దేవరకొండ సోమనాథశాస్త్రిగారు ... | 285 |
| 105 | దేవరకొండ మాణిక్యముగారు. ... ... | 285 |
| 106 | కల్లా పాపయ్యశాస్త్రిగారు. ... ... | 237 |
| 107 | ఆకెళ్ల సోమనాథశాస్త్రిగారు. ... ... | 238 |
| 108 | పాపరాజు వెంకటకృష్ణరాయశర్మగారు. ... | 238 |
| 109 | రావల్లి వెంకటకృష్ణారావుగారు . . ... | 241 |
| 110 | బొండాడ సూర్యనారాయణగారు.... ... | 242 |
| 111 | నూతలపాటి వసంతముగారు. ... ... | 244 |
| 112 | ప్రతివాదిభయంకర కృష్ణమాచార్యులుగారు. ... | 245 |

| వరుస నెంబరు. | నామము. | పేజీ. |
|---|---|---|
| 113 | మరింగంటి చక్రాచార్యులుగారు. ... ... | 247 |
| 114 | నందూరు శేషాచార్యులుగారు. ... ... | 348 |
| 115 | కొడమగుండ్ల కేశవాచార్యులుగారు. ... ... | 249 |
| 116 | సేనాధిపత్యం వేంకటనరసింహాచార్యులుగారు. ... | 250 |
| 117 | కందాడ నరసింహాచార్యులుగారు. ... ... | 251 |
| 118 | కోగంటి లక్ష్మీనరసింహాచార్యులుగారు. ... | 252 |
| 119 | చిలకమర్తి రొయింబెరుమానాచార్యులుగారు. ... | 254 |
| 120 | వల్లాన్ చక్రవర్తుల పట్టాభిరామాచార్యులుగారు. ... | 254 |
| 121 | మల్యాల వెంకటరావుగారు. ... ... | 256 |
| 122 | పుట్రేపు నాగభూషణముగారు. ... ... | 257 |
| 123 | గుడిగుంట లక్ష్మీపతిగారు. ... ... | 258 |
| 124 | శ్రీపతి నరసింహారావుగారు. ... ... | 260 |
| 125 | మల్లాది వేంకటసుబ్బారావుగారు. ... | 261 |
| 126 | వ్యాసావఝ్ఝల సత్యనారాయణమూర్తిగారు. ... | 263 |
| 127 | నిడుముక్కల కనకయ్యదాసుగారు. ... | 266 |
| 128 | కొర్విడి రామకవిగారు. ... ... | 268 |
| 129 | సత్యవోలు అప్పారావుగారు. ... ... | 269 |
| 130 | పావరాజు కోదండరామశర్మ గారు. ... | 271 |
| 131 | తిమ్మరాజు వెంకటనరసరాజశర్మగారు. ... | 273 |
| 132 | గుత్తిభాస్కర రామచంద్రరావుగారు. ... | 276 |
| 133 | మల్లంపల్లి కోటీశ్వరశాస్త్రిగారు. ... ... | 277 |
| 134 | శివలెంక నాగభూషణముగారు. ... ... | 278 |
| 135 | పోతరాజు విశ్వనాథకవిగారు. ... ... | 279 |
| 136 | పుల్లాభట్లసత్యనారాయణమూర్తిగారు. ... | 280 |

| వరుస నెంబరు. | నామము | పేజీ. |
| --- | --- | --- |
| 137 | పరవస్తు గోవిందస్వామిగారు ... ... | 281 |
| 138 | పిన్నమరాజు వేంకటరమణయ్యగారు. ... | 282 |
| 139 | ఉప్పల మార్కండేయశాస్త్రిగారు. ... | 288 |
| 140 | ముటపర్తి సోమయ్యగారు. ... ... | 285 |
| 141 | ... ... ... | 286 |
| 142 | ... ... ... | 288 |
| 143 | మంత్రిప్రెగడ వేంకటరమణయ్యగారు ... | 289 |
| 144 | వింజమూరి సూర్యనారాయణగారు ... | 290 |
| 145 | కాశీనాథుని వీరమల్లయారాధ్యులుగారు ... | 294 |
| 146 | చింతపెంట వెంకటరమణయ్యగారు ... | 296 |
| 147 | మంచికంటి పాపయ్యగారు ... ... | 297 |
| 148 | శ్రీరాజామంత్రిప్రెగడ భుజంగరావుబహద్దరు జమీందారుగారు | 300 |
| 149 | ఇమ్మానేని వేంకటగోవిందరావునాయనివారు ... | 309 |
| 150 | శ్రీవిక్రమ దేవశర్మగారు ... ... | 311 |
| 151 | ఈశ్వర సత్యనారాయణశర్మగారు ... | 312 |
| 152 | పేరి పేరయ్యశాస్త్రిగారు ... ... | 313 |
| 153 | కాశీ కృష్ణాచార్యులుగారు ... ... | 316 |
| 154 | అయ్యగారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ... | 317 |
| 155 | నాదెళ్ల పురుషోత్తమశాస్త్రిగారు ... ... | 318 |
| 156 | మయిలవరపు వెంకటరామయ్యగారు ... | 320 |
| 157 | రెంటాల వెంకటసుబ్బారావుపంతులుగారు ... | 322 |
| 158 | కొప్పరపు వేంకటనరసింహకవిగారు ... | 322 |
| 159 | కస్తూరి శివశంకరకవిగారు ... ... | 325 |

| వరుస నెంబరు. | నామము. | పేజీ. |
|---|---|---|
| 160 | బులుసు పాపయ్యశాస్త్రిగారు ... ... | 326 |
| 161 | వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ... ... | 327 |
| 162 | అదిపూడి సోమనాథరావుగారు ... ... | 328 |
| 163 | కళ్లేపల్లె వేంకటరమణమ్మగారు ... ... | 333 |
| 164 | పులుగుర్త లక్ష్మీనరసమాంబగారు ... ... | 336 |
| 165 | వుమ్రేఅలీషాగారు ... ... | 338 |
| 166 | మల్లెల దావీదుగారు ... ... | 341 |
| 167 | బాబుజాన్ చౌదరిగారు ... ... | 344 |
| 168 | కోకా శ్రీరామారావునాయుడుగారు ... | 346 |
| 169 | సత్యవోలు సోమసుందరరావుగారు ... | 348 |
| 170 | సత్యవోలు కామేశ్వరరావుగారు ... ... | 350 |
| 171 | కవితార్కికసింహం వేంకటరంగదాచార్యులుగారు ... | 351 |
| 172 | పారనంది రామశాస్త్రిగారు ... ... | 353 |
| 173 | ఆలూరు వాసుదేవయ్యగారు ... ... | 354 |
| 174 | ముడుంబ దొడ్డయాచార్యులుగారు ... | 355 |
| 175 | యుగళ్ల జానకిరామయ్యగారు ... ... | 357 |
| 176 | వేటూరి వేంకటరామశాస్త్రిగారు ... ... | 361 |
| 177 | భమిడిపాటి అయ్యప్పశాస్త్రిగారు ... | 364 |
| 178 | చక్రవర్తుల కృష్ణమూర్తిసిద్ధాంతిగారు ... | 368 |
| 179 | భమిడిపల్లి సీతారామకవిగారు ... ... | 369 |
| 180 | దంటు లక్ష్మీకాంతముగారు ... ... | 370 |
| 181 | నారపరాజు లక్ష్మీకాంతకవిగారు ... ... | 372 |
| 182 | అడిదము రామారావుగారు ... ... | 374 |
| 183 | పీసపాటి వెంకటరమణయ్యగారు ... ... | 375 |

| వరుస నెంబరు. | నామము. | పేజీ. |
|---|---|---|
| 184 | వెంపటి రామనాథశాస్త్రిగారు ... ... | 376 |
| 185 | మధిర సుబ్బన్నదీక్షితకవిగారు ... ... | 378 |
| 186 | నండూరి మూర్తిరాజుగారు ... ... | 381 |
| 187 | ముడుంబ కృష్ణమాచార్యులుగారు ... ... | 383 |
| 188 | చంద్రమౌళి చిదంబరరావుగారు ... ... | 384 |
| 189 | ముడుంబ నరసింహాచార్యులుగారు ... ... | 386 |
| 190 | అల్లమరాజు వేంకటగౌరీరాజుగారు ... | 388 |
| 191 | సూరిపరపు సీతారామసోమయాజులుగారు ... | 390 |
| 192 | మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు ... | 391 |
| 193 | వింజమూరి వేంకటసుబ్బారావుగారు ... | 393 |
| 194 | కొండమూరి వెంకటరత్నశాస్త్రిగారు ... | 395 |
| 195 | గొర్తి సూర్యనారాయణశాస్త్రిగారు ... | 396 |
| 196 | చీమలకొండ అద్వైతబ్రహ్మశాస్త్రిగారు ... | 398 |
| 197 | మచ్చ సూర్యరావుగారు ... ... | 400 |
| 198 | పరిమి నరసింహముగారు ... ... | 402 |
| 199 | మండ శివరామయ్యగారు ... ... | 404 |
| 200 | పాటిబండ సూర్యనారాయణరావుగారు ... | 405 |
| 201 | మణికొండ శేషాచలగుప్తగారు ... ... | 407 |
| 202 | కోరాడ దుర్గానాగేశ్వరముగారు ... ... | 408 |
| 203 | మంగు వేంకటలక్ష్మీనృసింహారావుగారు ... | 408 |
| 204 | కొండముది నరసింహకవిగారు ... ... | 415 |
| 205 | క్రొత్తపల్లి సూర్యరావుగారు ... ... | 417 |
| 206 | వంగులూరి రామచంద్రశర్మగారు ... ... | 418 |
| 207 | నందిరాజు చలపతిరావుగారు ... ... | 420 |

| వరుస నెంబరు. | నామము. | | పేజీ. |
|---|---|---|---|
| 208 | బొమ్మకంటి నృసింహశాస్త్రులుగారు | ... | 423 |
| 209 | తిరుమల ఉప్పరపల్లెరంగాచార్యులుగారు | ... | 424 |
| 210 | దంతుర్తి సుబ్బారాయశాస్త్రిగారు... | ... | 426 |
| 211 | పండిట్. వి. యజ్ఞేశ్వరశాస్త్రిగారు | ... | 428 |
| 212 | అక్కిరాజు లక్ష్మీనృసింహరావుగారు | ... | 429 |
| 213 | శ్రీడింగరభట్టరు వేంకటాచార్యులయ్యవార్లంగారు | ... | 430 |
| 214 | ప్రయాగ ప్రకాశరావుగారు ... | ... | 431 |
| 215 | అబ్బరాజు హనుమంతరావుగారు ... | ... | 433 |
| 216 | ప్రత్తిపాటి కామేశ్వరకవిగారు ... | ... | 434 |
| 217 | పోతరాజు రామకవిగారు ... | ... | 435 |
| 218 | పెళ్లూరు శ్రీనివాసరంగేశ్వరశర్మగారు | ... | 437 |
| 219 | కామభట్ల పద్మనాభశాస్త్రిగారు ... | ... | 439 |
| 220 | శ్రీపాద పాపయ్యశాస్త్రిగారు ... | ... | 439 |
| 221 | గరిమెళ్ల శివరామయ్యగారు ... | ... | 441 |
| 222 | కన్నెపల్లి సాంబశివరఘురామస్వామిగారు | ... | 442 |
| 223 | చించినాడ వేంకటరత్నశాస్త్రిగారు | ... | 443 |
| 224 | పెళ్లూరి శ్రీరామశర్మగారు ... | ... | 444 |
| 225 | పి. వెంకటరామప్పపంతులుగారు ... | ... | 445 |
| 226 | కాశీనాధుని బ్రహ్మయలింగారాధ్యులుగారు | ... | 447 |
| 227 | వి. హెచ్. అమ్మ్యతిరామశర్మగారు | ... | 448 |
| 228 | కూచిప్రూడి రాజరత్నముగారు ... | ... | 449 |
| 229 | వింజమూరి వేంకటనృసింహాచార్యులుగారు | ... | 451 |
| 230 | మామిళ్లపల్లి సూర్యనారాయణమూర్తిగారు | ... | 452 |
| 231 | తిరుపతి వేంకటేశ్వరులు, శతావధానులు | ... | 454 |
| 232 | ఆకొండి వ్యాసమూర్తిశాస్త్రిగారు... | ... | 459 |
| 233 | ... ... | ... | 460 |

# PREFACE.

In connection with my eldest daughter's marriage on 18th December 1913, I arranged for a meeting of the Sanskrit and Telugu Pandits and Poets with the renowned Mr. Vedam Venkataraya Sastri in the chair. There were then present 148 learned Poets of all castes and creeds, from all parts of the Telugu Country, including native states such as Hyderabad and Mysore. This volume on the whole consists of the lives of 283 poets of whom the lives of those that were present on the occasion were collected as part I and part II includes the lives of the rest who sent their verses. Every one of these poets blessed the couple with long life and prosperity, in verses composed for the occasion. Then it struck me that I shall be doing a useful work to the literature of the land if the biographies of these poets were collected together and with this end in view, I requested one and all of the Pandits to furnish me with the details of their lives. My thanks are, therefore, due to one and all of them for their kind help. I avoided a discussion of the comparative merits and demerits of their style and diction in order to avoid unpleasantness and that is the chief reason why I have given as examples of their style only those verses that have been composed for the marriage. I, therefore, request the reader to refer to their respective books, a list of which has been given in their lives, for further particulars. I intend to bring out a second volume of the lives of Living Poets who have not come within the scope of this volume.

ELLORE.
16-5-16.

RAJAH M. BHUJANGA ROW.

శ్రీరస్తు.

# హైమవతీపరిణయము.

## అను ఆధునిక కవి జీవితములు.

### పీఠిక.

శ్రీమదమలతర కరుణాసుధాలహరీసంప్లావిత నిజభక్తప్రకరుండును హైమవతీ సతీవదనాబ్జమత్తభ్రమాయమాన నయనుండునగు మార్కండేయేశుని యునికిత్రావును జలాపహారేశ్వర వేణుగోపాలాది దేవతానికాయమహోన్నతాలయ గోపురాలంకృతంబును బద్మాహేలావతీ లీలాఖేలాశాలాయమానంబునగు హేలాపురంబు రాజిలుచుండె. అత్యాది కృష్ణవేణీ కుల్యాసీమంతితంబును కృష్ణాగోదావరీ కుల్యాసంయోగ సంభావితోపాంతదేశంబును కృష్ణామండల మండనంబును కృష్ణామండల ద్వితీయాధికారి ఫంస్ద్రకార ప్రముఖన్యాయసభావి సురంబును నాగిరెడ్డివిరాజ దారామరమ్యంబును ధూమశకట తండులయంత్రాద్యనేక యంత్రసంతతాఘుమఘుమితంబును వటవిశాల బహుళతరశాఖానగరగమాచ్ఛాదితంబును నఖిలదేశవిచిత్ర వివిధవస్తుసమావృతవివిధాపణయాతాయాతవివిధదేశవణిగ్జన నికరనిరంతరాళంబునై పశ్యజ్జనమనోమోద సంధాయకంబై యొప్పులకుప్పయై యొప్పుమీరుచుండె. అప్పురంబున నార్వేలకుల విభూషణంబై "మంత్రిప్రెగడ" యనిసంస్కృతంబునం దెలుంగునం గూడ నేకార్థంబుం ద్వయుక్తంబుగా బ్రకటించుటం జేసి యువ్వంశంబునం గల్గువారు సచివసామాన్యులు గాకుండురని ధ్వనింపించు మంత్రిప్రెగడయను నుపనామంబున విరాజిల్లుచు హరితగోత్రసంకలితంబైన యన్వవాయంబునం బుట్టి మహావైభవంబునం జెలువొందుచు స్వకీయభుజబలసంపాదిత రాజ్యరమాధురీణుండును "రాజాబహదరు" అను బిరుదంబులచేత రాజితుండునునగు భుజంగరాయప్రభుమణి విభాసిల్లె. అతండు పురుషార్థచతుష్టయంబుం బోలె దారచతుష్టయంబుం గైకొని యందగ్రమహిషియగు

చిన్నాంబికయందు మల్లికార్జున ప్రసాదరాయసమాఖ్యాకుండగు సుతుం బడసె. ఆభూజానికి నిజపితామహాభిఖ్యాంకితుండగు కొమరుండు కొమరు మిగులుచుండె. ఆప్రభుమణి బాల్యాదిగా విద్యావినయసత్యశుచిత్వాది సమాజరుఁడును సుసమభ్యస్తాంధ్రగీర్వాణభాషా సంస్కారంబునం ఉత్తరోత్తరపరిశీలన దక్షుండైయుండుటవలనం గలిగిన యాంధ్రకవితాష్టావధానాది రచనావిశేషంబులం బొలుపుమీఱుచు వసంత కుసుమాది కంబులగు పెక్కుకబ్బంబులం గూర్చి పండితులకానందంబు నొదవించుచుండు. తద్రచితంబులగు నాటకపాత్రంబుల మొత్తంబుం జిత్తమలరం జిత్రగించు వారికిది తార్కాణంబయగుంగాక. ఈనేల తెలని యేలుబడింబోరింబోరి నానందించు మానవనివహంబునకుం దానకంబులైన, వెల్ల, లక్కవరము మున్నగునూరుల వన్నెవాసికెఁ దేజరిల్లుచు బహుతరంబులగు పత్తింపు ముత్తెంబులం బత్తిదను రూపంబుగ మొల్లంబుగ వెదజల్లుచుండ నట్టిసుసంపత్తిచే నిజపరివారపరిపోషణంబును స్వాభీష్టభోగానుభూతియు యథార్హధర్మనిర్వహణంబును గావించుచుండు. గుంటూరు నంటుకొన్నరను నమెరికా దేశపుదొరసానిచే స్థాపింపంబడిన మిగుల విపులంబగు స్త్రీవైద్యశాలయందా భిషగ్వర్య యమృతహస్తయుం జికిత్సయందారితేఱినదియు నిపుణమతి మఱియు నగుటచే దెక్కురుగున్నజను లితర వైద్యులకసాధ్యములయిన చిరకాలరోగములం బోఁద్రోచికొని ప్రజదేహులై సుఖంబునం బోవుచుంటం బట్టి యట్టియాసయాపులసంఖ్య యధికమై యాగ్రామంబున ముఖ్యబంధువులున్నచో నట్టి కొందఱికిఁ బక్క సెల్లరకు నివసించుటకుం దావులు లభించుటదుస్సాధంబుగా నుండె. అది యాపురంబునం గాపురంబున్న మనుజులతప్పని యెంచుట యుప్పగాదు. ఏమన్నచో నెట్టికుటుంబియైనం దనకుటుంబమునకుం జాలినంతియుఁ గుటుంబము వృద్ధిఁ జెందునకొలందిం జాలనిదియునగుగృహంబునిర్మించికొనియుండుంగాని విపులధనాఢ్యుండైనను విపులమై తన యునికికి మీఱిన యిల్లుఁ గట్టఁడుగదా! యెట్టిగేహంబునం దెట్టకేని నొక పరదేశికి నొకటి రెండు దినములుగాని యంతకుం దాటిన నొకటిరెండుమాసములుగాని

పిల్లతెమ్మెర చేసవిలాసంబుగ మెల్లనం జలించు మంగళదేవతాడోలికలోయనం గన్నులపండువ గావించె. ఆకల్యాణవాసరంబుల నావిరిదివ్వెల వెలుంగునది వానికా భేదంబెఱుంగరాదయ్యె. అబ్బ! అప్పరిణయసమయంబునఁబట్టి మనుష్య సమ్మర్దం బెట్లుసహించితిమో యెంచఁజాల. ఔనౌను. ఉద్వాహదర్శన కౌతుకంబునఁబట్టి రాపిడిఱొయుంగరాదయ్యె. ఆయుల్లోచంబున లోచనమనో మోదకవిధానపటిష్ఠంబులై యామూల పుష్పితంబులును బర్ణపల్లవసముల్లసితంబులునగు లతావితానంబువితానం గొన్నిరచనావిశేషంబులు వాస్తవం బుండీవలెనో, కావు, కాగితంపుఁగట్టడంబులనుకొనియెద. అవియామోద భరితమ్ములుగాకున్నను మనమ్మున నామోదమ్ము వెదఁజల్లె. ఆఁ! మఱచితి. ఆమోదము లేకేమి? అందుఁజిల్కించిన యత్తరు పన్నీరులచేఁ బెంపగు నెత్తావి గుబ్భురించె. హేమంతర్తువగుటంజేసి శీతబాధానివృత్త్యర్థంబుగను వైదుష్య ప్రకటనార్థంబుగను ద్విజశ్రేష్ఠులు గాల్చిన వివిధవర్ణ విచిత్రితంబులగు రాంకవంబులు కుట్టిమంబునం బరచిన రత్నకంబళంబులు స్వచ్ఛాభ్యుత్మలగు వాతిమేమలంబ్రతిఫలించెననం జూపులకింపు సంపాదింపం దొడంగె. రాజభవనాగ్ర ప్రాంగణంబునం గిలమహోత్సేధకాయమానంబునం గట్టిన ధవళధవళంబగు మేలుకట్టు మేలుకట్టు ప్రాంతలంబిరక్తతరచేలాంచలసువర్ణవర్ణ పట్టికావళిశోభితంబై మన్యసంబద్ధంబులును బహువిధరచనాచమత్కృతింబులునగు కాగితంపుబుట్టలయధోదేశంబున వ్రేలు కాగితంపు జాలరులు వాతాందోళితంబులై యింపులు గులుకనటించుటంగాంచు జనులనయనంబులట నుండి మరలంజాలవయ్యె. అట్టిశుభగేహంబున హైమవతీ వివాహంబును సీతావివాహంబును విజయలక్ష్మీ వివాహంబునుం బలపించుమ హైమవతీసీతా విజయలక్ష్మీ వివాహంబు నేత్రానందంబు నొసంగించె. వయసున నాభిజాత్యంబున రూపంబున నలంకారంబున ధనాదివైభవంబునం గన్నెకునను యూపుఁడై వన్నె కెక్కనమగనికిని మగనికినమనగుమగువకును జరుగుచున్న కళ్యాణమెవ్వారిమదికిముద మొదవింపకుండును. కన్యాదాతలిచ్చు ధారాజలంబుతో నయ్యిందుముఖిని సేకరించు నక్కుమారుని మోమునం దుదయించిన ప్రసన్న

నందేజరిల్లునది. అందు సదస్యబ్రాహ్మణాశీర్వాద ప్రముఖంబులు నడుపం బడినవి. ఆనాఁటి తృణదాకాలంబున నధికార ధార్ష్ట్యపు పంతులుగారి భూమికను శైలూషులు చూపిరి.

ఇంగువాసరంబునం బూర్వాహ్ణంబున బ్రాహ్మణ వేషములంబూని కొంత హాస్యరసంబున నటించిరి. ఆనాఁటి యామత్రయానంతరంబునం గవిమండలీ కవితాగోష్ఠి ప్రవర్తిల్లె. ఇదియుంతియు భుజంగరాట్ప్రభుమణి వదాన్యత నపేక్షించుచుం జూచువారలును వినువారలునుంగూడం బ్రహ్లాద విస్మయ సంధాయకంబయ్యె. అందు వారువారు రచించిన సంస్కృతాంధ్రాశీర్వాద సంపుటి పద్యంబుల నాయా కవులే చదువుట నిర్ణీతమైనది. ఆసభకు సంస్కృతాంధ్ర భాషాసిద్ధి పొందిన కవితా సమంచితులగు బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు సభ్యులుగా నుండిరి. వారు "సభాస్తారులారా! ఈనాఁడు శ్రీరాజాభుజంగరాయ బహద్దరుగారు కవుల యాశీఃపద్యములంగైకొని వారికెల్లరకు సత్కారములొనరించెదరు గావున నట్టి పద్యములయందున్నయు గుణదోష విచారణములు సేయక మీరుండుఁడు. అట్లుగానిచో రసభంగమగుంగావున నాప్రార్థనం గైకొనుఁడు." అని యుచ్చస్వరంబున వక్కాణించిరి. అచటం దొలుత శ్రీరాజావారు తమ యాస్థానమునందును, ఉర్లాము పురాధీశ్వరులగు శ్రీ శ్రీ శ్రీ కందుకూరి లక్ష్మీప్రసాదరావు పంతులుగారి యాస్థానమందును విద్వత్కవులగు బ్రహ్మశ్రీ కొంతి భద్రాద్రిరామశాస్త్రిగారి యాశీర్వచన పద్యములంగైకొని తత్కార యుగింబున సౌవర్ణ కటకాభరణంబులందొడగి రాంకవంబుంగప్పిరి. అపిమ్మట మహామహోపాధ్యాయ బిరుదాంకితులగు బ్రహ్మశ్రీ కొక్కొండ వేంకటరత్నము పంతులుగారి యాశీఃపద్య స్వీకారముంజేసి సాలువొసంగిరి. వీరు వారన నేల అందరుదెంచిన కవులకెల్ల నరుదొదవం బరితోషము వెల్లిగొనరాంకవ పారితోషికము లొసంగుటం గన్నులున్నందులకు సాఫల్యము గలుగంజూచి తీరవలవదే? ఆకొనిమదికి కవులెల్ల నెట్లు గోచరించిరో యన్న శుభలేఖ

లంచెనో యనువారును, ఆహాహా! అంతటి మహారాజు నాయట్టివానికి శుభలేఖంబంపెఁగదా యనువారును, నాజన్మము మొదలుగ నెన్నఁడును పాలువు బహుమాన మందలేదనువారును, ఏది యెట్లయిన నేమిగాని యింతటి సభ నెన్నండుం జూడలేదనువారును, కటకటా! శుభలేఖలందియుం గొందఱు రాలేరి వారికిట్టి వేడుకం గన్నులారఁ జూచుభాగ్యము లభింపదయ్యె ననువారును, అయ్యారే! నేఁడుగదా వివిధములగు కవితాభేదముల వీనులార వింటి మనువారును, ఔరౌరా! యీరసికాగ్రేసరుండు కవితారసబద్ధచేతస్కుండై పాలువులం దదుపు ప్రాతిలకంబె సులభంబుగాఁ దలంచి సందియము లేక యొసంగుచుండె ననువారును, అల్పాధిక భేదమెంచక యిచ్చుచుండెం గదా యెట్టి దాక్షిణ్యశాలియో యనువారును, ఎవ్వఁడైన నొకఁడొకఁ డొకపద్ద మల్లినంజాలును పాలువు లభించినదే యనువారును, ఓహో! వ్రాసిన పద్యముచే చదువలేకుండె నీతండే మహాకవియో కాని యీతని మొగమునఁ గవిత్వము కూడవచ్చునా కానిఁ డెవ్వని చేతనో యొకపద్యము వ్రాయించుకొని తెచ్చి చదువలేక చదువలేక చదువుచున్నాఁ డనువారును, (ఒక కవిచెంతం జేరి) వాయనా! నాకొకపద్యము వ్రాసిపెట్టుము. పాలువొకటి దొరికినచో నీధర్మమున నీకొకకాలమునం గప్పికొనియెదననువారును, ఓరీ! నిన్న మొన్నం జూచితివో లేదో మనవాండ్రు పద్యములు వ్రాయుటకుం జెరచుటకు మొదలుపెట్టి యెన్నెన్నికాగితములో చించివేసిరనువారును, వానిం జూడుము చూడుము. వానివయస్సెక్కడ? కవిత్వమెక్కడ? నిజముగా నీపద్యము వీఁడు సేసినదేయగునా యనువారును, గలిగి యాసభ బహుళతర వాచాకల కలితంబయ్యె. కాని యాప్రభుమణి యాశయమేమన, ఆయన కవితాలోలుప హృదయుండుగావున "ఎట్టివారెట్టిరీతిం గవిత రచించినను వారివారికవితకై యిట్లు సత్కరించినచో వీరునుందక్కువారునుం గూడంగను ప్రయత్నంబులొనరించి కవితం జక్కసేయుదురుగావునఁ గవితాలతి నానాటఁ జివురులిడి పొగుచుండును." అని యిట్టి యుద్యమంబుబూనిరి. ఇట్లాసభ యావాఁడు ప్రవర్తిల్లిన నెల్లవారికి సత్కారములొసలుపఁ బ్రొద్దుచాలక జయవా

సరము నాఁటిప్రొద్దుటంగూడ మరల సాగింపంబడె. అందు నిన్నటికంటెం గొందఱును మఱియుం బెక్కురీతులం గొందఱును పఠింపం దొడఁగిరి. ఆ నాఁడు వారినెల్ల సత్కరించి తాము వ్రాయించిన పట్టికలోఁ జేరినవారింజేరని వారి ననాహూతులైనవారింగూడ మరలమరలం బిలచిపిలచి యెల్లరు సత్కరింపంబడిరనుమాటం దత్రత్యులవలన విని యేయేయుదారయుం డుదారకోవిదంబు నంబొదవె. ఇక్కవులనెల్ల నీభూపతి పలువన్నెలనుండి రప్పించి వారికి రాకపోకలకయి ధూమశకటాగనులకు నగువెచ్చంబుల నెమ్మిగుల్కం నిచ్చి పుచ్చె.

ఆయాకవులు రచించిన పద్యములనెల్ల వారివారి చరిత్రములతో నను పదంబున వ్రాయఁబడుంగావున నోకవిచంద్రులారా! మీయెల్లర తారతమ్యం బెంచ మాకునలవిగాదు గావున నింగుం జౌర్వాపర్యంబులకై కినియకుందురు గాకయని మీకు ప్రార్థింపఁబడుచుంటిరి.

గతరాత్రి యత్తుంగమాతంగంబుపై వివిధ రచనా విచిత్రితంబయిన చప్పరంబు నిలిపి యందానూతన దంపతులం గూర్చుండం జేసి యూరేగింపు టుత్సవము నిర్వర్తింపుటం జూచినవారలకుం గల్గిన ప్రమోదంబునకుం దత్త దంతఃకరణంబులె సాక్షులు. చూడనివారికిఁ దెలియఁజేసిన నయ్యయ్యో! చూడమైతిమని వారిమనంబున జింతయుదయించుట దక్క ఫలంబేమి గలదు! నాకబలినాఁటి వాలు ప్రొద్దుతిరిఁ గొప్పరవు సోదర కవుల యాశుకవి సభ యొనర్పం బడియె. ఇందుఁగూడ వేదము వేంకటరాయ శాస్త్రులుగారు సభాగ్రాసనాధి పత్యము వహించిరి. అందందలోంచలో వేడుక జూడం గూడిరి. ఈజరుగుచున్నది హైమవతీ కళ్యాణముగావున హైమవతియగు గౌరీకళ్యాణకథను వర్ణింపుఁడని యగ్రాసనాధిపతిగారు సెలవీయనక్కథనోక సారి బ్ర॥ కొంతి భద్రాద్రి రామశాస్త్రిగారిచేఁ జెప్పింపుఁడని కోరియది విని యక్కథం బద్యములచేనుడివిరి. వారికవితాధోరణిమిక్కిలి వేగమునఁబొప్పారె. బ్ర॥ వేంకటరాయశాస్త్రులవారు కథముగిసిన తర్వాత లేచియిటు వచించిరి.

"వీరి కవితావిశేషము గంగా ప్రవాహమువలె నుల్లసిల్లుచు వినువారల కానందము గల్గించుచుండె. నే నిన్నాఁడు నింతటి శీఘ్రరచనం జూచి యుండలేదు. ఇందుం బొరపాటులుండినచో వానిం బేర్కొనుట యుచితముకాదు. ఎట్టివారికైనం దప్పులుండవచ్చును." అని మఱియుంగొన్ని పల్కులచేఁ గొనియాడిరి. బ్రహ్మశ్రీ పేరి కాశీనాథశాస్త్రులవారు వీరికవితకై సంతసిల్లి శ్లోకరూపమునఁ గొనియాడిరి. అపుడు శ్రీరాజావా రాయాశుకవుల కిద్దఱకు "నాశుకవిశేఖర" యను బిరుదాక్షరములతోఁ గూడినట్టియు మణిఖచితమ్ములగు దేశాలు లునగు సువర్ణకంఠాభరణంబులు వేర్వేఱుగా నొక్కొక్కటిగాఁ బారితోషికంబిచ్చిరి. ఆరేయి నాగబలిమహోత్సవము ప్రవర్తిల్లె. ఆమఱునాఁడు మిథునపువిడెములు దానిమఱుసటినాఁడు దండియాడింపు నొప్పగింతలు నామఱుసటినాఁడు పెండ్లివారి యంపకములును జరిగె. నాటినుండి పదిపదునేను దినములవఱకు బంధుమిత్రాదుల సత్కారపూర్వకంబులగు నంపకములు జరుగుచు నేయుండె.

లోకమున బ్రాహ్మణవివాహములకు నైదుదినంబులు ప్రఖ్యాతముగ నేర్పరుపఁబడినవి. స్థాలీపాకలగ్నమైనచో నొకదినము సంకుచితంబగు. దేవాలయములజరుగు వివాహములకొక్కదినమే. ఈ హైమవతీ పరిణయమెనిమిది దినములవఱకు జరిగి మిగుల నామోదింపఁజేసె.

ఇట్లు విన్నవించు విధేయుఁడు,

కొత్తపల్లి-సుందరరామయ్య.

# ఆధునికకవి జీవితములు.

## 1. వేదము వెంకటరాయశాస్త్రిగారు.

వీరు ప్రమాదీచ మార్గశీర్ష బహుళ షష్ఠినాడు చెన్నపురిని జనన మొందిరి. ఇప్పటికి 61 సంవత్సరములు వయస్సు. వీరితండ్రిగారు బ్రహ్మశ్రీ వేదము వెంకటరమణశాస్త్రులవారు వ్యాకరణశాస్త్రపండితులు. కీర్తిశేషులు. వీరితల్లిగారిపేరు మహాలక్ష్మమ్మగారు. వారిప్పుడు జీవించి యున్నారు. వీరియర్ధాంగలక్ష్మి శేషమ్మగారు. వీరు ఈసంవత్సరమునకు వచ్చిన కవిపండితసభకు సకలజనసమ్మతముగా నగ్రాసనాధిపత్యమును వహించిరి. వీరువ్యాకరణశాస్త్రమునందు మిగుల ప్రవీణులని ఖ్యాతిం గాంచినవారు. ఆంగ్లేయభాష బి. ఏ. పట్టపరీక్షవఱకును జదివినవారు. వీరు కేవలము పరీక్షలయందు జయముగాంచుటకే ఆభాషను పఠింపక పాశ్చాత్యవిద్యావిధానము గలిగించుకొనుటకే చదివినవారు. వీరికి సంస్కృతమునందు వలెనే యాంగ్లభాషయందును విశేషపాండిత్యము కలదు. కవితా సంప్రదాయములను వర్ణనా ప్రణాళియు, ఉభయభాషాకవులయందెట్లున్నదో పరిశీలించుటకై ముఖ్యముగ నాంగ్లభాషపఠించినారు. అందువలన వీరికి విమర్శనాసామర్థ్యము మిక్కిలిగ లభించినది. వీరు కర్ణాటభాషయు, ద్రవిడభాషయు నా ప్రయోజనముగాలికే సంపాదించిరి. వీరిట్లయిదు భాషలయందుఁ బాండిత్యము సంపాదించి ప్రౌఢకవుల హృదయములను గ్రహించియునేక సంస్కృతాంధ్ర ప్రౌఢకావ్యములకు వ్యాఖ్యానములను రచించి యాంధ్రలోకమునకు మహోపకారము గావించి కీర్తిమూరఁగొనిరి. వీరిప్రఖ్యాతము ఆంధ్రలోకమునఁగల అక్షరాస్యుల కెల్లరకును విదితమైయున్నది. కావున విస్తరించి వ్రాయనవసరములేదు. వీరురచించిన మేఘసందేశ వ్యాఖ్యానములవలననే సంస్కృతమున వీరికిఁగలయసమానపాండిత్యమునకు నిదర్శనమైయొప్పుచున్నది. ఆంధ్రభాషయందు వీరికిఁగల పాండిత్యమునకు ప్రసన్నరాఘవవిమర్శనమే తార్కాణమైయున్నది. వీరనేకమైన కవితాసంప్రదాయ విషయములఁగూర్చియు వ్యాకరణవిశేషములఁగూర్చియు విమర్శనములను, అను

ద్రిత గ్రంథచింతామణి మొదలగు పత్రికలయందుఁ బ్రకటించి అనేకములయిన దుష్ప్రయోగములను నివారించినారు. వీరు రచించిన శాకుంతల, నాగానంద, ప్రియదర్శికా నాటకముల యాంధ్రీకరణములు మిక్కిలి రసవంతములనియు, మూలమునకు రసపుష్టియందును, అర్థస్ఫూర్తియందును వన్నె పెట్టుచున్నదని పండిత మండలిచేఁ గొనియాడఁబడెను.

అత్యద్భుతనీతిన్వఃవార కథలు గలకథా సరిత్సాగరమును తెలుఁగు చేసినారు. స్ఖాలిత్య రహితముగ సంస్కరించి విపులమగు వ్యాఖ్యతో శృంగారనైషధమును లఘుటిప్పణములతో, పారిజాతాపహరణము, సారంగధర చరిత్రము, విజయవిలాసము ప్రకటించినారు. తెనుఁగుటీకతో, అమరుక కావ్యము, పంచతంత్రము, దశకుమారచరిత్రము మున్నగు సంస్కృతగ్రంథములు ప్రకటించినారు.

అపారకథా సంవిధానప్రౌఢిఁ జూపుమం బ్రతాప రుద్రీయమను నమూలామాల్యనాటకమును, శృంగారరసగుళికయనఁ బొప్పు, ఉషానాటకమును రచించినారు. వీరు, అసామాన్య సాహిత్యమునకుఁ దోడుగా సకలశాస్త్రపరిచయమును గలిగి తమ ప్రతిభావిశేషమునఁ బండితజనమండలిలోను గవిమండలిలోను మహోన్నతపదవిని జెందినవారు.

వీరియాశీర్వాదము.

శా॥ శ్రీరాంభోధిసుతావరుల్ గిరిసుతా శ్రీకంఠులున్ భారతీ
నీరేజాసనులున్ నిజోపములుగా నేమాననన్యోన్యమున్
గారామారఁగఁ బ్రన్నివాసులయి యోగం బెప్డుఁ గోల్పోకవా
చారీతిన్ జరియించుచున్ మహిమ లీజాయాపతుల్ గాంచుతన్.

స్రగ్ధర॥ చేతోజాతాభిరూపుల్ శిఖిరథవిజయస్థేమధాముల్ తనూజుల్
శీతాంశుప్రాచ్యరేఖాంచితసుమములు స్వర్జప్రియా శ్రీలుకూతుల్
ఖ్యాతిశ్రీబంధురశ్లాఘనసుకృత బుధగ్రామసంతోషణంబుల్
పాత్రివ్రత్యైకపత్నీవ్రతిసురతరు సంప్రాప్తమూపండ్లు మీకున్.

## 2. కౌంతిభద్రాద్రి రామశాస్త్రిగారు.

వీరి నివాసస్థలము పీఠికాపురము. వెలనాటి వైదికులు. ఆపస్తంబసూత్రము. గౌతమగోత్రము. తండ్రి గంగారామయ్యగారు. తల్లి కామాంబ-నలసంవత్సరఫాల్గుణబహుళచతుర్దశి జన్మదినము. వీరు, ఆంధ్రగీర్వాణములయందు, ఉభయవ్యాకరణ విశిష్టంబులగు సాహిత్యములయందును, ఉభయకవిత్వములయందును, ప్రవీణులు. వీరు పెక్కురను సాహిత్యవంతులనుగాఁ జేసిన విద్యాగురువులు. శ్రీరాజా మంత్రిప్రెగడ భుజంగరాయ బహద్దరు జమీందారువారి యాస్థానవిద్వాంసులు. ప్రకృతము, ఊర్లాముసంస్థానాధిపతులగు మ॥ కందుకూరి లక్ష్మీప్రసాదరావు పంతులుగారియొద్ద ఆస్థానపండితులు. వీరు రచించిన గ్రంథములు:—సంస్కృతములు, 1. శంబరాసురవిజయచంపువు, 2. ముక్తావళీ నాటకము, 3. శ్రీరామవిజయము॥ తెలుఁగులు, 1. కాళిందీపరిణయము, 2. శంతనూపాఖ్యానము, 3. ఆంధ్రీకృతముక్తావళీనాటకము, 4. చిత్రసీమ, 5. శివరామశతకము, 6. మల్లికయమునవల, మఱియుఁ గొన్ని చిల్లరవి.

వీరియాశీర్వాదము.

శ్లో॥ పాయాస్తాం నిజనామధారణసముద్భూతాతిహార్దాన్వితౌ
నిత్యం ప్రేమవతీసతీ కరుణయా శ్రీ సత్యనారాయణః
తన్నామాంచనభూమిమండలమి మంతన్నామధేయాన్వితం
కృత్వాప్తాదపరిస్ఫురస్యను మనోగంధావిన శ్రీపుషా. 1.

శ్లో॥ పరిణయసమయేస్మిన్ యస్యదేవంకృపార్థ్యం
భవదభిమతిరైవందంపతీ వామజస్రం
భవనమభి విధేయాస్సంధు మిత్రాదికీర్ణం
శ్రుతిమధురని నాదంమంగళాచార యుక్తమ్. 2.

ఉ॥ శ్రీయును వాణిపార్వతియుఁ జెన్నుగఁ బెన్నురమందు మోమునన్
డాయెడనొప్పువేల్పులు దృఢంబగు ప్రేమవహించితాముప్ప
ప్రేయసులున్నయట్లు లాలనరింతురు వేంకటపూర్వ సత్యనా
రాయణరాయనిన్ వరునిహైమవతిన్ వధువున్ దయాన్వితై. 3.

ఉ॥ నాటితకీర్తులైన ద్విజనాథులమంగళవాక్కుచే నెద
న్నాటిపరస్పరంబుగను వర్మిలి పేర్మి వహింపవద్దమ
న్నాటికులంబు స్వీయగుణ ప్రథిమం బ్రథితిన్ వహింపనా
నాటికి వైభవోన్నతివనాహతి నొప్పెదరివ్వధూవరుల్. 4.

చ॥ సిరులిడునివ్వ వోఘులకు శీతమయూఖకళావతంసుఁడం
బరతటి నీప్రసాధనవిభాసురవిగ్రహల శీర్షభాగుఁడున్
పరభరుఃకారస ప్రసరవన్మృదు చిత్తుఁడు నాటఁజల్లనై
పరగడు శంకరుండతని భామినిసంతతమాదరించునన్. 5.

సీ॥ మొగముజాడనుబట్టి తగియుండుమో యమ్మ
యుజుపోల్కె నిక్కన్న నరయుమయ్య
ఎడలోన మెలఁగుచు నే పొందుమో యమ్మ
హరిపోల్కె నిక్కన్న నరయుమయ్య
ఏకత్వమున నుండి యింపొందుమో యమ్మ
హరుపోల్కె నిక్కన్న నరయుమయ్య
ప్రీతిమీఱఁగ సంచరించు మహోయమ్మ
మరుపోల్కె నిక్కన్న నరయుమయ్య

గీ॥ మీరలన్యోన్యహితరీతి మెలఁగుచుండఁ
గాంచిముదమందునట్టి భాగ్యంబు మాకుఁ
గల్గుగావుత దేవుని కరుణచేత
నిదియుఁ దీవన యుపదేశ మిదియె మీకు. 6.

ఉ॥ దీప్రగుణాఢ్యమాచవగ తేజము చేఁదనరారుచున్నమం
త్రిప్రపిగిదాన్వవాయము మనీషిసమాదరుఁడౌ భుజంగరా
యప్రభుచేతఁ దానినలరారు సువర్ణముఁబోలి మార్దవ
శ్రీప్రథమానమైనమణి చెన్ను నపొందమొసంగుటబ్బమే. 7.

మ॥ కవితాభామిని ప్రౌఢిమన్విడమమున్ గ్రాహ్యాంగనాతుల్యయై
యవివేకత్వము బాల్యఁ బాల్పడియె విద్యాల్పావృతిం జేసి యు
ట్టివిలంబాంబిక యుండనప్పుడు కృతిన్ దివ్యన్ రసజ్ఞాళిసా
జ్ఞవిశృంఖలన్ పెంచి కవితాసౌభాగ్యమున్ నిల్పెఁడీ ౮.

## 3. వడ్డాది సుబ్బారాయఁడుగారు.

వీరు క్రీస్తుశకము 1854 సం॥ జూలై ది 30 తేదికి సరియైన, ఆనంద నామసంవత్సర శ్రావణశుద్ధ ౫ ఆదివారమున నిప్పటి నగరము తాలూకా లోఁ జేరిన పాశర్లపూడి లంక యను చిన్న గ్రామమునందు జననమొందిరి. నియోగి శాఖా బ్రాహ్మణులు. వాధూలసగోత్రులు. అప్పనామాత్య పౌత్రులు. లక్ష్మమాంబకును నారపరాజుగారికిని ప్రథమపుత్త్రులు. వీరిగురువులు భాగవతుల వాసుదేవ దీక్షితులుగారు. వీరి జ్యేష్ఠభ్రాతయును మునిస్వామి శాస్త్రి గారును, పదునొకండవయేటఁ దల్లిగారును గాలధర్మము నొందిరి. నాటనుండియు రామచంద్రపురము తాలూకాలోని ద్రాక్షావాటికకు సమీపమగు నొప్పుదొడ్డమపేట జమీందారిణీవారగు శ్రీ వాడ్రేవు రంగనాయకమ్మగారి కరుణాకటాక్షమున విద్యాభ్యాసాది వృద్ధులనందిరి. వీరికి చిన్నతనముననే వివాహము జరిగినది. 19 యేట అనఁగా, భావ సంవత్సరమున రాజమహేంద్రవర పాఠశాలయం దుపాధ్యాయులుగాఁ బ్రవేశించిరి. చిన్ననాట నుండియు దైవభక్తి మెండగుటఁ బట్టి భాగవతాద్యుద్గ్రంథపఠనమునఁ గవిత్వరచనయందు నిపుణత్వమును సంపాదించిరి. ప్రస్తుతము రాజమహేంద్రవర బోధనాభ్యాసన పాఠశాలయం దాంధ్రోపాధ్యాయులుగా నుండిరి. వీరు రచించిన గ్రంథములు, 1. చండకౌశిక నాటకము, 2. మల్లికామారుత ప్రకరణము, 3. భామినీవిలాసము, 4. సూర్యశతకము, 5. వేణీసంహార నాటకము, 6. శాకుంతలనాటకము, 7. విక్రమోర్వశీయ నాటకము, 8. ప్రబోధచంద్రోదయము, 9. మేఘసందేశము, 10. నందనందనశతకము, 11. భక్తచింతా

మణి, 12. ఆపదుద్ధారక శతకము, 13. సూక్తివసుప్రకాశము, 14. సతీస్మృతి, 15. సుతస్మృతి, 16. సుమనోమనోజ్ఞము, 17. చాటూక్తిముక్తావళి మొదలైనవి. జ్ఞానమునందనుభవ జనితము ముఖ్యము; కావున నట్టి యనుభవజ్ఞానముచేతఁ బ్రేరితమగున కవనమధికరసవంతమయి వీనులకు విందు సేయుచుండును. ఇక్కవివర్యులు తమ యౌవనావస్థయందు గొప్పనర్తకులై నాటకప్రదర్శనమందు స్వానుభవైక ప్రావీణ్యము కలిగియుండిరి. రంగస్థలంబున నాటకమురక్తి కట్టించువిధము విశేషముగ నెఱిఁగియుండిరి. వీరి నాటకరసజ్ఞత కేవల గ్రాంథికమేగాక యనుభవజనితము నగుటచేత వీరి నాటక భాషాంతరీకరణములు మిక్కిలి శ్రావ్యములును, ప్రదర్శనానుకూలములయి రంజిల్లుచున్నవి. అందు ముఖ్యముగ వేణీసంహారనాటకంబు ప్రజాబాహుళ్యంబును రంజింపఁజేసినటు లీయాంధ్రమండలంబున మఱేనాటకంబును రంజింపఁజేయఁజాలదని నొక్కి వక్కాణింపవచ్చును. పండితులయిన నాటక కర్తలయుండి నర్తకత్వము స్వీకరించిన వారిలో వీరగ్రగణ్యులనఁ దగుదురు. వీరితోడి పాటుగా నప్పుడు నర్తకులయిన వీరి శిష్యులిప్పు డనేకులు పదవియందును కీర్తియందును నెన్నికెక్కి పండితకవి బిరుదాంకితులయి వాసిఁగాంచియలరారుచున్నారు. ఈ కవి నాటకములనుగురించి పూర్ణముగ వచింపవలెనన్న నధిక కాలముపట్టును. ఇక్కవి యాంధ్రభాషను పాఠశాలయందు విద్యార్థులకుబోధించుటలో నసమానుండను ప్రఖ్యాతిని, ఆంధ్రమండలంబున వహించియుండె.

శా॥ శ్రీమత్స్థావరజంగమాత్మకజగత్సృష్టీచ్ఛమాయన్ స్వవీ
క్షామాత్రాదృతగా నొనర్చి పోదలన్సర్గంబవిచ్ఛిన్నమై
ప్రేమాద్గాఢనిబద్ధయంత్రచయమున్ స్త్రీపుంవిభేదంబునం
జామున్సేతద్విధాకృతిం దెలుపు తత్త్వంబేలు నీద్వంద్వమున్. 1

ఆ.వె॥ విధువుహైమవతికి వరునకుసత్యనా
రాయణునకు వలయునఖిలశుభము

లాపహింౘుగాక యనురాగపూర్ణులై
యాత్మసతులుదారు వజ్రుడు హరియు. 2.

శా|| మంత్రిప్రెగ్గడసంశ దుగ్ధజలధిన్ మాణిక్యమార్వ్యలస
త్తంత్రావాపసమర్థ గోత్రిశతపత్రశ్రేణి మిత్రుండుగో
సంత్రాణుండు భుజంగరాయకృతి వేశ్యన్మా నితావాణినా
మంత్రించెన్సుతపెండ్లిఁ బిన్నతిసుదాంపత్యాప్తిగా జోటికిన్. 3.

ఆ|| వె|| వాడరేవుకతన వడ్లమన్నాటికు
దారుణాజమీను దార్లతోడ
నిచ్చిపుచ్చుకొనెడునిట్టి వియ్యములువం
గాఁబదుహితమను మరాలునధువు. 4.

తే|| గీ|| విశ్వసుందరు పరిణయవేదిమొలచి
యతనిపెపమేన గోడలియనఁగుఁబెండ్లి
పందిరిని ప్రాఁకుసుమనస్సు పత్రసాంద్ర
కవిసభావల్లి సుఫలముల్ కనకునొసఁగు. 5.

## వివాహవైభవప్రకటనపద్యములు.

ఉ|| నాలవనాటిపెండ్లియిది నాపని నీపని నేడెభద్రకుం
డాలమ! వచ్చినందులకు నల్వురుసంతసమున్ వధూవరుల్
చాలఁగనున్నతింగనఁగనల్పుధమిర్వ్యరమర్త్యకృత్యముల్
లీలభుజంగరాయ శుభలేఖలనిర్ణయమిట్టిదేగదా. 6.

క|| రాజాభుజంగ రాట్కృపి
భోజుఁడహో! దీవదుందు భుల్మ్రోగించెన్
భోజనములఁబూజనముల
భోజనములఁ దనిపిప్రథమ పుత్త్రికపెండ్లిన్. 7.

భారతవర్ష మహామహోపాధ్యాయ,

## 4. కొక్కొండ వేంకటరత్న శర్మగారు.

వీరు ౧౮౪౨ సం॥ మార్చి నెల ౧౪గవ తేదియందు వినుకొండలో జన్మించిరి. పిమ్మట గుంటూరిలో విద్యాభ్యాసము సేసిరి. తరువాతఁ జెన్నపట్టణమున వసించిరి. వీరు చిత్తూరి మండలములోని తిరువలమను గ్రామమునందు వెలసియున్న శ్రీతనుమధ్యా బిల్వనాథేశ్వరులకు భక్తులై, తత్కారుణాకటాక్ష సంప్రాప్త కవిత్వవిద్యా ప్రవీణులై ప్రసిద్ధులైరి. "ఆంధ్ర భాషాసంజీవని" యను మాస వార్తాపత్రికను 30 ఏండ్లు ప్రకటించిరి. చెన్నపురి సర్వకళాశాలయం దాంధ్రపండితులైయుండిరి. తర్వాత రాజమహేంద్రవరము నందలి రాజకీయ శాస్త్ర పాఠశాల యందును, ప్రధాన పండితులై యుండిరి. ఇట్లు వీరు 30సం॥ రాజకీయశాస్త్ర పాఠశాలాంధ్ర పండితులుగా నేయుండిరి. అత్తతినే వీరు భారతవర్ష మహామహోపాధ్యాయ బిరుద పట్టముం జెందిరి. ఇట్టి మహాబిరుదాంకముం జెందిన యాంధ్రులలో మొట్టమొదటి వారువీరే. వీరు నియోగులు. కాఁబట్టి వీరివలన నియోగుల కెల్ల గౌరవాధిక్యము కలిగెనని చెప్ప నొప్పుఁగద. ఇంతేకాక వీరు కవిబ్రహ్మ యనియు, అక్షర సాంఖ్యాచార్యులనియు బిరుదాభిధానములను బొంది యున్నారు. ఇప్పుడు వీరికి ౭౨ సంవత్సరములు. వీరు రచియించిన గ్రంథములు:—1. సంస్కృతమున, బిల్వనాథ శతకము, 2. గీతమహానటమను సంగీత గ్రంథము, 3. తనుమధ్యా గీతరత్నమను గాన ప్రబంధము, 4. తనుమధ్యార్యా శతకము, 5. ప్రిన్సుపువేల్సు తారావళి, ఇది లండన్ క్రాకాపెరిస్ప్ర్యాపెరీ కంపెనీసభవారిచే సముచిత సంభావనతో సమ్మానింపఁబడినది. 6. ప్రిన్సుపువేల్సు, హిందూస్థాన సందర్శనమను నాంధ్ర గద్యకావ్యము. 7. శంకరమత తత్త్వప్రకాశిక యనునాంధ్ర గద్యకావ్యము. 8. బిల్వేశ్వరీయమను మహాకావ్యము, కేవలాంధ్ర పద్యాత్మకము. 9. బిల్వ

నాగేశ్వర శతకము, తెనుఁగు. 10. సింహాచలయాత్ర, తెనుఁగు. 11. కౌశ్మాండ మాహాత్మ్యము, కేవలాంధ్ర పద్యాత్మకము. 12. పానకము, మంగళగిరి క్షేత్ర మాహాత్మ్యము, పద్య గద్యమయము. 13. పాయసము, సత్యనారాయణీయము, అముద్రితము. 14. మోదకము, నియోగి విజయము, నందిరాజు లక్ష్మీ నారాయణ దీక్షిత చరిత్ర. 15. శంకరవిజయ ధ్వజము, ఆంధ్ర గద్యకావ్యము. 16. ఘటికాచల క్షేత్ర మాహాత్మ్యము, ఆంధ్రపద్య గద్యాత్మక ప్రబంధము. 17. అక్షర సాంఖ్యశాస్త్రము, మార్గదాయిని, సంస్కృతము. 18. శ్రీమతీ మాధవ నాటకము. 19. ఆంధ్ర భగవద్గీత, 20. ప్రసన్నరాఘవ నాటకము, 21. నరకాసుర విజయవ్యాయోగము, 22. ధనంజయ విజయవ్యాయోగము, 23. గోదావరీవర్ణన, ఇంక ననేక గ్రంథములు.

శ్లో॥ జయతు విజయలక్ష్మీ సత్యనారాయణశ్చ
జయతు మిథునమేతద్దీర్ఘ మాయుష్యమాప్య
సతత సకల సంపత్సౌఖ్య సంతాన యోగాత్
బుధజనవినుతం స్యాద్భూసురాశీః ప్రభావాత్. 1.

శ్లో॥ యద్ధామవతీసీతా శంకరనారాయణ స్స్వయంరామః
భవతీహ విజయలక్ష్మీ రాశీర్వచనం కిమత్రవక్తవ్యం. 2.

శ్లో॥ నారాయణ స్సత్యవిరాజమాన స్సత్యేనలోకాన్ జయతీతిమత్వా
యస్మాత్కృతౌ వేంకటనాయకో గ్రస్త స్మాద్వయోఽయంత్రి
పదాభిధానః. 3.

శ్లో॥ శ్రీవద్దమన్నాటి కులప్రభూత శ్రీమాంశ్చయో వేంకటరామశర్మా
తస్యాత్మజో వేంకటసత్యపూర్వో నారాయణో రాయపదో
వరోఽత. 4.

శ్లో॥ శ్రీమద్రాజ భుజంగరాయ విభుర త్రాచీ కరత్వత్రికో
ద్వాహం హైమవతీ శరయోరివతురాత్రి గ్యథా సాధిరమ్
సీతో ద్వాహముదార ధీర్జనక వల్లక్ష్మ్యో వివాహంసుధా
రాశిర్వావరయోాభ వేచ్ఛుభమభీష్ట్వార్థాప్తిర ప్యేతయోః. 5

శ్లో॥ మహామహోపాధ్యాయే నకవినారత్న శర్మణా
నిర్మితాన్యర్పితా న్యాశీఃపంచరత్నాని మంగళమ్. 6

వివాహమహోత్సవ ప్రశంస.

బంగారము. శ్రీమంతుఁడైన రాజామంత్రి పెగడభు
జంగరావ్ బహదరు సత్ప్రభునకు-సదయునకున్
ప్రథమపు త్రికయయి ప్రథితయా శ్రీచిరం
జీవినిసౌభాగ్యశీలినికిని-శ్రీమతికిన్
హైమవతికిని సీతామహావిజయల
క్ష్మమ్మకు బ్రహ్మలలక్ష్యం కితుఁడగు-నార్యుఁడునా
పెదపల్లమన్నాటి వేంకటరామయ్య
పంతులుగారి సంభవుఁడు భవుఁడు-భవ్యుఁడునా
ప్రథిత వేంకటసత్యనారాయణాఖ్య-రాయనికిన్
పరిణయంబయ్యెను ప్రమాదివత్సరమున-వంద్యముగన్
మార్గశిర కృష్ణపంచమి మఖనుతులను-మాన్యముగన్
ఎలమి పేలాపురంబున నెన్నికఁగనె-నెసఁగుసిరిన్. 1

పెండి॥ ఇనులెందఱో వచ్చియెంతయు మెచ్చిరి
యీ పెండ్లి వైభవమెంచఁదరమె
ద్విజరాజులెందఱో వినుతించిరెంతేని
నీవివాహోత్సవ మెంచఁదరమె

మంగళార్థ్ము కులందఱుంగడుఁ బొగడిరి
యీపాణి పీడన మెంచఁ దరమె
బుధగురుకవులు సమ్మోదమ్ము నొందిరి
యీపరిణయ శోభ నెంచఁదరమె
యెందఱకు మందహాసంబు పొందెస్థిరత-నటులగుటన్
గ్రహములెల్ల శుభస్థితిఁ గాంచెనంచు-గరుసలవన్
ఇటవధూవరులకు సామ్యమైన సెనంచు-నెల్లరనన్
హైమవతి సీతవిజయలక్ష్మమ్మ పెండ్లి-యులరెఁగడున్. 2.

వెండి|| కన్యకవరుఁ గాంచి కరముహర్షించెను
వరుఁడు కన్యకఁ గాంచి పడసెముదము-వరముగదా
కన్యకా జనకుండుగనియా సమ్మోదమ్ము
వరుని సత్ప్రాజ్ఞత్వ వైభవమున-భవ్యముగా
కన్యకా జననియుఁ గడుముదమందెను
వరునిసంపత్ప్రాభవము జనరాట-నంద్యముగా
బంధువులందఱుం బరమహర్షముఁ బొంది
రనుకూలసంబంధమనుచును మది-న్రబముగా

బహుళమృష్టాన్న భోజనావాప్తిభూరి
దక్షిణలజనులందఱుం దనిసిరిపారి
సకలకవిపండితులు గురుసత్కృతులను
దనివిఁజెందిరి యీపెండ్లిఁదఱ మెపొగడ. 3.

రత్నావళి|| శ్రీరస్తనియును శుభమస్తనియును శ్రీసమృద్ధిరస్తనియునొగిన్
వారకవిజయోస్తని స్వస్త్యస్తనివసుధా మరులెల్లరుఁబల్కన్
ధీరులుకవి పండితులందఱు రహిదీవింపన్వివిధముగమహా
దారుఁడు వరుండు వర్తిల్లెడుఁగడు ధవళపక్షచంద్రునిపగిదిన్.

రత్నావళి॥ హైమవతియొకద పధునామమున హైమవతి భంగినన్నిటనా
భూమిపుత్త్రికగనగు నీయమయే పొందుగసీతాభిఖ్యయొకా
శ్రీమత్ప్రతికిన్విజయ లక్ష్మిగాఁజెలఁగు విజయలక్ష్మమ్మకదా
యీమహీతలమునందిటునంటిడి యీడ్యవివాహ మగనమెందున్ 5.

తే॥ గీ॥ శ్రీమహామహోపాధ్యాయనామబిరుద
రత్నకోకొండ వేంకటరత్నశర్మ
సరసుఁడైనట్టి రాజభుజంగరాయ
ప్రభునితోలికూఁతు పెండ్లి వర్ణనముసేసె. 6.

## 5. పేరి కాశీనాధ శాస్త్రిగారు.

వీరి నివాసస్థానము విజయనగరము. ద్రావిడులు, గౌతమస గోత్రము. తండ్రి వేంకట శాస్త్రిగారు. తల్లి మహాలక్ష్మి. కాలయుక్తి నామ సంవత్సర జ్యేష్ఠ బహుళ సప్తమి జన్మదినము. వీరు భాష్యాంత వ్యాకరణ పండితులు. పూర్వోత్తర మీమాంసలయందు, తర్కాలంకార సాహిత్యమందును ప్రవీణులు. సంస్కృత ప్రాకృతాంధ్రవ్యాకరణ యుక్తకవితా చమత్కారవంతులు. వీరు పెక్కురను వ్యాకరణ సాహిత్యవంతులనుగాఁ జేసిన మహోపాధ్యాయులు. శ్రీ పూసపాటి శ్రీమదానంద గజపతి మహారాజావారి యాస్థాన విద్వత్కవులు. బహుకాలమునుండి వీరు ఉర్లాము సంస్థానాధిపతుల శ్రావణీ విద్వత్సభా పరీక్షాధికారులు. ప్రకృతమున విజయనగర సంస్కృత కాలేజీయందు నుత్తమసాహిత్యవ్యాకరణ మహోపాధ్యాయులు. వీరు రచించిన సంస్కృత గ్రంథములు :—1. పరిభాషేందుశేఖర వ్యాఖ్యకాదంబిని, 2. గంగాస్తవరాజము, 3. యామినీపూర్ణతిలక నాటకము 4. గోదావరీలహరి, 5. పాంచాలికా రక్షణము. (ఏడంకముల మహానాటకము). 6. దుర్గాసౌందర్య శతకము, 7. సర్వమంగళావిభుత్వస్థాపనము,

8. సంస్కృత భాషోపన్యాసము. ఆంధ్ర భాషయందు, 1. పూర్వశాకుంతల నాటకము, (ఏడంకములు.) 2. పార్థసారథి శతకము, 3. వీధీనాటకము, 4. గౌతమ తర్కము, 5. ఆంధ్రీకృత శాంకరబ్రహ్మ సూత్రభాష్య సహితప్రశస్త్యాః ప్రబోధమనవము, 6. భగవద్గీతాసారము. ఇంకను చిల్లరవి మఱికొన్ని కలవు. వీరు శ్రీమదానంద గజపతి మహారాజావారిచే సత్కృతమగు విద్వత్కవీంద్రప్రశస్తిని బొందినవారు.

శ్లో॥ లక్ష్మీనారాయణాదిత్య వాయువారోగ్యవర్ధకా
సధూసరాప్రపాయాస్తాం వైవాహికశుభాన్వితా. 1.

శ్లో॥ భద్రాంకౌతుకవేదిమాశ్రితవతో రన్యోన్యసందర్శన
ప్రీతిస్ఫారదృశో స్త్రపావిముఖయో రుద్గాఢరాగశ్రియోః
సీతారాఘువయోః ప్రలేపధుమతో స్స్వస్వాపరాన్యోత్కయో
రన్యోన్యంరభసాత్కరాగ్రకలితో లాజాంజలిఃపాతువాం. 2.

గద్య॥ భోభోస్సమంతా దున్మీలిత మృదుమృదంగ మంగళరవసంగి సదుపాంగ హృదయంగమ సంగీత భంగీప్రసంగేనచ కదాచిత్సము యోర్యత నానావిధవాదిత్ర నిర్ఘోష విశేష సంతోష సమాగత నానాజన కోలాహల ద్విగుణిత విబుధవరోచ్చార్యమాణాశీర్వచన మంత్రధ్వని బధిరీకృతాన్యోన్య సరస వచన రచనాకర్ణనా వనమిశ్రవణ వివర మనోహరాః.

గద్య॥ పాండురవితాన వితన్యమాన నిరుపమాన భాసమాన కాయమాన ప్రాంత సంక్రాంత చూతపల్లవాంకుర జనితమసృణ మరకతమణి తోరణ శోభావిశస్వరః. అగరు కస్తూరికా మిశ్ర చందనానులేపనజనిత సువాసనావాసి ప్రాంగణ శోభాసురః సుమిత్రాది యుక్తతయా శతానందాది సంధాయకతయాచ పురాతన వాల్మీకి మునివర్ణిత మిథిలానగర సంజాత సీతారాఘువ వివాహ మహోమ

హోత్సవ స్మృతికర విభాకరః కుమారోత్పత్తి నిదానతయా పార్వతీపరమేశ్వరపరిణయ మహోత్సవ సుందరః, శుభచిత్రలేఖా ప్రేరణయాచ, ఉషానిరుద్ధోద్వాహ భ్రమకరః స్వకన్యారత్న భూతాయాః మహాలక్ష్మ్యాః సుగుణగుణాకరేణ దీర్ఘాయుష్మతా శ్రీసత్యనారాయణ పరిణయ మహోత్సవః శ్రీమంత్రిప్రెగడ వంశ స్థూలముక్తాఫలేన రాజాశ్రీభుజంగరాజతిలకేనసమ్యక్సమకారి.

శ్లో॥ శ్రీరాజాంక భుజంగరాయ విబుధః పుత్ర్యాః పరస్యోభయోః
శీతారాఘవయో రివాకృత కృతింవైవాహి కీంకామపి
నిర్వ్యాధళృత కీర్తిమద్భుతళతానందాచ సంధాయకాం
యద్యస్యామ పినాకరమ్యవిభవో యోగస్సుమిత్రాదిభిః. 4

మ॥ అలంమంత్రి ప్రెగడాన్వయాబ్ధి శశియైయత్యంతశోభాదృతి
న్విలసత్కీర్తిని తానురాజగుటచే విఖ్యాతభాస్వద్యశః
కలనన్ వర్ధమనాటి వంశమణి వేంకట్రామునితో వివాహమం
దలసద్వైభవమొప్పఁ దుల్యులకుఁగాదే వివాహముంగన్యమున్. 5

ప్రాకృతము. చౌక్షణదక్షిణ దిట్టుకృపాతమంతోయి వావదిట్టు రసంఅద్ధంజావ
దీ రూపకమద్ధంపూహూమమోదుదంపత్తం. 6

## 6. అయ్యగారి ఉమామహేశ్వర శాస్త్రిగారు.

ఈయన యాఙ్వల నియోగిబ్రాహ్మణుఁడు. కౌండిన్యసగోత్రుఁడు. ఆపస్తంబ సూత్రుఁడు. వయస్సు ౫6 సంవత్సరములు. ఈయన తండ్రి విశ్వేశ్వర శాస్త్రిగారు. తల్లి సూరమాంబ. వీరిచే శ్రీకృష్ణ చరితమను శృంగారకావ్యమును, గురుస్తవతారావళియను వేదాంతగ్రంథమును, వైరాగ్య బోధిని యనునొక గ్రంథమును రచింపఁ బడినవి. ఇక్కడి సాంఖ్యయోగా

ద్వైత[redacted]శాస్త్ర పారదర్శి సంస్కృతాంధ్ర భాషాసాహిత్య పూర్ణుఁడు. ఈ భాషాద్వయ గ్రంథములందనేక విద్యార్థులను పూర్ణులను జేసినారు. ఈయన ప్రపితామహుఁడు అయ్యగారి పెదబాపయ్య శాస్త్రిగారు. పెద్దాపుర సంస్థానములో వత్సవాయి తిమ్మ జగత్పతి మహారాజుగారి యొద్ద ప్రధాన పండితులు. ఈయన పంచ రత్నములను సంగీత వర్ణములు తిమ్మ జగత్పతి మహారాజుగారిమీఁదఁజెప్పి యిరువదిపుట్ల యీనాము భూమిని బహుమతిగాఁ బొందిరి. అది యిప్పటి వఱకును మామహేశ్వర శాస్త్రిగారి స్వాధీనములోనే యున్నది. వీరి కుటుంబములోని వారందఱుఁ బూర్వము నుండియు విద్వాంసులై యుండుటం బట్టి చాలమంది శిష్య బృందముచే నయ్యగారను బిరుదాంక గృహనామముం బొందియుండిరి. "ఆరాధ్యవరులెల్ల నయ్యగారనిపిల్చు, కారణంబున నయ్యగారివారు" అని యీ మొదలయిన పద్యములు శైవ రత్నాకరమను నాంధ్ర గ్రంథమునందుఁ జెప్పఁబడి యున్నవి. వీరికి బొండాడవారు, కాల్లకూరివారు మొదలగు నియోగి బ్రాహ్మణులు శిష్యులు. వీరి పినతండ్రిగారగు, అయ్యగారి వీర శంకర కవిగారిచేఁ జెప్పఁబడిన వ్యాఘ్రేశ్వర శతకమునందు వీరి వంశీయులను గురించి యిట్లు చెప్పఁబడి యున్నది. "గురుతర కౌండిన్యగోత్ర పవిత్రుండు, దెందులూరన్వయ దీపకుండు | భువిభక్తవరులలోఁ బూర్వగణ్యుండును మహితజ్యోతిర్నాథ మాన్యయశుఁడు | నీలకంధరదేవునిష్టతోఁబూజించి బొందితోఁ గైలాసపురముఁజేరె || అమ్మహాద్విజునకు నాత్మజుండగుచును, నురుతేజమున నుదయించి మించి | హరునకు తనుధూప మర్పణంబుగఁజేసె, మోహాంబువిడిచియు నోహిళయ్య|| ఆమోహిళయ్యకునాత్మజుండయిమించు, మల్లనారాధ్యుండుమహిమవెలయు | శ్రీగిరిచెంతను శివపురంబొక్కటి నిర్మించియచ్చట నెమ్మినుండి | రాతిలోలింగంబు రమ్యంబుగాఁజూపి తనరఁబ్రతిష్ఠించె తద్యమహిమ|| అతనికినుదయించె నతులితతేజుఁడై, శివదేవనారాధ్య శేఖరుండు | పరగచండాలుని బ్రాహ్మణుఁగాఁజేసె శివదేవనారాధ్య శేఖరుండు || అశివదేవున కాత్మజుండైనట్టి ఘనత

శక్తిలింగయ్యగారు | దుష్టజనంబులు తొడరితన్నుంధింప, ఘులతరశక్తిలింగయ్య గారు | ఏడహోరాత్రము లేకరాత్రముజేసె, ఘనతర శక్తిలింగయ్యగారు || అమ్మహాదేవుని కాత్మజుండైపుట్టె, మహినికేదారయ్య మాన్యయశుఁడు || అట్టి కేదారయ్యకాత్మజుండైపుట్టి, యవనిలోఁదెలగనాహ్వయఘనుండు | అభవుని పదభక్తి నఖిలవిద్యలునేర్చి రాజసన్మానంబు రమణఁగాంచి | నిరతంబు శివు కడ సెమ్మనంబుననుండఁ గోరెనాతండును గునలయేశు | పెదపూడిపురమును ప్రియమునవిమ్మన చయ్యనవాతండునెయ్యమెసఁగ | రాజరాజ నరేందుృండు రమణనొసఁగె | నతఁడు శివుఁగొల్చుచుండె నత్యధికభక్తి | చిరతరానందనిల యేశ చిత్ప్రకాశ | భవభయవినాశ వ్యాఘ్రేశ పార్వతీశ || ” అను మీఁది సంగతులం బట్టిచూడఁగా నిక్కవి వంశీయులందఱు విద్యా సముద్రులును, భక్తాగ్రగణ్యులు, మహారాజ పూజితులనియుం దెల్లమగుచున్నది.

శ్లో|| శ్రీమంత్రివర్య కులరత్న భుజంగరాయ
సత్కార్యవర్గ పరిపూర్తివిధాన దీక్షం |
వామాంకగాబ్జ నయనాపరి భూషితాంగం
గౌరీసుతం గణపతిం శరణం ప్రపద్యే. 1.

శ్లో|| శాంతం సైరిభదైత్య మర్దనకరీ కేళీ కటాక్షాదృతం
శ్రీహేలాపురవర్య వాసమభవం శీతాంశు రేఖాదరం
మంత్రిప్రెగ్గడ భుజంగరాయ తనయా సమ్మోద సంపూర్తయే
మార్కండేయ మహేశలింగ మనిశం మన్మానసేభావయే. 2.

శ్లో|| సూర్యచంద్రకుజసౌమ్యమంత్రి ణోభార్గవార్కసుతరాహుకేతవః
మంత్రిప్రెగ్గడభుజంగరాట్సుతాం పాలయంతుసవరాంసదాముదా. 3.

శ్లో|| శ్రీవల్లమన్నాటి కులప్రసూతం శ్రీసత్యనారాయణ నామధేయం
శ్రీహైమవత్యాఖ్యవధూసమేతం రక్షాంతుశర్వాచ్యుతపద్మగర్భాః. 4.

శ్లో॥ మంత్రిప్రెగ్గడ భుజంగరాట్కులధరో ద్భూతార్ధ చంద్రాలికా
శ్రీమద్ధైమవతీ సమాహ్వయయుతో శ్రీసద్గుణస్మాట్కులే
జాతంవేంకట సత్యశౌరిమభవం ప్రాప్తా కుటుంబావనీ
జీయాద్భాంధవ వర్గసౌఖ్యజననీ శ్రీశప్రసాదాచ్చిరం. 5.

శ్లో॥ హైమవతీ హేమాభా హేమమయం భర్తృ సద్మరచయంతీ
సోమసమానాన్ పుత్రాన్ జనయంతీ పరమణాచిరంజీయాత్. 6.

శ్లో॥ సుబ్బాంబికాభూద్భువి మేనకాంబా
భుజంగరాయో భవదద్రిరాజః
తయోరభూద్ధైమవతీ కుమారీ
తస్యాఃపతిర్వేంకట సత్యశర్వః. 7.

శ్లో॥ భుజంగరాయి సంపూజ్యో భుజంగ ప్రియనాశకః
భుజంగ భూషణః పాయా ద్భుజంగ ప్రభు శేఖరం. 8.

శ్లో॥ శ్రీకృష్ణరాయ పెదపూడి పురాధివాస
దివ్యాయ్యగారి కులరాజదుమామహేశః
శ్రీమంత్రిప్రెగ్గడ భుజంగమహీ మహేంద్ర కన్యా
వివాహ సమయాశిషు ఉజ్జగాడ. 9.

## 7. వేమూరి శ్రీరామశాస్త్రిగారు.

వీరిజన్మస్థలము నెల్లూరుమండలమున, కందుకూరుతాలూకా ధర్మవరము శివారు, కురుగంటివారి ఖండ్రికయను జువ్విగుంట అగ్రహారము. ప్రస్తుత నివాసము, బెజవాడ లేక నిజాముహైదరాబాదు. వెలనాటి వైదికులు. ఆపస్తంబసూత్రము, హారితసగోత్రము, వేమూరివంశము, హూణశకము 1870

వసంవత్సరము సెప్టెంబరు 15 తేది గురువారమున జన్మించిరి. తండ్రిరామ జోగిసోమయాజులుగారు తల్లి కోటమ్మ సోమిదేవమ్మగారు. తాత, అప్పన యాజులు అను లక్ష్మీనారాయణపౌండరీక యాజులవారు, లక్షణవేత్తలగు ఘనపాఠీలు. కాళహస్తిసంస్థానమునందాస్థాన విద్వాంసులుగనుండెడివారు. తండ్రివేద, శ్రౌత, ధర్మ, వేదాంత, శాస్త్రములయందు వేత్తలు. తల్లికిఁగల ధారణాశక్తి మిగుల స్తవనీయము. వీరలిద్దఱు, అవిచ్ఛిన్నాగ్ని హోత్రులయి, యిప్పుడు ఏలూరునందున్నారు.

వీరు పిన్న వయసుననే వేదాధ్యయనమును, శ్రౌతమును, జ్యోతిష మును, కొంతవఱకు; తమతండ్రి పినతండ్రి మొదలగు వారులయొద్ద నభ్యసించిరి. తరువాత గురుకటాక్షముచే విద్వాంసులయిరి. తర్కాలంకారాది శాస్త్రములును, అవధాన కవిత్వాదివిద్యలును, వీరి కభిమానాస్పదములు. సంభాషణశక్తి వీరి సొత్తు. తల్లికిఁగలధారణాశక్తియే వీరియవధానధారణా శక్తికిఁబూర్ణాది యనవచ్చును.

1894 సంవత్సరములో బయలువెడలి సేటివఱకుఁ గన్యాకుమార్యాది కాశ్మీరాంతిముగల భారతభూమియంతయు పాండిత్యప్రచారమునకై సంచరించుచున్నారు. ప్రథమమునఁ గేవల సంస్కృతపాండిత్యముననే పురస్కరించుకొని, బయట వెడలినను ఇప్పటికి పదునాలుగు భాషలలో మాటలాడను, మూఁడు భాషలలోఁ గవిత్వముచెప్పను, సామర్థ్యమును సంపాదించిరి. వీరిచే రచించబడిన గ్రంథాదులలో సంస్కృతమున "అవధానవిధానమ్" "గురు కల్పమ్" "నూతనోద్యానమ్" ఆంధ్రమున "ఆంధ్రసంగీత రత్నాకరము" "దేశభాషాకదంబము" హిందూస్థానిలో "ఖాఖాగోపాల రత్నాకర్" "సాంఘిక ప్రస్తావ్"

1898 లో శ్రీ బరోడామహారాజాగారి సమక్షమున పదునాలుగు గంటలలో సంపూర్ణ శతావధాన మొకటియొనర్పఁబడి బహుమతియొసంగఁ బడినది.

1903 లో శ్రీకాశ్మీరమహారాజావారిని దర్శించి "గ్రైవేయకబంధ" మనుకవితా చమత్కృతిచే మెప్పించి, "మణికంఠ" మనెడిహారమును బడసిరి. పూర్వము దిగ్విజయార్థమై వెడలి సర్వజ్ఞపీఠాధిరోహణముఁజేసిన శ్రీశ్రీశ్రీ శంకరాచార్యులవారికి తరువాత, కాశ్మీరమునకు పాండిత్య ప్రచారమునకై వెడలి మహారాజావారివలన సమ్మానమునందిన ద్రావిడులు మఱియొక రెవరును లేరు.

1911 లో శ్రీజార్జిచక్రవర్తిగారి పట్టాభిషేక మహోత్సవ సందర్భమున వీరిచే రచించఁబడిన "ఢిల్లీప్రభ" లేక "దర్బార్ కసీదా" యను సంస్కృతగ్రంథమును బరిశీలించి, ప్రభుసముఖమున, విద్వన్మండలిలోఁ బ్రథమకక్ష్యయందు గౌరవమొసఁగఁబడినది.

శ్రీజగద్గురు పీఠమగు, శృంగగిరియందు "సప్తలాభస్తుతి" యనుశారదాస్తోత్రమును శ్రీ శ్రీ శ్రీ సచ్చిదానంద శివాభినవ నృసింహభారతీస్వామివారువిని, వీరికిఁగల శారదాభక్తికి సంతసించి యాశీర్వదించిరి. నిజాంరాజ్యమున ధార్మిక విషయములలోఁ దమకుఁ బ్రతినిధిగ వ్యవహరించుటకు నధికారపత్రమును గూడ నొసఁగిరి.

వీరిచరిత్ర మిదివరలో వంగదేశమున "సార్థక శతావధానీ"యనియుం కాశికధియ వాడిలలో "అవిచ్ఛిన్నాహితాగ్ని వంశ" మనియుం, మళయాళమున, "అపార చరితన్" అనియుఁ బ్రకరణోచితముగఁ బ్రకటితమై యున్నది.

వీరి కనిష్ఠ సోదరుఁడు విశ్వనాధ శర్మ, యమ్. ఏ., యల్. టి., రైరాజమహేంద్ర వరమునఁ గళాశాలలో నుపాధ్యాయులుగా నున్నారు.

అనుష్టుభమ్॥ కన్యాందాతుర్గృహీతశ్చ వంశయోరుభయోస్సదా
స్వస్త్యస్తుమహతాంధర్మ ప్రజాసంపత్తయేసదా. 1.

ఆర్యా॥ వేదైశ్శాస్త్రగమనిపహై। స్వమబుద్ధిర్నిరవధీర మాపిపమమ్।
నానావిధబలమపిభవ। రాగస్సాద్వైజవేలసేజ్జగతి॥

(2) మణికొండాస్థానమున మ॥ శ్రీకాటిరెడ్డి గోపాలరెడ్డి జమీందారు వారిచే "బాలసరస్వతి" బిరుదమును, (3) నెల్లూరులో మహాసభాజనులచే "ఆశుకవీంద్ర సింహ" బిరుదమును, (4) బుచ్చిరెడ్డిపాలెములో మ॥ బెజవాడ పట్టాభిరామరెడ్డిగారిచే "విజయఘంటికా" బిరుదమును, (5) మదరాసు మహాజనసభలో మ॥ విజ్ఞానచంద్రికామండలి వారిచే "ఆశుకవిచక్రవర్తి" బిరుదమును, (6) మఱియొకసభలో "విజయఘంటికా" బిరుదమును, (7) గుంటూరులో మహాసభాజనులచే "కుండినకవిహంస" బిరుదమును, (8) అందే సోమసుందరేశ్వరాలయసభలో "కవిరత్న" బిరుదమును, (9) బాపట్లలో మహాసభాజనులచే "అవధాని పంచానన" బిరుదమును, (10) మార్టేరులో మహాసభాజనులచే "కథాశుకవీశ్వర" బిరుదమును, (11) ప్రకృతము మాచే మహాసభలో "ఆశుకవిశిఖామణి" బిరుదమును, బొందిరి. వీరింత కాలమును, అవధానాశుకవిత్వ సభలఁ గడపి యిప్పుడిపుడే గ్రంథరచన కారంభించిరి. కాని, ఇంతకుమున్ను కొన్ని శతకములను దత్తుల్యములగు కొన్ని చిన్నిపొత్తములను రచించియున్నారు. వీరు, ఆశువున నానావిధవృత్తములతో నెట్టికథనైనఁ బ్రబంధశైలిగ గంటకు 500 పద్యములు రచించు సామర్థ్యముగలవారు, వీరొకపర్యాయము పన్నిదమునకై మార్టేరు సభలో గంటకు 720 చొప్పున నొక యరగంటకాలము మను చరిత్రమాశువుగ రచించిరఁట. వీరిపై నితరులగు మహాకవులు రచించిన ప్రశంసా పద్యము లొక సహస్రము కెక్కువయుండును. వీరింతవఱకు రచించిన పద్యములన్నియు, వ్రాసియుంచినచో సుమారు మూఁడులక్షల కెచ్చుగాఁగలవని సహృదయుల యభిప్రాయము. వీరిరువురును సోదరులు. వీరికింక నిరువురు సోదరులు కలరు. అందుఁ బ్రథములు, అష్టావధానమునఁ గృతకృత్యులై శతావధానమునకుఁ బ్రయత్నించుచున్నారు. గంటకు 200 పద్యము లాశువుగఁ జెప్పఁగలరు. వీరిపద్యము లీ గ్రంథమందు మఱియొకచోఁ గాన్పించును. వీరి పిన్నతమ్ములును గవిత్వము చెప్పఁగలరఁట. వీరి గృహమును జా-

చిన యొక కవి "కవితపుట్టిల్లు సోమరకవులయిల్లు" అని చెప్పిన గీతపద్య పాదమునుబట్టియే సర్వమును గ్రహింపదగియున్నది. జగద్విఖ్యాంత కీర్తులగు వీరి విషయ మింతకన్న వ్రాయుట పునరుక్తి.

సీ|| విశ్వదేవతాబృందంబతి భక్తినాందీము
ఖముసనదీతీరంబిచేకొన్న యమలబుద్ధి!
తగ "సభాసప్తసదాధన" యనిపల్కు
యబలఁ బ్రేమించు గృహస్థమౌళి!
"నాతిచరామి" యన్నైగమోక్తినిసర్వ
హితముగఁ జెల్పినబుధవచస్కు!
సంతానసౌభాగ్య సంధాయకునిగాఁగ,
నగ్నినభ్యర్చించినట్టి సుకృతి

గీ|| శ్రద్ధయును, వేడ్కమనమున సంపడింపఁ
బరిణయపు వేళనిపల్కు పల్కులెల్ల
మఱవకయె, హైమవతిఁగూడి నరళుభంబు
లందికొనుమయ్య! సత్యనారాయణయ్య! 1.

మ|| అడుగన్నేరనివారి, వర్ధులఁగవీంద్రాళిన్ బుధవ్రాతమున్
గడుశ్రద్ధంబరికించి, ప్రేమడినిఁగాంతుంచీర్చి "యీమామయ
ల్లుఁడెయా"నంచు జగంబుమెచ్చుకొన, నుశ్లోకంబు రాణింప, నీ
నడకన్ముంగలివారికిం దెలుపుమన్నా! సత్యనారాయణా! 2.

మ|| భయమున్భక్తియు శ్రద్ధయుంగవులపైఁ బాటింపుమన్వాంర నీ
కయమున్గూర్చి, యుశమ్మొసంగఁగల వారన్యంబులింకేల, నీ
పయిఁగూర్మిన్ వచియించినారమిది, యీపైనీహితంబేవిధం
బయినన్ సమ్మతమే! రహస్యమిదివత్సా! సత్యనారాయణా! 3.

సీ|| కన్నబిడ్డలకన్నఁగడుఁ బ్రేమనిశంబుఁ
బరిచారికాజనం బరయుమమ్మ
కులదైవతములందు, గురువులయందుఁ బె
ద్దలయందునతిభక్తిఁ గొలుపుమమ్మ
పతిదేవతామణి ప్రకటచరిత్రముల్
సేర్చితద్ధర్మముల్ తెలుపుమమ్మ
ఆలుదూ లెఱుఁగక యుత్తమామలస ప
ర్యలఁదన్పి మంచిపేరందుమమ్మ

గీ|| మగఁడు దేవుం డటంచునమ్మఁగదవమ్మ
కవులయాశీః ఫలంబులుగాంచుమమ్మ
మా భుజంగ నృపాలునిమాననీయ
యశము నిల్పంగదమ్మ మాయమ్మ కాన! 4.

సీ|| కూడబాయక యాట పాడుముల్ జూపు నె
చ్చెలులగౌరవమునఁ దలఁపుమమ్మ
పొత్తిళ్లనుండి నిన్నెత్తిపెంచినదాదు
లనువర్మిలినిజూచి తనుపుమమ్మ
బీదసాదలపట్లఁ బ్రేమంబు తెలిపి "చ
ల్లనితల్లి" యను పేరునందుమమ్మ
దౌహిత్రలాభంబుఁ దండ్రిగారికిఁగూర్చ
మంచిసంతానంబుఁ గాంచుమమ్మ

గీ|| సకలసామ్రాజ్య సౌభాగ్యశాలినివయి
సారదళ్లొక్త్త నీయ తవారియింట
సర్వమంగళయనఁ బ్రీతిసల్పు వేళఁ
దేజరిల్లఁగ హైమవతీకుమారి. 5.

శా॥ శ్రీభద్రాంకు భుజంగ భూషితసుమూర్తిన్ గాత్రధర్మాధ్వతా
శోభిన్ హైమవతీకళత్రు, విబుధస్తోత్రార్హచారిత్రుస
త్యాభిఖ్యున్ శ్రితసద్గణావనకళావ్యాప్తోజ్జ్వలాకారు, నా
త్మాత్మున్ హైమవతీ కళత్రుఁడల విశ్వాధీశ్వరుండోముతన్. 6.

సీ॥ ఆత్మప్రభావ శక్త్యౌజ్జ్వల్యములర, ర
వి, పితృసుఖంబుఁ గావించుచుండ
హృదయప్రసాదసంపద దోఁపఁ జంద్రుండు
మాతృసౌఖ్యముఁ గూర్పిమనుచుండఁ
పరివార పరవైభవము మీఱునంగార
కుండు, భ్రాతృసుఖంబుఁ గొల్పుచుండఁ
గర్మవిజ్ఞానాదికము లొహింప, బుధుండు,
కరముఁ బ్రజ్ఞ నొసంగి కాచుచుండఁ
దేజోబలాధ్యతన్ దీవింప, గురుఁడు, సం
తానసంతోషంబుఁ దార్చుచుండ
మహనీయవాహనమహిమంబు వెలయ; శు
క్రుఁడు భోగగరిష్ఠంబు నడపుచుండ
సుఖదీవనసమృద్ధిశోభిల్ల, శని, మహో
యూర్వాగ్యమిడి, కృపఁ జూచుచుండ
వనతటాకాదికల్పన, నవల్పయశంబు
పొసఁగ రాహువభీష్ట మొసఁగుచుండ

గీ॥ ననుపమానానదాన విద్యావిరూఢి
యమరఁగాఁ గేతు వమృతపదాభిలాష
మొనరనేయఁగ నిత్యవృద్ధిగణింత్రు
గాత! మామాత్మదంపతుల్ ఖ్యాతియుతులు. 7.

సీ॥ శ్రీరస్తువిజయోస్తు ధీరస్తుతేజోస్తు
స్థిరతరాయుర్భాగ్య సిద్ధిరస్తు
ఆరోగ్యమస్తు మహైశ్వర్యమస్తు స
ద్బుద్ధిరస్తు జగత్ప్రసిద్ధిరస్తు
పుత్త్రపౌత్త్రాధిక భూరిలాభోస్తు ప్ర
శాంతిరస్తు నితాంతదాంతిరస్తు
స్వస్త్యస్తు సత్కవి స్తవనీయమతిరస్తు
నీతిరస్తు సమస్తభూతిరస్తు

గీ॥ వామిహాలిధా స్తటంచు దీవనలొనర్చి
నట్టివిప్రులస్వస్తి మంత్రాక్షరములు స
ఫలములగుఁగా తసన్మనోబలముకలిమి
హైమవతికినిసత్య వారాయణునకును.

సీ॥ గణ్యలౌ వాణీహిరణ్యగర్భులయందు
వాగనుసరణమై వఱలెనెద్ది
నందుర్యలౌ శ్రీర మానారాయణులయందు
హృదయానుగతమయి యొసఁగెనెద్ది
భవ్యలౌ పార్వతీ పరమేశ్వరులయందు
నైకరూప్యమ్ముయి యమరెనెద్ది
దృశ్యులైనయరుంధతీ వసిష్ఠులయందు
సత్ప్రదారూఢమై జరిగెనెద్ది

గీ॥ అద్దియనుకూల దాంపత్యమంచుఁదనర్చె
ధర్మరుపార్థ ఫలప్రద, సుచరిత్రము
ఖ్యప్రదము, సత్యభాగ్యలాభప్రదము వి
తరముగ్రహింత్రు దీవధూవరులుమీరు.

లఘుటీక:— 1. భద్రము=వృషభము, శుభము. 2. భుజంగ=శేషాహి, భుజంగరావుగారు, 3. గోత్రము=పర్వతము, వంశము. 4. హైమవతి=పార్వతి, వధువునామము. (హైమవతి) 5. విబుధులు=దేవతలు, పండితులు, 6. సత్య=నిజము, సత్యనారాయణమూర్తి. (నాయికదేశము) అను వరుఁడు. 7. అభిఖ్య=కీర్తి, పేరు. 8. సద్గణము=నక్షత్రసమూహము. విద్వత్సమూహము. 9. కళా=చంద్రకళ, నేర్పు. 10. ఉజ్జ్వలము=స్వచ్ఛము, శృంగారము. 11. ఆకారము=రూపము, చేష్ట.

## 9. ముప్పాళ్ల జానకిరామ శాస్త్రిగారు.

వీరు గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకా ముప్పాళ్లగ్రామవాసులు. ఆర్వేల నియోగి బ్రాహ్మణులు. ముప్పాళ్ల కుశలవరామామాత్యునకును హనుమాంబికకును బుత్త్రులు. ఖరనామసంవత్సర జ్యేష్ఠ బహుళ ౧౦ బుధవారము భరణీ నక్షత్రమున రాత్రి పదమూఁడు గడియల కుజీవస్థ కుంభలగ్నమున జననమొందిరి. నేటి కిరువదిమూఁడవ సంవత్సరము. పదునెనిమిదవ వత్సరమున అష్టావధాన శతావధానా శుకవిత్వముల హయగ్రీవదేవతాదయా విశేషమున సిద్ధిపడసిరి. వింశత్యబ్దమున జ్యోతిష విద్యాసక్తులును గురిజేపల్లగ్రహారికులును వీరిమాతులుండునగు శ్రీగిరిరాజు చంచయామాత్యునివలన జ్యోతిషజ్ఞానంబు వడసిరి. మార్కాపురంబున శ్రీమదిండియా చక్రవర్తియగు జార్జిప్రభు పట్టాభిషేక మహోత్సవకాల మందాశుకవిత్వసభసల్పిరి. నాడు మ॥ రా॥ రా॥ శ్రీ. ధారసామయ్యగారు డిప్యూటి కలెక్టరు వారియాధిపత్యముక్రింద సభ జరుపఁబడి పురవాసులచే విజయఘంటయు శ్రీవారిచే వివిధసత్కార్యములును బొందిరి. నాటికి చంద్రమహోదకా శుక్రాతరము. చాగంటివారిపాలెమ్మున మ॥ కలిగొట్ల కోటి రెడ్డిగారు సభజరిపించి నూటాయిలొసఁగి చతురంతయానారోహణగావించిరి. ఏకవింశతివత్సరమున రవ్యంతరమందు నంద్యాల కర్నూలుపురములలో శతావధానములు

సత్పుటయు సత్కృతులనందుటయు నా సేతుహిమాచలపర్యంతమును దర్శిం చుటయుంగలిగె. _ పోతారెడ్డిపేట. జమీందారులగు మ॥ అనంతరెడ్డిదేశాయి గారి సభాస్థానమున విద్వత్కవుల సన్నిధిని పండిత కవిశరభంబను బిరుదం బును వడసిరి. నాటికి కుజదశారాహ్వాంతరము. నేటికి గుర్వంతరము జరుగు చున్నది. వీరిచేరచింపఁబడిన గ్రంథములు:— 1. మనోరమనాటకము, 2. కన్యకాపరమేశ్వరీనాటకము, 3. హనుమచ్ఛతకము, 4. వేదాద్రి నృసింహ శతకము, 5. రామేశ్వరీయము. 6. లక్ష్మీసహస్రము (ప్రస్తుతము తెనిఁగించు చున్నది.

శా॥ శ్రీమన్నైత్రజ వివాహవేళ మణిభాక్సింహాసనం బందుజా
యామోదోజ్జ్వల మండపాసకలితాత్మారాముఁదూర్వ్యంగ్రజా
త్స్నేహాఖండ కలావిభూషణుఁడు విస్తుల్య ప్రభుండీశుఁడుకా
శ్రీమంత్రోచ్ఛదు గాత హైమవతి సాధ్వీన్ సత్యనారాయణున్. 1.

మ॥ సుతుఁడాస్కందుఁడు స్తన్యపానమునకై సొంపారఁగాఁదల్లియం
కతలంబందునఁ జేరఁబార్వతి శిశూత్కర్షప్రహర్షంబుచే
హితమేపారఁగఁ జుంచుదువ్వెదయనెంతేగాంచు నాచూడ్కులన్
సతముంజూచెడుగాత హైమవతియోషన్ సత్యనారాయణున్. 2.

సీ॥ ప్రావృడారంభప్రభా కృష్ణకందన
ద్దివ్యయూపాంశువుల్ దిశలఁబర్వ
జలముక్ప్రభూత నిస్వనమద్రగంభీర
వాక్యప్రభావంబు పరిఢవిల్ల
విద్యుద్విభాఛాయ విస్మయాంకూరమై
కౌస్తుభరత్న ప్రకాశములర
పాకశాసనధను ర్భంగిభాస్వనాలి
శిఖిపింఛమువరుమల్ శ్రీఁకహింప

గీ॥ గజ్జెలందెలు మ్రోయంగ ఘల్లురంచు
వేణువూదుచు నర్తించు చిన్నికృష్ణుఁ
డాయురారోగ్య సంపదలమరఁగూర్చు
హైమవతిలక్ష్మి సత్య నారాయణులకు. 8.

చ॥ కలమఃలో సంగు చేడె సురకాంతలనోము ఫలంబులక్ష్మి ప్ర
జ్వలితయశోలలామ నవసారసలోచన భక్తలోకపా
వ్నిలయగుణాభిరామ కరుణించి వధూవరులన్ శుభమ్ములన్
సలలితరీతి మన్నిజయ సంపదలిచ్చెడు గారవిచ్చలున్. 4.

ఉ॥ ధీయుతుఁడైన బ్రహ్మ జగతిం దగభూతములన్ సృజించి వా
చాయుతులన్ బొనర్చెఁ దన చాననుపాయము గోరవేడ్క వా
క్ఛ్రియము గూర్చి లోకులకుఁ జెల్వునిగూడి సుఖించు వాణిదా
రాయని తోడఁ బ్రోచు సుకరమ్ముగ దంపతులన్ సదాకన
ద్గేయులఁ జేసి విద్యలఁ బ్రతిష్ఠనొసంగి చిరాయులట్లుగన్. 5.

## 10. వల్లూరి వేంకటరామలింగ శర్మగారు.
## పాపరాజు వీరరాఘవ శర్మగారు.

వీరి జన్మస్థానము, నర్సారావుపేట తాలూకా యల్లమంద గ్రామము. వలూరి వేంకట రామలింగశర్మగారు, ఆఱువేల నియోగ బ్రాహ్మణులు. ఆప స్తంబసూత్రము. కౌండిన్యసగోత్రము. తండ్రి వేంకటలక్ష్మణకవిగారు. తల్లి మహాలక్ష్మాంబ. సర్వజిన్నామ సంవత్సర కార్తీక శుద్ధత్రయోదశి జన్మ దివసము.

పాపరాజు వీరరాఘవశర్మగారు:—వీరు ఆఱువేల నియోగ బ్రాహ్మ ణులు, అపస్తంబసూత్రము, కాశ్యపసగోత్రము. తండ్రి హనుమంతరాయఁడు గారు. తల్లి జానకమ్మంబ. సర్వధారిసంవత్సర శ్రావణబహుళ చతుర్దశి జన్మ దివసము.

వీరిరువురు కరణీక, అసిస్టాంటు కరణీకోద్యోగియులు. ఉభయకవిత్వములయందుఁ బ్రవీణులు. అష్టావధాన శతావధానములు చేయఁగలరు. సంగీతవిద్యయందుఁ బ్రవీణతకలదు. ఆశుకవిత్వముఁ జెప్పఁగలరు. వీరు రచించిన గ్రంథములు:— 1. శ్రీకోటీశ్వరశతకము. (ఏకప్రాస కందములు) 2. వసుమతీ వసంతనాటకము, 3. జయశీలనాటకము. 4. కాంతామణినాటకము. 5. భస్మాసురోపాఖ్యానము. (పద్యకావ్యము) 6. లంబకర్ణ్మకుని నమ్మిన దీర్ఘదంష్ట్రిని ఫార్సు.

సీ|| శ్రీరమణీమనోసారస భానుండు
 భూతసంతాన ప్రపోషణుండు
సారరుచిస్ఫుట చాంపేయవసనుండు
 వికసితాంభోజాతవీక్షణుండు
నవరత్నయుతకంకణ స్ఫురద్బాహుండు
 తతదయాలోక వీక్షితగుహుండు
పాలితపీడ్యూషభక్తకోధికుండు
 తాపసవరజనతా వశుండు

గీ|| సైనలక్ష్మీసతీ నాధుఁడనవరతముఁ
గాంతమిన్న హైమవతిని గాంతివిజిత
రతిమనోహరు సత్యనారాయణాఖ్యు
మించుకారుణ్యము ననురక్షించుఁగాత. 1.

చ|| నిమిష మువీడి యున్న లుపసేరకనొక్కపరాూజనేత్ర శీ
ర్షమునధరించి యొక్క జలజాత నిభాననఁజారువామ భా
గమునవహించిమే ప్రతిసుఖంబులఁగాంచు శశాంకమాళి తా
నమరుచు నీవధూవరులకంచితమా ననురాగబంధముల్. 2.

సీ॥ అతులమానీధనో న్నతిపాటిగాలేక
    నలకుబేరుఁడుశివు నాశ్రయించె
సతతమానీదాన చతురతలేనగాక
    బలిదానవేంద్రుండుఁ బట్టెనడుగు
విశదమానీకీర్తి విసరమ్ము సరిగాక
    బహుళత్వయుతనొందెఁ బంకజారి
స్తవ్యమానీదుతేజస్ఫూర్తిఁ బోలక
    హరిదక్షిణోత్తరా యనములొందె

గీ॥ నిరుపమానకల్పశాఖి నీకుసాటి
గాకఁబంచశరుండ నంగతవహించె
నహహా! మంత్రిపెగడ జననాబ్ధిచంద్ర
సకలకవిగేయరాజ భుజంగరాయ. 3.

సీ॥ పక్షపాతములేక పాలింతువనుటకుఁ
    బ్రజలందఱానంద పడుటసాక్షి
ఘనకలాజ్ఞాతృత్వకరుఁడ వటంటకు
    వందితావనదీక్ష పదమెసాక్షి
ప్రకటభోగవిభూతిపరుఁడ వటంటకు
    నిరతసౌఖ్యానంద నియతిసాక్షి
తామసరహితనిదానుఁడ వనుటకు
    ఘనమైనశాంత విగ్రహమెసాక్షి

గీ॥ రొదుటికష్టప్రవర్తన మెఱుఁగఁజనుట
కాత్మపోషకసత్కార్థ మదియెసాక్షి
వసుధమంత్రిపెగడవంశ వార్ధిసోమ
సరసగుణగణగేయ భుజంగరాయ. 4.

మ|| అవనీమండలమందునీ కలియుగంబందీ విధానంబుగా
గవిలోకంబును వేదవేత్తలను సత్కారంబుగావించిరే
నవభోజావనినాయకుండవను శబ్దన్వేయు లేదన్నఁగన్
గవిలోకేశ్వర శిష్టపాలన భుజంగక్ష్మాతలాధీశ్వరా. 5.

## 11. పాపరాజు వీరరాఘవశర్మగారు.

శా|| శ్రీకారుణ్యగుణాళిభూషితుఁడు రాజీవాయతాక్షుండు సు
శ్లోకుండర్యమకోటితేజుఁడు బుధస్తోమాభివంద్యుండు గా
రీకాంతాప్తుఁడు రామమూర్తివిభవశ్రీకాముఁడై సర్వదా
శ్రీకళ్యాణుల నీవధూవరులరక్షించున్ శుభస్వాంతుఁడై. 1.

ఉ|| శ్రీగిరిజామనోంబుజ పరిభ్రమణాత్తమిళిందుఁ డాశ్రితో
ద్యోగనిరూఢి సంతతదయాన్వితసద్వరదాత శేముషీ
రాగుఁడపారధీరుఁడు సురప్రకరోత్తముఁడైన శంకరుం
డీగరువంపుదంపతుల శిష్టసుఖంబులొసంగి బ్రోచుతన్. 2.

క|| శ్రీరమణీసుతుఁడ సద్భక
చారిత్రుఁడు సర్వదేవసంపూజ్యుఁడుదుం
ఢారయునీ దంపతులక
పారసుఖంబులనొసంగి పాలించుదయన్. 3.

సీ|| ప్రసవాయుధారిచే భంగపొందకయున్న
కనకాద్రి సంకాశ ఘనుఁగవమ్మ
శుంభసంభవునిచే ఘాసఁజెందకయున్న
వనరాశినీకాశ ఘనుఁగవమ్మ

శారదాఘనస్థలి నవ్వుతకూడక యున్న
యమతనూజానిమాద్రి యనఁగవచ్చు
కొమరొప్పఁగాగొండ గుహలదాగక యున్న
సింగంబునొకసాటిఁ జేయవచ్చు

గీ॥ ధైర్యగాంభీర్యసత్యప్రతాప కళల
నంచుసత్కవులెందు వర్ణించుచుండఁ
బరగుమంత్రిప్రెగడవంశ వార్ధిసోమ
సరసగుణగేయరాజా భుజంగరాయ. 4.

సీ॥ కుటిలపాదంబులఁ గులుకునంచయదెంత
బిచ్చమెత్తెడురుద్రు సెంపదెంత
సారసాహితుఁడైన రేడునిసొబగెంత
పాతాళమునదాగు ఫణిపుఁడెంత
తుహినావృతంబైన మహీధరేంద్రంబెంత
శరధిలోమునిగిన శంఖమెంత
శ్వసనాహతంబైన శారదాభ్రమదెంత
రాగయాపరమేష్టి రాణియెంత

గీ॥ యనుచుమీకీర్తి హరిసహరాబ్జశేష
గిరిదరాంబుదభాషల గేరిమెరసె
వసుధమంత్రిప్రెగడవంశ వార్ధిసోమ
సరసగుణగేయరాజా భుజంగరాయ.

## 12. నందగిరి శేషగిరిరావుగారు.

వీరు ఆ 1880 సంవత్సరములో జన్మించిరి. మధ్వబ్రాహ్మణులు. విశ్వామిత్రగోత్రము. గుడివాడ తాలూకా అంగలూరుగ్రామ వాస్తవ్యులు.

తండ్రి రామచంద్రరావు పంతులుగారు. తల్లి తులసమ్మ. వీరు శతావధానము జక్కగాఁ జేయఁగలవారు. వీరు రచించిన గ్రంథములు:—1. అవధానదర్పణము, 2. దివ్యచిత్తీయము, 3. చంద్రిక మొదలగు గ్రంథషట్కమును రచించిరి. అంగలూరులో " ఆంధ్రవాణీరత్నమాల " యను గ్రంథమాలను స్థాపించినవారు.

శా॥ శ్రీమద్ధైమవతీ సతీయుతమమం శ్రీసత్యనారాయణం
యందృష్ట్వాహృది సంస్మరామ ఇనరుక్ప్రీణాని నీనాయకం
పాయాదీశవశంకరీబుధజన క్షేమంకరీశంకరీ
కారుణ్యం సముపేయుషే ప్రదద్యతీ సౌభాగ్యదీర్ఘాయుషీ. 1.

సీ॥ ప్రకృతిపూరుషులట్లు పరమభద్రాత్ములై
యుద్గాఢ మైత్రితో నుండుగాత
భారతీబ్రహ్మలభాతి విఖ్యాతులై
ఘనకళాభ్యుదయంబు గాంతుగాత
శ్రీమాధవులరీతి స్థిరకీర్తిగాంచియు
హీనసంస్థితితో రహింతుగాత
పార్వతీశ్వరులట్లు ప్రథితులై సుమనోభి
గణ్యసంతానంబు గాంతుగాత

గీ॥ అత్తమామలు పితలువత్యంతముదము
గాంచునట్లుపురోవృద్ధి గాంతుగాత
వినుత నూతనదాంపత్యమున రహించు
హైమవతియును సత్యనారాయణుండు. 2.

సీ॥ మాంసాశనులభూమి మసలకళ ర్తరం
జించుసీతమ్మువై చెలఁగుమమ్మ

పలుపురశ్లోళోఁబడకుండఁ బ్రియమునిషం
భావించు వాణిపైవలలుమమ్మ
ఇల్లిల్లుదిరుగక హృదయేశ్వరుభజించు
నిందిరవౌచుఁబెంపొందుమమ్మ
పంకగతిని వీడిపతిని సంసేవించు
గంగాభవానిపై గ్రాలుమమ్మ

గీ|| చండికాభిఖ్యఁగనక యీశ్వరునిఁగొల్చు
నార్యపై సమ్మదంబున నలరుమమ్మ
హైమవతి! భవదాత్మాభిరాముఁడైన
సత్యనారాయణుని పూజసలుపుమమ్మ. 3.

సీ|| సత్కవిజనచిత్తజలజాతపాళికి
నాహ్లాదకారణంబగుటవలన
శస్తగుణాంచిత సత్యనారాయణ
స్వామికి నర్పింపఁబడుటవలన
గణనీయసద్గుణమణిగణగర్భర
త్నాకరంబునఁబుట్టి నందువలన
వినుతసువర్ణశోభిత హృద్యబహువిధా
లంకారములతోడి లంకెవలన

గీ|| నలఘుకవితారమయ్యును శ్రీహైమవతియు
నిత్యమాలలాడింపరే ? వినయశోభిఁ
ప్రథితమంత్రిపెగడ వంశరాజవర్య
సకలసముదాయగేయ భుజంగరాయ. 4.

ఉ|| శ్రీమదనంతవైదుషివిశిష్టజనాదరణంబుతోడ, ని
స్సీమవిభుత్వసంపద లశేషబుధేంద్రసపర్యతోడ, నో

సీ॥ భూభృద్వరానంద భూరిసంధానమై
హైమవతీ వివాహంబునాఁగ
జనకవిశ్వామిత్రసచివాను మోదమై
ధరణిసీతామహోద్వాహమనఁగఁ
బ్రాప్తపద్మాలయా భావుకాన్మర్త్యమై
విజయకరగ్రహవేళయనఁగ
సకలరత్నాకర సంస్తూయమానమై
లక్ష్మివధూటి కల్యాణమనఁగ

గీ॥ జరిగెహేలాఖ్య నగరరాజాభుజంగ
రాయమణి సౌధముననుదిగ్రాజవిబుధ
వినుతహైమవతీ సీతవిజయలక్ష్మి
మాంబవైభవపాణిగ్రహణ విభవము. 4.

సీ॥ ప్రాలేయధరసుతా ప్రభుఁడీసుమారుఁడు
పార్వతీదేవి యీ భాసురాంగి
పద్మాలయాప్రాణబంధుఁడీసుగుణుండు
పద్మగేహిని సుమీ పంకజాక్షి
భారతీకామినీపతి యీసుచరితుండు
భారతీదేవి యీపద్మగంధి
యింద్రాణిసుందరీ హితుఁడీమహాభాగుఁ
డింద్రాణి యేసుమీ యిందువదన

గీ॥ యనఁగవేంకటసత్యనారాయణునకు
హైమవతి సీతవిజయలక్ష్మ్యమ్మవరవ
ధూయుగముభాస్వ సౌభాగ్యధీయుతులయి
తనరుదురుగాత యాచంద్రతారకముగ. 5.

సీ॥ మేదినీధవవభూరి మిత్రసందోహంబు
సరసకళానిధిసముదయంబు
నిరుపమశేముషీగురునికురుంబంబు
నవమృదువ్యాహారకవికులంబు
ధారుణీపకిరీటమేరు కదంబంబు
చిరతరశుభసాంద్రదజిష్ణుగణము
భూసురజ్యేష్ఠకృదాశీర్వచనతతి
ధననాథఘనసద్మధ్వజంబు

గీ॥ మంత్రి ప్రెగడభుజంగేంద్రమహిపసౌధ
నిర్మలాభ్యంతరంబు సుధర్మనియతి
నలరువేంకట సత్యనారాయణవర
హైమవతి సతిపాణిగ్రహణపదంబు. 6.

చ॥ విభవము తేజమున్ ధృతియువీర్యము పౌఁరుషము పుష్టియున్ ధనం
బభయచిరాయువున్ సుముఖుసౌమఖవుండనలుండవాచిది
క్రృభుఁడును యాతుధానుఁడును బాసిసదాగతి శ్రీదుఁడీశ్వరీ
విభుఁడొనఁగూర్చి ప్రోచెదరు వేడ్క వధూవగులన్సుభోన్నతిన్ 7.

శా॥ రంగైమించి భవత్సభాస్థలి భళీరాణించెనౌరా! వియ
ద్గంగాభంగతరంగితుంగల హరీగాధార్భటీవాగ్ఝరీ
శృంగారప్రభవానుచిత్రకవితాశీర్వాదధాటీలస
త్సంగంబౌచు భుజంగరాడభిధ రాజామంత్రిచూడామణీ. 8.

చ॥ చిరతరభాగ్యనీచదరుచేది చరించిన పుణ్యవృత్తిచే
వరయభవత్సు తౌవరిణయంబునఁగంటిమదేభకుంభసం
భరితవిమూత్న రత్నవవభాసురహారపటీరగుంభిత......

నిరుపమసౌరభప్రభవ నిర్మలసంతతపుష్పనిర్మితద్వధూ
వరకమనీయదివ్యతర వైభవభూరి మహోత్సవంబుస
చ్చరితభుజంగ రాయగుణసాంద్రమహీశకులాబ్ధిచంద్రమా. 9.

సీ|| ఏమాన్యనకుఁదండ్రి శ్రీమంత్రిపెగడదు
ర్గామల్లికార్జునాఖ్యప్రభుండు
ఏమహామహుమాత శ్రీమించుసీతావి
జయలక్ష్మమాంబవాసాధువర్తి
ఏధీరవరుసాధ్వభూధరకన్యకా
శ్రీసద్గుణాకదంబ చిన్నమాంబ
ఏనృపుజామాతయిందు సుందరకాంతి
రాణించు సత్యనారాయణుండు.

గీ|| ఏరసాధి ప్రచిరకీర్తిభూరిగరిమ
దశదిశాంతప్రకాశసంధానపూర్తి
యట్టినినువర్ణనము సేయనలవియగునె
సర్వసజ్జనగేయ భుజంగరాయ. 10.

గీ|| అబ్ధివిభునకుఁదొల్లిచిరాయువుగను
చందురుఁడుగల్గిలచ్చికానందమిడిన
కరణినీభుజగేంద్రునకనుఁగుసుతులు
గలిగిదీర్ఘాయుసహితులై కాంతిమీఱ
హైమవతి కచ్చెదరుగాక నధికముదము. 11.

గీ|| మంత్రిపెగడ భుజంగేంద్రమాన్యయుష్మ
దాత్మజాపరిణయంబుసందర్శికోటి
తృప్తినొందించు నీదువితీర్ణధాటి
బలిమఃరుద్ధర[illegible]సాటి. 12.

## 14. నెమలూరి వెంకటశాస్త్రిగారు.

వీరినివాసస్థలము, అమలాపురముతాలూకా మురుమళ్లపోలవరము. వెలనాటివైదికులు. ఆపస్తంబసూత్రులు. కణ్వసగోత్రులు. తండ్రి పుల్లయ్య గారు. తల్లి సత్తెమ్మ. ధాతృసంవత్సర కార్తిక బహుళైకాదశి జన్మదినము. వీరు సంస్కృతాంధ్ర పాండిత్యము, ఉభయవ్యాకరణజ్ఞానము, ఉభయ కవితా సామర్థ్యముగలిగి పెక్కుచోట్లశతవధానాది విశేషంబులఁ గన్పరచి పేరుపొందినవారు. మహారాజరాజశ్రీ శ్రీపిఠాపురము రాజావారివిద్వత్సభా స్థలిని నద్వితీయంబుగ సంపూర్ణశతావధానమొనర్చి శ్రీవారిచేఁ బ్రతివత్సరము బహుమానితులగుచుఁ దత్పోలవరగ్రామమునకు అలంకారభూతులగు మహారాజశ్రీ శ్రీరాజాకాకర్లపూడి పెదయచ్యుత రామరాజబహద్దరుగారికి ముఖ్యాశ్రితులై వారికిచ్చవచ్చినకవితా వినోదంబుల నెరవుచునుండువారు. వీరిచే నహల్యాచరిత్రమను గ్రంథమురచియింపఁబడెను.

ఉ॥ శ్రీయుననామయత్వము శరీరశుచిత్వముప్రాణులందు ప్రా
ణాయితశక్తిసర్వగతమైన యశోమయరాశియున్ సుధా
ప్రాయపుశీలమున్ బరమ పావనవృత్తియు ధాన్యలక్ష్మిపెం
పేయెడ నిన్వధూవరులకిచ్చుతశంకరుఁ డష్టమూర్తిదాన్. 1.

క॥ హైమవతీ నారాయణ
నామకులీదంపతుల కసారతభోగో
ద్దామత్వ చిరాయుత్వ
శ్రీమత్వములొసఁగుఁగాత శ్రీహరిపేర్మిన్. 2.

మ॥ మృదుభావంబు పెలంగు హైమవతికి వీకుండవై యొప్పి భా
గ్యదశన్ విద్యలుసర్వమంగళహిత స్వాంతానురాగంబు సాం

పొదవన్ హైమవతీకులట్టలరిమే లాలించు తత్ప్రియకా-
స్పదమై పొల్తురుగాక సత్యమిదియప్పా సత్య నారాయణా. 3.

క॥ ఇమ్మడైన సత్యనారా
యణునిన్ భజియించిపట్టినది బంగరుగాఁ
గనుమెఱయుచు సౌభాగ్యం
బునుగొనుమా పేరుసార్థముగ హైమవతీ. 4.

సీ॥ కవనంబుచెప్పఁగాఁ గలిగినప్రభువన్నఁ
గవిరాజశబ్దంబు గణనకెక్కు
కవులలో మేటియై తనరెల్లునని యన్నఁ
గవిరాజశబ్దంబు గణనకెక్కు
కవులనురంజిల్లఁ గాఁజేయువాఁడన్నఁ
గవిరాజశబ్దంబు గణనకెక్కు
కవులురాజులు గాఁగ గణుతించుఘనుఁడన్నఁ
గవిరాజశబ్దంబు గణనకెక్కు

గీ॥ ఎట్లుసమనింపనీ కన్వయింపఁదగిన
యట్టిమతి యొక్కరికిఁ జెప్ప నర్హమగునె
సరసకవిరాజశబ్దమో సకలగేయ
సత్కవివిధేయరాజ భుజంగరాయ. 5.

చ॥ ప్రణుతి వహించుపట్టి కవి రాజపదంబును దేశభాషలం
దనువయిదూరదేశములయందలిసత్కవులన్ సమీపవ
ర్తనులుగఁ జేసికాంచిన యుదారచరిత్రము నెంచిచూడఁ దే
ర్కొనుగవికోటికిన్ బ్రభులకున్ గలయయ్యనుబంధసన్నిధిన్. 6.

మ॥ కవులుం బండితులున్ బ్రభాంధవులు వర్గంబై భజింపంగఁ ద
గ్గవిధిన్ జేవతలుగ్గడింప నిజ సత్కా_ర్యా విహారంబులోఁ
గవితాకన్యకుఁ గూడ బేడుకలరం గల్యాణముం జేసితై
భవమున్ గూర్చిన నిన్నుఁ దింపఁదగు పద్మావా భుజంగాధిపా. 7.

సీ॥ అలపిఠాపురరాజు నాస్థానమందు శ
తావధానముఁ జేసి యలరినాఁడ
నల్లయుర్లాంపురాధ్యక్షుని సభఁ బెక్కు
విధములకయిత మెప్పించినాఁడ
గద్వాలరాజ్యరక్షకుఁడై యొసంగుసీ
తారామవిభు కాన్కఁ దనిసినాఁడ
వనపర్తిరాజ్యపాలనుఁడైన రామేశ
పార్థివు మన్ననల్ పడసినాఁడ

గీ॥ తక్కఁగల పట్టణంబులఁ దద్దులలరు
నట్టులవధాన మొనరించి నట్టివాఁడ
విబుధసంతతికెల్ల సంప్రీతిఁ గొలుపఁ
జాలు నెమలూరి వెంకట శాస్త్రినధిప. 8.

## 15. కార్యముపూడి రాజమన్నారుకవిగారు.

ఈకవి నివాసస్థలము బాపట్లతాలూకాలోని పేరాల గ్రామము. పద్మ శాలికులజుఁడు. భృగుసూత్రము, మార్కండేయగోత్రము. తండ్రి వీరన్న మ హాధనశాలి. తల్లి లక్ష్మమ్మ. విద్యావినయనిధి. ఇప్పటి కఱువదియేడింటిం దాటిన పరాభవసంవత్సర, ఆశ్వయుజబహుళ అమావాస్య జన్మదినము. వీరు, ఆంధ్రగీర్వాణకావ్య నాటకములు, శ్రీమద్వేదమార్గస్థాపనాది శ్రీమానద్ధంకి తిరు మలకుమారతిరుమలాచార్యులయ్యవారలుంగారి సన్నిధి నుభయవ్యాకరణము

అను పదవి శ్రీమదిత్యాదివిద్వాన్ మాడభూషి వేంకటాచార్యులయ్యవారు అంగారి సన్నిధిని వివిధావధాన విధానముల లభించుకొని వనపర్తిసంస్థాన రాజవంశ రత్నావళి గ్రంథము, గద్వాలసంస్థాన చెన్నకేశవ విజయము, ఆత్మకూరుసంస్థాన సీతారామ భూపాలవిలాస ప్రబంధము, విజయనగర సంస్థాన సమస్యాశతకమును, తత్తద్రాజానుమతమునఁజెప్పి మెప్పించుటయేగాక నెల్లూరు, చెన్నపట్టణము, కాంచీపురము శాల్యము మొదలగు ముఖ్యనగరముల డెబ్బదియొనిమిది వివిధావధానసభలయందు గౌరవింపంబడి వివిధపల్యంకికోత్సవముల దీపించెను. మఱియు, హేలాపురీ కన్యకాపరమేశ్వరీ దండకము, కారముచేటి మాధవస్వామి శతకము లోనగు నిరువదినాలుగు కృతులరచించి భగవదనుగ్రహమునఁబుత్రపౌత్రప్రపౌత్రులతోఁదగుపాటి పాడి పంటలు గలిగి శిష్యప్రశిష్యులతో సంతోషమున స్వగ్రామంబున నిప్పటికుండియుండిరి.

ఉ॥ శ్రీమదశేషపౌరజన సేవితమై హితరాజబాంధవ
స్తోమమనోజ్ఞమై విబుధశోభితమై తతతూర్యనాదసాం
ద్రామితమై కవీంద్ర కృతిరత్నవిరాజితమై క్షితీష్టమై
హైమవతీవివాహము శుభావహమై వెలుఁగొందుఁగావుతన్. 1.

సీ॥ నవనవాశ్వత్థ పల్లవతోరణంబులు
పవిత్రవిలసితద్వారములును
క్రముకరంభాస్తంభ కలితపార్శ్వంబులు
రంగవల్లీ కవత్ప్రాంగణములు
ఆనద్ధతతఘనసుషిరాది వాద్యంబులు
చీనాంశుకోద్యద్వితానకములు
కౌతుకవీక్షణాగతసువాసినులు స
మ్యక్కౢప్త వేదికామంటపములు

గీ|| వివిధకల్యాణ వస్తువుల్ విప్రవరులు
వ్రేల్చుహుతవహకుండము వెలయుచుండ
హైమవత్యాఖ్యసీతాఖ్య లాదిగల
విజయలక్ష్మమ్మ పరిణయ విభవ మొప్పె. 2.

సీ|| లలితాష్టవిధభాగ్య లక్షణలక్షిత
యైనలక్ష్మి వివాహమునుబోలి
విశ్రుతాష్టైశ్వర్య విభువృతానఘగాత్ర
యైనగౌరీ వివాహమునుబోలి
అవనరతాష్టభోగాస్ప దోన్నతరాష్ట్రి
యైనశచీ వివాహమునుబోలి
పృథులాష్టదిగధీశరిపు హారణోదయ
యైనసీతా వివాహమునుబోలి

గీ|| వసుధపై వడ్లమన్నాటివంశజలధి
రాజువేంకటసత్య నారాయణాధి
పతివిబతిగావరించిన ప్రాజ్ఞశ్రీభు
జంగరాట్పుత్రి సత్యప్రసంగయైన
హైమవతిరాజ్ఞి సద్వివాహము వెలంగె. 3.

సీ|| వెండిబంగారపు కొండలిల్లునువిల్లు
గాఁగలవానికిఁ గన్యనొసఁగు
చలువవెట్టలనీను బలుగాము శేకను
ల్గాఁగలవానికిఁ గన్యనొసఁగు
రాచబిడ్డఁడు వేల్పు రాయఁడు నాఁబనుల్
చేసినవానికి సీతనొసఁగు

పాలకుదిండులవేలు పులనొగిఁ ద్రుంచుచుఁ
బాలించువానికి బైష్మి నొసఁగు

గీ॥ శైలపతికంఠి జనకభీష్మకులఁబోలి
రమ్యవేంకటసత్య నారాయణునకుఁ
దనదుపుత్రిని హైమవతిని భుజంగ
రావొసఁగికూకుదుండన రాజిలెనిల. 4.

క॥ విబుధాహ్వానారావము
విబుధాశీర్వచనరవము వేణువిపంచీ
ప్రబలతూర్యారవంబును
నిబిడంబై పరగఁ బెండ్లి సెలవు వెలయఁగన్. 5.

సీ॥ క్షితినరుంధతియువసిష్ఠు లట్లంతటఁ
బూజ్యాగ్రగణ్యులై భూమియందు
చంద్రమతీహరిశ్చంద్రు లట్లంతట
సత్యవర్ధిష్ణులై జగతియందు
జానకీశ్రీరామచంద్రు లట్లంతట
ననురాగవంతులై యవనియందు
శ్రీరతీలక్ష్మీకుమారు లట్లంతట
సుందరాకారులై క్షోణియందు

గీ॥ ఆయురారోగ్యపుత్త్రపౌత్రాభివృద్ధి
నఖిలసంపత్సమృద్ధిని హైమవతియు
రమ్యవేంకటసత్య నారాయణుండును
వెలయుదురుగాక శోభా ఘనుల[illegible]రగున. 6.

సీ॥ ఆయురారోగ్యవంశాభివృద్ధి విధాత
దయనిచ్చుగాతనీ దంపతులకు
బంధుమిత్రాశ్రితా వనకీర్తిహరిమూర్తి
సమకూర్చుగాతనీ జంపతులకు
భువనారిదళనాను భూతిగౌరీపతి
శివినీవుత నీవధూవరులకు
వివిధభోగప్రాప్తి విబుధేశ్వరుఁడుత్పృప్తి
దెలుపుగావుతనీ సతీపతులకు.

గీ॥ పోసఁగఁదక్కిన దేవతల్ పుత్త్రపౌత్రి
ధనకనకవస్తువాహన తతులొసఁగుత
రమ్యవేంకటసత్య నారాయణాధి
పతికినీ హైమవతికిఁ బ్రపంచ మెన్న. 7.

## 16. చిల్లరిగె యోగానంద కవిగారు.

వీరు మధ్వబ్రాహ్మణులు. హరితసగోత్రులు. తండ్రి నరసింహారావు పంతులుగారు. తల్లి శేషగిరమ్మ. గుడివాడ తాలూకా అంగలూరుగ్రామ నివాసులు. ఆ 1880 సం॥ మున జన్మించిరి. అష్టావధాని. ఆశుకవితా పరిచయులు. జ్ఞానవతి, కనకవల్లి, దేవయానా వివాహము మొదలగు గ్రంథములు రచించిరి.

ఉ॥ శ్రీయుతుఁడైనశౌరి నిజచిన్మయనాముఁడటంచు సత్య నా
రాయణనాముఁడౌవరు నిరంతరముల్నిజసోదరీసహా
ప్యాయనదృష్టితోవధువు హైమవతింగని సత్కృపాప్తుఁడై
యాయినచంద్రతారక మనంతసుఖస్థితులిచ్చి ప్రోచుతన్. 1.

సీ|| శ్రీప్రమాదీచాబ్ద శృంగారమార్గశీ
ర్ష బహుళపంచమీ ప్రకటితగురు
వాసరశర్వరీభవ్య మఖాయుక్త
ఘనతులాదివ్య లగ్నంబునందు
శ్రీమంత్రిప్రెగడాబ్ధి సోముఁడైనభుజంగ
రాయార్యుఁడు తనదుప్రథమపుత్రి
హైమవతీసమాఖ్యాంచిత యాకన్య
శ్రీవల్లమన్నాటి చిన్నబాలుఁ

గీ|| డైన సత్యనారాయణాహ్వయునకొసఁగి
పరిణయంబును గావించె బంధుహితపు
రోహితాఖిలశాస్త్ర గురువిబుధనిక
రాత్తనియతులు వెలసి యేలూరియందు. 2.

సీ|| వలిగుబ్బలిజనించి బహుకాలముతపించి
భూమలశివుని బొందినట్టి
హైమవతీదేవినాత్మలోఁ దలంచి
యాచెయువులకంతో యుపహసించి
వేలమాలిగఁబుట్టి క్రాణకోర్కినిబట్టి
శ్రీరాముఁచేపట్టి చెల్ఁగినట్టి
సీతనుగుణమణి జాతను ద్రిభువన
ఖ్యాతనుమదినెంచి మాతివినిచి

గీ|| లక్ష్మినిజయించుట విజయలక్ష్మియాదు
సత్యనారాయణాఖ్యప్రశస్తిఁగనిన
వరునివరియించె గరిమనీవధువుభళిర !
వినినసుఖయింతు రాచంద్రతారకంబు. 3.

ఉ॥ అనుముహూర్తమందు దివిజౌఘుబహూకృత పుష్పరాజిసాన్
భాసురశర్వరీవిపుల ఫాలవిరాజిత తారకాళిసాన్
శ్రీసరసీసుఖాప్లవకరిప్రకరోజ్ఝిత కంకణాళిసాన్
సేసలుపాల్పెసమ్ముదిత చిత్రవధూవర శీర్షభూషలై. 4.

సీ॥ తోరణాదులచేతఁ దురగలించెడిపెండ్లి
నగరుపోయల్లని పొగడలేము
చిత్రవిచిత్ర ప్రసిద్ధమంగళవాద్య
నినదంబులిట్లన్లు వినఁగఁబోము
సకలదిక్కులనుండి చనుదెంచిసభచేరు
కవిపండితులనిట్లు గానఁబోము
సంగీతనాట్యహాస్యభవ మోదంబిట్లు
చిత్తంబునందెప్డు చెందలేము

గీ॥ సూరిసత్కారములనిట్లు చూడఁబోము
దివ్యవస్త్రాన్నదానముల్ దెలుపలేము
పరగనీవధూదాతకా భానుచంద్ర
తారకమునిరులిచ్చి మాధవుఁడుప్రోచు. 5.

## 17. పోతరాజు లక్ష్మీనరసింహకవిగారు.

వీరి నివాసస్థలము నర్సారావుపేటతాలూకా ఏరుచూరు. ఆఱువేల నియోగి బ్రాహ్మణులు. ఆపస్తంబసూత్రులు. శ్రీవత్సగోత్రులు. తండ్రిరామకవిగారు. తల్లి సంజీవమాంబ. జన్మదినము సర్వధారి నామసంవత్సరాషాఢ శుద్ధపాడ్యమి. అవధానాశుకవిత్వ విభునులు, పెక్కండ్రను సుకవులుగాఁ జేసిన విద్యాగురువులు. వీరి వంశము సుకవివంశముగ ఖ్యాతినందినది. వీరు

రచించిన గ్రంథములు, 1. సుమతీచరిత్రము, 2. ఋతుధ్వజవిలాసము, 3. దేవీపురాణము, 4. ప్రసంగోచితచాటుపద్యకుంజరి.

శా॥ శ్రీగౌరీరమణీమణీ పదపరాజీవాంశుమంతుండుల
క్ష్మీగంధద్విపగామినీరమణహృన్మిత్రుండు దేవాధిరా
డ్వాగీశప్రముఖామరేడితపదాబ్జాతుండు శంభుండుస
ద్భోగారోగ్యము లీవధూవరులకెప్డుంగూర్చి రక్షించుతన్. 1.

మ॥ కిరికింబాండవమధ్యముండుఁబతియున్ గ్రిందౌచుమీఁదౌచుదు
ర్భరశౌర్యంబునఁబోరఁగ్రీడినిజయింపన్ జేసి వెన్మెచ్చుసం
బరమొప్పారఁగఁజూచి యవ్విజయుపైఫాలాక్షుఁడల్లంగనీ
కరహీన్ బాశుపతాఖ్యఁజేసినయుమాకళ్యాణిమిమ్మోముతన్ 2.

సీ॥ దరహాసహితవక్త్రము పూర్ణిమాసుధా
ధామబింబముతోడఁదగవులాడ
వక్షః ప్రదేశసంవాసభార్గవిఘనాం
తరితవిద్యుల్లతకరణిఁదోఁప
శంఖచక్రాసిశార్ఙ్గకస్ఫురత్కరములు
దిక్కరికరముల వెక్కిరింపఁ
గటిలసత్కాంచన పటమస్తమయనగ
వ్యాప్తసంధ్యారాగమవహసింప

గీ॥ నరిభయంకరమౌ తేజమందగింపఁ
గావెలుఁగుమాధవుండీ వధూవరులను
హైమవతిని శ్రీసత్యనారాయణాఖ్యుఁ
బోషణము సేయుఁగాతసంపూర్ణకరుణ. 3.

సీ॥ వ్యాకోచసవిలోద్భవని కాంతయేకాంత
వ్రాతదీనజనచింతయే సెలంత
తటిదుపమానవిస్ఫుటధామయేరామ
చతురత్వసీమయేసతిలలామ
మానితగతి జితమదదంతి యేయింతి
నీరజపాణియే నీలవేణి
గణనీయసద్గుణ గణపేటియేబోటి
కుముదాప్తవదనయే కుందరదన

గీ॥ యట్టియిందిర కరుణాంతరంగయగుచుఁ
గలికిమిన్న హైమవతిని గాంతివిజిత
రతిపు వేంకట సత్యనారాయణాఖ్య
సకలసౌభాగ్యము లొసంగిసాకుఁగాత. 4.

సీ॥ క్షీరోదకములభాగింప నేర్పినయంచ
యెవనిహంసమాయిరై యొసఁగుచుండె
నజ్ఞులఁబ్రాజ్ఞులౌనట్లుచేసెడివాణి
యెవనికిల్లాలయి యొసఁగుచుండెఁ
బదునాల్గుభువనముల్ పాలించుశ్రీహరి
యెవనికిఁదండ్రియై యొసఁగుచుండె
దాసులపాలిచింతామణియిందిర
యెవనికిఁదల్లియై యొసఁగుచుండె

గీ॥ నట్టికమలాసనుండు సత్యాధినాథుఁ
డతులితామ్నాయవేది మహాత్మకుండు
హైమవతిని శ్రీసత్యనారాయణాఖ్యుఁ
జిరతరాయుష్య మొసఁగిరక్షించుఁగాత. 5.

సీ॥ ఫణసహస్రముగల్గి పరసహాయమ్ముగ
ధరణిధరించిన దొంతయొకఁడు
ఏకలోకైకత నొసఁగియు రెండునా
లుకలలోనుండిన లోపకుఁడొకఁడు
శాస్త్రంబునిర్మించి సకలధర్మ మెఱింగి
కుటిలగతింజను కొదువయొకఁడు
మణులనెత్తిన్ఁబెట్టుకొని పాయుచుండియు
మరుదశనుండగు తరుగొకండుఁ

గీ॥ బాపుకొనసెంచి బ్రాహ్మణవంశమందుఁ
బుట్టినభుజంగపతి నాగఁబొదలినాడఁ
పనఘమంత్రిపెగడవంశవనధిచంద్ర!
యమలగుణసాంద్ర శ్రీభుజంగావనీంద్ర! 6.

సీ॥ జననమిచ్చింతమా సర్వవర్ణోత్తమం
బైనబ్రహ్మాన్వయంబునందు
ప్రభుతనిచ్చింతమా ప్రకటసౌఖ్యంబయి
సొరుమీఱిన జమీందారుపదవి
మైత్రినిచ్చింతమా మహితచరిత్రులౌ
పండితకవిరాజపాళితోడ
చాగమిచ్చింతమా సకలాబ్ధిమేఖలా
స్థితదీనమార్గణప్రీతికరము

గీ॥ కవివరుండవు నీవుశృంగారమదన
యట్టినీకన్నిఁటను సరిరైనవారి
తోడబాంధవ్యమొద్దవై సంతోషమబ్బ్యు
రాజసంకాశభుజగధరాతలేశ. 7.

చ॥ అదితియుఁగశ్యపుండుఁ దనయార్థముతన్గానియాడవారికిన్
సదయమనస్కుఁడైపాడమి సౌఖ్యములిచ్చిన యాత్రిశేష్టిత
ప్రదుఁడురమామనోహరుఁడు పద్మదళాక్షుఁడుపుత్త్రిరత్నసం
పదలొసఁగూర్చుఁగాత కవిమాలికి మాభుజగాధిశేకున్. 8.

## 18. గోపాలుని హనుమంతరాయ శర్మగారు.

అష్టావధాని. నివాసస్థలము గుంటూరుజిల్లా. వినుకొండ తాలూకా ముప్పాళ్ల గ్రామము. ఆర్వేల నియోగిబ్రాహ్మణులు. ఆపస్తంబ సూత్రులు. మౌద్గల్య సగోత్రులు. తండ్రి శ్రీరామ శాస్త్రిగారు. తల్లి వెంకట రమణమ్మాంబ. జననకాలము సర్వధారి సంవత్సర మార్గశిర శుద్ధ దశమీ బుధవారము. రేవతీనక్షత్ర తృతీయ చరణము. సింహలగ్నము. ప్రయివేటు, ఇంగ్లీషు స్కూలునందును, సంగీత పాఠశాలయందును, ఉపాధ్యాయులు. వీరిచే రచియింపఁబడిన యక్షగాన ప్రబంధములు, 1. నృగచరిత్ర, 2. సానందోపాఖ్యానము, 3. సత్యహరిశ్చంద్ర, 4. చంద్రకాంత (తయారగుచున్నది) 5. మఱియు సందర్భానుసరణముగా ననేక విషయములను గుఱించి వ్రాసిన పద్యములు.

సీ॥ ఖర్జూరభూధరా గ్రస్థలనిలయుండు
జలరాశి మేఖలాస్యందనుండు
పరిదధినాయక స్ఫారతూణీరుండు
కాంచనసాను మత్కార్ముకుండు
శంబరప్రోద్భవ సంజాతసూతుండు
శార్ఙ్గశరాసన సాయకుండు
కాత్యాయనీపతీకలిత వామాంగుండు
భోగిలోకాధీశ భూషణుండు

గీ॥ నైవశంభుండు బాలశశాంకమౌళి
కృపను హైమవతీసతిఁ గీర్తివిజిత
రాజావేంకట సత్యనారాయణాఖ్యు
సర్వసంపదలొందఁగూర్చి సాకుఁగాత. 1.

మ॥ తరుణీ! యెవ్వఁడవీవు? శూలిని. భిషగ్థామంబదే. స్థాణుఁడన్
జరుసంసర్గమదేటికిన్. బశుపతిన్ గన్పింపవేకొమ్మలం
చురషిన్ నాథునిన్నాన్కులందున వృషభిన్. శోధించివవ్వించుభూ
ధరరాట్పుత్రికయీవధూవరులఁ జెందంజేయు సౌఖ్యంబులన్. 2.

మ॥ అవనీనాథుఁడవీవయాదువు వినీలాంభోదదేహుండవై
మివులంగల్గుటమమ్మువొంట్లఁగొనకే మేలబ్బునంచుల్లసం
బవితర్కాంశ్యంబుగవాదులచ్చివయి నీర్ష్యన్ జూపకేమెచ్చు శ్రీ
ధవుఁడీనూత్నవధూవరద్వయము నత్యంతంబు రక్షించుతన్. 3.

మ॥ భవదీయాస్యసుధాంశుబింబమునకై వాంఛించునన్ బాసి సౌ
ఖ్యవిధుల్ దూరముజేసి మొక్కులిడు భక్తానీకవేళ్మాలిమే
ల్గవులన్ నిల్వఁగనేల! యీయురము నుల్లాసంబునందేల్పుమన్
ధవువాక్యంబులమెచ్చులచ్చియిడుఁగాతన్ సౌఖ్యముల్ దంపతుల్ -

## 19. ఏలేశ్వరపు సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.

వీరు వెలనాటి వైదికులు. ఆపస్తంబసూత్రజులు. కౌశిక గోత్రీకులు కాకినాడ రామారావుపేట వాస్తవ్యులగు సాంబమూర్తిగారికిని లక్ష్మమాంబకును నారకులు. అమలాపురము తాలూకా ఇంధుపల్లి గ్రామమునులగు రామశాస్త్రిగారికిని శేషమాంబకును దత్తులు. కీర్తినిథులగు శ్రీశృంగారకవి పర్వారాయకవిగారి శిష్యులు. హూణశకము 1893 సంవత్సరమున జన్మించిరి. ఆంధ్రసాహిత్యవ్యాకరణములయందుఁ బ్రవీణులు. అష్టావధాన నేత్రావధానముల

నొనర్పఁగలరు. ఆశువు చక్కఁగాఁ జెప్పఁగలరు. 11-12-1912 తేదిని శాం దయమిత్రుల ప్రోత్సాహముచే "దమయంతీ స్వయంవర" మాశువుగాఁ జెప్పిరి. వీరిఁగన్న తండ్రిగారాంధ్ర కవిత్వదక్షులై భక్తలోకావన శతకము రచించి ప్రసిద్ధివడసిరి. పెంపుడు తండ్రిగారు గీర్వాణ సాహిత్య నిధులై యనేకులం బూర్ణసాహిత్యవంతులఁజేసి విఖ్యాతిఁగాంచిరి. వీరు రచించిన గ్రంథములు. 1. రామదయాసారము. (ప్రబంధము) 2. మల్లికావసంతము, (కల్పిత ప్రబంధము) 3. దమయంతీ స్వయంవరము (ఆశు ప్రబంధము) 4. యామినీ పూర్ణతిలక, (రూపకము) 5. ధర్మార్థసిద్ధి, (రూపకము) 6. రాధారాణి (రూపకము) 7. రామకథాసుధానిధి, (గద్యప్రబంధము) 8. శాంకరీ సహస్రము, 9. ప్రశ్నోత్తర రత్నమాల. (ఆంధ్రీకృతము) 10. వేదాంతడిండిమము, (ఆంధ్రీకృతము) 11. ద్విపద రామాయణము. 12. కేశవ శతకము మొదలయినవి.

సీ॥ శ్రీనాథముఖదేవతా నీకమవనీధ
రావళిచెలిమియొక ప్రక్కనుండఁ
బక్కలసమాచిలో ద్యత్కీర్తియాంచితమంత్ర
ములఁబఠించుచుబ్రహ్మ ముందునొప్ప
మేనకాహేమా సమానాంగనావ్రాత
ములుముదంబున వెన్కనిలిచిచూడ
విద్యాధరాధిప విబుధవ్రాతానమ్ము
పరిపరివిధములఁ బ్రస్తుతింపఁ

గీ॥ గనకమాణిక్యమయపీఠి కన్పడించి
హేమవతికేలువట్టిన యట్టిదిట్ట
వెసఁగళావర శేఖరుండొసఁగుఁగాత
సంపదలనెల్లనీ మాన్య దంపతులకు.

# హైమవతీపరిణయము.

1 సీ|| శ్రీరస్తుసకలభాషా రహోనిచయార్థ
భావగ్రహాసక్త భావనీకు
దీర్ఘాయురస్తు ప్రదీప్తవిఖ్యాత సు
ధీసముదాయ విధేయనీకు
ఆరోగ్యమస్తు కళ్యాణకళాబద్ధ
భాగ్యసౌభాగ్యాతి యోగ్యనీకు
చింతితాభీష్టార్థ సిద్ధిరస్తుసమస్త
కవినిస్తులస్తవ కలిత ! నీకు

|| విశ్రుతతోఽధికైశ్వర్య వృద్ధిరస్తు
వర్ణమహ్నాటివంశ సంభావ్య ! నీకు
అనుధాకరమిత్ర వంశాభివృద్ధి
రస్తు శ్రీసత్యనారాయణార్యనీకు. 2.

సీ|| ఏతన్విపావతిగిరి పుత్త్రియా బెట్టెఁగించు
గురుసమున్నతపీన కుచయుగంబు
ఏరాజవదన సింహారూఢయగుటను
నొడివెడునసదు నెన్నడుముతీవి
ఏరామఫణిభూషు దారయౌటను దెల్పు
తీరుచెన్నారు నూగారుపోరు
ఏతన్వికరిముఖు మాతయౌటనుజాటు
సమధికోరుద్వయీ సౌష్ఠవంబు

గీ|| అట్టిజగదేకమాత లోకైకపూత
భూరివిఖ్యాత రక్షితభువనజాత
యతులమతి హైమవతి హైమవతికొసంగుఁ
గాతసౌభాగ్య సౌభాగ్యభాగ్యంబులెల్ల. 3.

సీ॥ విపులవిధానత విబుధాన్న దానతఁ
దనరిరమా జనార్దనులభాతి
నచలధామోన్నతి నసమాంబకస్థితిఁ
బరగిశివామహేశ్వరులఖ్యాతి
హంసవాహనకీర్తినతి శుచిస్థిరమూర్తి
మరగివాణీ పితామహులభాతిఁ
బ్రాప్తసంతానతబహు బుధానూనత
నరలి శచీపురందరులరీతి

గీ॥ హైమవతిసత్య నారాయణాభిధాన
దంపతులుపొందెదరుగాత తగినసిరియు
విపులసంపదచతుర వాగ్విలసనంబు
భూరిభోగంబు నాచంద్రతారకముగ. 4.

సీ॥ తనరారువేడ్క "శతంజీవశరదో" య
టంచుఁబఠించి దీవించువారు
హరువుగా "నోషధయస్సంవదంతి" య
టంచుఁబఠించి దీవించువారు
నవకుతూహలమునిండఁ "గురుతేతస్మా" త్త
టంచుఁబఠించి దీవించువారు
పూర్ణహర్షమున "నవోనవోభవతి" య
టంచుఁబఠించి దీవించువారు

గీ॥ నైచెలంగఁ దదాశీర్వచోఽవసాన
విశ్రుతముహుర్ముహుస్తథాస్త్వితినినాద
భాసురధరాసురైతద్వివాహమధిక
భాగ్యదంబగుఁగాక దంపతులకెపుడు. 5.

## 20. చిలర వేంకటేశ్వరకవిగారు.

వీరికాపురము గుంటూరు మండలములోని వెల్లలూరను గ్రామము. ఆర్వేల నియోగి బ్రాహ్మణులు. కౌండిన్యసగోత్రోద్భవులు. తండ్రి సుబ్బయ్యగారు, తల్లి పిచ్చమ్మగారు. ఈకవి జననము విరోధినామసంవత్సర మార్గశీర్ష బహుళసప్తమీ శనివారము. పూర్వఫల్గున నక్షత్రము (అ 1889 సం|| ది 14 డిశంబరు) న. ఇప్పటికి రచించినగ్రంథములు 1. హరిశ్చంద్రచరిత్ర. 2. శ్రీకృష్ణవిజయము. 3. విచిత్రపురూరవము (నాటకములు)ను, మునుపల్లె, ఎడ్లపల్లి, అన్నవరము మొదలగుగ్రామముల యందవధానములుచేసి సన్మానములను బొందినారు.

క|| శ్రీవాణీశ్వరు బలెసౌ
ఖ్యావహతన్విద్దలరసి హైమవతీసీ
తావిజయలక్ష్మి యుతుఁడై
శ్రీవిస్తరి లంగవరుఁడు చెలఁగుసతతమున్. 1.

సీ|| మంగళదేవతా మధుసూదనులరీతి
భాగతీపద్మ సంభవులభాతి
హైమవతీవృషభాధి రోహణులట్టు
లలశచీసంక్రందనుల తెఱఁగున
ఛాయాప్రదీప్తభాస్కరుల సామ్యంబున
రోహిణీహరిణ ధారులవిధముఁ
జంద్రమతీహరి శ్చంద్రులమాడ్కిని
ధరణిజారామ భూధవులకరణి

గీ|| వసుధవర్ధిల్లుఁడీ శతవత్సరంబు
లాయురారోగ్యవృద్ధిగా నఖిలవసుస

మృద్ధిగా సత్సుతాప్తి సమృద్ధిగాన
యాభివృద్ధిగా దంపతుల్ హర్ష మొదవ. 2.

సీ॥ కాంచుఁడీ సుగుణ సాగరులైన సుతులఁబో
షించుఁడీ ధర్మసాశీల్యములను
బెంచుఁడీ మార్గణ ప్రియకుటుంబముల మె
ప్పించుఁడీ వసువులర్పించి కవుల
మించుఁడీ సంపత్స మృద్ధిచే వరసిపూ
జించుఁడీ నిగమ భాసితుల గురుల
నించుఁడీ యశము ప్రపంచమం దెల్లఁ జే
యించుఁడీ క్రతువు లహింసవిధినిఁ

గీ॥ బుడమి నాచంద్ర తారార్క ముగఁ బ్రతిష్ఠ
నిల్పుఁడీ శరణార్థుల నెనరుగలిగి
రక్షణము సేయుఁడీ సురప్రతతిఁ దన్పుఁ
డతులశుభములు గల్గు దంపతులు! మీకు. 3.

సీ॥ ఎంతకాలము తార కేశమార్తాండబు
ధేంబు లంబరమందుఁ గ్రాలుచుండు
నెంతకాలము సార సంతర్గైనానాది
గంతర్గై సంతతా నంతయులరు
నెంతకాలము ప్రాణి సంతానములఁ బృథి
వ్యాదిభూతావళి యధివసించు
నెంతకాలం బావ గేశలోకాలోక
కులగోత్రములు స్థిరంబులుగ నుండు

గీ॥ నంతకాలము సుఫలదంబై, ద్విజప్ర
సాదమై, యచ్యుతాహీన మూలమైయు

శాఖోపశాఖలై ప్రబలఁగలదు
క్రమతమీఁదగు వంశవృక్షంబుధరణి. 4.

మ॥ అతులైశ్వర్యము లందినారొవడమి వారార్వేలవంశంబునం
దతివిద్యావినయాదు లూహనుదయం బర్యోంబామీమీకునీ
క్షితిదేవోత్తము లెల్లప్రేమమెయి నాశీర్వాదముల్సల్పిరం
చితసౌభాగ్యము లబ్బుటబ్బురమె లక్ష్మీసత్యనారాయణుల్. 5.

ఉ॥ చిలరవేంకటేశ్వరుఁ డశేషమహత్వ కవిత్వవైదుషీ
తల్లజపాదపద్మములెదన్ దలపోసితదీయప్రేమచే
నల్లినపంచరత్న మయహారము మీగళసీమఁదాల్చిశ్రీ
వల్లభవీక్షణామృతశుభంబులఁ బొందుఁడు సర్వకాలమున్. 6.

## 21. వేంకటరామకవులు.

ప్రతాపవేంకటేశ్వర్లుగారు—వీరినివాసస్థలము నాగండ్ల. ప్రస్తుతము బాపట్లతాలూకా మన్నవ. వెలనాటివైదికులు. ఆశ్వలాయన సూత్రము. ఆత్రేయసగోత్రము. తండ్రికోటయ్యశాస్త్రిగారు. తల్లిమహాలక్ష్మమ్మ. నందన సంవత్సర శ్రావణశుద్ధదశమి జన్మదినము.

రావూరిశ్రీరాములుగారు—వీరినివాసస్థలము బాపట్లతాలూకా పెదనందిపాడు. ఆయువేలనియోగులు. ఆపస్తంబసూత్రము. జనకగోత్రము, గౌతమ. దత్తగోత్రము, భారద్వాజ. జనకతండ్రి మన్నవశేషగిరిరావుగారు. దత్తతండ్రి వేంకటకృష్ణయ్యగారు. జనకతల్లిరామమ్మ. దత్తతల్లిచిన్నమాంబ. విక్రుతిసంవత్సరఫాల్గుణశుద్ధషష్ఠి జన్మదినము.

వీరికి, ఆంధ్రమునఁగవిత్వము చెప్పుట, అష్టావధానముచేయుట, సంస్కృతమునను బరిచయముగలదు. పెక్కుచోట్ల నవధానము లొనర్చిరి.

వీరిచే రచియింపఁబడిన గ్రంథములు:—1. హనుమన్నక్షత్రమాల 2. వేణుగోపాల తారావళి. 3. సారంగధర. (మత్తకోకిలలు, ఉత్సాహవృత్తములతో)

ఉ॥ శ్రీరమణీయురస్థలివసింప మునీంద్రసురేంద్రులాదిబృం
దారకులొక్కవంక సతతమ్ము భజింపఁగలోకపాలకుం
డైరమణీయసంపదల నందఱినిన్ దనియించుచుండు నా
మారమణుండు మారమణుమన్సుసుఖాబ్ధినిఁదేల్చునిచ్చలున్. 1.

చ॥ సిరులుగలట్టివారలకుఁజేరదొకించుక విద్యయద్దియున్
వఱలినయేని సద్గుణమవారిత వృత్తినిఁజెందకుండు నె
ట్లురహినిసద్గుణంబులను లోపముగల్గకయున్న కైతఁజే
కురవివియన్నియుంగలుగు కోమలదేహుఁడవీ విభూవరా. 2.

మ॥ మునుభూభర్తలచేతఁబెంచపడి సమ్మోదమ్మునన్ సంచరిం
చినదారాకవితావధూటియిపుడున్ జీవించినిర్జీవిభం
గినియుండంగని తత్సహాయమను రక్తిన్ జేయఁగానెంచి నా
వనభూభూపవతంస యిట్టివెగదా యౌన్నత్యసత్కారముల్. 3.

సీ॥ ఏదిక్కుఁగాంచిన నాదిక్కు వేదంబుఁ
బఠియించు విప్రులుఁబరిఢవిల్ల
యేదెసఁజూచిన నాదెససంస్కృత
భాషాప్రవీణులౌ పండితాళి
ఏవైపుఁగనుఁగొన్న నావైపు రహియించ
గానంబుఁబాడెడిగాయకులును
యేవంక వెదకిన నావంకసత్కావ్య
గరిమచేమించెడి కవివరులును

ఆ॥ నలుఁగడలను సిరులఁదులఁదూఁగుచుండెడి
వారితోడనీసభాభవనము
వఱలుచుండె నేఁడు సరససద్గుణగణ్య
శాంభవరాయ హరభుజంగరాయ. 4.

శా॥ శ్రీరామాహృదయాబ్జభృంగహరిరాజీవాత్మవిద్వన్నుతా
ధీరోదార మునీంద్రవందిత పదాఘృష్టప్రభాభాసురా
మారారిప్రముఖాబ్జయోని సురసన్మాన్యాశుభోదంతలో
కారాధ్యాదయని వ్వధూవరులనీవాశీర్వదింపంగదే. 5.

శా॥ నానానిర్జరపూర్వనిర్జర వితానంబబ్ధిఁద్రచ్చంగని
ధ్యానానందము గాఁజనించెనిరి, కన్యాదాతయౌ సాగరుం
డానారిన్ హరికీయదంపతులెర్రై యానందముంగూర్చుల
క్ష్మీనారాయణులివ్వధూవరుల కాశీర్వాదముల్ సేయుతన్. 6.

శా॥ ప్రాలేయాచలకన్య దేహమున నర్ధంబున్ గ్రహింపంగఁదా
మౌళిన్ నిల్పెను గంగయిర్వురిని సామాన్యంబు గాఁజూచుచున్
గేలీలాలసుఁడై విహారయుతుఁడై కీర్తిప్రభాభాసురుం
డైలోకేశ్వరుఁడివ్వధూవరులఁ దానాశీర్వదించున్ వెసన్. 7.

చ॥ సకలచరాచరాస్పద రసాతలమున్ సృజియించిమాడునా
సకియయటన్న వాణియును సర్వజగన్మయవాక్ప్రపంచము
త్సుకమునఁజేసియున్ స్వకృతశోభిత నిశ్చయలౌవధూవరుల్
కకుదములివ్వ ధూవరులఁగాచుచునుందురుగాత నిచ్చలున్. 8.

## 22. కూచి సత్యనారాయణశాస్త్రిగారు.

వీరుగోదావరిజిల్లా రామచంద్రపురముతాలూకాలోని దంగేరుగ్రామ వాస్తవ్యులు. తారణసంవత్సర భాద్రపదబహుళ అష్టమి దినంబున జనన మొం

రిరి. తండ్రి రామశాస్త్రిగారు. తల్లి శేషాంబిక. వీరిచే రచింపఁబడిన గ్రంథములు. 1. వరూధినీవిలాసము, (రూపకము) 2. యుక్తరాఘవము, (రూపకము) 3. పార్వతీపరిణయము. (ప్రబంధము) 4. సద్గురుస్తవరాజము (ప్రబంధము) వీరిపెద్దలందఱును బండితులు కవులునై యుండిరి. నాచికేతోపాఖ్యానము, బేతాళపంచవింశతి, రామచంద్రోపాఖ్యానము మొదలయిన గ్రంథరాజములనొనర్చి జగద్విఖ్యాతినందిన మిక్కిలి మల్లికార్జునశాస్త్రిగారు వీరిమాతామహులు.

సీ|| శ్రీహరిదన్ను వాంఛించికన్గొనుచుండ
శ్రీకాంతలజ్జచే శిరమువంపఁ
గమలయోరంత్రిగే గంటఁగాంచుచునుండ
నళినేక్షణుఁడు చిఱునవ్వునవ్వ
నన్యోన్యవిముఖులై యరనిమేషమునిల్వ
మదిలోనఁ గోరికల్ మల్లడింప
నదరిపాటునదృష్టు లన్యోన్యమతికింప
ననశులై చొక్కి దేహములుమఱవ

గీ|| నతిమహోత్సవమున మందరాద్రియందుఁ
బరిణయంబౌ పురాణదంపతులభద్ర
వీక్షణములు పరస్పరప్రేమనొసఁగి
మించియీదంపతులను రక్షించుఁగాక! 1.

సీ|| కుసుమాస్త్రుఁడీపెండ్లి కొడుకనువారికి
బాలికరతిదేవి భంగిఁదోఁచు
నకలంకచంద్రుఁడీ సుకుమారుఁడనువారి
కీబోటిరోహిణి యింపుఁజూపు
నలకృష్ణుఁడీవరుం డనిఱొంచువారికి

కన్యరుక్మిణిపోల్కెఁ గానవచ్చెఁ
గలితవసంతుఁడీ లలితాంగుఁడనువారి
కీశమహాసంతి లీలమెఱయఁ

గీ॥ చిత్రవైఖరి మీఱంగసృష్టిఁజేసి
పేర్చియీదంపతుల సమకూర్చినట్టి
యావిరించను చాతుర్యమభినుతింపఁ
గలమెకోవాని కడుపుబంగారుగాను. 2.

సీ॥ లోకముప్పొంగు దుర్లోక్యప్రభావంబు
తోనొనర్చిరి మహోద్యోగములను
బృందారకులకు నానందంబుసంధిల్ల
నాచరించిరి. దివ్యయాగములను
నిగమంబుఁజదివిరన్నిర్ణీత విధులచేఁ
బోసఁగఁజేసిరి త్యాగభోగములను
ప్రాభవసంపదా స్పదులయ్యుఁగాంచిరి
రాణించుసత్త్వ విరాగములను

గీ॥ మానితానంత పూజావిధానసావ
ధానమానస పదసన్నిధానగమిత
పరశివనిధానులగుచు మించిరొకయింత
పాటివారలెవర్ల మున్నాటివారు. 3.

సీ॥ అత్యంతకారుణ్య నిత్యసన్నిహితమా
ర్కండేయవిభుఁడు సంరక్షకుండు
వంశపరంపరా ప్రాప్తసామ్రాజ్యల
క్ష్మీకటాక్షములు తేల్చించుగనులు

కమనీయధారాళ గమనశోభితకవి
త్వవిలాసవతిస్వయంవరపురంధ్రి
అష్టదిగ్రంగవిస్పష్ట నర్తనకళా
ప్రౌఢయశఃకాంత వారకాంత

గీ|| గాఁగవర్తించునద్భుత క్రమమువారు
పేరుమాత్రంబు ప్రెగ్గడపేరుగాని
రాజరాజింప రాజాధిరాజవరులు
ప్రెగడకులభూషణులు మంత్రిప్రెగడవారు. 4.

ఉ|| ఈయుభయాన్వయంబులకు నీడగునంచు వివాహబంధసం
ధాయకుఁడై విరించనుఁడొనర్చిన సంఘటనంబుఁబోడశో
భాయతమైన హైమ వలయంబునరత్నముఁ గూర్పదద్వయా
మేయరుచుల్ ఘటిల్లి వసమించినభంగిఁ జెలంగురంగుగన్. 5.

ఉ|| ఈవిధవంబుఁగన్గొనఁ గవీంద్రులకెల్ల భుజంగరాజధా
త్రీవిభుఁడాదరాన్విత మతింబిలిపించె నయారెమున్నవా
డ్రేవుకులాబ్ధిచంద్రుని కడిందివివాహ మహోత్సవంబునన్
భావితరక్తిఁగూడుకొని బందరునందరు దందిరందఱున్. 6.

ఉ|| నాటికి నేడుగా! కవులునల్వురుఁగూడిన భాగ్యమబ్బెము
మ్మాటికిఁగీర్తికాములగు క్ష్మాపతులందఱికిప్పుడీగతిన్
చాటనుజూపినట్టి కవివర్యభుజంగ నృపాలువద్దను
న్నాటికుశేశ్వరున్ భువననాథుఁడుమాపతి ప్రోచుగావుతన్. 7.

క|| వారికివీరికి భాంధ
వ్యారంభము సర్వమంగళారంభకమై
యారూఢిగ వాహిమకర
తారార్కము వెలయుఁగాక ధరణీస్థలిపైన్. 8.

## 23. కురుగంటి సూర్యనారాయణశాస్త్రిగారు.

వీరి నివాసస్థలము కృష్ణామండలములోని కొల్లాసరోవరమునకు దక్షిణతీరమునందలి కైంకర్యపు రంబ నెడి ప్రాచీననామమునఁ బ్రసిద్ధిఁజెందిన కైకలూరు గ్రామము. వీరు కృష్ణయజుశ్శాఖవారు. వెలనాటి వైదికులు. ఆపస్తంబసూత్రులు, హరితసగోత్రులు వీరి తండ్రి అప్పయ్యశాస్త్రులుగారు. తల్లి వెంకమాంబ. వీరి పితామహుఁడు తర్క-వ్యాకరణ వేదాంతాదిషడ్దర్శనములయందు దిగ్విజయమును బొంది యనుగమభట్టాచార్యాది బిరుదాంకితులగు కురుగంటి వెంకటరామశాస్త్రులుగారు. జన్మదినము. కలియుగగతాబ్దంబులు 4960 శాలివాహనశకగతాబ్దంబులు 1781. హూణశకాబ్దంబులు 1860కి సరియయిన సిద్ధార్థిసంవత్సర పుష్యబహుళనవమీ సోమవారము. వీరాంధ్రగీర్వాణములయందు, నుభయవ్యాకరణ విశిష్టంబులగు నాటకాలంకారాద్యుభయసాహిత్యములయందుఁ దర్క-వేదాంత నవవిధవాస్తు జాతకసిద్ధాంతములయందు నుభయభాషాకవిత్వములయందుఁ బ్రవీణులు. పెక్కురను ఉభయభాషాకవిత్వవంతులనుగాను నుభయసాహిత్యవంతులనుగాను బండితులనుగాను జేసిన విద్యాగురువులు. వీరు నూజవీడు శ్రీరాజారంగయ్యప్పారావు బహద్దరు జమీందార్లవారి హైస్కూలులోఁజిరకాలము ప్రథానాంధ్రోపాధ్యాయులుగానుండిన విద్వాంసులు. ప్రకృతము విశాఖపట్టణములో బ్రిటిషుగౌర్న రుమెంటువారు ధర్మబుద్ధితో నూతనముగా స్థాపించిన హిందూబాలికాపాఠశాల యనెడి క్వీన్ మేరీసు హైస్కూలులోఁ బ్రధానాంధ్రోపాధ్యాయులుగానుండియు నాంధ్రసంస్కృతములు రెండును బోధించు విద్వాంసులు. వీరు రచించినగ్రంథములు. (సంస్కృతగ్రంథములు) 1. హరిశ్చంద్రచంపువు 2. హంసవంశము. 3. సుబ్రహ్మణ్యవిజయము. (తెలుఁగు-తర్జుమాగ్రంథములు) 1. కాదంబరి. ట్రాన్‌స్లేషను. తెలుఁగుపద్యకావ్యము సమగ్రము 2. దత్తాత్రేయమాహాత్మ్యము. ట్రాన్‌స్లేషన్. తెలుఁగుపద్యకావ్యము. 3. అనర్ఘరాఘవనాటకము. ట్రాన్‌స్లేషన్. తెలుఁగువచనకావ్యము. (ఒరిజినల్

తెలుఁగుగ్రంథములు) 1. దక్షయజ్ఞధ్వంసనాటకము. 2. కామదహననాటకము. 3. కుమారసంభవనాటకము. 4. దేవసేనాపరిణయనాటకము. 5. దశావతారచరిత్ర. నాటకము. ఇపుడు రచించుచున్న తెలుఁగుగ్రంథములు. 1. నియోగవైదికాభేద నిర్ణయము. (వచనకావ్యము) 2. కవిచరిత్ర (వచనకావ్యము) 3. ఇంకను మఱికొన్ని చిల్లర గ్రంథములు.

శా॥ శ్రీరస్తుప్రథవేత్రిలింగకవితాజీవాత్మవేసాధవే
ధీరవ్యాస్మృతి సింధవేవిమలమంత్రిప్రెగ్డవంశేందవే
శ్రీరజ్యద్వసవేసువైదికమయార్వోల్కాదురోచిష్ణవే
సారజ్ఞాయభుజంగరాయవిభవే సామ్రాజ్యలీలాభువే. 1.

శా॥ సమ్యగ్రూపనయోవిలాస సుషమాసౌభాగ్యరేఖోచితా
ప్రాంచన్మంగళరూపిణౌ జనకజాకాకుత్స్థతుల్యాకృతీ
ఏతౌనూతనదంపతీ విజయలక్ష్మీ సత్యనారాయణా
వహ్యాద్విస్యదయామృయస్మిత దృగంతస్సోర్ధనారీశ్వరః. 2.

మ॥ కవిమంత్రి ప్రెగడాన్వయాగ్రణి భుజంగక్ష్మాసురేంద్రుండుల
క్కవరాధీశుఁడు పండితప్రభువు సత్కార్యప్రసిద్ధుండుస
త్కవిసంతానవినోదియష్టవిధ సంతానుండు తానుండుని
ఋ్ఘవిహేలాపురి హేలయింద్రపురి సొంపున్మించివర్ధిల్లఁగన్. 3.

ఉ॥ ఉండిన యాభుజంగనృపుఁ డుత్తమపూరుషుఁడౌనసంగఁదా
నిండినఖ్యాతిఁజెంది క్షితి నేతలచెన్నెలఁజెన్నె సంగిభూ
మండలినాంధ్ర భాషనభిమానముతోఁగనఁగృష్ణదేవరా
యండనఁబోలిసత్కృతుల నందెడు శ్రీవిలసత్కుటుంబుఁడై. 4.

॥ ఉభయకులములనొక్కటనుదరింపఁ
జాలుతెనపెద్దకూఁతుని జారుగాత్రిఁ

చిలుమసీతావిజయలక్ష్మి పేరమతియు
హైమవతి పేరనెపుడు ముద్దారనితఁడు. 5.

సీ|| తనముద్దుకూఁతురందఱుఁబ్రౌఁడిబొమ్మక
న్యకసిరిగలదియౌ హైమవతిని
వరుఁడుచక్కనివాఁడు వడ్లమన్నాటివెం
కటరామయార్యుని కన్నకొడుకు
సరివాఁడువేంకట సత్యనారాయణ
రావునకధిక గౌరవముతోడఁ
దమిఁబ్రమాదీచవత్సర మార్గశీర్షంపు
బహుళపంచమి గురువాసరమున

గీ|| లలిమఖాయుక్తమగు తులాలగ్నమందు
నిచ్చితార్యత్రికంబును మెచ్చువెరుగ
సురలుమెచ్చంగ సకలభూసురులుదీవ
నలనొసంగఁగఁ గన్యదానంబుఁజేసె. 6.

చ|| వరమనవచ్చుజానకి వివాహముకంటె భుజంగరాట్సుతా
పరిణయలీలధర్మగుణభంజనముం గవిమార్గయుఁజ్నెరా
కరణము లేకతత్తదుపకారము లౌటమహేశుఁడివ్విధూ
వరులకు నిచ్చలిచ్చు ననువర్తనమున్సుఖముంజిరాయువున్. 7.

సీ స మా లి క.

తొలినాఁడు స్నాతకోద్యోగమూరేగింపు
వోలిఁబాణిగ్రహణోత్సవంబు
మఱునాఁడుమోదసంమతిఁగూచి పూడిభా
గవతులనటనాదికథలకేళి

పదపడి యానాఁడె పట్టంపుగానవి
    ద్వాంసులసభలోని పాటరక్తి
మఱునాఁడుజనులు వేమఱుఁజూడఁదాలిమి
    ఖానవారల మల్లకళలవిలువ
మఱియునమ్మఱుపూటమఱియొకపట్టంపు
    గానవిద్వాంసునిగాన సరణి
మఱునాఁడుదేశ్యముల్మఱిగినపగటివే
    గవతులహాస్యోక్తికలన మొకటి
తరువాతవేదశాస్త్రములఁ బేర్వడినపె
    ద్దలఁబరీక్షించి సత్కారమిడుట
యాస్థానవిద్వాంసుఁడయిన తాడేపల్లి
    వేంకటరత్నార్యవిభులగీతి
మఱునాటియుదయాన మఱిచల్లపల్లివి
    ద్వాంసులసన్నాయి పాటయొకటి
మఱుపూటఁగవనంపుమధురవాక్కులఁగూర్పు
    కవిపండితుల సమాకలనమొకటి
తరువాత నారాత్రిఁబురవిభులింపార
    నురువైనయంబారి యుత్సవంబు
మరునాఁడు బహువిధామలగాయనస్వర
    గ్రామముల్పల్క బల్గాత్రమపోను
నన్నాటిమఱుపూట వాటుకవీంద్రసిం
    హాదినానాబిరుదాంకితులగు
కుండినకవివరుల్ కొప్పరపుఁగవిసో
    దరులద్భుతా కవిత్వపువినోద
మటుమీఁదనారాత్రి నటనసంగీతసం

భావితమగునాట భాగవతము
నయిదునాళులు మద్రసాప్యాయముగనునం
దఱికుమృష్టాన్న సంతర్పణములు
పండితసత్కృతుల్ మెండును భూరిసం
భావనలవి దండిపామరులకుఁ
గవులకు శాలూలుగడియాలు నూటప
దాఱులుమనసార వారికిడుట
పెండ్లివారికిఁబెక్కువియ్యంపు మర్యాద
లెన్నెన్నొ వేలుకేలింపులెసఁగ
సతిహైమవతి సీతజయలక్ష్మియుద్వాహ
మివ్విధంబునఁబుట్టివింటనయ్యె.

గీ|| ఇట్లురాజాభుజంగ రాయేంద్రుకూఁతు
రల్లుఁడగునివ్వధూవరు లనవరతము
సిరియుసంపదతులఁ దూఁగఁజెలువమెసఁగ
నోగిఁజిరంజీవులై ప్రీతినుంద్రుగాత. 8.

ఉ|| ముప్పదిమూఁడుకోట్లు సురపుంగవులిందు వివాహవేదిపై
నొప్పుగనున్నవారిచటి యొప్పునకున్మదిఁ బొంగిముందు మే
లొప్పునటంచుఁ జెప్పుకొనుచుండిరి యన్నైతథాస్తటంచునే
నెప్పుడునివ్వధూవరుల కెంతయుదీవన లిచ్చుచుండెదన్. 9.

మ|| శివులెల్లప్డుశివంబుశ్రీహరియు లక్ష్మిదేవియానందమున్
దివిజాగ్రేసరుఁడాయువున్ మధురవక్త్రత్వంబు వాగ్దేవియున్
రవియారోగ్యము నగ్నిహోత్రుఁడుసిరిన్ రాఁజేసిప్రోచున్ భుజం
గవిభుప్రీతులనివ్వధూవరుల నానాసౌఖ్యముల్పొందఁగన్. 10.

## 24. పులవర్తి అన్నపూర్ణయ్య శాస్త్రిగారు.

సీ॥ శ్రీగణేశుండు నీచేయుచైవులనని
రిఘ్నంబుగా నెంతకేర్పఁగాత
శ్రీవాణిసర్వ విద్యావిశారదునిగాఁ
జేసినిన్నెపుడు రక్షించుఁగాత
శ్రీమహాలక్ష్మి సుస్థిరములై యలరారు
సిరులిచ్చినిన్ను బోషించుఁగాత
శ్రీహైమవతియు నశేషశుభంబులన్
వెలయించినిను గారవించుఁగాత

గీ॥ సదయులై సర్వసురలును సకల సుఖము
లొసఁగిసతతంబునిను బ్రోచుచుండ్రుఁగాత
భువిని హైమవతీ పూర్వపుణ్యమునను
సత్యనారాయణ సుమామసువిర్భృ థామ. 1.

సీ॥ పరమభక్తుండైన ప్రహ్లాదుఁగూర్మిఁగా
పాడినసద్భక్తవత్సలుండు
సంత్రస్తుఁడగు విభీషణునకు నభయంబొ
సంగి ప్రోచినదయాసాగరుండు
సుజనుఁడైతగు ధర్మసుతునకు జయమిచ్చి
ప్రోచినయాశ్రిత పోషకుండు
బీదకుచేలుఁగు బేరు సంతటివాని
గానొనర్చిన మహాదానఘనుఁడు

గీ॥ హరివినూతనదంపతులైనమిమ్ము
ధనకనకవస్తు వాహనాద్యఖిలములు

దున్నతులఁజేయుఁగాత విద్వన్నుతుండ
రమ్యచరితుండ సత్యనారాయణుండ. 2..

సీ॥ శ్రీవిష్టపత్రయీ సృష్టిచేష్టాధృష్టుఁ
డబ్జవిష్టరుఁడభీష్టాయువొసఁగి
నందారుసందోహ మందారుఁడగునంద
నందనుం డవిరళానందమొసఁగి
రంగదర్ధాంగసుసంగత సర్వమం
గళుఁడింగ జారమంగళము లొసఁగి
నిఖిలలోకానంత సుఖదుఁడౌపద్మినీ
సఖుఁడు సదారోగ్య సుఖమొసంగి

గీ॥ మనుతురెప్పుడునిన్ను హైమవతితోడ
సకలసుగుణాభి రామసజ్జనలలామ
పద్మనాట్టి సద్వంశవార్ధిసోమ
సత్యనారాయణ సునామసవితృధామ. 3..

సీ॥ చతురాననుని ముఖాబ్జమునందు భారతీ
హరిణాక్షి మెలఁగుచున్నంతవఱకు
విష్ణుదేవునియురః పీఠమందబ్ధిక
న్యారత్న మొప్పుచున్నంతవఱకు
పరమేశ్వరుని వామభాగంబునందుమా
కాంతభాసిల్లుచున్నంతవఱకు
ఘనతేజములతోడ గగనభాగంబునం
దలసూర్య చంద్రులున్నంతవఱకు

గీ॥ హైమవతితోడ సకల సౌఖ్యంబులమర
నతిశయింపుము పుత్రపౌత్రాదులలర

నష్టమవాన్నటి సద్వంశవార్ధిసోమ
సత్యనారాయణసు నామసవితృధామ. 4.

సీ॥ శ్రీమన్మిథ శృమత్కృతి వాక్ప్రయోగాతి
మదితవాణీ చతుర్ముఖులకన్న
సరసకటాక్ష వీక్షాస్ఫుటాన్యోన్యాను
రాగలక్ష్మీజనార్దనులకన్న
నిత్యదేహార్ధనిరతిశయానంద
సహితగౌరీ మహేశ్వరులకన్న
సతతసాన్నిధ్యాతి శయవిస్ఫుటస్నేహ
సంయుతఛాయాబ్జసఖులకన్న

గీ॥ నధికతరమగునమరాగమతిశయిల్ల
ననుభవింపుఁడు సకల సౌఖ్యంబులెలమిఁ
బరమకల్యాణగుణ హైమవతియు నీవు
సత్యనారాయణాభిఖ్యసన్సమాఖ్య 5.

## 25. అల్లమరాజు రంగశాయికవిగారు.

సీ॥ శ్రీరమారమణుండు సారసనేత్రుండు
నీలపయోధర నిభతనుండు
శంఖచక్రగదాసి శార్ఙ్గధనుర్ధారి
కమలామనోజ్ఞ మత్తమధుకరము
శేషశయానుండు శ్రితజనావనదక్షుఁ
డఖిలలోకాధ్యక్షుఁ డమరనుతుఁడు
స్వర్ణాంబరధరుండు పక్షిరాడ్వాహుఁడు
లలితకలాపి కలాపయుతుఁడు

గీ|| సంతతదయార్ద్ర హృదయుండు శంభుహితుఁడు
నందనందనుఁడంచితా నందదాయి
యగుచు శ్రీసత్యనారాయ ణాఖ్యునకును
హైమవతికిని శుభసమూహంబునొసఁగు. 1.

శ్లో|| యాదుగ్ధాంబునిధేః ప్రభూయదుహితా ధత్తేపి తేవోర్మికాః
యాచంద్రస్య సహోదరీ సహజవద్దామాంశుకోద్యత్తనుః
సాదేవికమలాలయాత్రి జగతీమాతాభృశంప్రేమతః
పృష్ట్వా హైమవతీంచ రక్షతుసదా శ్రీసత్యనారాయణం. 2.

శ్లో|| శ్రీసత్యధీట్కమల జాదిసుపర్వసేవ్యః
శంభుస్సమస్తభువనాధి పతిర్భృతాబ్జః
భద్రంవితీర్యభువి హైమవతీంచసత్య
నారాయణాఖ్య మనిశంకృపయాప్రపాయాత్. 3.

శ్లో|| యస్యాశ్శీతనగాధిరాడ్జనయితా ప్రేమ్ణాభవత్ప్రోషితా
యస్యానిర్జరయోషితస్స్వవికటేపానీయచేటోభవన్
సైషా హైమవతీమహేశ్వర తనోరర్ధాంశభాక్సర్వదా
సౌభాగ్యం హైమవతీంచ రక్షతుసదా శ్రీసత్యనారాయణం. 4.

శ్లో|| విద్వజ్జనా శీర్వచనానియాని
వేదోక్తమార్గాను సరాణితాని
సత్యంసమేత్యాభి జనస్యవృద్ధ్యై
భవంతుజాయాపర యోరజస్రం. 5.

## 26. వేమూరి విశ్వనాథశర్మగారు, యమ్. ఏ.

వీరు వేమూరి శ్రీరామశాస్త్రులవారి సోదరులు. వారిచరిత్రమును జదివిన వీరిసంగతి విశదమగును. అయ్యది గ్రంథారంభమునఁ జూడనగును.

ఉ॥ శ్రీమహిళాకృపా మహిమసిద్ధమనోరథులౌచుసజ్జన
స్తోమము మెచ్చఁగాంచినిజ శుద్ధచరిత్రముచే వధూవరుల్
తామరతంపరై కుల ముదారయశోవిభవాఢ్యమై కళా
ధామతనొప్పఁగాలుదురు తద్దయు నాయువు భాగ్యమొప్పఁగాన్ 1.

## 27. నంబూరి తిరునారాయణస్వామిశర్మ కవిగారు, బి. ఏ.

వీరు ప్రమోదూత సంవత్సరమున మైసూరు సంస్థానమునకుఁ జేరిన మేల్కోటయను తిరునారాయణ పురమున జన్మించిరి. నియోగి వైష్ణవులు. కణ్వసగోత్రము. తండ్రి బలరామ ప్రధానిగారు. తల్లి లక్ష్మీదేవమ్మగారు. ఈకవికృత గ్రంథములు. రుక్మాంగద నాటకము, ప్రణయమహిమ, (నవల) దుర్గావతీ నాటకము. నిడదవోలు యెస్టేటు మేనేజరుగా నున్నారు. సంతాన మిరువురు పుత్త్రులు.

సీ॥ సౌశీల్యగరిమకు సంతసించిభవాని
రైయిదువతన మక్షయంబు సేయ;
నయవచోగరిమకానందించి వాగ్దేవి
భర్తృసమ్మాన సంపదఘటింప;
దీనరక్షణపరాధీనత కెదమెచ్చి
శ్రీలక్ష్మియొడలేని సిరులొసంగ;
బుధజనారాధన బుద్ధికివలరారి
సురవధూనికరంబు శుభములొసఁగ

గీ॥ శ్రీయుతుండైన సత్యనారాయణుండు
నిత్యసమ్మోదితాత్ముఁడై నిండుకూర్మి
సోముగారతహైమవతీ వధూమతల్లి
సద్గుణకలాపయుభయ వంశప్రదీప. 1.

ఉ॥ శ్రీమహిళామనోహరతఁ జెన్నలరారియుఁగావ్యభారతీ
కాముకుఁడయ్యుఁబోతనివిఁగానక యంతటనైనఁగీర్తికాం
తామణిచేయిపట్టెఁ దగునాయిదియంచుఁబరావనీపతి
స్తోమముదూరునిన్ను బుధలోకశిఖామణిశేఖరాన్మణీ. 2.

## 28. కాళ్లకూరి సాంబశివరావుగారు, బి. ఏ.

వీరు నలుగురన్నదమ్ములలోఁ బెద్దవారు. తండ్రి భోగరాజుగారు. తల్లి పాపమ్మగారు. భారద్వాజ సగోత్రము. ఆపస్తంబ సూత్రము. ప్రస్తుతము కృష్ణాజిల్లా భీమవరము తాలూకా బొండాడ గ్రామము కాపురస్థలము. కాకినాడ కాలేజిలో 17 సంవత్సరములనుండి ఇంగ్లీషుపాధ్యాయులు. ఎనుబదిరూపాయలు జీతము. వయస్సు 40 సంవత్సరములు. వీరిచే రచియింపఁబడిన గ్రంథములు.—1. రంగారాయకదనసమవాకారము, 2. కన్యకాంబావిలాసము, 3. అప్పారాయ విజయము, 4. ఆంధ్రవచన రచనాపద్ధతి.

ఉ॥ శ్రీకరులంబుజాసన హరిత్రిదశేంద్ర సురాదిసేవితుల్
ప్రాకటసత్త్వలన్వహ శుభప్రదులర్క సుతామరాపగా
స్తోకశరీరులర్థి జనలోకములాదిమదంపతుల్ శుభ
శ్లోకులనూత్నదంపతులఁ జాతురమేయచిరాయురున్నతిన్. 1.

సీ॥ సారస్వతప్రకర్ష ఖ్యాతిజరుగుట
సారగాంభీర్యముల్ సమములగుట
సరవినపారత సామ్యగుణంబౌట
వృత్తతత్త్వము సమవేద్యమగుట
నీరససరసుల నెరిపడఁజేయుటఁ
గవివరామోదంబు కరముఁగనుటఁ
బ్రకటతరధ్వని ప్రాధాన్యమగుటను
సమతాస్వభావంబు సహజమగుట

గీ॥ నరయవిద్యాసముద్రుండ నగుటనిజమె
యారజయలక్ష్మి పుత్త్రినారాయణుండె
యల్లుఁడయ్యెను యోగంబుసార్థమయ్యె
సరసగుణగేయ! మంత్రి! భుజంగరాయ! 2.

గీ॥ విమలశుభలక్షణాన్విత విజయలక్ష్మి
యార్జితో త్తమగుణుఁడు నారాయణుండు
వీరిదాంపత్యమనుకూల విధిని నెగడుఁ
దొంటివారల నామముల్ దొరయుమహిమ. 3.

సీ॥ వైభవగరిమంబు వరలు నేప్రొద్దుశ
చీపురం బరశుభప్రాపకమున
సకలసౌఖ్యోన్నతి సమకూడునిందిరా
నారాయణుల దయాసారమహిమ
సుకలాకలాపంబు సొంపొందు వాణీహి
రణ్యగర్భుల వరప్రాభవమునఁ
బరమసంపత్తి సంప్రాప్తించుఁ బార్వతీ
పరమేశ్వరా నల్పకరుణచేత
గీ॥ వైభవారోగతాయురైశ్వర్యములుపు
రాణదంపతు లొసఁగుచు రహినిమిమ్ము
పాకుదురుగాత మహనిజాంశభవులైన
కారణంబునధరణి నే కాలమునను. 4.

శా॥ ఆనందాంబుధినోలలాడ సుకరంబౌవావరౌ పుత్త్రపౌ
త్రావల్పస్థితి వంశవృద్ధికరమై యశ్రాంతురాభ్యాగత
ప్రాణత్రాణనిదానమై శుభదకర్మద్వారమైరాజయో
గానూవాస్పదమౌచుభూమిపయి గార్హస్థ్యంబెయోగ్యాశ్రమం

శౌనావర్ధిలుమీవినూత్నతర దాంపత్యంబుసంసారమా
హా! నిస్సారమటన్ననూక్తికి నసత్యత్వంబు ప్రాపింపఁగన్. 5.

గీ॥ ఆత్మ యొక్కఁడె యొందున్న దైనఁగాన
"నాత్మవత్సర్వభూతాని" యనెడునెఱుక
నాత్మయాత్మను ప్రేమింపవలయుఁగాత!
సుకమునూతన దంపతులకును, బ్రజకు. 6.

## 29. కలువలపల్లి రంగనాథశాస్త్రిగారు.

వీరి నివాసస్థలము కృష్ణామండలములోని యేలూరుపురము. తండ్రి రామమూర్తిశాస్త్రిగారు. తల్లి లక్ష్మాంబ. జననదినము యువసంవత్సరజ్యేష్ఠశుద్ధచతుర్దశి. కాశ్యపగోత్రము. ఆపస్తంబసూత్రము. వీరుఆంధ్ర వైదికబ్రాహ్మణులు. ఉభయవ్యాకరణ పరిజ్ఞాతలు. సాహిత్యవంతులు. సాధుకవితా రచనా నిపుణులు. గురుభాస్కరాచార్య బిరుదపదాభి గీయమానులై హేలాపురవాసులగు వైశ్యులచేత సంతతంబుసాదరంబుగ సమ్మానింపఁబడుచు వర్ధిల్లుచున్నవారు.

శా॥ యస్యైకస్యవిభోః కృపాకలనయా సర్వంజగద్వర్తతే
తేజోయస్యచదుస్సహం పృథుతమం, సర్వత్రసంశోభతే
సేవాంయస్య చకుర్వతేతను భృతస్స్వాన్యాన్మహేశస్సదా
దేవోహైమవతీం వధూంవరమణిం శ్రీసత్యనారాయణమ్. 1.

శ్లో॥ వధూరియం హైమవతీసతీవ
సుమంగలీ హైమవతీజగత్యామ్
పతివ్రతాసన్నుత సాధువృత్తిః
పతింభజంతీ జయతాచ్చిరాయ. 2.

మ॥ అలరుందావులపోలికన్ విడనిసౌహార్దంబునన్ నిచ్చలున్
మెలఁగిన్ వేర్చిసమస్త సజ్జనులు మెచ్చేలంచు వెన్నున్ మహీ
తలమందుం జరియించు చుండెదరుగాతన్ శ్రేయముల్ చెందిరా
జిలుచున్ హైమవతీవధూజనమణి శ్రీసత్యనారాయణుల్. 1.

ఉ॥ మంచియుఁబెద్దయుందెలిసి మానుగహైమవతీవధూటియ
భ్యంచితవర్తనంబు విడనాడకపెన్మిటి వెల్గుఁబోలెనే
వించెడిగేస్తురాలనెడు పేరును బెంపుగడించి, సంతతిం
గాంచియపారమోదము నఖండసుఖంబును జెందుఁగావుతన్. 2.

మ॥ తల్లిదండ్రుల్ తన మేలివర్తనకు మోదంబందఁగాన త్తమా
మలుసాధ్వీజనతావ తంసమనిపల్మారున్ గణింపంగనె
చ్చెలులెల్లన్ సుగుణాఢ్యురాలని ప్రశంసింపంగ నెంతేమహీ
స్థలిలోవర్తిలుఁ గాతహైమవతివిద్వల్లోకగణ్యస్థితిన్. 5.

శా॥ మంత్రిప్రెగ్గడవంశమౌక్తికమణి శ్రీమద్భుజంగప్రభుః
ప్రాయఃపారిణయోత్స వేతనుభువాం విద్వత్కవీంద్రవ్రజమ్
ఇత్థంపోషితపండితస్సవినయం సమ్మానయన్ పుత్త్రవాన్
భూత్వాదేవకృపాబలాదిహ చిరంజీయాద్యశస్వీభృశమ్. 6.

## 30. క్రొత్తపల్లి సుందరరామయ్యగారు.

వీరిజన్మస్థానము, పీఠికాపుర సమీపచెందుర్తి గ్రామము. తెలుగాణి వైదికులు. ఆపస్తంబసూత్రము. కౌండిన్యసగోత్రము. తండ్రి రామనారాయణుడు తల్లి సుబ్బాంబ. యువసంవత్సరముజన్మము. ఆంధ్రమునఁ బరిశ్రమచేసిన వారు. శ్లేషకవిత్వమునిన వీరికాసక్తి. శ్రీరాజామంత్రి ప్రెగడ భుజంగరావు బహద్దరు జమీదారువారి యాస్థానకవులలోనివారు. ప్రస్తుతము, ఏలూరునం దిల్లుకట్టుకొని నివసించియున్నవారు. వీరిచే రచియింపఁబడిన గ్రంథములు:—

1. వసుస్వారోచిషోపాఖ్యానము,(ద్వ్యర్థకావ్యము) 2. మాళవికాగ్నిమిత్రము, (ప్రబంధము) 3. రామదాసునాటకము, 4. ప్రహ్లాదనాటకము, 5. కుచేల నాటకము. ఇది శ్రీవేంకటగిరికుమారరాజావారును, తంగెళ్లమూడి యెస్టేటు జమీందారువారునగు శ్రీశ్రీ గోవిందకృష్ణయాచేంద్రులు బహద్దరు జమీందారు వారికిఁ గృతియీయఁబడినది. 6. రసమంజూష 7. రామలక్ష్మణదేశయాత్ర, 8. ఆంజనేయదండకము, 9. హస్తలాఘవము, 10. నిజమైనమహాగారడి, 11. దంతశోధని, 12. వ్రణచికిత్స, 13. మేనతికము, 14. శ్రోత్రశోడలు, 15. తిక్కశంకరయ్య, 16. వ్యాసవ్యాసము, 17. భుజంగరాయమణిశతకము, 18. ఆంధ్రీకృతనిరోష్ఠ్యచాణక్యనీతి, 19. ఆంధ్రీకృతహితోపదేశము, 20. బలిమిక్షేత్రమాహాత్మ్యము, 21. నీతిప్రకాశిక, 22. బాలకబాలికా ప్రసంగనాటకము, 23. నిర్భాగ్యచరిత్రము, 24. ఉత్తరకుమారప్రజ్ఞలు, 25. దైవశతకము, 26. వర్ణక్రమైకప్రాసైకతురీయపాదయతిప్రతి పద్యయమకభక్తిప్రధానభావనారాయణశతకము, 27. షడ్భాషానిఘంటువు, 28. కవిహీరశృంఖలము, 29. స్త్రీవర్ణన, 30. దురభ్యాసము మొదలయినవి.

సీ॥ సద్వర్తనమ్ముఁ విశ్వమునిండునట్లుగాఁ
జరియింతుమంచును జాటుకొఅకు
కలకాలమొకరీతి గాభేదమునువీడి
సంచరింతుమటంచుఁ జాటుకొఅకు
పరమానురాగసంభరితాంతరంగప్ర
శస్తిఁబాయమటంచుఁ జాటుకొఅకు
అరమరికలులేక యత్తిరియొట్టిటులె
సాపడెదమటంచుఁ జాటుకొఅకు

గీ॥ పాణిరక్షాగ్ర్యబంధముల్, బమ్మముదులు,
సెలమిఁ బేలనుఁ బేల్గొంట, యేకపాత్ర

భోజనముగల్గిసద్బంధు రాజియందుఁ
బరగెదరుగాక నూత్న దంపతులు సతము. 1.

సీ॥ ఈలసద్గుణకదంబ శేద్యచారిత్రంబ
సీతఁజాల్చాలని చెనకినవ్వు
ఈమృదువాణిమహీయః ప్రభావంబ
వాణిమాటయటంచు రాణఁజేరు
ఈభాగ్యశాలిని సౌభాగ్యగరిమంబ
పద్మనవ్వాయని పలుకరించు
ఈశాంతిపతిత్వ మాహీనసౌజన్యము
యవనినిఁగుసతీ యటంచుఁబిల్చు

గీ॥ నార ! హైమవతీకన్య హస్తముఁగొని
పద్మమన్నాటిఘనవంశ పావనుండు
చిరతరైశ్వర్యములఁజాల చెన్నుమీఱి
శంకరసమాహ్వయుండనఁ జాలఁడొకొ. 2.

సీ। తారాబలంబుఁ జంద్రబలంబు బాగుగ
నూత్నదంపతుల జానుగసుబ్రోవ
లగ్నబలంబుఁగాల బలంబుఁజక్కఁగ
నవవధూవరుల మన్ననలఁదేల్చ
విద్యాబలంబు దైవిక బలంబును బెండ్లి
కొమరునిమతిబెండ్లి కూఁతుఁదనుప
నాశీర్వచనబలంబళి వందనబలంబు
జాయాపతుల సంతసమునఁగూర్పఁ

గీ॥ పుత్త్రపౌత్త్రాభివృద్ధియుఁ బూరివిభవ
సిద్ధియును నాయురారోగ్యబుద్ధులుఁగడుఁ

గల్గిహితబంధు జాలముల్ గౌరవింప
వెలయుచుందురుగాక పృథ్వీతలమున. 3.

సీ|| హైమవతీ వివాహమునాటికవిపద్య
ములరుచిసుహృదయముల నెయుండె
హైమవతీ వివాహమునాటికజ్జాయ
ములరుచి జిహ్వాగ్రముల నెయుండె
హైమవతీ వివాహమునాటిబహుదీప
ములరుచియది నేత్రముల నెయుండె
హైమవతీ వివాహమునాటిసంగీత
ములరుచిశ్రుతిరంధ్రముల నెయుండె

గీ|| చేటికింగూడ, నన్నియు చేదుగూడ
నింకవిస్మయావకాశవిహీనముకట
వనుచు హైమవతీ వివాహమునసందె
యుండి త్రిదశులు దీవించుచుండిరపుడు. 4.

సీ|| ఒకకాలిపారాణి యొప్పుగువానుకి
నూపురోపమమయి యొప్పుచెంద
ఒకపార్శ్వపుబసిండి యొడ్డాణమైనేయ
మనెడుపోలికగాఁగనమువ్విఱి
ఒకప్రక్కవలెవాటుప్రకటకుంభీనస
భూషణమను రీతిఁబొదలుచుండ
ఒకచెంపఁగ్రాలుచంద్రకలాపముదివాల
చంద్రికయను జాలఁజాటుచుండ
సీ|| అర్థనారీశ్వరత్వంబుపార్థకముగ
తెల్పు హైమవతీదేవి పొల్పెసంగ

హైమవతిఁ బెండ్లియాఁడు మహాముదమున
ఘనపతివ్రతఁ గాఁజేసి మనుచుఁగాత. 5.

సీ|| ఏప్రక్కఁ బండిన నాప్రక్క వేగాని
కూడ లేక బాములఁబడెదు నతఁడు
ఎడ్డికాసులకయి వాంఛించి లక్ష్మినా
గుండెఁ బట్టుకొనుచు నుండు నతఁడు
గ్రుక్కెడు నీర్వోయఁ గుత్తుకఁ దడపుచు
నోరు దెఱచి యడ్గఁగోరు నతఁడు
కలకాలమొక రీతి గాయంపు బాధచే
మందు లలందుచు నుండు నతఁడు

గీ|| భర్తగాకున్న నింటింటఁ బడక యున్న
పాటియనవచ్చు వద్ద మన్నాటికులజుఁ
డైన వేంకట సత్యనారాయణునకుఁ
బత్నివైయొప్పుమా హేమవతికిలక్ష్మి. 6.

సీ|| సంతసించితిమి నీజన్మోత్సవము[illegible]
తలితండ్రులొందు మోదముఁ గాంచి
ముదముఁ జెందితిమి నీముద్దుపల్కులనాఁటి
బంధుజనానందవార్ధి మున్గి
మోదమందితిమి నీమురిపెంపు నడనాఁటి
సేవకాహ్లాదంబుఁ జెలఁగఁ గాంచి
హర్షమొందితిమి నీయాటపాటలనాఁటి
సర్వజనామోదసరణిఁ బెంచి

గీ|| కౌతుకముఁ జెందితిమి నీదు కౌతుకమున
హైమవతి ! పీట[illegible]

విజయలక్ష్మియనంగను వేరుఁగాంచి
పుత్రపౌత్రాభివృద్ధిని బొదలుమమ్మ. 7.

క॥ పుట్టినయిల్లును మెట్టియున్
మెట్టినయిలుఁగీర్తిఁ జెందివెగడఁగవసుధం
బుట్టినది హైమవతిచే
పట్టినదిసురూపగుణ విభాసితునిఁబతిన్. 8.

గీ॥ అవని వేంకటసత్య నారాయణునకు
నతివపౌభాగ్యవతియైన హైమవతికి
మంగళము మంగళము జయమంగళంబు
మంగళము మంగళము జయమంగళంబు 9.

## 31. క్రొత్తపల్లి రామచంద్రమూర్తి గారు.

వీరి నివాసస్థలము గోదావరి జిల్లాలోని పీఠికాపురమునకు సమీపంబు నంగల చెందుర్తి. తెలుగాణి వైదికులు. ఆపస్తంబసూత్రము. కౌండిన్యసగోత్రము. తండ్రిగంగయ్యగారు. తల్లి నరసమ్మగారు. విజయనామసంవత్సర ఆషాఢబహుళపంచమి జన్మదినము. వీరాశుధార కవిత్వమును జక్కఁగాఁ జెప్పఁగలరు. చిన్నతనము నుండియుఁ దండ్రిగారియొద్ద రామాయణభారతాద్యనేకగ్రంథములం జదువుటఁ అభ్యాసముచేసి స్వబుద్ధిచేఁగవితాధారనలవరచుకొనిరి. గ్రంథరచనకుఁ బ్రారంభించిరి. తండ్రిగారు సంస్కృతాంధ్ర సాహిత్యములు కలవారై నిరాఘాటశైలింబురాణము జెప్పఁగలవారును జ్యోతిషశాస్త్రవేత్తలునై సదాచారనగలవారైవిరాజిల్లుచుండిరి.

మ॥ పరకైలాస నివాసిశంకరుఁడు దుర్వారాఘసంహారిభా
స్కరచంద్రానల లోచనుండు సకలైశ్వర్య ప్రదుండీశుఁడం
బరగంగాధరుఁడష్టదిశాపతి నతింబాలించుఁగాకీవధూ
వరులన్నాత్మ కిశోరధంపతులు విద్యాసుత్య సౌందర్యులన్. 1.

సీ॥ భక్తజనోపద్రవఘ్నుఁడు పురుషోత్త
మ్ముఁడు రక్షకుండు నామురహరుండు
చతురాననుఁడు చరాచర జన్మభూత్తుండు
నాగమవేదియౌ నబ్జజుండు
పద్మాక్షి సకల సంపత్ప్రదకారిణి
క్షీరాబ్ధితనయ యా శ్రీకమలయు
ధవళాంగి సర్వవిద్యా ప్రదాయిని సర
స్వతి విధిపత్నియౌ భారతియును

గీ. దయను నోముత యీ నూత్న దంపతులను
రక్షసలిపియు నాయువు నక్షయముగ
సిగియును సిరులను ఘటియించియును గు
విద్యలను గూర్చియును నెల్లవేళలోలి. 2.

గీ॥ నాగకిన్నర ఖచరకన్యకలబోని
హైమవతిఁగూడి శంకరుఁడనుచుఁబొలిచి
జగతి నాచంద్రతారార్కముగను మనుము
సద్గుమన్నాటెకులపయోవార్ధిచంద్ర. 3.

సీ॥ అసురాపహృతయై మహావ్యసనంబునఁ
బతిఁబీడి వెతపడు పడఁతికుంధు
పుచ్ఛదీకతనంబుఁ బోఁజిమ్మి కోరికఁ
జంద్రుఁగూడిన యలచామలోటు
కరిపురంబున నీచకర్ణకారరవులఁ
గరముఁగృశించిన కలికిసగ్గు
కాలకౌశికునింటఁగాని కర్మంబుల
నవయుచుఁజేసిన యతివకౌంత

గీ॥ సడలఁజేయు మహోన్నతసరణిఁదగడి
తగునపత్యంబు వడసియిద్ధయశవగుము
బ్రాహ్మణాశీర్వచః పరంపరనుజేసి
దీనజనకల్పవల్లి ! సతీమతల్లి ! 4.

గీ॥ అల్లహైమవతీ వివాహముపురాణ
ములను వినుటరయెగాని కన్నులనుజూడ
మిపుడుమన హైమవతిపెండ్లి యింపుబొదలఁ
గాంచితివిసేడు కన్నులకఱవుదీర. 5.

గీ॥ అరయశీతాంశునకు నమృతార్పణమను
వాగ్గతిరచించితిని పద్యపంచరత్న
ములనుమన్నింపుఁడవ్యక్తలలితమధుర
బాలవాక్కులు వేద్యసంభావితములు. 6.

## 32. క్రొత్తపల్లి సోమసుందరముగారు.

వీరి నివాసస్థానము గోదావరిజిల్లాయందలి పీఠికాపుర సమీపస్థ చెందుర్తిగ్రామము. తెలుగాణివైదికులు. ఆపస్తంబసూత్రము. కౌండిన్యసగోత్రము. తండ్రి వెంకయ్యగారు. తల్లి మంగమాంబ. జన్మదినము, జయనామ సంవత్సర ఆషాఢబహుళ౧౨ గురువారము. శ్లోకకవిత్వమందు నాటకకవిత్వమునందు వీరునిపుణులు. కొంతవఱకు నాంగ్లేయభాషాపరిశ్రమచేసి ప్రస్తుతము గోదావరిజిల్లా పెద్దాపురము తాలూకాప్రత్తిపాడునందు మేజస్ట్రేటు వారి యాఫీసునందుద్యోగియులు. ఉద్యోగవశంబున సావకాశము చిక్కని వారగుటం బట్టియు, బాల్యమగుటం బట్టియు నిదివఱకెంతగా గ్రంథములు రచించియుండలేదు. కాని, ఇఁకముందు బ్రాసిలోకమున కుపకారము సేయఁగలరు. వీరిపినతండ్రులుం బెదతండ్రులు నందఱు ననర్గళకవితాధారయుఁ బాండిత్యమునుగలవారై రాజసభాంతరములఁగీర్తి ప్రతిష్ఠలనందియున్నారు.

తండ్రిగారు శ్రీరాజారావు చెల్లయ్యయ్యార్మరావుబహద్దరు జమీందారువారియుద్యోగికోటిలో నిరాగసవృత్తిం జేరఁగాంచి సర్వజనాహ్లాదముగా వ్యవహరించుచున్నారు.

సీ|| కరిచర్మచేలుండు కరిరాజనిభయాన
చంద్రమామకుటుండు చంద్రవదన
మదనసంహారుండు మదనమోహనగాత్రి
శైలవిహారుండు శైలపుత్రి
నాగకుండలధారి నాగకుంభస్తని
గగనకేశభరుండు గగనమధ్య
నీలసుగ్రీవుండు నీలనీరదవేణి
కమలాంచితకరుండు కమలపాణి

ఆ|| పులినసంభవాది మునినుతామలచరి
తులు పురాణ దంపతులగు శంభుఁ
డుమయు నహరహంబు నోముచెమివ్వధూ
వరులసకలసిరుల దొరలఁజేసి. 1.

ఉ|| కాయజకాయసన్నుని కాయుఁ గవీశ్వర గేయసత్యనా
రాయణుఁజెట్టనట్టినవు రాయణు మన్యవవప్రఫుల్లవ
ద్మాయతనేత్రిహైమవతి తాపియసూనమునాఁగ నేకమై
ఛాయకయిన్వధూవరులు భాసిలుఁ గాతచిరాయురర్థితిన్. 2.

సీ|| తనతోడసరివమ్మునని యెంచియయ్యరుం
ధతిరాఁగఁదర్జనిఁ దవిలిపంపు
తనతోడనీడగునను మనహల్యరాఁ
గోడిగములచుట్టు నాడిపంపు
తనతోడసమమందు ద్రౌపదీదేవిరాఁ

గన్నులవెరపించి కడఁగిపంపు
తనతోడఁబుఱుడంచుఁ దారాపురంధ్రిరా
దరహాసమునసిగ్గు నరచిపంపు

గీ॥ నవురకల్యాణరమణి హైమవతిసకల
నయగుణగరిష్ఠ వర్ధమన్నాటిసత్కు
లాంబుధిసుధాంశు సత్యనారాయణునివ
రించెనయ్యింతులను ధిక్కరించిరయించి. 3.

చంపకమాలిక.

పవనుఁడుగంధవాహుఁడయి వారిజమిత్రుఁడు లోకబంధుఁడై
యనినియనంతరైపరగు నంతటికాలముగ్రాలుచుండఁగా
దవిమలకీర్తియయ్యదిసుధీఖని యేకవిమాళిఁజేసియు
ష్ఫనమునుబెంపుసొంపతని పల్కులమోఘములంద్రుసత్కవి

ప్రవరగణంబుడెందమల రారఁగదీవనలీనమానవై
భవములునాయురున్నతియు వారకచేకురునంచు వేఁడెఁజె
ప్పవలెనె యివ్వధూవరుల భాగ్యముసన్నుతిసేయఁబద్మసం
భవునియనుంగురాణి యలవాణితయానొడక యున్నెయింకనీ

కవినికరంబులొఁగరిము గారవమొప్పఁగ నెమ్మిఁజేరియ
న్యవసుమతీంద్రులెల్లఁగొనియాడఁగ నెంతయుఁగూర్పమేదినీ
ధవుఁడుభుజంగరావుకవితా వనితారమణుండుదక్షతన్
బ్రవిమలకీర్తిసాంద్రుఁడయి భావుకముల్గను శాశనిచ్చలున్. 4.

సీ॥ అరయసర్వ సర్వంసహా భరణధుర్యుఁ
డాటభోగియగుట యూభయకవిమిత్రుఁ

డగుటయు బ్రమెపెభుజగ రాయండుతాను
గుండలీంద్రుఁడయి నెగడుచుండధాత్రి. 5.

## 33. స్వయంపాకల లక్ష్మీనారాయణశాస్త్రిగారు.

వీరి నివాసస్థలము దక్షారామము. తెలగాణ్యవైదికులు. ఆపస్తంబ సూత్రము. భారద్వాజగోత్రము. తండ్రి సూర్యప్రకాశముగారు. తల్లి అన్నపూర్ణాంబ. సర్వజిత్సంవత్సర మాఘశుద్ధ చతుర్దశి జన్మదినము. ఆంధ్ర గీర్వాణములయందు సాహిత్యముగలదు. ఉభయకవిత్వములయందు సమర్థత గలదు. ప్రస్తుతము పీఠికాపురమున నివాసము. రచించినగ్రంథముల. 1. భీమేశ్వరశతకము, 2. సర్వమాన్య శతకము, 3. కలియుగము, (ప్రబంధము ముద్రితము) సంస్కృతమున, అష్టకములు మొదలగునవికొన్ని.

సీ॥ శ్రీమీనాధవుని శరీరార్ధభాగంబు
విడువకవసియించు వెలఁదిమిన్న
బహుదీర్ఘతపముచే భవునిధవునిగాఁగఁ
బడయఁజాలినయట్టి భవ్యచరిత
వందారునిజభక్త వరమస్తకాంచిత
పాదపీఠముగల్గు పరమశక్తి
అలరుక్మిణీదేవి నాదిదేవునితోడ
సమమూర్తినట్టి విశ్వమతకీర్తి
గీ॥ సర్వమంగళలోకైక జనని హైమ
వతిదయామతితో వధూవరులునైన
హైమవతికిని సత్యనారాయణునకు
సిరులుసంపదలిచ్చి రక్షించుగాత. 1.

మ॥ జనకోర్వీశసుతావివాహమున భాస్వద్భాసుస్వయంపఁద
ద్ధ్వనివల్లిక్కుల బ్రోయఁబార్వతియు నత్యంతైకభీతాత్మయై

తననాథున్గవుఁగింటఁజేర్చ నగుచున్ధన్యోస్మిధన్యోస్మియం
చనుకైలాసవిభుండుదంపతుల కిష్టావాప్తిఁగావించుతన్. 2.

సీ॥ ఆరవసంద్రంపు గారాబుకూఁతురు
పద్మాలయంబున వరలురామ
జగముల వెలిఁగించు తొగ ఱేనితోఁబుట్టు
పులుఁగుతత్తడిరౌతు వలపుటాలు
కడగంటిచూపుల కలుములీనెడుకన్నె
కన్నులవిలుకాని గన్నతల్లి
పున్నెంబులకునెల్ల ప్రోకైనజగదంబ
లేముల నెల్లఁ దూలించులేమ

గీ॥ సుందరంబగుచల్లని చూపుతోడఁ
జిరునగవుమోమునందునఁ జెంగలింపఁ
గలిమిసిరిసంపదల దంపతులకొసంగి
చిరతరాయు రున్నతులనుజేయుఁగాత. 3.

ఉ॥ శ్రీయుతమూర్తిభక్తజన సేవ్యుఁడనంతుఁడు సత్యమూర్తిలో
కాయతనుండుశిష్టజన పావనుఁడాశ్రితవత్సలుండునా
రాయణుఁడప్రమేయుఁడు నిరంతరసౌఖ్యలఁజేయుసత్యనా
రాయణరావునిన్మతియు హైమవతీలలనాలలామనున్. 4.

## 34. శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు.

వీరి నివాసస్థలము గోదావరీతీరమునఁ గోవూరు. వెలనాటివైదికులు. ఆపస్తంబసూత్రము. కౌశికగోత్రము. తండ్రి మందయ్యశాస్త్రిగారు. వారువేద శాస్త్రశాతములఁ బండితులై స్మార్తోపయుక్తమగు "మంత్రిపరిశిష్ట గృహ్యపరిశిష్ట" ములను గ్రంథము రచించినవారు. తల్లి యజ్ఞసోమిదమ్మగారు

స్వభానుసంవత్సర మాఘశుద్ధ తృతీయ జన్మదివసము. ఆంధ్రగీర్వాణముల యందు వ్యాకరణవిశిష్ట సాహిత్యములుగలవారు. ఉభయభాషలలోను కవిత్వము చెప్పఁగలవారు. శ్రౌతమునఁ బ్రవేశముకలదు. స్మార్తమునఁ బూర్ణపరిశ్రమచేసినవారు. కతిపయవిద్యార్థులకు నాటకాంగము సాహిత్య గ్రంథములు చెప్పిరి. తునిలో శ్రీరాజావారిచే స్థాపింపఁబడిన, హైస్కూలులోఁ గొంతకాలము తెలుఁగుపండితస్థానమునుండి, ప్రస్తుతము కోటరామచంద్రపురమున నేషనల్ హైస్కూలులో సంస్కృతపండిత స్థానమున నున్నవారు. సంస్కృతములో, వధూవర వివాహకాలమను వచనరూపక విమర్శనగ్రంథమును, తెలుఁగులో వాసవవిజయమను నీహామృగరూపకమును వ్రాసిరి. ఇవికొద్దికాలములో ముద్రింపఁబడును.

శ్లో॥ శ్రీరస్తువల్లమన్నాటి సత్యనారాయణస్యచ
సీతావిజయలక్ష్మ్యాశ్చ దాంపత్యసుఖకామినోః 1.

శా॥ శ్రీమద్రాజభుజంగరాయ హృదయాహ్లాదాంకురస్థానయోః
దంపత్యోరనయోర్నవీన నయసోద్ధర్మార్థకామార్థినోః
భూయాసుర్ద్విజధర్మరక్షణ చణాధ క్షిశ్చదేహస్థితి
స్సంపత్సజ్జనసమ్మతాప్ర విమలాకీర్తిశ్చమైత్రీస్థిరా. 2.

చ॥ కరమునలోకరక్షకతఁ గంకణబంధముపూనిదంపతి
స్థిరచిరమైత్రిదక్షమతి తెన్నెటలేదనియెంచిభార్యలన్
నిరతముదేహభాగముల నిల్పిచులోకులహెచ్చరించునా
హరిహరధాతలిష్టమతి హైమవతింబతితోడఁద్రోచుతన్. 3.

చ॥ సకలకలారహస్యములఁ జక్కఁగనేర్చినపండితోత్తమ
ప్రకరముచేరిహృద్యతమ పద్యవిధంబునఁజేయుదీవనల్
ప్రకటితసూనృతత్వమున బ్రహ్మవచస్సులఁబోలిసౌఖ్యదా
యకములుగావుతన్ వరున కంచితహైమవతీష్టదృష్టికిన్. 4.

## 35. ఉపాధ్యాయుల వేంకటేశ్వరశాస్త్రిగారు.

వీరి నివాసస్థలము విశాఖపట్టణముజిల్లా గజపతినగరము తాలూకాలింగాలవలస అగ్రహారము. ప్రస్తుతమైదువత్సరములనుండి చిత్రాడ. వేరూరు ద్రావిడులు. ఆపస్తంబసూత్రము. కౌండిన్యగోత్రము. తండ్రి సూర్యనారాయణావధానులుగారు. తల్లి అచ్చమాంబ. స్వభానునామసంవత్సర మాఘబహుళ ద్వాదశి జన్మదినము. ఆంధ్రగీర్వాణములయందు నుభయవ్యాకరణవిశిష్టంబగు సాహిత్యములయందును, అద్వైతశాస్త్రమున ప్రస్థానత్రయమందును పాండిత్యముకలవారు. ఊర్లాము మొదలగు సంస్థానములయందు వ్యాకరణ శాస్త్రము లోఁబరీక్షింపఁబడి యోగ్యతాపత్రములను బొందిరి. వీరుకొమరగిరిలో శ్రీకోటగిరి వెంకట్రాయినింగారిచే స్థాపింపఁబడిన సంస్కృత పాఠశాలలోపాధ్యాయులుగనున్నారు.

శ్లో॥ శ్రీవడ్లమన్నాటి కులాంబుధీందుం
శ్రీసత్యనారాయణరావు మేత్య
విరాజతాం హైమవతీ యథాశ్రీః
వైకుంఠనాథంసము పేత్యరాజతి. 1.

శ్లో॥ శరసిభృతసురాపగేపురారావ
రుణముఖేందురుచిర్నగేంద్రపుత్రీ
అథపదయుగళానతేస్వవాథే
కృతహాసితాభవతో స్తనోతుమోదం. 2.

శ్లో॥ యుంవదంహేలయావాదీం
వదేయుర్వ్వదయోర్ద్వినా
తంపదంకృపయాయచ్ఛే
ద్వాంస్థిరం పద్మసంభవః. 3.

## 36. కొప్పరపు వేంకటరత్నకవిగారు.

వీరి నివాసస్థలము గుంటూరుజిల్లా నర్సారావుపేట తాలూకా కొప్పరము. ఆర్వేలనియోగిబ్రాహ్మణులు. ఆపస్తంబసూత్రము. కౌండిన్యసగోత్రము. వీరి తండ్రి నరసింహాశర్మగారు. తల్లితిరుమలాంబ. జన్మదినము నందననామసంవత్సర జ్యేష్ఠశుద్ధపంచమి ప్రస్తుతము వినుకొండ తాలూకా ముప్పాళ్లబోర్డుస్కూలు మాష్టరుగానున్నారు. అష్టావధానాశుకవిత్వ సమర్థులు. వీరుచేసిన గ్రంథములు, 1. శాంభవీశతకము, 2. రామదండకము, 3. చాటుపద్యములు.

శా॥ శ్రీవాణీస్తనకుంభలిప్త విలసచ్ఛ్రీగంధచిహ్నంబులెం
తేనిన్ వక్షమునందునన్ దనరఁ బ్రాణిశ్రేణిఁగాపాడుల
క్ష్మీనారాయణుఁడీవధూవరులఁ బేర్మింబ్రోచియుల్లాసపుసం
తానంబున్విజయంబు సౌఖ్యమును జెందన్ జేసిరక్షించుతన్. 1.

శా॥ ఏకాంతాంమణికిన్సుధాంశుఁడనుజుం డేవారి జాతాస్యకున్
లోకంబున్ సృజియించు ధాతసుతుఁడే లోలాక్షికింజారుభా
షాకంఠీరవమధ్య, కోడలల కంజాతాక్షుతన్వంగియా
స్తోకానందము లీవధూవరులకిచ్చున్ భద్రసంధాత్రియై. 2.

చ॥ పరుఁడు జనింపఁజేసిన ప్రపంచమునన్ గలభూతకోటికిన్
గరుణయొసంగజ్ఞానమును గల్పనఁజేసి మహోపకారయై
పరికివివర్ణనీయయగు భారతియక్షర రూపయీవధూ
వరులను జారుమూర్తుల ననస్యము సేయుఁగళాసమేతులన్. 3.

చ॥ సరసిజాక్షుఁడు సూనసంచయములన్ సద్భక్తిఁబూజింపనో
క్కాకసేజంబును మాటియాతఁడపలన్ గందమ్మునర్పింపఁబ్రే
మరహింపన్ హరిఁదేల్చుశంభుఁడిడి సామ్రాజ్యంబు లంబ్రోచుభా
స్థిరులన్ హైమవతీ సతీతిలకమున్ శ్రీసత్యనారాయణున్.

## 37. కొప్పరపు కామరాజుకవిగారు.

వీరు గుంటూరుజిల్లా నరసారావుపేటతాలూకా కొప్పరగ్రామనివాసులు. 1868 సంవత్సరము మార్చి 25 తేది వీరిజననదినము. తండ్రి వేంకటరమణయ్యగారు. కౌండిన్యస గోత్రులు. జాంబవతీపరిణయ ప్రబంధనిర్మాణులు.

ఉ॥ శ్రీమహితాగ్రణుల్ విబుధ శేఖరులున్ సుమనోపురందరుల్
హైమవతీ వివాహసమయస్థితులై తనరారినట్లుగా
శ్రీమహితాగ్రణుల్ విబుధశేఖరులున్ సుమనో పురందరుల్
హైమవతీ వివాహసమయస్థితు లౌటుచితంబెగా ధరన్. 1.

క॥ హైమవతీ సీతాల
క్ష్మామానాత్ములు సదానతీకరులగుచున్
హైమవతీ సీతాల
క్ష్మామానినికపుడు నిష్టసిద్ధులొసఁగుతన్. 2.

ఉ॥ శ్రీయుతమూర్తులైతనరు శ్రీధరశంకరపంకజాసనుల్
పాయనిసత్కృపాగరిమ బంధురసౌఖ్యముభాగ్యమున్సదా
పాయతలేనియాయువు నపారముగాదయ చేసిసత్యనా
రాయణరావుహైమవతినా బలిబ్రోతురుగాతనిచ్చలున్ 3.

ఉ॥ కుంకుమబొట్టుకాటుకయు గోరడు కాదముసర్వకాలని
శ్శంకసుమంగలీత్వమును సాధుజనావనభక్తియున్నిరా
తంకతగల్గునట్లుగసుధానిధి కన్యకదుర్గవాణియుం
బొంకముగా నొసంగిదయఁబ్రోతురు హైమవతిందయామతిన్.4.

సీ॥ శ్వేతాంబుజాతవాసినిరమా సుమగంధి
భాగ్యప్రదాయియై పరగఁగాత

మహిళామణి స్తవ్య తుహినాద్రికన్యక
సర్వసంపదలిచ్చి సాకుఁగాత
భవ్యభాగ్యశ్రేణి పాకశాసనురాణి
భోగప్రదాయియై పోసఁగుఁగాత
అనపాయయల యత్రిమునిజాయయనసూయ
యొనరఁబాతివ్రత్య మొసఁగుఁగాత

గీ॥ సర్వసంపత్సమృద్ధులు శాంతరసము
నొనరవిశ్వంభరా దేవియొసఁగుఁగాత
హైమవతి సత్యనారాయణాభిధాన
దంపతులకింపుసొంపార ధరణియందు. 5

సీ॥ కులదేవతను బ్రీతిఁగొని భజించుటెకాదు
పతిభక్తివిడువని పంకజాక్షి
సరసవాచాప్రౌఢి సల్పుచుండుటెకాదు
సత్యంబుఁదప్పని చంద్రవదన
సతతాన్నసత్రంబు సాగించుటయెకాదు
పక్షపాతములేని భాసురాంగి
చుట్టాలకురభియై సొంపుఁజూపుటెకాదు
యర్ధిసంతాన మీయలరుబోడి

గీ॥ యనుచుఁబ్రజ దన్ను వినుతింపననవరతము
మెట్టినింటను బుట్టింట రట్టులేక
భర్తకెపుడును సౌఖ్యసంపదలనొసఁగి
గ్రాలుఁగావుత హైమవతీలలామ.

## 38. కొప్పరపు బుచ్చిరామకవిగారు.

వీరి నివాసస్థలము నరసారావుపేట తాలూకా కొప్పరము. ఆఱువే లనియోగిబ్రాహ్మణులు. ఆపస్తంబసూత్రులు. కౌండిన్యముని గోత్రులు. తండ్రి వేంకటరాయఁడుగారు. తల్లిసుబ్బమాంబగారు. శ్రీమదాసుకవి చక్రవర్తుల సోదరులు. జన్మదినము నందవసంవత్సరమార్గశిర బహుళషష్ఠి. అష్టావధానాశుకవిత్వముల సమర్థులు. శతావధానమునకుఁబ్రయత్నము సేయుచున్నారు. ప్రస్తుతమొకనాటకము వ్రాయుచున్నారు.

శా॥ శ్రీకాంతాముఖచంద్రబింబ జనితస్మేరోల్లసచ్చంద్రికా
నీకంబక్షి చకోరకంబులకు సందీప్తత్వముంగూర్పన
స్తోకానుగ్రహమొప్ప భక్తులకు మెచ్చుంగూర్చువిష్ణుండుదా
సాకల్యంబగు ప్రీతిదంపతులకిచ్చుంజేయుఁ గల్యాణముల్. 1.

సీ॥ అప్పులుగలవాని యంతికమ్మునఁబంక
జమ్మునఁ గొలువుండు చానయొకతె
కటికినిప్పచ్చరాల్గలవారి గృహముల
యందునసించు చంద్రాస్యయొకతె
అనయంబునటవి మాయా కిరాతునివెంట
నంటిచరించు వాల్గంటియొకతె
పగలుచేఁజిక్కియర్భకవృత్తిఁ బాల్గొన్న
యనరుమోహించిన యతివయొకతె

గీ॥ తమ తమ కొలంతలుదుపుకోదలఁచినీస్వ
రూపమునఁ బుట్టెనుగుణకలాపుఁడైన
సత్యనారాయణుని మహోత్సాహమునను
బెండ్లియాడివరీతిఁ గాన్పించెనహహా! 2.

సీ॥ సకలలోకస్తుతా చార్యనార్యాదేవిఁ
బెనుగొండఁబుట్టించు బిరుసుఁదనము
కరుణారసార్ద్రాక్షికంజాత శ్రీదేవిఁ
జడనిధిజనిఁగూర్చు వెడఁగుఁదనము
పతిదేవతాశిరోభరణనరుంధతిఁ
గడజాతిఁబుట్టించు గడుసుఁదనము
అమరీకదంబసేవ్యాంఘ్రిపంకజశచిఁ
బలలానిసుతఁజేయుతులువ తనము

గీ॥ వలనఁగలిగిన యాపకీర్తిఁబాపికొనఁగఁ
దనదుచతురత్వమును జూపితమ్మిచూలి
భుజగభూపాలపుత్త్రిగాఁబుట్టఁజేసె
నలఘుసౌభాగ్యవతిననీ హైమవతిని
రమణిగ్రహింపు వేంకటరామపుత్త్రి 3.

సీ॥ జనకుండు సకలసజ్జనవర్ణనీయ స
త్కవితాప్రభావసంకలితయశుఁడు
జననిపావనకుల జాతపతివ్రతా
చారపుణ్యాంగనా జనమతల్లి
జనియించినట్టి వంశమురాజబహాదూర్బి
రుదమాన్యకవితాభిరూపకంబు
కైకొన్నపతి మహాఖ్యాతి సంశోభిత
వర్ధమాన్యాట్యన్వవాయభవుఁడు

గీ॥ త్రిజగతీమాతలని పేరుఁదెచ్చికొనిన
హైమవత్యాది సతులపేర్లందివావు
నీదుభాగ్యంబెవండు వర్ణింపఁగలఁడు
భవ్యగుణహారిసుబ్బమాంబాకుమారి. 4.

సీ॥ తరగలరుర్మ్యలలుగా మురపెంబునూపుపా
ల్కొడలిరాయంచయై లాహిరీడు
కలుములజవరాలుగావున్న యురమున
నీటుకెంపు ధరించు నీటుకాడు
ఆప్తవర్యనిదైన్య మడపిదయాన్వృష్టి
వాఁగుఁబాతించిన చాగకాడు
పగఱలఁగూర్చి నెవ్వగడుల్చిపాండవే
యులనిలసేవించు బలిమికాడు

గీ॥ సత్యనారాయణుండు ప్రశస్తగుణుఁడు
నిజసమాఖ్యాభిశోభితు నిర్మలయశు
విజయలక్ష్మీమనఃకాము వినయధాము
విజయలక్ష్మి సమేతుఁగావించుఁగాత. 5.

మ॥ తహశీల్దారుఁడుతండ్రికర్షకమహార్థంబెల్లనార్జించిభూ
విహితాభ్యున్నతగౌరవంబుఁగొనె నావీలున్నెసన్నేర్పిభ
వ్యహరిద్వాశ్వవృతకీర్తిదాయక కవీంద్రాశీఃపదార్థచ్ఛటన్
దహశీలుంబొనరించినాఁడవు గదన్నా సత్యనారాయణా. 6.

సీ॥ స్వస్త్యస్తువేద విజ్ఞాలాభివర్ణనీ
యారోగ్యదాయు కాచారనీకు
దీర్ఘాయురస్తుధాత్రీ దేవకరముక్త
నిర్ద్వంద్వ కాఞ్ఛితానీకనీకు
సుశ్లోకమస్తుభాసుర సత్కవివ్రజా
స్తోకధీవిరచిత శ్లోకనీకు
శ్రీరస్తుహైమవతీ రసేజాక్షిక
టాక్షసంప్రాప్త భాగ్యాఢ్యనీకు

గీ॥ పుణ్యమ_స్త్వన్నదాన ప్రపోషితసకల
ధారణీశేఖముఖ సమస్తజననీకు
భవ్యతరవర్ధమన్నాటి వంశచంద్ర
అమలగుణధుర్య సత్యనారాయణార్య. 7.

సీ॥ శశ్వద్గుణుండైన విశ్వసుందరుఁడాది
గలరాజబంధులఁ గాంచనయ్యొ
వ్యాయామవిద్యా ప్రభావంబుఁజూపించు
బాడబాన్వయు మల్లుఁజూడనయ్యొ
మనుమార్గచరుల సమ్యక్పండితీధురం
ధరులౌగవీంద్రుల నరయనయ్యొ
సంగీతవిద్యా ప్రసంగంబుచేరాళ్లఁ
గరిగించువైణికుఁ గనఁగనయ్యొ

గీ॥ శిష్టులనుబండితులను వీక్షింపనయ్యొ
నహహ! బ్రహ్మోత్సవాహ్వు దుగ్ధాబ్ధిసోమ
భుజగభూభృల్లలామ మీపుత్త్రికామ
చర్చికోద్వాహ సూత్సవసమయమందు. 8.

మ॥ మునుభోజుండును గృష్ణరాయఁడు గవివ్యూహంబురప్పించిపే
ర్మినిమన్నించి రటంచువింటిమిపుడీ శ్రీమంతుఁడీమేటిత
ష్టనవాక్యంబును నిల్పెనిందఱను వేడ్కం దేల్చి మున్ భోజసే
డనువారోజులు వచ్చెనోసుకవులారా! దైన్యమున్వీడుఁడీ. 9.

## 39. దేవగుప్త సన్యాసిరాజుగారు.

వీరు కశిమికోట నివాసులు. తండ్రి సుందరరామ మంత్రిగారు.
శాండిల్య గోత్రము. అపస్తంబ సూత్రము. వీరురచించిన గ్రంథముల

మాతృదేవతాస్మృతి, 2. భక్తవత్సలసతీమణిశతకములు, 3. హరిభక్తిసుధారసము. 4. ఆంధ్రభగవద్గీత, జననము రాక్షసనామసంవత్సర శ్రావణబహుళదామి. పించను పోస్టుమాస్టరు.

సీ॥ శ్రీకరంబైనట్టి వైకుంఠపురమున
మణిమయరమ్య హర్మ్యంబునందుఁ
జలువరాసెజ్జపై నెలమినిబవళించి
పాలేటిరాచూలి పదములొత్తఁ
జతురాస్యుఁడైనట్టి సుతుఁడఖిలాంగసుం
దరుఁడైనకొమరుఁ డౌమరుఁడుగొలువఁ
బరమకైంకర్య తత్పరులైనపార్షదుల్
రహిఁగొల్చునాది నారాయణుండు

గీ॥ మంత్రిప్రెగడభుజంగ రాణ్మంత్రిమౌళి
ప్రియసుతను హైమవతి సీతవిజయలక్ష్మి
ననుఁగుటల్లుని సత్యనారాయణాఖ్యుఁ
జిరకరుణచేత నెపుడురక్షించుఁగాత. 1.

సీ॥ చంద్రమతీహరిశ్చంద్రులపోలికిఁ
బతిభక్తిసత్య సంపత్తినలరి
కైరవిణీసుధా కరులరీతినిమార్ద
వంబుఁగళా ప్రభావంబుఁగాంచి
ఛాయాదినేంద్రుల చందాననురక్తిఁ
దేజఃప్రశస్తినిఁ దేజరిల్లి
యలశచీబలఘుస్మ రులయాధిక్యమహిమాను
భావంబువర వైభవంబుపడసి

ఆ॥ మంత్రిపెగడవంశ మహితరత్నాకర
లక్ష్మివిజయలక్ష్మి లలితసుగుణ
సహితుఁడైన యట్టిసత్యనారాయణ
రావుతావి పూవుఁబోవిసలరు. 2.

సీ॥ శంకరుఁజేపట్టి శైలరాజతనూజ
సర్వమంగళ యైనచందమునను
శ్రీహరిఁబెండ్లాడి శ్రీసతిమంగళ
దేవతాఖ్యాతిఁ జెందినవిధమున
చతురాస్యుఁగాఁబ్టెట్టి శారదాంబామణి
పలుకులకొమ్మయై పరగుకరణి
నత్రినిఁగూడిమూర్తిత్రయిఁగన్నవ్వ
యనసూయయైఖ్యాతి నెనసినట్లు

గీ॥ శ్రీవిజయలక్ష్మి హైమవతీవధూటి
పద్లమన్నాటివంశాబ్ధి బాలచంద్రుఁ
డైనవేంకట సత్యనారాయణాఖ్యుఁ
బొందియన్వర్థనామయై పొలుచుఁగాత. 3.

సీ॥ నిజపౌరుషార్థమింతికి వంతుఁబెట్టినా
డింతటియనురాగ మెందుఁగలదు
పాలఁతికోరికిఁదీర్పఁ దలగంటునంటియు
నెలమిఁజెన్నుగఁ బూను టెందుఁగలదు
సతిపిండిబొమ్మను బ్రతికించితొలిపూజ
నిప్పించె నీప్రియం బెందుఁగలదు
గద్దెపైముద్దియ గాసేయముదమున
నృత్యముఁగావించు టెందుఁగలదు

గీ॥ యారయనుకూల దాంపత్యమనఁగనిదియె
యనుచుఁ బదునాల్గు భువనముల్ వినుతిసేయ
పార్వతీపరమేశ్వరుల్ పతినిసతిని
నరమరలులేని మనుగడ నాదరింత్రు. 4.

సీ॥ పతిభక్తియును రమాపతిభక్తియును గల్గి
యల్లమీరాభాయిననుకరించి
దీనసంరక్షణదానవిచక్షణఁ
గన్న విక్టోరియా గరిమఁగాంచి
సాహచర్యంబును సంతతోదార్యంబు
రాణించు మేరియా రాణిపగిది
సమయోచితమనీష సజ్జనశుశ్రూషఁ
బరగినహార్డింజిప్రభ్వికరణిఁ

గీ॥ దనరిసహధర్మచారిణి యనఁగఁబరగి
శ్రీవిజయలక్ష్మి హైమవతీ వధూటి
సత్యనారాయణస్వామి సత్యముగను
గొలిచియాచంద్ర తారార్క మలరుఁగాత. 5.

సీ॥ తలలోనినాలుక చెలువునఁబొలుపారి
తలవాకిట మెలంగుపొలఁతిమిన్న
యున్నతగోత్రమం దుదయించి ప్రాణేశు
నర్ధాంగలక్ష్మియై యలరెడుసతి
వరునంత రాత్మఁదానరసి వర్తిల్లుచుఁ
గలుములు వెదచల్లు కలిమికన్నె
విష్ణుపదంబున వెలసి ముజ్జగముల
జీవనంబులనిల్పు పూవుబోణి

గీ॥ వాణిహరురాణిహరిరాణివనధిరాణి
తెలివిబలమును సిరులునిర్మలతనొసఁగి
వేడ్కఁ బ్రోచుచునుందురు విజయలక్ష్మి
ప్రాణవిభుఁడైన సత్యనారాయణాఖ్య. 6.

సీ॥ నెత్తావిసిరియును నిద్దంపువిరియును
పలపునఁబొలుపునవలరునట్లు
మాధవీలతయును మహితపున్నాగంబు
పరువంబుగరువంబు నొరయునట్లు
చలువవెన్నెలయును వెలయు క్రొన్నెలయును
నింపును సొంపును నింపునట్లు
శబ్దవిశుద్ధియు సమ్యగర్థసమృద్ధి
సరసతచతురత నెరపునట్లు

గీ॥ సతియుఁబతియును నతులసంగతులనెసఁగి
పితలకును మాతలకును సంప్రీతినొసఁగి
క్షితితలంబున సజ్జనస్తుతులఁబొసఁగి
యశముగణియింత్రు గావుత విశదలీల. 7.

సీ॥ ఏమహాత్ములపెండ్లి హేలాపురంబును
హేలాపురంబుగానిపుడుచేసె
నెవ్వారికళ్యాణ మీయాంధ్రదేశముం
గళ్యాణవంతముగానొనర్చె
నేదంపతుల వివాహోదితోత్సవవార్త
నఖిలజనోత్సవమైతనర్చె
నవధూవరుల సమావేశమహిమస
త్కవిసమావేశవైభవముగలిగె

గీ॥ నవ్వధూవరులకు వారియనుఁగుఁదల్లి
దండ్రులకు నాయురారోగ్యధనసమృద్ధి
పుత్రపౌత్రాభివృద్ధిసంపూర్ణముగను
గలుగుఁగాత రమానేతకరుణచేత. 8.

సీ॥ ఆజ్యధారాప్రవాహంబులొకవంక
నురుకవితాధారలొక్కవంక
షడ్రసభక్ష్యభోజ్యసమూహమొకవంకఁ
జక్కనిసత్క్రుతు లొక్కవంక
సంగీతపారస్య సంపదలొకవంక
నుభయసాహిత్యము లొక్కవంకఁ
బరిహాసకవినోద పాటవంబొకవంక
నుచితహాస్యరసంబు లొక్కవంక

గీ॥ ప్రమదమొనగూర్చి నివ్వధూవరులపెండ్లి
పామరులకును బండిత ప్రకరమునకుఁ
గానదంపతులైశ్వర్య కలితులగుచుఁ
గ్రాలుదురుగాత శ్రీహరికరుణచేత. 9.

గీ॥ అనుచునాశీర్వదించుచు హర్షమలరఁ
బద్యనవరత్నమాల నర్పణమొనర్చు
కసిమికోట సమాహ్వయగ్రామవాసి
యాంధ్రకవిదేవగుప్త సన్యాసిరాజు.

## 40. నిడదవోలు సుందరముగారు.

వీరినివాసస్థలము విశాఖపట్టణము జిల్లాలోని విజయనగరము. వీరి
కాంధ్రమున మిక్కిలి పరిచయముగలదు. వీరు శోధించిచూచిన గ్రంథ

ములసంఖ్యాకములని చెప్పవచ్చును. వీరియముద్రిత గ్రంథభాండాగారము మిక్కిలి గొప్పది. మంజువాణి మొదలయిన మాసపత్రికలకు వీరు చాల పురాతన గ్రంథములను సంపాదించి యిచ్చిన యుపకారబుద్ధి గలవారు. ఒక్కొక గ్రంథమును సంపాదించుట కెన్నెన్ని కష్టములనైనఁబడిరి. వీరి కవిత్వశైలి మిక్కిలి సరసముగా నుండును.

శా॥ శ్రీకళ్యాణమహోత్సవ ప్రసరకాశ్మీరార్ద్రి కౌశేయుఁడున్
బాకారిప్రముఖాఖిలామరశిరోభాగాగ్ర కోటీరర
త్నాకభ్రాజితరుద్ధగద్ధగితదీప్తో త్కృష్టసత్పాదనా
ళీకద్వంద్వుఁడు బ్రోచుమా విజయలక్ష్మీ సత్యనారాయణున్. 1

సీ॥ శరచంద్రశుకమత్త కరికుంభనవసింహ
నయనాస్యవాకుచ నాభిమధ్య
కాంచనకౌముది ఘనసారబింబాళి
తనుహాసవాసితా ధరశిరోజ
వసుమతీతిలపద్మ బిసబాలశశిహంస
కటివాసపదకర నిటలగమన
చారురంభాఘనుశ్శంఖ పన్నగకుంద
యూరుభ్రూకంఠ రోమోత్కరరద

గీ॥ తూణకిసలయజంఘ సత్పాణియుగ్మ
కమఠదర్పణచరణ రంగత్కపోల
శ్రీమహాదేవి విజయలక్ష్మీసమేతు
సత్యనారాయణునిఁ బ్రోచుసంతతంబు. 2

సీ॥ ఏరామకారుణ్య వారానిశభిలాశ్రి
తాయతార్తులు శర్దమాంకురములు

ఏవామపదనఖ శ్రీవజ్రధారకు
దాసదారిద్ర్యముల్ ధరణిధరము.
లేకొమ్మవిహరణ శ్రీకేళిసరసికి
సకలసంపదభంగ సంకులంబు
ఏపాద్వివాస విలాసనిర్జరశాఖి
కఖిలభోగములు సూనావృతములు

గీ॥ ఏజగన్మాతసర్వ సరోజజాండ
భాండమునకెల్లప్రజలు సుప్రజలుధాత్రి
నట్టిశ్రీమహాదేవి మాముద్దుహైమవతిని
సత్యనారాయణునిఁ బ్రోచుసంతతంబు. 3.

సీ॥ కప్పుకుత్తుకవాఁడు కలికివాల్జూపుల
మెలఁతచేఁదనరు సామేసివాఁడు
కంకణంగమువాఁడు నెరినిండువెన్నెల
నిగ్గారు మైనిగన్నిగలవాఁడు
పునుకకంచమువాఁడు నునుతీవిఁగనుతావి
వెలిబూదిపూఁత చెన్వలరువాఁడు
మువ్వన్నెమెకముతోల్ మొలకట్టుగలవాఁడు
చిలువరాతొడవుల చెలువువాఁడు

గీ॥ పొగడఁదగువాఁడు సిగనెలపువ్వువాఁడు
నీరునాలుగుమోముల నెసఁగువాఁడు
నడ్డమన్నాటిశ్రీహైమవతినిపతిని
సత్యనారాయణుని బ్రోచుసంతతంబు. 4.

సీ॥ కమనీయతనునీల ఘనమండలికిహేమ
చేలంబుచంచల శ్రీలనింప
లావణ్యబాహు పల్లవులకుఁగరనఖ
రాజిప్రవాళ జాలతవహింప
మహనీయముఖపూర్ణి మాచంద్రబింబంబు
నకుమందహాస చంద్రికలునెరప
ఖండేందునిభగండ కాంతిలక్ష్మికిరత్న
కుండలద్యుతులుకై దండలొసఁగ

గీ॥ మెరపుబెడసిరి కైనించుమేలితెరలు
వరలెనాకౌస్తుభప్రభల్ పరగుశౌరి
పద్మనాభుని శ్రీహైమవతినిపతిని
సత్యనారాయణుని బ్రోచుసంతతంబు. 5.

సీ॥ పరమపతివ్రతా భక్తికిభూపుత్రి
పావనంబునకు గంగావధూటి
గాంభీర్యమునకు భూకామినీరత్నంబు
గణమహోన్నతికి వాణికంబుకంఠి
భోగంబునకుశచీ పూర్ణేందుబింబాస్య
భాగ్యంబునకునుమా పంకజాక్షి
సంపద్విభూతికిఁగేశవు సుందరీమణి
మతినిశ్చలత కరుంధతియునంగ

గీ॥ వినుతివహియించి కామినీవితతిలోన
మేటివైయాచకా తిథికోటికలఘు
ధనదుకూలాశనాదులు తగనొసఁగుచు
మెలఁగవలెనుమ్ము విజయలక్ష్మిపతమ్ము. 6.

సీ॥ సుమనఃప్రకాశ వీస్ఫూర్తినింపుసురేంద్రుఁ
డిద్ధతేజస్ఫూర్తి విడుతకీలి
జీవనోన్నతసిద్ధిఁ జేకూర్చునబ్ధీశుఁ
డొగిధర్మగుణవృద్ధి నొసఁగువర్కి
పుణ్యజనావృత భూతినైరృతినించు
నామోదమొసఁగుత ననిలవిభుఁడు
అతులశోభానిధిస్థితిఁగూర్చుధనదుండు
సరసభూతి ఘటించు శంకరుండు
గీ॥ చిరతరాయుర్ని రోగక్షేమలాభ
శోభవాంచితసద్యశ మూద్యవాచ్య
వరములొసఁగుత నీసభాపండితాళి
వర్ధమన్నాటి శ్రీహైమవతికిఁబతికి
సత్యనారాయణునకును సంతతంబు. 7.
సీ॥ ఈసర్వమంగళ యేవేళనాస్మేశుఁ
గలసిమెలంగు శోభలుచెలంగ
నీజయలక్ష్మి వినిర్మలాత్మకశౌరి
నెదమెచ్చఁదిరుగు సంపదలఁబొదల
నీమంజువాణి ప్రాణేశువాక్సరణిని
బురణించితిరుగు నబ్బురముదరల
నీలతకూనవన్నియ వాసినింపంగ
సుమనఃప్రపూర్తులు దమలఁజేయు
గీ॥ నరిదివింతయా నాశ్చర్యమబ్బురంబు
ననుమహైందవజనము నిన్నభిమతింపఁ
బుట్టినింటను నిన్ను జేపట్టినింట
మెలఁగవలెనుమ్ము విజయలక్ష్మి సతమ్ము. 8.

## 41. అడవి సాంబశివ శర్మగారు.

వీరు ఆఱువేలనియోగి బ్రాహ్మణవంశజులు. సాంఖ్యాయనసగోత్రులు. కయికలూరుతాలూకా బొమ్మినంపాడు వాస్తవ్యులు. తండ్రి పాపయ్యగారు. తల్లి సీతమ్మగారు. 1864 సంవత్సరమున జన్మించిరి. ఆంధ్రమత్స్యపురాణ, బిల్వనాథీయ, పాత్రాజితీపరిణయ, శుద్ధాంధ్రమేఘసందేశాది పంచవింశతి ప్రబంధకర్తలు.

మ॥ కరుణాపూరిత చిత్తవృత్తులగు మార్కండేయనామాన్వితే
శ్వరుఁడున్ హైమవతీజగజ్జననియున్ సద్భక్తరక్షాధురం
ధరులై హైమవతీసమాఖ్యయగు కన్యన్ సత్యనారాయణున్
వరుఁగావింతురు గాతమంచిత మహైశ్వర్యానురాగాఢ్యులన్. 1.

శా॥ శ్రీవైవాహిక సంచితోజ్జ్వలరస స్ఫీతాశయప్రోన్నమ
ద్భావాంకూరదళద్దరస్మిత మిళత్ప్రత్యగ్రనేత్రాంతవీ
క్షావిన్యాసమునన్ భవానిఁగని హర్షప్రాంచితుండౌమహా
దేవుండీవుతనివ్వధూవరులకున్ దీర్ఘాయురారోగ్యముల్. 2.

చ॥ అవిరళదీప్తిహారతరళాంతర బింబితభర్తృరూపపై
భవపరివీక్షణాంకురిత భావవిజృంభితసాత్త్వికోదయ
ప్రవణతరూపగోపనపరాయణ యైతగమాటికాతుకో
త్సవయుతయైన హైమవతి దంపతులంగృపఁజూచుగావుతన్. 3.

చ॥ పరువఁపురాగజృంభణము పైకొనలోచనకోణదృక్ప్రరం
పరలితరేతరాస్యముల పైనొలయన్ శివయున్ శివుండుని
ర్భరమగుప్రేమనొండొరు శిరంబులనించెడుసేసబ్రాల్వధూ
వరులకొసంగుఁగావుత నభంగురశోభనవైభవంబులన్. 4.

మ॥ తలపైఁ గ్రొవ్విరిపూవునా సొగసుగాఁ దళ్కొందు బాలేందురే
ఖలలిన్ గుల్కెడు లేఁత వెన్నెలల జోకన్ మందహాసంబురం
జిలఁగా శంభుకరంబు వట్టిన యుమాస్వీయాంగులీపల్లవం
బులు గావించెడుఁ గాత దంపతులకున్ భూయిష్ఠసౌఖ్యోన్నతుల్.

ఉ॥ కౌతుకపీఠినున్న తఱిఁ గట్టిన పెండెలవంచు వేళలన్
జాతురియుల్లసిల్లఁ గళశాంక కళాధరుఁ జూచు వేడ్కను
ద్యోతితరాగకందళులతోనును సిగ్గు పెనంగ మించఁగా
రీతరళాననలోకములు శ్రీలిడి దంపతులన్ భరించుతన్. 6.

ఉ॥ కోరికలుప్పతిల్ల మలకూఁతు గళంబునఁ దాళిఁ గట్టుచోఁ
దారసమైన గుబ్బకనదాళి చెమర్చుచుఁ బుల్కపైకొనన్
పారెకుసారెకున్ వడఁకు చంద్రకళాధరు కేలుఁదమ్మి తాఁ
దోరపుశోభనం బిడి వధూవరులం గరుణించుఁ గావుతన్ 7.

ఉ॥ లేనెలతాల్పుమామశర లీలసుమాళము సేయఁ గోరి త
త్సూనశరాసనంబునకుఁ జొక్కపుసింగిణి తేఁటికూటువున్
దానలరించలంచమిడు దారి గుడంబును జీరకంబు సం
ధానము సేయునత్తుహిన ధారుణిభృద్వరపుత్రి చొక్కఁపున్
వేనలి యివ్వధూవరుల విశ్రుత శోభగులం బొనర్చుతన్. 8.

మ॥ అలరున్ నిక్కము గాఁగ హైమవతి కన్యారత్నమై తద్వరుం
డలఘుశ్రీనిధిసత్యసంకలితమా నారాయణాభిఖ్యతన్
దలఁపన్ శంకరుఁ డౌన భేదగతిఁ దద్దాంపత్యమెప్డున్ సము
జ్జ్వలమై హైమవతీశశాంక మకుటాంచత్సత్కృపాసంగతిన్. 9.

శా॥ శ్రీభాసిల్లఁగ సత్యశంకరవర స్ఫీతానురాగాత్తసౌ
ఖ్యాభోగార్పితచిత్తయై పరిణయౌదార్యత్సంభ్రమోదాఢ్యయా

భూభృత్పుత్రికయైన హైమవతి యెప్డున్ దాఁగటాక్షించునీ
భూభృత్పుత్రికయైన హైమవతికిన్ భూయిష్ఠకల్యాణముల్. 10.

## 42. నందగిరి వేంకటప్పారావు పంతులుగారు.

వీరు మధ్వబ్రాహ్మణులు. విశ్వామిత్రసగోత్రులు. ఆశ్వలాయనసూత్రులు. కృష్ణాజిల్లా గుడివాడతాలూకా అంగలూరుగ్రామ నివాసులు. తండ్రి వేంకటనర్సుపంతులుగారు. తల్లి శేషమ్మగారు. క్రీస్తుశకము 1868 సంవత్సరమున జన్మించిరి. ఆంధ్రరామాయణాద్యుత్తర కాండము, శుద్ధాంధ్రభీమసేన విజయము, ఆంధ్రీకృత మేఘసందేశము మొదలగు పంచవింశతి గ్రంథకర్తలు.

శా॥ శ్రీవెల్గొందు వివాహపీఠికపయిన్ సీతానఘాటీత్రపా
వ్యావల్గన్నయనాంత వీక్షణ మహుర్వ్యాశ్రపారితాంగంబుతో
భావోత్కంఠబ్రహర్షచిత్తుఁడగుచున్ భాసిల్లుశ్రీరాముఁడి
ష్టావాప్తిన్ దయచేసి దంపతుల సౌఖ్యాయత్తులంజేయుతన్. 1.

మ॥ ఒకబోటన్ సురపొన్న తోడిలవలీయోగంబునుంబోలిపా
యకవైవాహిక వేది రాఘవునితో నాసీనయైయుంగవ
ల్లికరోమాంచ కరంజితంబగుచు హాళిందేలు భూపుత్రిభా
వుకముల్గూరిచి యివ్వధూవరులనెప్డున్ సత్కృపంబ్రోచుతన్ 2.

శా॥ కౌసల్యాసుతహస్త విచ్యుతముక్తామ్రావుత్రికాకైశ్యవి
న్యాసంబొంది ఘనాఘనోద్గళితనూత్న ప్రౌఢవర్షోపల
శ్రీసంయుక్తి దిదృక్షుహర్షదముగై చెన్నారు మేల్ముత్తెపున్
సేసంబ్రాలొడగూర్చుదంపతులకున్ శ్రేయఃఫలావాప్తులన్ 3.

మ॥ జనకక్ష్మారమణప్రతి శ్రుతసమీహాకారిశాశేందుభృ
ద్ధనురుత్ఫాలన శబ్దసంశ్రవణ జాతశ్రీరఘూత్తంస ద

ర్సవకౌతూహల సంచితానన వికాసత్స్మేరసుతాపత్రపా
కనదాలోకనముల్ వధూవరులకున్ గావించుఁగళ్యాణముల్ 4.

చ॥ పరిణయహోమవేళఁదనభర్తకరంబున లాజలుంచుచోఁ
బొరిపొరిచెమ్మటందడిసి పుల్కలెసంగవడంకుచుండునా
ధరణిసుతాకరాంగుళి వితానమొసంగెడుగాత మివ్వధూ
వరులకపారసౌఖ్య విభవంబుల నుచ్ఛ్వసితానురాగముల్. 5.

మ॥ స్మరకేళీప్రణయాను సాంత్వన భవిష్యత్పాదసంవాహనా
దరసంసూచకభంగి సప్తపదిసందర్భంబునన్ జానకీ
చరణాబ్జంబమరర్తివట్టి సనెకల్ సంధించు శ్రీరాఘవే
శ్వరుహస్తంబొసఁగున్ వధూవరులకున్ సౌభాగ్యయోగోన్నతుల్

మ॥ చరణాబ్జంబులప్రాలి యూరుకదళీస్తంభంబులందేలిని
ర్భరనాభీకుహరానుషక్తివిహరింపం జాలిపీనస్తనాం
తరసంలగ్నగతిన్ వయాళిఁగని సీతాగాత్రవల్లీరతిన్
జరితార్థంబగు రాముచూపుమహదైశ్వర్యాప్తిఁగావింపతన్ 7.

మ. తనసౌశీల్యము రూపసంపదయు సీతాదేవియీకన్యయం
దొనరంగన్గొని తెల్పరాఘవుఁడు నైజోత్కృష్టసాద్గుణ్యవ
ర్ధనతన్ దద్వరునందుఁజూచితగునీదాంపత్యమంచున్ సుఖో
భవలాభంబొడఁగూర్చుదంపతులకున్ భవ్యానుకంపారతిన్. 8.

మ॥ అరయంగన్నియయాను హైమవతితా నాసత్యనారాయణా
ఖ్యరహింపన్ విరుఁడెన్న శంకరుఁడు తత్కల్యాణముం బ్రాంచితా
దరభావంబలరార మెచ్చుచును సీతారామచంద్రుల్ వధూ
వరులన్ గాఢతరానురాగమహదైశ్వర్యాఢ్యులం జేయుతన్. 9.

## 43. నోరి సీతాకాంత శాస్త్రిగారు.

వీరి నివాసస్థలము ఏలూరు. వెలనాటివైదికులు. ఆపస్తంబసూత్రము. హరిత సగోత్రము. తండ్రి వేంకటశివ శాస్త్రిగారు. తల్లి నరసమాంబ. విభవసంవత్సర జ్యేష్ఠ శుద్ధపాడ్యమి శనివారము జన్మదినము. వీరు వ్యాకరణ శాస్త్రము భాష్యము వఱకును నాటకాలంకార సాహిత్య గ్రంథములను ప్రస్థానత్రయమును జదివినవారు. సంస్కృత కవిత్వమందు దేవీశతశ్లోకియు, నీలకంఠస్తోత్రము మొదలయినవానిని రచించిరి. అనేకులను నాటకాలంకార సాహిత్యవంతులఁగాఁజేసిరి. ఆంధ్రమునందును, ఆంధ్రవ్యాకరణమునందును నిపుణులు. ఏలూరు హైస్కూలులోఁ బదునెనిమిది సంవత్సరములు సంస్కృత ప్రధానోపాధ్యాయత్వమును బొంది ప్రస్తుతము. ఆంధ్రప్రధానోపాధ్యాయత్వమును అవలంబించినవారు. వీరిదగ్గఱ మెట్రిక్యులేషను మొదలుకొని యం. ఏ., వఱకును, ఆంధ్ర సంస్కృత భాషలయందునుఁ గృతార్థులయినవారు పలువురు కలరు. శ్రీరాజా మంత్రిప్రెగడ భుజంగరాయ బహద్దరు జమీందారువారి యాస్థాన విద్వాంసులలో నొకరు.

శ్లో॥ శ్రీమంత్రిప్రెగడాన్వయాబ్ధిజశశీ శ్రీమాన్ హరౌభక్తిమా
న్మార్కండేయవరప్రసాదకవితా ప్రావీణ్యభూషోజ్వల
స్సాధుశ్లాఘ్యభుజంగరావితి విరాజత్కీర్తిపుంజః ప్రభు
శ్శ్రీరాజాబహదర్ లకంవర జమీందారుర్విజేజీయతే. 1.

శ్లో॥ శ్రీమాన్ వేంకటరామాఖ్యః దిక్షువిఖ్యాతకీర్తిమాన్
వర్ధమన్నాటివంశాబ్ధౌ ప్రాదుర్భూతోహిమాంశువత్. 2.

శ్లో॥ మేధావివశ్యతస్యాసనో ర్విధిర్దాంపత్యమాతనోత్
రాజపుత్ర్యా హైమవత్యా స్సత్యనారాయణస్యచ. 3.

శ్లో॥ ప్రమాదీచాఖ్యాయాంశరది శుభమాసేనుసహసి
ఋతౌహేమంతాఖ్యేనిశి బహుళపక్షేశుభఫలే
మాఘాఖ్యేపంచమ్యాంశుభద గురువారేపరిణయ
స్తులాలగ్నేశ్లాఘ్యస్సకల సమయజ్ఞైస్సమజని. 4.

శ్లో॥ శ్రీమద్ధైమవతీవధూశ్చ మతిమాఞ్ఛ్రీసత్యనారాయణో
ద్వావేతౌసుగుణాకరౌస్మరవధూ సంకాశరూపౌసదా
అన్యోన్యంచవధూవరౌజనదృశాం హర్షానుసంధాయినౌ
దేశబ్రాహ్మణసర్వజంతుషుదయా వంతౌచిరంరాజతాం. 5.

శ్లో॥ యావత్పార్శ్వేచశంభోర్హిమగిరితనయా వార్ధిపుత్రీచవిష్ణోః
వక్షస్యాస్యేచధాతుర్వహతిసురనదీ స్వచ్ఛభంగాంశ్చవాణీ
సూర్యేందూవ్యోమ్నిభాతఃకనక శిఖరవాన్ విద్యతేభూతలేద్రిః
పుత్రైఃపౌత్రైఃప్రపౌత్రైస్సుఖమనుభవతాం దంపతీతావదేతౌ. 6.

శ్లో॥ ఆయుర్యచ్ఛతువిశ్వసృడ్వితరతా దారోగ్యమర్కస్సదా
సామ్రాజ్యంచశచీపతిర్వితరతా దైశ్వర్యమీశోనిశం
ఆభ్యాంశ్రీపతిరేవదిత్సుసుయశ శ్శ్రీదంపతీభ్యాంశ్రియా
న్నీతింశుక్రగురూగిరాంప్రకురుతాం నైపుణ్యమబ్జాసనా. 7.

శ్లో॥ తర్కవ్యాకరణాదిశాస్త్రనిపుణా స్సామాదివేదేషువై
విద్వాంసోబహవోదిగంతయశస స్సంగీతశాస్త్రేభృశం
ఉద్వాహేకమలాస్పదేచసకలా రాజ్ఞాసుసమ్మానితా
వాద్యేమల్లకలాసులబ్ధయశస స్సర్వప్రదేశాగతాః. 8.

శ్లో॥ నోర్యన్వయసముద్భూత శ్రీమద్వేంకటశాస్త్రిణః
పుత్రేణసీతాకాంతేన రచితాశ్లోకమాలికా. 9.

## 44. దువ్వూరి సూర్యనారాయణగారు.

వీరి నివాసస్థలము పిఠాపురము తాలూకాలోని గోరస గ్రామము. వెలనాటి వైదికులు. ఆపస్తంబసూత్రము. ఆత్రేయ గోత్రము. తండ్రి సుబ్బన్నగారు. తల్లి యంతెమాంబగారు. వయస్సు 81 సంవత్సరము. ఆంధ్ర గీర్వాణములయందు సాహిత్యమున్నది. ఉపాధ్యాయోద్యోగము. వీరు రచించిన గ్రంథములు:—ఆంధ్ర గ్రంథములు, 1. సుమతీ చరిత్రము. 2. సుదర్శన నాటకము.

శా॥ శ్రీకళ్యాణమహోత్సవంబున సురశ్చింతామణింబోల్చు కాం
తాకారంబునుదత్కటాక్షచయమున్ హర్షంబు రెట్టింప న
స్తోకప్రౌఢిమదన్నివాసముగఁ దోడ్తోవాత్మనూహించు ల
క్ష్మీకాంతుండుదయార్ద్రదృష్టిఁగనుతన్ శ్రీమద్వధూకాంతులన్.

చ॥ తమమునడంచుచున్ వెలుఁగుఁ దప్పకజూపుచులోకబంధువ
యమరుమహాద్విజుల్ పలికినట్లు గ్రహాళియునీవధూవరో
త్తములవివాహలగ్నమునితాంత శుభప్రదమైతలిర్పఁగా
సుముఖములన్ శుభస్థితుల శోభనదృష్టులఁబోల్చుఁగావుతన్. 2.

చ॥ ముగుదతనంబువేసుకయు ముద్దుమోములసొంపునింపనిం
పుగొలుపునీవధూవరుల ముచ్చటమీఱికనుంగొనంబ్రసా
దగరిమధాత్రికిన్ డిగి సదస్యకపీంద్రవచస్సమాశ్రితిం
దగి ప్రియమాడుశారదనితాంత శుభోన్నతులిచ్చువారికిన్. 3.

చ॥ అలరిముఖాంబుజాతనటదంచిత వేదచతుష్టయంబుతోఁ
జెలువగుబ్రహ్మపీఠమును జెందిపురోహితుఁడైనబ్రాహ్మణుం
డెలమిఁబఠించునాశిషము లెల్లవిధిప్రతిభాషితంబులై
పొలిచివధూవరోత్తములఁబొందు తపఃఫలసిద్ధులట్టులన్. 4.

చ॥ ధరణిధవుండు శ్రీయుతుఁ డుదారుఁడు దివ్యమణీంద్రభూషితుం
డురుగుణుఁ డాశ్రితావనుఁ డహో విబుధప్రియుఁ డీభుజంగరా
ణ్ణరపతి యిచ్చు దీవనలు నవ్యమహోదయహేతువుల్ వధూ
వరులకు సర్వసంపద లవారణఁ గూర్చు నభీష్టభంగులన్. 5.

చ॥ పరధనదప్రశస్తతరభావమునున్ సకలజ్ఞధర్మమున్
సిరుల మెఱుంగునున్ దెలియఁ జెప్పవె వేంకటరామరాట్ప్రభున్
స్మరదమనావతార మనసన్నుతి యాయతఁ డిచ్చు దీవనల్
గురుహితులీవధూవరుల కున్వసనాంచలహేమరూప్యముల్. 6.

చ॥ బలమున భాగ్యసంగతిని బ్రాభవసంపద ధర్మవైఖరిన్
గలసుగుణంబులన్ యశముఁ గాంచు నగణ్యులు పెండ్లిచుట్టముల్
చెలిమి వచించు మేలులు ప్రసిద్ధులు చెప్పిన శాస్త్రవిద్యలా
ధ్యులకు బలెన్ వధూవరుల కున్నతసంపద లిచ్చుఁ గావుతన్. 7.

చ॥ సురభిఘృతంబుతో నితవు సూపు హవిస్సుల సేయ మెచ్చనన్
గరము ప్రదక్షిణాగతశిఖా కనకద్యుతిమండలభ్రమల్
మెరయ శిరంబు ద్రిప్పుగతి మించు కృశానుఁ డుదారత న్వధూ
వరులకొసంగుఁ గావుత మపారబలప్రతిభాయురున్నతుల్. 8.

చ॥ జనకుని లీలశూలిని భుజంగధరుం డగణేశ్వరుండనై
గొనకొని మాను చేలయును గోర్కె బలెన్ బనిమించు లింగమై
ఘనతర పూజలందుఁ గనక ప్రతిగాత్రుఁడు మూషికాశ్వుఁ డీ
యనఘులకీవధూవరుల కాయువు శ్రీయు నొసంగుఁ గావుతన్. 9.

చ॥ ఎలమి నలంకరించిన గజేంద్రుని పైఁ జెలువొంద దంపతుల్
జలజసితాతపత్రమణిజాల ధగద్ధగదృశ్యమానలై

చెలితనమారఁబిల్చు సర సీరుహ వాసినివీరలంగృపా
లలితకటాక్షమాలలనలంకృతులం దగఁజేయుఁగావుతన్. 10.

చ॥ రతనపుబళ్లెరంబు మణిరంజిత దీపికయున్ ఘటించియా
రతులిడుపటఁదప్పు ఛవిరాజిత మంగళమూర్తిసాత్కృతిన్
జతుర నభూమతల్లికలసంగతిఁ బొల్చెడిసర్వమంగళా
సతియుఁ, నఘూనరాధ్యులకు శాశ్వతమంగళమిచ్చి ప్రోవుతన్. 11

సీ॥ ఎంతకాలముగౌరి యిందుశేఖరుమేన
సగపాలుభాయక సరిమెలంగు
ఎంతకాలముధాత్రి యీప్రాణితతికి నా
ధారమైహరికి ముదంబునింపు
ఎంతకాలములక్ష్మి హృదయేశ్వరునురంబుఁ
బ్రమదంబునిండారఁ బాయకుండు
ఎంతకాలమువాణి హేమగర్భునిఁగూడి
వినుతప్రపంచంబు విస్తరించు

గీ॥ అంతకాలముసౌభాగ్య మతిథిపూజ
వినుతభోగంబుసంతతి తనకునొనర
రమణవేంకటసత్య నారాయణాఖ్య
నరునితో హైమవతి ప్రీతినరలుఁగాత. 12.

## 45. కాళ్లకూరి నారాయణరావుగారు.

వీరు నియోగి బ్రాహ్మణులు. ఆపస్తంబసూత్రులు, భారద్వాజగోత్రులు, వీరి తండ్రిపేరు బంగారురాజుగారు. తల్లిపేరు పూర్ణమాంబగారు. ప్రజోత్పత్తి నామసంవత్సర వైశాఖశుక్ల శుక్రవారము వీరి జన్మదినము. సంగీత సాహిత్యములు రెండును వీరికివంశానుగతములు. అష్టావధానమువలెనే

శతావధానమును భిన్నకృత్యములతో నిర్వహింపవలెనను పట్టుదలతోఁ జాల పరిశ్రమచేసి, కొంతకాల మవధానములం గావించి బిరుదములువడసి భావ కవితకవధానములు ప్రతిబంధములని యిటీవల విరమించిరి. అనన్యసామాన్య మయిన గ్రంథపఠనముచేత—"గ్రంథపఠన చతురాస్య" లనియు, అసాధారణమయిన యాంధ్రకవిత్వముచేత—"మహాకవి" యనియు బిరుదములం బొందిరి.

ఇప్పటికివీరు, చిత్రాభ్యుదయము, పద్మవ్యూహము, అను రెండునాటకములను; బుద్ధిరాజులు, రాజసుందరి......, పెద్దలనాఁటిముద్దుకథలు, అను నాలుగు చిత్రకావ్యములను; ఢిల్లీసామ్రాజ్యము, జార్జిరాజసూయము అను రెండుచారిత్రములను; రామాయణ రహస్యము, సదండవిసండ వివాదము, అనురెండు విమర్శగ్రంథములను; ప్రకృతకళ్యాణ గీతమువంటి పెక్కుగీతములను, అనేక ప్రహసనములను రచించిరి. మనోరంజనియను విద్యావిషయిక పత్త్రికకు సంపాదకులుగానుండి యనేకవ్యాసములనువ్రాసిరి. సాధారణముగ వీరిగ్రంథము లన్నియు నీరిమాతృభాష్య సేయులును, సంగీతసాహిత్య సంపన్నులు నగు బుద్ధిరాజు వీరభద్రరావు పంతులవారి కంకితముసేయఁ బడుచుండును.

## కళ్యాణగీతము.

ఈశ్వరోద్దేశమై శుభహేతువగుటఁ
బెండ్లియానందకందమై ప్రియముఁగూర్పు
మానవునిజీవితము నందనూనమగుప్ర
కాశమునఁదేజరిలు నట్టికాలమొక్క
పెండ్లిసమయంబె డొంకపై వెలసి, విరిసి,
మివులనొప్పియుఁదన్నుఁ బ్రేమించువారు
లేక, తనసార భంబెల్లనాకసంబు
పాలుగాఁజేసిచేసి యవ్వలఁదనంత

దానిక్రమముగ వాడియుదగ్రహ్మాయు
హాతినిక్షితిఁగూలి మానెమునడవిమల్లె
బ్రతుకువంటిది శాశ్వతబ్రహ్మచర్య!
మెన్న మానవజీవిత మెపుడుఁబగలె
కాక యపుడప్డు కాఱుచీఁకటులమిందు
రేలునగుచుండు, నయ్యాయి వేళలందు
సాయపడువారుభర్తకు సతియు, సతికి
భర్తయునుగాక యన్యులెవ్వరునుగారు ;
తలఁపఁగత్తెరకాళ్ల విధంబుగాను
స్త్రీపురుషులిర్వురుం గూడిజీవయాత్ర
సలుపునప్పుడెయెడ నెడసంభవించు
కష్టములుతెగు; సకల సౌఖ్యములుఁగలుగు.
విహితనరధర్మములు కొన్ని విన్నవింతుఁ
బెండ్లికొమరుఁడ! వినవయ్య! పెండ్లినాడు
చేసినప్రమాణములు నీదుచెంతనున్న
బంధుజనములె కాక దేవతలుకూడ
చేసినప్రమాణములు నీదుచెంతనున్న
నాలకించుచునున్న వారనెడుమాట
మానసంబున నెన్నఁడు మఱవవలదు;
ధర్మపత్ని నినీడగు దాసిగానో!
బొమ్మగానో! కొండొక పనిముట్టుగానో!
తలఁపఁగాఁబోక, యీశ్వరదత్తమైన
సౌఖ్యపేటికఁగాఁ బోల్చిచక్కదానిఁ
దెలియుమార్గంబెఱుంగుము ; పరిణయమ్ము
నాఁటిప్రేమయెప్పటి కప్డునాఁటియట్లె

శ్రోత్రదిగనుండఁ జూడుమేకోర్కెనైన
మరలనడిగించు కొనకుము; మనసునొచ్చు
హాస్యమెన్నఁడు నాడకుమాజ్ఞ వెట్టఁ
బోకుమూరకయే తిక్కపోడమునట్లు;
పగటియుపచారములనెల్లఁ బగటితోనె
యస్తమింపఁగనిమ్మొక యమ్మగన్న
బిడ్డయనుమాటయును నీదుప్రేయసియను
మాటయునుగూడనెన్నఁడు మఱవకుసుమ!
ముఖ్యమైననధూ ధర్మములనువినుతు
వినుముకళ్యాణి! ప్రేమించి పెండ్లియాడు
విధమిపుడుమాఱె పెండ్లిగావింపఁబడిన
కతనఁ బ్రేమింపవలసిన కతివధర్మ
మేఱుపడియెను; గానఁ బ్రాణేశుమొదట
నాత్మఁ బ్రేమింపు; మన్వాల నతనిఁగూర్చి
చక్కఁగమనంబున విమర్శసలుపుమాతఁ
డెంతధారాళముగనున్న నంతమెచ్చు
కొనుము; నీయెడనతఁడల్కఁగొనఁ బ్రసన్నుఁ
జేసికొనుము క్షమాపణచెప్పి; యతఁడు
వ్యసనపడునప్పుడుల్లాస పఱుపుమెట్లొ
సాధువృత్తిఁజరింపఁ బ్రకళింపసేయు;
మతఁడుసోమరియగునెడ నతివృదువుగ
మందలింపుము; నీకొక్క మర్మమెఱుక
సేయునదిమదిజీర్ణము చేసికొనుము;
ప్రథమమునఁజెలివై, తరువాతగృహిణి
వై, యనలనీడవై, దాదివగుచుఁ బిదపఁ
జతురవస్థలభర్తకు హితమొనర్పు;

మెప్పుడర్హుఁడుఁగాఁ దోఁచునప్పుడెల్ల
ముద్దియా! యాతనికి నొక్కముద్దొసగుఁము.
శతసహస్రయోజన పరిమితినిమించు
నలయముగలట్టి గ్రహరాజములనుభూత్రి
దర్పణంబునఁగాక నేత్రములఁజూడ
నలనుపడనట్టి జీవాణువులనుగూడ
నొక్కచేతనె చేసిన యోమహాత్మ!
యోపరాత్పర! యోచిత్స్వరూప! నీకృ
పావిలోకనంబులు వీరిపైనిఁగురిసి,
యరసి, యైహికజీవనమనెడు నోడ
కొకరుచుక్కానుగా మఱియొకరుతెఱగ
వెలయఁజేయుము; తమసంశ వృత్తమునకు
నొకరుతల్లివేరుగ, మఱియొకరుపట్టు
గాఁబ్రసాదింపు వీరిపగళ్ళు విస్తృ
తంబులై ప్రత్యవాయశూన్యంబులై, ని
శల్ విచారదూరంబులై పొగఁజేయు;
మాయువున్ సిరిపుత్త్రపౌత్త్రాభివృద్ధి
ధీపటిమకీర్తి యివిసమృద్ధిగనొసంగి
ధన్యులనుజేయుమీ శుభదంపతులను
సత్యమేజయమను ధర్మసంగ్రహంబు
స్థిరపడఁగనేఁడు విజయలక్ష్మిని గ్రహించి
నట్టియోసత్యనారాయణా! జయోస్తు.

## 46. రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారు.

వీరి నివాసము అనంతపురము జిల్లా కల్యాణదుర్గము తాలూకాలోని రాళ్లపల్లి. ప్రకృతము మైసూరు మహారాజావారి కాలేజిలోఁ దెనుఁగు

పండితులు. నందననామ సంవత్సర మాఘశుక్ల సప్తమి జన్మ దినము. ఆంధ్ర రఘువంశము, మీరాబాయి, భార్గవీ పంచవింశతి మొదలయిన గ్రంథములు రచించి యున్నారు.

శా॥ శ్రీలావణ్యమయస్వరూప, మఖిలక్షేమంకరప్రక్రియా
శీలం బప్రతిమానవైభవము, రాశీభూతకారుణ్యల
క్ష్మీలీలావిలసత్సుధాంబునిధి వీచీమాలికామధ్యదో
లాలోలంబిడుఁగాత సంతతముఁ గల్యాణంబు లీజంటకున్. 1.

మ॥ సిరులం జిందెడు నెమ్మొగమ్మునఁ గృపాసేకంబు చేఁజూపు శా
న్తిరసంబొల్కు నలంతి వెన్నెలకు వన్నెల్వెట్టు లేనవ్వుతోఁ
దరుణాబ్జంబునఁ బాదపల్లవము కందన్నిల్చు చెల్వారు నీ
శ్వరి, యీజంటకొసంగుఁగాతఁ జిరసౌభాగ్యాయురారోగ్యముల్.

చంపకమాలిక.

పొరపడియైన నాల్క తుదఁబుట్టిన యొక్క తెనుంగు ముక్కకై
బిరబిర నాంగ్లమన్త్రము జపించి యఘంబులు నీఁగు బుద్ధియం
దలుకును గల్గినట్టి వితథంబగు నీస్వమయంబునందు సుం
దరమయి పొల్చు చెల్వ వదనంబునకున్ మసిపూయునట్లు సం
స్కరణము సేఁకదిక్కు గతిగాననిపామర భాషఁ దూర్చితే
నెరుచుల నెల్లెడం జెలుకు నిద్దపుఁ దెన్గును రూపుమాపఁగా
దొరకొను పుణ్యపూరుషు లతుల్యలరేగుచుఁ గ్రేళ్ళువారు నీ
తరుణమునందు, వేసఁగిని దాపము సైఁపక వాడిపత్త్రలై
సురిగెడుమల్లితీవియకుఁ జొక్కముగా నొకనీలమేఘమం
బరమున లేచి తిన్నఁగ హిమాంబులదానము సంగినట్లు తె
మ్మెర గాలిబల్మిచే సడలి మిక్కుటమా వడిముండ్లకంచెపైఁ

బోరఁబడఁబోవుచున్న కడివోవని క్రొన్నవకంపుఁబూవునం
దరమునఁగందకుండఁగొని తద్దయుఁగూర్మి రెయుసంగనొక్కరుం
డరపురుషుండుదాఁగురులఁ దాల్చినరీతిని, నిప్పుడేదియో
వెలవునఁబెండ్లియంచు నొకపేరిడిసత్కవిసూరివర్యులిం
దలనొకచోటఁజేరిచి యుదారతసత్కృతిఁజేసియాంధ్రవా
క్తరుణికినెప్డులేకిపుడు దాఁపురమైనయభాగ్యమంతయున్
నిరతముఁబాపఁబూనితివి ! నీసరివచ్చెడువారినింకఁగొం
దలసృజియించుఁగాత ! సతతంబునుసౌఖ్య చిరాయువుల్ మహా
దరముననీకునీయుత ! విధాంభుజంగధరాధిరాణ్మణీ ! 3.

సీ॥ కనుసన్ననిలిచిచెప్పి నదిసేయఁగనూరి
వారలందఱును సేవకులుగారె !
యిచ్చకంబులనాడి యిటునటుఁబెండ్లికా
ర్యములకైతిరుగు మిత్రములునరుదె !
దక్షిణలొసఁగి సంతర్పణంబొనరింపఁ
దినిత్రేఁచిపోగడు బ్రాహ్మణులులేరె !
యంతరిక్షమునుండి యట్లకైనట్టింటఁ
గల్పవృక్షమునుదించు కవులుఁగలరె !

గీ॥ వితరణగుణంబుగలయట్టి విభులకిట్టి
విభవములకేమిగాని, యీపెండ్లియింట
నిన్నుఁటినిమించు సౌభాగ్యమిదియెకండ
పరఁగెసర్వానురూప దాంపత్యగరిమ. 4.

సీ॥ రాగంబువోలయఁజేరఁగవచ్చు రవిఁగాంచి
చెలఁగిన ప్వేదుఃకూర్పు చెలినిగనిన
జనులకన్గప్పి చయ్యనఁజెంతఁబొడసూపు
మేఘుంబుతోడి క్రొమ్మెఱుఁగుఁగనిన

గడునొద్దికంజేరి కౌఁగిలించిచెలంగు
    వేమావితోఁడి మల్లికనుగనినఁ
జలువలొల్కుచునిండు చందమామనుజేరి
    చెలువంబునూను వెన్నెలనుగనినఁ

గీ|| గానిపెమ్మోముపంచి, క్రీఁగంటఁబతిని
గాంచుకోర్కెని సిగ్గుసగంబుఁజేయ
నలరుసౌభాగ్యవతిని నీహైమవతిని
గనినయంతటి మోదంబుగలదె మనకు. 5.

సీ|| పరికించినంతఁజాపలమనంబుఁగలంపఁ
    జాలినచెలువంపు సౌరునొసఁగెఁ
గవులఁబండితులను గారవింపఁగఁజాలు
    సార్థకంబైన యైశ్వర్యమొసఁగ
మనభాషమనదేశమనునట్టి యభిమాన
    మననింక నీకులంబునకు యొసఁగెఁ
గులగౌరవంబు లెక్కుడు సేయుమేవిద్ది
    యలనేర్వఁగాఁ గుతూహలమునొసఁగ

గీ|| నిన్నిసిరులిచ్చియీజంటఁజేర్చి కూర్చి
యింకనవిరెండు నిక్కువంబిచ్చితీవు
నైనవేఁడెదశౌరి దయాంబురాశి
యాయురారోగ్యముల దయసేయుఁగాత! 6.

సీ|| సంసారమును సర్వసారంబుగాఁజేయు
    నానందములకెల్లనాలవాల
మొండొంటి విడనాడకుండ నెమ్మనములఁ
    గట్టివైవఁగఁజాలు గట్టితీఁగ

యెల్లకాలములనొక్కంతేనిఁగంఁక
కడిపోకపాలుచు చొక్కంపుఁబూవు
అనుభవించిన యంత కంతకు సెక్కువై
రసముక్కు పాఱులోరంపుఁబండు.

గీ|| అప్రమేయమనిర్వాచ్యమనుపమంబు
పారదాంపత్య భక్తిమీజంపతులకు
మొలచి, చిగిరించి, పూఁచి, నిస్తులసుఖంబు
లెసఁగఁజగినట్టి సత్ఫలమొసఁగుఁగాక. 7.

మ|| స్థిరమానొండొరుపైనిగూర్మి, నరసౌశీల్యంబు, సత్యవ్రతా
చరణంబున్, గడుధర్మసక్తియు, స్వభాషాదేశసంరక్తియుం
బరఁగంగూడిసుఖించుమంత్రమువమొప్పన్, దండ్రిన్, మామకున్
జిరకీర్తింగలిగింతుకీ విజయులక్ష్మీ సత్యనారాయణుల్. 8.

## 47. మోచెర్ల హనుమంతరావుగారు.

వీరినివాసస్థలము కాకినాడ. తండ్రి రామచంద్రరావుగారు, తల్లి సీతమ్మ గారు. భారద్వాజగోత్రము. ఆపస్తంబసూత్రము. జననము 11 జనవరి 1891 వికృతిసంవత్సరము వీరిచే రచియింపఁబడిన గ్రంథములు:—1 చంద్రహాస నాటకము, 2. పరమానందచరిత్రము. (వచనము) 3. చంద్రవదన. (వచనము) 4. ప్రభావతీ ప్రద్యుమ్నము. (వచనము) 4. మదాలసాచరిత్ర. (వచనము) 6. ఘోషయాత్ర, (నాటకము)

ఉ|| శ్రీయుతవంశగౌరవము శిష్టజనస్తవనీయవర్తనం
బాయతకీర్తి వైభవము, యతుపసంపదయున్ ఘటించిదీ
ర్ఘాయురుదారులై మనుఁడటంచును దీవనలిచ్చిసత్యనా
రాయణమూర్తి హైమవతి హైమవతీ సతిఁబ్రోచుఁగావుతన్. 1.

చ॥ చతురనవార్థకల్పిత విశాలయశోరుచిరంబమోఘమం
చితపదగౌరవాస్పద మశేషజగజ్జన రంజకంబనిం
దితమయిపొల్చుసత్కృతుల దివ్యసుధామయవాక్కునూత్నదం
పతులకు నాయురున్నత శుభప్రతిపాదనమై ఫలింమతన్. 2.

## 48. సింగుమహంతి పార్థసారథిగారు.

వీరు ప్రకృతమున గౌతమీతీరస్థ రాజమహేంద్ర పుర వాసులు. పూర్వకాలమున వంగదేశమునందలి గౌడయను పురమునుండి వెడలి యుత్కలదేశమునఁ బ్రవేశించిన పంచగౌడులలోని యుత్కలశాఖవారు. కళింగరాష్ట్రము ఆంధ్రులకులోఁబడిన దినములలో నీప్రాంతములకు వచ్చిన యుత్కలశాఖలోని శిష్టికరణములు. సామవేదశిష్టులు. వీరి మాతృభాష ఓఢ్రము. చిరకాలమునుండి త్రిలింగదేశమున నివసించుటచే వీరిచే నాంధ్ర భాషయును ధారాళముగా వాడఁబడుచున్నది. వీరు కాత్యాయనసూత్రులు. వసిష్ఠగోత్రులు. వీరి జనకతండ్రి సుదర్శనముగారు. జనకతల్లి రాఘవాంబ. దత్తతతండ్రి కుశాలరావుగారు. దత్తతతల్లి సుభద్రాంబ. వీరు 1876వ సంవత్సరమున జన్మించి మదరాసు క్రిష్టియన్ కాలేజిలో ఆంధ్రాంగ్లేయ విద్యల పట్టపరీక్షలకు నభ్యసించి గోదావరిజిల్లా రామచంద్రపురము తాలూకా యోగమాంబ పేటలో వీరికారణ గురువులగు శ్రీరాజావాడ్రేవు రంగనాయకమ్మ జమీందారిణిగారిచే బీద విద్యార్థులకై నెలకొల్పఁబడిన ప్రధానాంగ్లేయ భాషాపాఠశాలయందుఁ జిరకాలము ప్రధానోపాధ్యాయులుగ నుండిరి. శ్రీరాజావాడ్రేవు విశ్వసుందరరావు జమీందారుగారు, ఈపాఠశాలలోఁ జదివి పేరొందిన వీరిశిష్యులలో నొకరగుటచే మహంతో, పట్నాయకో, రాజగురో, పాత్రో, అనుపారుష బిరుదాంకములుగల శిష్టికరణములలో మంత్రికుల పుంగవులగు సింగుమహంతి వంశమునఁ బుట్టిన వీరికి రాజగురులను బిరుదు సార్థక మయ్యెడిని. దైవవశమున వీరికి శ్వేతావరోధము సంప్రాప్తమయ్యె. గానకళా విశారదులును,

ఉభయభాషాపరిజ్ఞాతలును, ఆంధ్రాంగ్లేయ పద్యగద్య రచనాధుర్యులును, అపూర్వ గణితావధాన కల్పనానిపుణులును, మృత్పాషాణశాస్త్ర విమర్శనాసక్తులును, అగువీరు ప్రస్తుతమాంధ్ర దేశంబునఁగల నానా రాజస్థానముల యందును, సకలపుర శిలాశాలలయందును, తమవిద్యా విశేషంబులను వెల్లడించుచు ననేకపతకాదులను, బహుమానంబుగానొందిరి.

సీ॥ ఇరులుజిమ్మెడునట్టి కురులునున్నఁగదువ్వి
చిన్నిగంటల జడచిందులాడ
ముద్దుగులుల్కెడుమోము నద్దియాతిలకంబు
పసిఁడిపైరతనము ల్పరచినట్లు
పసిఁడిపావడయంచు పాదంబుపైఁవ్రాల
నిండుచోక్కాయిపై నీటుధనర
ఆపాదమస్తకం బవిరళంబుగనున్న
కాంచనాభరణముల్ కాంతులీన

గీ॥ చెలులహాస్యంపుపల్కులు చెవినిఁబడఁగ
మొలకనవ్వులు ముఖచంద్రునలరఁజేయ
లీలకెంగేలనాథుని కేలుపట్టి
వెడలె హైమవతీకన్య వేదికడకు. 1.

గీ॥ పద్మమన్నాటిషంశంబు వన్నెమీఱఁ
జేయవేంకట సత్యనారాయణుండు
రాజకవిభుజంగవిభు గారాబుప్రథమ
పుత్త్రి హైమవతింగొని పొలుపుఁగాంచె. 2.

గీ॥ తల్లిదండ్రులదానంబు తాల్మినయవి
వేకమాన్యతాగరిమ హృద్వీథిఁదలఁచి

పట్టిరో! పుట్టినింటికి మెట్టినింటి
కిలయశంబు పెంపొందుచు నింపులొలుక
"పద్దు" "మన్నా" యనకెపుడు వరలుమమ్మ. 3.

## 49. శేట్లూరి రాఘవఅయ్యంగారు.

వీరి నివాసస్థలము ప్రకృతమున గోదావరీ తీరమందలి నరసాపురము. వీరు విశిష్టాద్వైతమతస్థులు. సామవేదులు. ద్రాహ్యాయణసూత్రులు. భారద్వాజగోత్రులు. తండ్రి వెంకటాచార్యులుగారు. తల్లి వెంకటనరసమ్మగారు. వీరు సామవేదమునను, పూర్వోత్తరమీమాంసలయందును నిరుపమానపాండితీ పరిపూర్ణులును, గోదావరీ తీరమందలి బూరుగపల్లియను గ్రామమున నివసించి కీర్తిశేషులయిన శేట్లూరి స్వామిరాఘవాచార్యులవారి కనిష్ఠభ్రాతృపుత్త్రులు. నాలాయిర ప్రబంధవేత్తలును ద్రావిడవేద విదులును, రిటైర్డు డెప్టాస్కూల్సుపరింటెండెంటును వీరి తండ్రియగు కీర్తిశేషులయిన శేట్లూరి వేంకటాచార్యులవారు ఈనరసాపురమున నివాసముచేసి తమపుత్త్రులకు నాంగ్లభాషాభ్యాసము జేయించుచుండ వీరికి దేశభాషయగు నాంధ్రంబున విశేషాభిమానము గలిగి ప్రాచీన కవికృతగ్రంథములను స్వంతముగనే జదువుకొనుచు సందిగ్ధస్థలములఁ దండ్రిగారి యొద్దఁ దెలిసికొనుచు నాభాషయందుఁ బ్రౌఢిమను సంపాదించి తత్సహాయకారిగ గీర్వాణభాషనుగూడ నభ్యసించి, ఆంధ్రభాషను మృదుమధురశైలిని గవిత్వమును జెప్పఁదొడంగిరి. ఇంతియగాక, ఆంగ్లభాషను స్కూలుఫైనలు పరీక్షలోఁదేరి వీరు ఉత్తీర్ణతాపత్రమును సంపాదించుకొనుటకుఁ గొన్నిశాఖములయందు పరీక్షనిచ్చు నిమిత్తము స్కూలుఫైనలు క్లాసునఁ జదువుచుండిరి. వికృతిసంవత్సర కార్తికబహుళ అష్టమీగురువారము వీరి జన్మదినము. వీరురచించిన గ్రంథములు:—1. సుశీల, 2. నృసింహనిర్యాణము (మిశ్రసృతి) 3 సత్యవతి, 4. మతియుంగొన్నిచాటువులు.

శా॥ శ్రీవాణీపతిపార్వతీ పతియును శ్రీలొప్పఁదన్ గొల్వఁగా
నేవేళంబ్రియమార నారదుఁడు దానింపార సద్భక్తిచేఁ

" గానన్ రాఁగదవే" యటంచుసతమున్ గానంబునుస్సేయఁగా
వేవాత్సల్యముఁ జూపునట్టి హరిసంప్రీతిర్మమున్ బ్రోవుతన్. 1.

చ|| సరసిరుహాసనుండు నుడిచానయు వెన్నుఁడు శ్రీవెలందియున్
హరుఁడు,నుమాసతూటియుఁ, జిరాయువువిద్యయుభోగభాగ్య
సిరులు, శుభంబులిచ్చి కృపచేఁదనరారు కటాక్షవీక్షలన్ [ముల్
గరముబహూకరించెదరు గావుత ! నీమిఁధునంబు నెప్పుడున్. 2.

ఉ|| పాయని భక్తితో హృదయ వారిజమందు మునీంద్రులెల్లవా
రేయనఘున్భజింతు రతఁడీప్సితదాయి, రమావిభుండునా
రాయణదేవుఁడిమ్మెయిఁజిరాయు రభీష్టములిచ్చి " సత్యనా
రాయణమూర్తి హైమవతులన్" గృప నెప్పుడుసాకుఁగావుతన్ 3.

చ|| సిరియును, నాయువున్ , దయయు, శీలము, దేహపటుత్వసంప
సరసతఁ వాగ్విశేషమును, సాధులయందనురక్తి, వైదుషీ [దల్
గరిమయు, ధర్మవాంఛయును, గారవమార నొసంగి యీవధూ
వరులను బ్రోవుతన్ హరికృపాకలశోదధి సర్వకాలమున్. 4.

గీ|| అమృతకణము సుధానిధికర్పణమను
నటులసత్యనారాయణ హైమవతులి
రువురఁ బ్రేమమీఱఁగ నీతరుణమునను
డీయపద్యంబులఁగొనఁ బ్రార్థించువాఁడ. 5.

## 50. గాడేపల్లి సూర్యనారాయణశర్మగారు.

వీరి కాపురస్థలము గోదావరిజిల్లాయందలి పీఠికాపురము. వికృతి సంవత్సర ఫాల్గుణ బహుళసప్తమి జననదినము. ఆపస్తంబసూత్రులు. భారద్వాజసగోత్రులు. తండ్రి వేంకటశాస్త్రిగారు. తాత తండ్రుల నాటినుండి పీఠికా

పుర సంస్థానాధిపతుల ముఖ్యాశ్రితులు. ఆంగ్లాంధ్రములయందుఁ బ్రవేశము కలవారు. వీరిచే రచింపఁబడిన గ్రంథములు:—1. పాశుపతార్జున నాటకము, 2, సైంధవార్జున నాటకము, 3. లీలావతీ నాటకము, 4. దురాశా విలాస నాటకము. మానిని (నవల) మానసింహ (నవల) మొదలగునవి.

శా|| శ్రీకాంతామణిపై విరాజిలెడిసత్ప్రేమం బ్రదీపించి తా
లోకారాధ్యుఁడై యయ్యెఁ వక్షమున నాలో లచ్ఛకోరాక్షిను
ద్రేకంబందు మనోజకేళి లడఁపన్ దీప్య ద్గతిన్నిల్వు నా
వైకుంఠప్రభుఁడీ వధూవరుల సౌభాగ్యోన్నతిన్ బ్రోచుతన్ 1.

చ|| హిమగిరికన్యకై యెడద నెక్కొను మొక్కల పున్మనోజతా
పమునకుఁ దాళలేక సగ బాలుశరీరమొసంగి వైచి మూ
ర్ధమున సుధాకరున్నిలిపి తాండవముం బచరించు శంకరుం
డమలమనోనురాగ ముదితాత్ములఁ జేయుతఁ బెండ్లిబిడ్డలన్. 2.

చ|| చదువువివేకమున్ మృదురసగ్రహణంబు వహింపఁగాశరం
బదియొకఁ డేలచాలునని యాదినతానలు మోములన్ ముదం
బొదవసృజించుకొన్నను మహోన్నతి నందఁగలేక విద్యనా
ముదితనెపెండ్లియాడువిధి బ్రోచు వధూవరులం గృపార్ద్రతన్. 3.

మ|| పలుభాషాగత రూపముల్గనియు నెప్పట్లన్ దెనుంగందస
ల్లలితాలంకృతయై బుధాంధ్రరసనల్ బ్రాపించి దీప్తాత్మతన్
లలినగ్రామ్యమదేదొ గ్రామ్యమది యేలా దూష్యమో చెప్పునా
విలసద్వీణెయుఁ బూనివాణి యొసఁగున్ విద్యాప్రసంగంబులన్. 4.

సీ|| దేశాభిమానుల యాశాప్రపంచంబుఁ
బ్రస్తరింపఁగఁ జేయు ప్రబలశక్తి
ప్రత్యక్షదైవంబు ప్రభువంచు బోధించి
రాజభక్తినొసంగు రంజితోక్తి

ఘనదురాచారంబు మొనసినిర్మూలించి
శిష్టసంగతినిచ్చు స్పష్టయుక్తి
స్వార్థపరత్వాది సర్వదూష్యగుణాళిఁ
గనిమసంగెడి విచ్చుకత్తిరక్తి

గీ॥ సాంప్రదాయానుగతమైన సకలసుగుణ
సంపదవిజృంభణ మొనర్చుసజ్జనప్ర
సక్తిగలిగించునూత నోత్సాహశక్తి
వరలఁజేయుదంపతుల సంపదలఁబొదల. 5.

మ॥ కరుణామూర్తులు వేదపారగులు నిష్కామ్యప్రకాండుల్ పరా
త్పరతత్త్వార్థవిచారణైక మతులద్వైతుల్మితాహారులున్
స్థిరసంకల్పులుసన్మునీశ్వరు లవిచ్ఛిన్నాతిమోహంబునం
బరిపూర్ణాయువశేషసంపదలు సంప్రాప్తింపదీవింతురన్. 6.

ఉ॥ ఏమతమందు నేని జను లెంతురు దేవుఁడొకండ యంచు నా
నామతమాతయై వెలుఁగు సనాతనమౌ మన సన్మతంబునన్
గామితముల్పొనర్చుటకుఁ గాసుర లెందఱు నున్న భర్తయే
కామినికొక్క దైవతముగా భజియింప ననుగ్రహించుతన్. 7.

మ॥ పతియే దైవమటంచు నెల్లపుడు సద్భావంబు తోఁపన్నసం
తతభక్తిన్ భజియించు దిక్షుజనుసీతా కాంతిలాలించిని
శ్చితమా ప్రేమఁబదేక పత్నిగఁగటాక్షించుచుంగదా, రాముఁడీ
క్షితిని పెండ్లికుమారు నభ్యుదయదాశీర్వాదముల్ జేయుతన్. 8.

గీ॥ ఆయురారోగ్య సంపదలతిశయిల్ల
ఘనతరాన్యోన్యరాగంబు పెనఁగొనంగఁ
బ్రణుతిఁజేయు గాడేపల్లివంశజనిత
సూర్యనారాయణాఖ్యుఁడు సొంపుమీఱ. 9.

## 51. దామరాజు శోభనాచలముగారు.

వీరి నివాసము కృష్ణాగౌతమీ మధ్యప్రదేశంబగు వెలనాటి సీమలో తెనాలను గ్రామమునకు సమీపంబగు జాలపురము (జాలిపూడి) ఆఱువేల నియోగిబ్రాహ్మణులు. ఆంధ్రులు. యజుశ్శాఖ. ఆపస్తంబసూత్రము. శ్రీవత్సస గోత్రము. పంచార్షేయము తండ్రి వెంకట్రామయ్యగారు. తల్లి వెంకమ్మ. జననము దుర్మతినామసంవత్సర వైశాఖ బ॥ పాడ్యమీ శనివారము. (1861సంవత్సరము మే25వతేది) వీరు మొగట పెదతండ్రి గారియొద్ద భారత భాగవత రామాయణాది సద్గ్రంథములును, నిఘంటువులును సలక్షణముగఁ జదివిరి. వీరు చర్చిమిషనరీసొసైటీవారి ప్రయిమరీ పాఠశాలలలోఁ బ్రధానోపాధ్యాయులుగను హైస్కూలునందు, ఆంధ్రసహోపాధ్యాయులుగను, సుమారు ముప్పది సంవత్సరములనుండి పనిచేయుచుండిరి. మఱియు వీరు శ్రీ రాజామంత్రి ప్రెగడ భుజంగరాయ బహద్దరు జమీందారువారి యాస్థానమునందు, ఆంధ్రపండితులుగనున్నవారు. వీరి వంశకర్తలలోని మూలపురుషులలో వీరు పండ్రెండవ తరములోనివారు. వీరిలో తొమ్మిదవ తరములోనివారగు "జాలిపూడి వెంకు" అనువారు, తమయిష్టదైవమగు శ్రీమదన గోపాలస్వామివారికి కృతియిచ్చి "అంబరీష చరిత్ర" మనునొక ప్రబంధమును రచించిరి. ఈతరములోని వారగు "లక్ష్మణదాసు" అనువారు మల్కాపురము (పాలగూడెము) లోని శ్రీసీతారామస్వామివారికి కృతియిచ్చి బృందావన విహారమనునొక శృంగార ప్రబంధమును రచించిరి. వీరిలో నాల్గవ తరమువారగు "విరూపాక్షుఁ" డనువారు పార్వతీ పరమేశ్వరులకుఁ గృతియిచ్చి బ్రహ్మకైవర్త పురాణమునందలి శ్రీశతానంద మహర్షిచరిత్రమను నొకమహా ప్రబంధమును, సావిత్రీ చరిత్రమను నొకమహాకావ్యమును రచించిరి. ఇక్కవి పితామహులలోని కొందఱు దేశపాండ్యాగిరి (ఇప్పటికలెక్టర్ల పనివంటి) హోదాను సంపాదించిరి. వీరి పెద్దలుపౌరాణికులు. వీరు సుందరీ విలాసమను నొకప్రబంధమును, బాణలింగేశ శతకమును రచించిరి. పద్ధతినియోగమును స్థాపించిన

శ్రీనందిరాజు లక్ష్మీనారాయణ దీక్షితులవారి శిష్యులును వేదవేదాంగాది షట్కర్మ నిరతులును, వీరి మేనమామలునునగు బ్రహ్మశ్రీ మట్టిపూడి భీమేశ్వర శాస్త్రిగారియొద్ద కొంతకాలము వీరు వైదికవిద్యను గూడ గ్రహించిరి. తరిగొండ వెంగమాంబచే రచింపఁబడిన "రాజయోగిసారం" బను వేదాంత గ్రంథమునకు శ్రుతిస్మృతి పురాణేతిహాసో దాహరణములుగ విపులముగఁ దెలుఁగున పదవిభాగ టీకాతాత్పర్యములు వ్రాసిరి.

ఉ॥ మానితమంగళప్రదు లుమారమణుల్ నిరతింబునాయువున్
ధీనిధిభాగ్యముల్వెలయఁ దేజములంబొనరించిమించుక
ల్యాణముఁగూర్చి దంపతు లహర్నిశసౌఖ్యములందునట్టుగా
బూనిధరించిసద్దయను బోషణసేతురు గాలిమేలుగన్. 1.

మ॥ ఇనుఁడుంజంద్రుఁడు తారలాశలును నాయింద్రుండుదిక్పాలురున్
మునులున్దివ్యులు భవ్యభూమిచయమున్ భోగుల్నరుల్ కిన్నరుల్
ఘనగంధర్వులు నెల్లకాలమును సౌఖ్యంబిచ్చియీసత్యమూ
ర్తిని శ్రీహైమనతిం గృపామతిని వృద్ధింజెందఁగాపాడుతన్. 2.

చ॥ సకలకళావిశాలు రయిసన్నుతిఁ గన్నమహాకవీంద్రులుం
బ్రకటశ్రుతిస్మృతుల్ దెలియుపండితవర్గముబంధులోక లౌ
కికశిశువృద్ధులు న్బహుళకీర్తిదమై వెలయంగఁజల్లునా
యకలుషమైనసేసలిదు నాయువునూన్ వధూవరద్వయిన్. 3.

## 52. వడ్డమాని సుబ్బావధానికవిగారు.

వీరి నివాసస్థలము మొదట విజయనగర సమీపమందున్న శ్రీరామపురాగ్రహారము. ప్రస్తుతము కాకినాడ. వాధూలగోత్రము, ఆపస్తంబసూత్రము. ద్రావిడవైదికులు. తండ్రి సుబ్బారాయఁడుగారు. తల్లి సూరాంబ. స్వభాను

సంవత్సర కార్తీకశుక్ల చతుర్థి జన్మదినము. సవ్యాకరణముగ సంస్కృతాంధ్ర భాషలనేర్చియుండిరి. ఈరెండుభాషలయందుఁ గవిత్వము చెప్పఁగలరు. ఆంధ్రభాషను శుభ్రతోదయంబను గ్రంథమొక దానిని రచించియుండిరి. అనేక స్థలములలో, అష్టావధాన నేత్రావధానములను జేసియుండిరి. ఈశాస్త్రాభ్యాసమునకు ముందుగా కృష్ణయజుర్వేదము ఘనాంత మభ్యసించి శ్రీఉర్లాముసంస్థానమందుఁ బరీక్షనిచ్చియుండిరి.

మ॥ దివిజాల్ చెంతను నిల్చికొల్వరజతాద్రిస్థాయిమందారపు
ష్పవనంబందు వసించు స్త్రీపురుషరూపంబాదటందుల్యరూ
పవయోవేషుల కీవధూవరులకున్ భద్రాళికిన్ మూలమా
నవినాభావము నిచ్చుచున్మతియు దీర్ఘాయుష్యమున్గూర్చుతన్.1.

చ॥ పసపును బూసియాపసపుపైరహిఁగస్తురి బొట్టునుంచఁగా
నసితమిళింద యుక్తమగు నంబురుహంబన నొప్పుచుంగృపా
రసభరితంబులై శుభవరంబుల భక్తులకిచ్చునట్టియ
ద్రిసుతవరాస్య మీవధువు దీర్ఘసుమంగలిఁజేసి కావుతన్. 2.

చ॥ అమృతము నభ్రకుంజరము నశ్వమునున్ భిషజున్ సుధాకరున్
గమలను గామధేనువును గల్పమహీజముఁగన్న పాలసం
ద్రమిచటఁబెండ్లియాడికొను దంపతుల న్వరపుత్రపౌత్రపా
త్రములుగఁజేసి ప్రోవుతనితాంతదయన్ భువిశాశ్వతంబుగన్. 3.

ఉ॥ ఏయెలనాగయబ్ధిజని యించెనొ యేయెలనాగకోరినా
రాయణుభర్తగాఁగొనెనొ యంబురుహచ్ఛదదీర్ఘనేత్రయా
నాయెలనాగలచ్చి శుభహైమవతీ యుతుఁడైన సత్యనా
రాయణుగేహసీమ నభిరామముగా ననయంబునిల్పుతన్. 4.

సీ॥ జనకుఁడొసంగిన సరిక్రొత్తచీరను
గన్నులకింపొప్పఁగాధరించి
జనని యొసంగిన చాయపసపుఁజీర
యంచునమూట బిగించికట్టి
తనతోడసాడు తలిరుబోండ్లొసఁగిన
తాంబూలములను జేతను ధరించి
యిరుగుపొరుగు వారలిచ్చిన కుంకుమ
సేకరించి మఱొక్క చేతఁబట్టి

గీ॥ యింపుగానత్త వారింటికేగునాటి
కన్నిభాగ్యమ్ములున్నదా హైమవతికి
ముద్దుమాటలఁబల్కు తమ్ముండొకండు
కూడనేతెంచు భాగ్యమ్ముగూడుఁగాత!

## 53. పెమ్మరాజు సత్యనారాయణమూర్తిగారు.

వీరు గోదావరిజిల్లాలోని పీఠికాపుర సమీప చెందుర్తిగ్రామవాసులు. ఆఱువేలనియోగులు. పేరరాజపౌత్రులు. రమణాంబికా వేంకటరాజామాత్య పుత్త్రులు. ఆపస్తంబసూత్రులు. భారద్వాజగోత్రులు. సంస్కృతాంధ్రాంగ్ల కవిమిత్రులు. వేదాంతాగమ పవిత్రులు. గానకళాస్తోత్ర పాత్రులు. భాగవత చారిత్రులు. చెందుర్తికరిణీక వ్యాపారము గలవారు. స్వతశ్శక్తిచే గ్రంథ రాజములంజదివి సంస్కృతాంధ్ర సాహిత్యములను సంపాదించుకొనినవారు. ఆశుధారను గవిత్వముఁజెప్ప నేర్పునుగలవారు. ఏతద్గ్రామ వాసులును, ప్రస్తుత మేలూరునందు నివసించియున్న బ్ర॥ క్రొత్తపల్లి సుందరరామయ్యగారును, వీరును దమయాశుకవిత్వసుధా ధారను లోకమునఁ బ్రవహింపఁ జేయుటకును, అవధానాదులొనర్పుటకును ప్రయత్నములో నున్నవారు. బ్ర॥ క్రొత్తపల్లి సుందరరామయ్యగారు వీరికి సహావధానులేగాక గురుప్రపత్తిలోని

వారు. వీరు సర్వప్రపంచమును యోగాభ్యాసముచేతను, కొందఱి మతమున మెస్మరీజముచేతను, సర్వరోగములను మంత్రోదకముచేఁ బాపుచున్న వారగుటచే క్షణకాలమైన నివాసస్థలమందుండుటకుఁగాని, గ్రంథముల రచించుటకుఁగాని వీలులేక పరోపకారముగ దేశపర్యటన మొనర్చుచు రాజాధిరాజులచే గౌరవింపఁ బడుచున్నవారు.

ఉ॥ శ్రీమదఖండమవ్యయ మచింత్యముసత్య మనంతముంబరం
ధామమమేయ మాదిమము తారకమక్షరము న్నమిద్ధతే
జోమహిమమ్ముపూర్ణము విశుద్ధము బ్రహ్మము మూర్తిమంతమై
యోముతమిన్వధూవరుల నుద్యదశేష శుభావహమ్ముగన్. 1.

క॥ శ్రీమన్మార్కండేయ
స్వామికృపానిరత హితభుజగరాట్కృతమీ
హైమవతీ నారాయణ
ప్రేమమహితాద్వైత సచ్చిదానందమగున్. 2.

సీ. హిమవంతుఁడయ్యె మాహేశ్వరిహైమవ
తినిజగల్లయపాతకునకొసంగ
జనకుఁడయ్యె నయోనిజన్వీతసర్వజ్ఞ
గర్మగుణప్రమథునకొసఁగ
బహ్మ్రయయ్యెమహాను భావయోగ్యవిజయ
మునధార్మికాను రాత్మునకునొసఁగ
రత్నాకరుండయ్యె రమణిమహాలక్ష్మి
ఘనపుణ్యజన వర్ధనునకొసంగ

గీ॥ విమతినని హైమవతి సీతవిజయలక్ష్మి
గౌరిశాంభవులకన్య వేంకటునిభామ

సత్యనారాయణుం గూర్చి చతురుడౌర!
సమ్యగధిగతార్థుఁడు మా భుజంగరావు. 3.

చ॥ అవిరళ బంధుమిత్ర సుహృదక్షి చకోర సుధాకరంబు నూ
త్న విభవదర్శనాగత జనప్రకటీకృత తారకంబు స
త్కవిబుధమానసాంబుజ వికస్వరభాస్వర భాస్కరంబునై
ప్రవిమలమిమ్మహోత్సవము భాసిలునా శశితారకాంతమై 4.

గీ॥ ఆయురారోగ్య పుత్త్రపౌత్త్రాభివృద్ధి
ధనకనకమణివస్తు వాహనసమృద్ధి
మానితేతోధిక శుభసామ్రాజ్యసిద్ధి
నరలుదురుగాత మీ వధూవరులు సతము. 5.

మ॥ మహదామ్నాయగ ధర్మసంపనన ధీమద్వేంకటతత్వముక్తవన్
మహనీయప్రతిపాదితార్థ భగవన్మాహాత్మ్య సత్యాపనో
న్మహిమంబూరుప శబ్దవాచ్యగరి మన్నారాయణుండీతఁడు
న్వహిఁగీర్తింగయికొమ్ము వేంకటసుపూర్వా సత్యనారాయణా. 6.

శా॥ నీమాంగళ్యయశో విలాసముమృడానిన్ భిల్లి! చాముండనా
నీమంజుప్రతిభాప్ర భావమజురాణిన్ వాణిమాటయ్యెనా
నీమర్యాదయు లక్ష్మినవ్వయుచు మన్నీతంగుజా! చాలునా
శ్రీమద్హైమవతీసతీ విజయలక్ష్మి ఖ్యాతిపాలింపుమా. 7.

శ్లో॥ ఇతో ప్యధిక మైశ్వర్య మితో ప్యధికమంగళం
ఇతో ప్యధికసౌఖ్యంచ భూయాద్వామనుకూలయోః. 8.

శ్లో॥ మార్కండేయమహేశ్వరః పశుపతిర్యేనార్చిత ప్రత్యహం
యేనానాగతపూజితా భగవతీదుర్గాఖ్యభట్టారికా

యేనుజ్ఞానయుతా బుధాశ్చకవయః తత్సంఘపోషోధునా
శ్రీమంత్రి పెగడాన్వయో విజయతాం రాజాభుజంగప్రభుః 9.

శ్లో॥ అనఘభుజంగ నృపాలో విశద మతిశ్శోధయత్వఖిలం
ఫణితింస్ఖలితా భిరమాంకృపయా మమబాలలీలస్య. 10.

## 54. సూరవరపు పురుషోత్తమావధానికవిగారు.

వీరి నివాసస్థానము కాకినాడతాలూకా సర్పవరము. యజుశ్శాఖ. ఆపస్తంబసూత్రము వాధూలసగోత్రము. తండ్రిసుబ్బరాయఁడుగారు తల్లి వీర భద్రమాంబ. స్వభానుసంవత్సర శ్రావణశుద్ధసప్తమి జననదినము. యజుర్వేద మందును, శిక్షలయందును, ఆంధ్రగీర్వాణ సాహిత్యమందును, షోడశకర్మల యందును, జ్యోతిశ్శాస్త్రమందును, నేత్రావధానాష్టావధానాద్యవధానముల యందును ప్రావీణ్యముకలవారు. శ్రీపీఠికాపుర సంస్థానమందు శ్రీరాజావారి సముఖమందు నేత్రావధానాష్టావధానాద్యవధానములనుజేసి ప్రత్యబ్దసన్మా నమును బొందుచున్నవారు. మ్యోడాసుగవర్నరుగారు మొదలైనవారి సమ్ము ఖమందు నేత్రావధానములను గావించి బహూకరింపఁబడి వారివలన సన్మానపత్రికలను బొందియున్నారు.

మ॥ స్థిరమైయొప్పు దయారసంబెసఁగ శ్రీసత్యనారాయణున్
దరునిన్ హైమవతిన్ వధూతిలకమున్ వాణీరమాపార్వతీ
వరులారోగ్యము నిత్యమైయొసఁగు సద్భాగ్యంబునన్యోన్యవి
స్ఫురితప్రేమము నిచ్చియెల్లపుడు సొంపుల్గుల్కఁగాఁజేయుతన్. 1.

మ॥ క్షణమైనంబ్రియుఁ బాయలేకనిజవక్షఃపీఠమందుంచిదో
ర్గుణజాలంబున లచ్చిగాఁగిలిమిషన్ గూఢంబుగాఁగట్టునా
ఫణిరాజన్యశయానుఁడీ వరుమవః పద్మంబునందిన్వధూ
మణినింబాయక యుండునట్లు జనియింపంజేయుతన్సన్మతిన్. 2.

ఉ॥ ఎవ్వతె బూసెఁ జందనము నెవ్వతె కన్నులఁ గాటుకుంచెనీ
కెవ్వతె కప్పురంపు విడె మిచ్చెనటంచు వచించు భామతో
నవ్వుచుఁ దప్పు సైఁపుమను నందకుమారుఁడు హెచ్చుప్రేమతో
నివ్వనితాశిరోమణిని నీవరరత్నము ప్రోచుతన్ భువిన్. 3.

మ॥ నగుచుం గేరుచుఁ గౌఁగిలించుకొనుచున్ సఖ్యంబు దెంపొందున
ట్లుగ భాషించుచు మోవితేనియరుమల్గ్రోలంచున్ స్మరక్రీడలన్
దగురీతిం జరియించు దంపతులు రాధామాధవుల్ సుస్థిరం
బుగ నీదంపతులన్ దమంతటిమహాభోగాఢ్యులం జేయుతన్. 4.

## 55. పోచిరాజు సీతారామయ్యగారు.

వీరి నివాసస్థలము గుంటూరు మండలమునఁ గల తెనాలి తాలూకా యందలి యీమని గ్రామము. ఆఱు వేలనియోగులు. ఆపస్తంబసూత్రులు. శాండిల్యగోత్రము. తండ్రి లక్ష్మీనారాయణగారు. తల్లి వెంకట సుబ్బమాంబ. పార్థివసంవత్సరాధిక జ్యేష్ఠసితపక్షద్వాదశి జన్మదినము. వీరు సంస్కృతాంధ్ర పాండిత్యము గలవారు. ఆంధ్రకవితా విశారదులు. చంపకోత్పలమాలికా రూపమగు శంకరశతకమును రచించిరి. వీరు నుమన్న వ నరసింహాముగారును గలిసి సత్యనిరూపణాది పద్యపూరితములగు వ్యాసములను పత్రికాముఖంబున ననేక పర్యాయములు ప్రకటించిరి.

శా॥ శ్రీమచ్చంద్రకళాపతింసుఁ డగజాచిత్తాబ్జమిత్రుండు వా
గ్భామాధీశ ముఖామరార్చితుఁడు భక్తత్రాణపారీణుఁడు
ద్దామప్రాభవశాలి సర్వజగదాధారుండు శర్వుండు తా
నోముంగావుత మీవధూవరుల నిత్యోల్లాససంధాతయై. 1.

మ॥ అలకైలాసనగమ్మునందు శశికాంతాశ్మచ్ఛటా నిర్మితో
జ్జ్వలసౌధమ్మున నాథుతో సరసవాచాలీలలం దేలు పై

దళితశంపాలలితాంగి శైలసుతనిత్యమ్ముం గృపావీక్షణాం
చలరైమాభుజగక్షితీంద్రతనయా జామాతలన్ బ్రోవుతన్. 2.

సీ॥ సనకాదిగీర్వాణమునిసార్వభౌమసం
పూజితుండు కృపావిరాజితుండు
కమనీయరత్నసంకలితకోటీరాది
భూషణుండు త్రిలోకపోషణుండు
తుంగతరంగానుషంగవారాశిని
కేతనుండు ఖగేంద్రకేతనుండు
కమలాలయాధరారమణీమణీమనో
నాయకుండు శుభప్రదాయకుండు

గీ॥ విమలతరనిగమాంత సంవేద్యమూర్తి
సాధువశవర్తి దేవతాచక్రవర్తి
ఘనయశోధనుఁడగు భుజంగక్షితీంద్రు
తనయనల్లునిఁ బ్రేమతో మనుచుఁగాత. ౩.

సీ॥ సరసీరుహమునఁగాపురమున్న మృదుగాత్రి
యలపాలవెల్లి నెయ్యంపుఁబుత్రి
జిలుగుపసిండి దువ్వలువదాలుపురాణి
శంబరారిని గన్నజలజపాణి
లేములనెడబాపురామాశిరోమణి
యద్రినందన కెనయైనతరుణి
అమరాంగనలయూడిగములుగైకొను కాంత
తొలిబల్కుగిల్కుటంచెలనెలంత

గీ॥ ధూతనిజభక్తకల్మషతూలజాత
ప్రాకటదయారసోపేత లోకమాత

అమలగుణుఁడగు మాభుజంగావనీంద్రు
కూఁతువకునల్లునకు సిరుల్ గూర్చుఁగాత. 4.

ఉ॥ ఎవ్వనిమోములందు జనియించెఁజతుశ్శ్రుతులద్భుతమ్ముగా
నెవ్వనిచేసృజింపఁబడె నీసచరాచరలోక సంచయం
బెవ్వఁడు తమ్మిగద్దియ నహీనగతిం గొలువుండు దక్షుఁడై
యవ్విధియీవధూవరుల కాయురపత్యసుఖమ్ము లిచ్చుతన్ 5.

చ॥ ఎలసినదుగ్ధనీరముల నేర్పరుపంగల వారువమ్మునిం
పలరఁగనెక్కియొల్లెడవిహారమొనర్చు వధూటి, మల్లికా
లలితశరీరపద్మజువెలంది, సరస్వతి, సత్కళాకృతిం
జెలఁగుచు నీవధూవరుల జిహ్వాలయందు నటించుఁగావుతన్. 6.

క॥ పరిణయమహోత్సవాగత
వరకవి చయరచిత పద్యవారము, గుణగా
సురులీవధూవరులకుం,
గరమభ్యుదయమ్మొనర్చుఁగాతనిరతమున్. 7.

మ॥ సతివైదర్భియు మాధవుండును, శచీచంద్రాస్యయున్ దేవతా
పతియున్ రోహిణియున్ విధుండు రతియుంబంచాస్త్రుఁడుంబోలెవా
యతసౌభాగ్యనిరూఢిమై వెలయుఁడీయశ్రాంతమున్నాత్మదం
పతులారా! ధరణీజనుల్ బళిరసేబాసంచుఁగీర్తింపఁగన్ 8.

సీ॥ ఇంద్రనందనవసంతేందుల నిరసించు
సుకుమారులైన పుత్త్రకులుగల్గి
తొలకరిమించు దీవలవంటి నెమ్మేని
చకచకల్ గల సుపుత్రికలుగల్గి

అత్యున్నతమ్ములై యాకాశమంటెడు
విమలసౌవర్ణ సౌధములుగల్గి
భూరినీరదసమాకారమ్ములై మీఱు
రమణీయదంతావళములుగల్గి

గీ॥ కవివరులయందు నిర్వ్యాజకరుణగల్గి
ఆర్తజనరక్షణముగల్గి కీర్తిగల్గి
యెల్లమంగళములు గల్గియుల్లసిలుఁడు
నవ్యదంపతులార! సంభావ్యులార! 9.

## 56. మున్నంగి లక్ష్మీనరసింహ శర్మగారు.

వీరి నివాసస్థలము ఏలూరు. జన్మస్థానము కర్నూలుజిల్లాలో వెలకుంట తాలూకా తిమ్మానాయని పేట. జననకాలము స్వభాను సంవత్సర పుష్యశుద్ధ అష్టమి. తండ్రి వేంకటకృష్ణ శర్మగారు. తల్లితిరుమలాంబ. నియోగివైష్ణవులు మున్నంగివంశము. సోదరులు, ఒకతమ్ముఁడు నొకచెల్లెలు. హరితసగోత్రము. హితకారిణీ వార్తాపత్త్రికాధిపతులు. రచించిన నాటకము "మాధవవర్మ."

సీ॥ శ్రీకరలాలనఁ బ్రియుని నెమ్మదికెక్కి
వెలయుతమీవధూతిలక మెపుడు
వాణీవిభవమునఁ బతికివాదోడుగ
మెలఁగుత మీవధూతిలక మెపుడు
ఈశ్వరి సేవనిజేశు సామేనవ
ర్తిలుఁగాత మీవధూతిలక మెపుడు
ఆయరుంధతిదర్శనాప్తి సత్ప్రథవృత్తిఁ
జెలఁగుత మీవధూతిలక మెపుడు

గీ॥ అనుచు సత్కృవు లొసఁగుదీవనలమహిమ
నవనినాచంద్రతారార్కమగు యశంబు
వెలయఁగా దంపతులనంత విభవములను
నందురుగాత సచ్చిదానందునికృప. 1.

## 57. వాడపల్లి పట్టాభిరామశర్మగారు.

వీరి నివాసస్థలము కృష్ణాజిల్లా విజయవాడ. (బెజవాడ) ఆఱువేల అద్వైతనియోగులు, ఆపస్తంబసూత్రులు. కౌండిన్యసగోత్రులు. తండ్రి వేంకట రామశర్మగారు. (పూర్వాశ్రమనామము) స్వయంప్రకాశ బ్రహ్మానందాశ్రమ పరమహంసస్వామివారు. తల్లి అన్నపూర్ణమ్మ. నలసంవత్సరజ్యేష్ఠశుద్ధత్రయోదశి జననము. ఆంధ్రగీర్వాణ, ఆంగ్లేయ హిందీభాషలయందును వ్యాకరణ విశిష్టంబులగు సాహిత్యములయందును, కవిత్వముల యందును. ప్రవీణులు. వీరు పెక్కుండ్రను అద్వైతసుధానిధులనుగాఁ జేసినవిద్యాగురువులు. వీరును వీరి తండ్రిగారును, ఆంగ్లేయ ప్రభుత్వములోఁ దహాసీలుదారు పనివఱకుఁ జేసి పెన్‌షన్ వేతనమును పొందియున్నారు. ప్రస్తుతము కృష్ణాజిల్లా బెజవాడ సబ్‌డివిజన్ స్పెషల్‌ఫస్టుక్లాసు మేజస్ట్రీటుగానున్నారు. వీరు రచించిన గ్రంథములు:—సంస్కృతము:—సోపాధిక బ్రహ్మవిద్యాదర్పణ పూర్వభాగము, ఉత్తరభాగోపన్యాసములు. పరమహంస పరివ్రాజకాచార్యులగు స్వయంప్రకాశ బ్రహ్మానందస్వామి విరచితములు. 2. ఆంధ్రీకృత వృత్తిప్రభాకరనామక ఉత్తరహిందూస్థాన యోగినిశ్చలదాస కృతహిందీ వేదాంత ప్రకరణము. 3. సంస్కృతము, బ్రహ్మానంద ద్వాదశమంజరి. 4. శ్రీకృష్ణ స్తవ పంచకములు మూఁడు. 5. మఱియుఁగొన్ని చిల్లరవి.

శ్లో॥ బ్రహ్మవిష్ణుశివాహ్యత్ర జాయాభిస్సహసంగతాః
వధూవరౌసముద్దిశ్య కుర్వంత్వాశీఃపరంపరాః. 1.

శ్లో॥ సభాస్థలసమాసీనా విద్వాంసోయేమహాశయాః
వధూవరావనుగ్రాహ్య కుర్వంత్వాశీఃపరంపరాః. 2.

శ్లో॥ రత్నద్వయమిదంప్రాప్య ఆచంద్రార్కశుభావహం
చరంతుదంపతీహ్యత్ర లోకాలోకముదేసదా. 3.

నిసర్గతఏవప్రాణిమాత్రమిష్టమభిలాషుకమ్చా౽నిష్టంవ్యుదసిషు చథప తీతీష్టా౽నిష్టప్రాప్తి పరిహారోపాయ ప్రకాశనైదమ్పర్యేణ భగవానామ్నాయ శ్చాతుర్వర్ణ్య చాతురాశ్రమ్య ప్రభృతివిభాగ ప్రవిభాగభక్తాన్య భ్యుదయ సాధనాని సమష్టివ్యష్టి ఫలాని నానావిధాని విదధదభిదధే. నిశ్శ్రేయస సాధనమప. పునర్యాథం ప్రత్యగాత్మ పరమాత్మయ థాత్మ్యావబోధం ప్రవి రళే భ్యోపిధీరంధారేయేభ్యః “క్రియాహినామ వికల్పనాస్పదం భవతినతు వస్త్వైకరూపమయ్యా౽త్మయాథాత్మ్యమతి లౌకికతయాచ. పరమతమ గహనమూర్తితయాచ, పురుషబుద్ధివైవిధ్యాచ్చ భగవల్లీల వైభవమితీయత్త యాచే దృక్తయాచ దుష్పరిచ్ఛేదమాపేదేపరః శతరూపతాం. తథాహి. ఆత్మనః కర్తృత్వభోక్తృత్వాదికమాతిష్ఠన్తే తార్కికాః; భోక్తృత్వమేవ తస్య, నపరంకర్తృత్వ మపీతిసంగిరన్తే కపిలకమలాస నాద్యనుగామినః. ఆసతాంవాతా ఇత్ప్రరేషాంకథాః; ఔపనిషదాఏవ పరస్పర విలక్షణ నానా విధసిద్ధాంతేషు సమర్పిత సమాదరాః. నచైతే౽ర్వాఞ్చఏవ రాద్ధాన్తాధ్వభేదాః; మహర్షీణామేవ తేషుతేషు విశేషేతు వైశేష్యాత్.

తదేవమతిత రామగాధం విశ్వపారదృశ్వా నామపిమతివికల్ప కల్పనక్షమ మౌపనిషదమర్థం మీమాంసామాస. నిబబన్ధచ బ్రహ్మమీమాంసా సమాఖ్యయా “అథాతోబ్రహ్మజిజ్ఞాసే” త్యాది చతుర్లక్షణ్యా భగవతో వాసుదేవస్య జ్ఞానావతారః. భగవాన్బాదరాయణ ద్వైపాయనాపర పర్యాయః కృష్ణః పాణశర్యః.

శ్రీమన్తళ్ళంకరాచార్యా యుక్తివాచోయుక్తి ప్రథస్యాసు దీర్ఘపాన్థాళ్ళ రమతాత్పర్య మభివిత్స్త కథాయాన్నిర్విశేషవస్తు పరతయైవాఽఽవితపన్ అథాప్యపాశ్యా ద్వైతవాదపాస్య యుక్తిప్రాయగ్రహ గృహీత విగ్రహతయాశ్రీ శాంకర భాష్యాదేశ్చ శ్రుతిస్మృతి సూత్రాద్యనుసారితయై వావశ్యముప నిబద్ధనప్యాఽఽపతి తత్వాచ్ఛనైతారతాఽప్యతీవతరామ రాజితాఽద్వైతవాదః.

## 58. మంగిపూడి వేంకటశర్మగారు.

క|| కల్యాణగుణాఢ్యుఁడు శ్రీ
కల్యాణీహృదయకమలకమలాప్తుండీ
కల్యాణదంపతులకుఁ
గల్యాణము లిచ్చుఁగాతకలకాలంబున్. 1.

చ|| ఉరుతరవిద్యలందొకరికొక్కరు తక్కువకాకసద్గుణో
త్కరమునఁదీసి పోకకుతుకంబు బలరారఁగజీవయాత్రనొం
డొరులకుఁదోడుచూపుమను నొద్దిక నెల్లరు మెచ్చఁగాఁబర
స్పరపరమాను రాగమున వర్ధిలుచుందురుగాత దంపతుల్. 2.

గీ|| ఆదిదేవుండు సజ్జనాహ్లాదపరుఁడు
సత్కృపాకరుఁడీ నూత్నదంపతులకుఁ
బ్రాభవసమృద్ధి పుత్రపౌత్రాభివృద్ధి
ఆయురారోగ్య సంసిద్ధిఁజేయుఁగాత 3.

## 59. మిన్నకంటి గురునాథకవిగారు.

వీరి నివాసస్థలము నర్సారావుపేట తాలూకా ఏరుమూరు. ఆఱువేల నియోగి బ్రాహ్మణులు. ఆపస్తంబసూత్రులు. శ్రీవత్సగోత్రులు. తండ్రి వేంకటలక్ష్మయ్యగారు. తల్లి సుబ్బమాంబగారు. జన్మదినము హేమలంబినామసంవత్సర

చైత్రశుద్ధనవమి. వీరు శ్రీపోతరాజు విశ్వసాధకవిగారితోఁ గలిసి జంటకవులై "గురువిశ్వసాధకవులు" అనునామమున విద్యావిషయిక విమర్శనలు వ్రాయుచుందురు. వీరు రచించిన గ్రంథములు:—1. అంబరీషోపాఖ్యానము, 2. దశరథరామశతకము, 3. ప్రహ్లాదచరిత్రము, 4. చాటుపద్యములు.

సీ॥ సర్వంసహాభారదూర్వహాచణుఁడైన
    శేషాహిరాజెవ్వాని సెజ్జయయ్యె
రేఁబవల్ నిజదీప్తిచేఁ బ్రజ్వరిలసేయు
    శశిసూర్యులెవని వీక్షణయుగంబు
అఖిలపాపక్షయంబై సురస్తుత్యయౌ
    స్వర్ణదిగనె నెవని చరణయుగము
ఘోరసంతాపనిర్మాత యాధాతను
    బుట్టించె నెవ్వాని బొడ్డుఁదమ్మి

గీ॥ అట్టిలక్ష్మీసమేతుఁ దయాలవాలు
భక్తజనకల్పభూరుహుఁ బద్మనాభుఁ
బ్రస్తుతినొనర్తు నీవధూవరులధాత్రి
మించియభివృద్ధిఁగాంచి రక్షింపుమనుచు. 1.

సీ॥ ఏదంపతులు జగదీశ్వరత్వంబుచే
    జననీజనకులై ప్రశస్తిఁగనిరి
ఏజంటకల్యాణమెల్లవారికి మార్గ
    దర్శినియై ప్రమోదంబొసంగు
నేవధూయుగ్మమభీష్టములఁ గూర్చి
    లెంకలనెందుఁ బాలించుచుండు
నాదంపతులు యశోభ్రాజిష్ణులైయాది
    దంపతులను పేరఁదనరుచుండు

గీ॥ రత్నత్రిశూలాంకరీ శంకరాభిధాన
మూర్తులు సుఖంబు సద్దయానూన్యార్తిఁజూపి
హైమవతి సత్యనారాయణాఖ్యవంప
తులనురక్షింత్రుగాత మేల్వేలయఁజేసి. 2.

ఉ॥ పదుగురి నోళ్లలోఁబడుట పాడియెసర్వము సృష్టిఁజేయునా
కుఁదరుణివైయనంగఁ దనకుందను సృష్టికి ముఖ్యమాటనా
కదివిహితంబు నాముఖము నాకృతి దెల్పద చిత్తశుద్ధియుం
చుదృహింపఁదేర్చువాణిదయఁజూచుతధూవరులన్ని తాంతమున్ 3.

మ॥ పవరాశిన్ జననంబునందినపుడే వైకుంఠుఁడాదేవతా
జనమధ్యంబుననుండి తన్గనఁగఁదా స్వాంతమ్మునన్వాని రూ
పున కబ్బమ్మనుజెంది లజ్జమెయి పొమున్వంది చెరోరకం
టనిచేచ్చున్ హరిమెచ్చఁదెల్పసిరివేడ్కన్ గూర్చుతన్ సంపదల్ 4.

## 60. పోతరాజు విశ్వనాథకవిగారు.

సీ॥ ఎవనికీర్తికినోడి హిమపక్షధూధరం
బనయమ్ముఁగరఁగినీరౌచునుండు
నెవనిదాతృతకోడినపవారి ధరములు
పర్షించి వెల్వెలబాఱుచుండు
నెవనిరూపున కోడిచివురుఁటైదుపుజోదు
బ్రతుకెల్లనీరుగానతనుఁడయ్యె
నెవనికాంతికి నోడిహిమభానుఁ డెదగుంది
బహుళపక్షక్షీణభానుఁడయ్యె
॥ నట్టిశ్రీమద్భుజంగ భూపాగ్రయాయి
కూఁతునర్పించె నీవాఁడుకూకుదుఁడను

యశముఁ గాంచఁగ సత్యనారాయణాఖ్య
బాలుఁ బ్రేమిఁచి సౌఖ్యంబుఁ బడయుమయ్య. 1.

## 61. మన్నవ నరసింహము గారు.

వీరి నివాసస్థలము గుంటూరు మండలములోని మన్నవ. ఆఱువేలని యోగి బ్రాహ్మణులు. ఆపస్తంబసూత్రులు. గౌతమ గోత్రులు. తండ్రి బుచ్చిరాజుగారు. తల్లి పున్నమాంబ. యువసంవత్సర మాఘబహుళసప్తమి జన్మదినము. ఆంధ్రభాషయందుఁ గవిత్వము నల్లు నేర్పుగలదు. మన్నవ గ్రామమణియగారు. వీరు రచించిన గ్రంథములు:—దేవస్థానముల దురవస్థను దెల్పు గద్యరూపకమయిన 1. పతనీయము. అను పేరుగల గ్రంథము. పోచిరాజు సీతారామ కవిగారితో కలిసి రచించిన, 2. సత్యనిరూపణము, చాల భాగము ముగింపునకు వచ్చిన 3. కవిజనోల్లాసము, అను ప్రబంధము. కొన్ని చిల్లరలు.

ఉ|| శ్రీనగజాధినాథుఁడు విశేషకృపాకర మూర్తి మానిస
న్మానసవీధులన్మెలఁగు మాన్యచరిత్రుఁడు చంద్రమౌళిపం
చాననయోగి భక్తజన తామరభూజము మాభుజంగభూ
జానికభీష్ట సంపదలొసంగియు ధీగుణశీలఁ బ్రోవుతన్. 1.

ఉ|| ఏలుటయందు రాకొమరకీయ్యెడఁ బెండిలిసేతురన్నఁ గా
వేలకొమాపుమించు వచియించుచు మత్కవితాకుమారిక
గ్గోలొనరించుమండ నిటకుం గొనివచ్చితినో భుజంగభూ
పాలక! దీనిపల్కు చెలువమ్ము కయించుక యాలకింపుమా. 2.

మ|| పలుకుల్ ముద్దయమీటు వీణపలుకుల్ పాటింపకేనాల్గుమో
ములవేదమ్ముల నొక్కతూరి ఋతవమ్ము న్సల్పనవ్వీణపా

టలకన్నన్ నిగమధ్వనుల్ చెలఁగియుండన్ నవ్యనవ్యాణియై
జలజాతాసనుఁడీ వధూవరుల నిచ్చల్ మెచ్చి రక్షించుతన్. 3.

సీ॥ కవితా విధూటిని భవనమందునఁ గ్రీడఁ
గావించెననఁ గవుల్ గడలుకొనఁగఁ
గలిమియిల్లా లిటఁ గడలక నిల్చెనో,
యన, ధనికవ్రజంబధిగమింప
భూపాలతాంగిని బ్రాపుఁగోరినయట్టి
విద్వజ్జనశ్రేణి విందులంది
వేదముల్ మూర్తీభవించి సేయిలుజేర
ననభూసురావళి యనవరమందఁ

గీ॥ బరిణయమ్మందు నీవధూవరులనిరులఁ
దేల్చి దీర్ఘాయువొసఁగి మూర్తిత్రయమ్ము
రక్షణమొనర్చుఁగాతనిరంతరమ్ము
నగభవదివ్యరూప! భుజంగభూప! 4.

సీ॥ కోలనిలోపలఁ బగులొక్క నిగ్గుకుక్కరాయుంచ,
మానసమును జేరమనినయట్లు
తుమ్మకొమ్మలఁ జిక్కి దుఃఖించుతుమ్మెద
పునుకుమ్మాన్ కడఁజేర పాఁడలినట్లు
లల్లుచేకూరకయగ డొందులతకూన
పున్నాగమును జుట్టికొన్నయట్లు
చిప్పిచేఁగుందుచాతక విహంగమ్ముతో
లకరిచినుక్కలలో మెలంగినట్లు

గీ॥ తగినపోషణలేక దుర్దశవహించి
యణగఁదుఁజెందిన కవితనీయాదరమునఁ
గృష్ణరాయలనాఁటి కీర్తినివహించె
నంగభవదివ్యరూప! భుజంగభూప! 5.

## 63. ద్రోణమరాజు సీతారామారావుగారు.

క॥ శ్రీరమణీ నారాయణ
గౌరీపరమేశవాణి కమలాసనవి
స్ఫారకృపాపాంగంబుల
ధారుణి వెలయుదురుగాక దంపతులెపుడున్. 1.

సీ॥ సర్వలోకానందసంపాదక శ్రియ
తావిలోఁ గుసుమంబుదనరినట్లు
నరనాథ చంద్రుసమ్మాన్యమై శోభయు
మానికంబును నేకమైనకరణి
శ్రుతికనుకూలపద్ధతి గల్గివాగర్థ
ములుపరస్పరమునుగలియురీతి
జగదననోత్సాహ సమృద్ధసంపద
శ్రీసతియుఁ బతియుఁజెలఁగువరుస

గీ॥ వరలుదురుగాక సతతంబు భవ్యభోగ
భాగ్యసంతాన కీర్తిప్రవర్తితోడ
ధరణియందున నాచంద్రతారకముగ
హైమవతియును సత్యనారాయణుండు. 2.

సీ॥ జనకుఁడైనట్టి భుజంగనృపాలుకీ
ర్తమకువన్నెను దెచ్చుఁగాక

పతితోద్ధరణమటంచు మదిలోన భావించి
స్థిరకీర్తినందుచుఁ జెలఁగుఁగాక
ఘనపాతివ్రత్యయై యొప్పు కాంతామణులకెల్లఁ
పలుకట్టుగా నిను ననరుఁగాక
నిగమంబు గానంబు నెలకొల్పు మఠమున
వర్థులఁ బాలించి యలరుఁగాక

గీ|| సత్యమెప్పుడుఁ జెప్పక జరుపుఁగాక
పెద్దలందున భక్తితో మెలఁగుఁగాక
ధర్మమే భూషణమటంచుఁ దలఁచుఁగాక
వనవిరిద్ధి సుమంగళియగునుగాక. 3.

సీ|| హిమనగేంద్రుని పెంపు గూర్చెడిపుత్త్రి
విఘ్ననాయకుఁ గన్నబిసరుహాక్షి
కత్యాయనునికిఁ గాఁక బెంచినతల్లి
కైలాసమునఁ జెందు కాంతమిన్న
హారమైన పంపాలు వరలుమండెడివారి
చల్లచూపులఁ గాచు సద్గుణాఢ్య
భక్తులపాలింటి మందారభూజంబు
సౌభాగ్యములకెల్ల జన్మభూమి

గీ|| యఖిలభువనైక సన్నుతయమలతేజ
యైనహైమవతీ దేవి హైమవతిని
మరుతరస్త్రీలనే ప్రొద్దువగలఁజేవి
మనుపఁ గావుత దీర్ఘ సుమంగళిగను. 4.

మ|| జనముల్ మెచ్చఁగ సర్వవిద్య లెలమిన్ సమ్మోదమేపారఁగా
ఘనరీతిన్ గడు నభ్యసించి విపులఖ్యాతిం దగంబూనున

స్థానగాధీశ్వర పుత్రికారమణుఁడాలోకించెదుంగాక, మిం
చిన కారుణ్యరసంబు వెల్లివిరియన్ శ్రీసత్యనారాయణున్. 5.

మ॥ పతిభక్తిన్ సుజనానురక్తిహితవాక్పాండిత్యశక్తిన్ రమా
సతికిన్ దోడనఁజాలి సాధుసుమనస్సంస్తూయమానంబనా
రతివర్ధిష్ణువునౌచు దానమహిమన్ రంజిల్లి వర్ధిల్లెడున్
క్షితిమా హైమవతీసతీతిలక లక్ష్మింబోలె బ్రాణేశుతోన్. 6.

## 64. నందివాడ జగన్నాధకవిగారు.

వీరి నివాసస్థలము చెన్నపురి రాజధానింగల కృష్ణామండలమందలి యేలూరు తాలూకాలోఁజేరిన పానిగూడెమను నామాంతరముగలదగు స్వామిపురము. ఆర్వేల వెలనాటి నియోగిబ్రాహ్మణులు. ఆపస్తంబసూత్రులు. భారద్వాజగోత్రులు. తండ్రి సుబ్బారాయఁడుగారు. తల్లి యచ్చమాంబ. బహుధాన్య సంవత్సర శ్రావణ బహుళ సప్తమి జన్మదినము. ఏలూరు తాలూకాలో నినాగులదేవునిపాడు గ్రామమునకుఁగరణము. మిశ్రశాఖలో నితండు రచించిన ప్రబంధములు. 1. హైమవతీపరిణయము. 2. ప్రద్యుమ్నవిలాసము. హరికథారూపంబుగా యక్షగానంబులు. 1. శ్రీమద్రామాయణముషట్కాండములు, రాగాంకితములుగా. 2. శ్రీకృష్ణునిరాయబారము. 3. శ్రీసీతాకల్యాణము. 4. హైమవతీ పరిణయము. గయోపాఖ్యానము. 5. హరిశ్చంద్రోపాఖ్యానము. 6. వామనచరిత్రము. 7. కాళియమర్దనము. 8. చిత్రకేతూపాఖ్యానము. 9 ఇలోపాఖ్యానము. 10. చంద్రహాసచరిత్రము. 11. సానందోపాఖ్యానము. 12. సత్యవతీ చరిత్రము. మఱియుంగొన్ని కీర్తనలును జాటుపద్యములును. వేంకటపతిక్షితిపతీయము అనుచాటుపద్యావళి. శతకములు. 1. నందినందన శతకము. 2. కపోతలింగశతకము.

శా॥ శ్రీగంధామృతవజ్రసింధుర సుధాసింధ్వందువాక్సుందరీ
భోగీంద్రామలదంత వ్రజముల సంపూర్ణాను కంపామతి

స్వర్గంబ్రానసుఁడీపభూవరుల విఘ్నుత్మ్తధరశ్రేణుల
స్వర్గంబుంచి శుభంబులెల్లనిడుచున్నిత్యంబు రక్షించుతన్ 1.

## మౌక్తికమాలావృత్తము.

శక్తికుమారుం గొల్చుఁగుమధర్మా
సక్తియుమేల్పంతు సతతసంప
ద్వ్యక్తియునిదంపతులకుఁజంచ
న్మౌక్తికమాలా సమసుయశంబున్. 2.

## సరసిజవృత్తము.

చాతుర్వేదార్ధజ్ఞతయున్శాస్త్రములను దెలియఁగ సకలజనులకుం
జేతోమోదంబుల్లులుగన్భాసిలఁగను బలుకఁగ జిలిబిలిపలుకుం
జాతుర్యంబుం గాంచఁగనుండుంజదువులమదపతిసతతముఁగదుసం
జాతంబౌకారుణ్యములోనీ సతికిఁబతికిముఖసరసిజములపై 3.

## కందగీత గర్భచంపకమాల.

సరశర ధీట్సుతా! వికచవారిరుహాగ్రనివేశ! లక్ష్మి! శ్రీ
హరితరుణీ మణీ! నతజనావని! పావని! నాగవేణి! బం
ధురకరుణాబ్ధి! యీనవవధూవరగేహమున న్వసించు భా
సురచరితాన్వితా! కరముస్త్రీ మెనర్పఁగన్దతిక్షణా! 4.

## గర్భకందము.

శరధీట్సుతా! వికచవా
రిరుహాగ్రనివేశ! లక్ష్మి! శ్రీహరితరుణీ!
కరుణాబ్ధి! యీనవవధూ
వరగేహమునవ్వసించు భాసురచరితా! 5

## గర్భగీతము.

వికచ వారిరుహాగ్రనివేశ ! లక్ష్మి !
నతజనావని ! పావని ! నాగవేణి !
నవవధూవరగేహమునన్వసించు
కరముస్తోత్రమొనర్చెదఁగన్నతల్లి ! 6.

శా॥ మాయాభిల్లపవామ పార్శ్వగతను సత్పృష్ఠాయిభక్తావళీ
శ్రేయోదాయిన్పృపాకశాయి విలసచ్ఛ్రీధర్మనిర్మాయికా
త్యాయన్యాతి శయామ కంపభువియుండత్యంతమైనిత్యమా
జాయాభర్తలకత్రుమేంఘములకున్ శార్దూలపక్రాంగావుతన్ 7.

మ॥ చలదుత్తుంగతరంగ సంగజలధీట్సంతాని కాంచద్విభూ
తలతాంగీ హృదయాబ్జభృంగ విలసత్పుత్రుండు తార్క్ష్యుండు ని
చ్చలుఁగల్పించుత నీవధూవరులకున్ సాకల్యకల్యాణని
ర్మలధర్మప్రభునదర్మఁడైన సురరాణ్మత్తేభసత్వంబిలన్ 8.

క॥ ప్రకటముగనం ||జ|| కవిఁబ్రో
చుకేశవుని కరుణ యీకుసుమగంధీనా
యకులహృదిచ్ఛాసస్యము
లకువార్షికకందమై యెలర్పంగాతన్. 9.

## షోడశదళ పద్మబంధసీసము.

శ్రీమాన్కరిస్ధ్యుక్తిని జూచిచిటిపాటి
పండ్లనిశావిన సౌభాగ్యశాలి
మలెలచెన్న హైమగిరి విన్నాణంబుఁ
గనుమయిందను శోభీఁగాచుమేటి

సనమూలపై వెంబడిని బ్రతీతిన్నిల్పి
మకరాంకుఁగన్న సీమాటి తోఁడు
టక్కుమానివెతార మెక్కుడు సయిరింమ
నావిభు నేలు సత్యయజయుండ

గీ॥ జయ్యబలభునాయాష్యము ల్జయమునుశుభము
రాయఁడులు నిలస్తోత్రంబు సేయనిడియ
సూత్క్మమగు కరుణను బొల్పినుమతు లెనసి
ప్రతిదినంబును బ్రోతురీ ప్రభునిసతిని. 10.

1. ఈపద్యమందు చివరదళముల చుట్టును, శ్రీ, చి, సా. హైమ
వతీ సీతా విజయలక్ష్మమను, అనియు,

2. లోపలి పదునాలుగుదళములలో నొక ప్రాకారమున, నడ్డమన్నాటి
వెంకట సత్యనారాయణ ప్రభు, అనియు చేర్పఁబడి యుండెను.

ఆ॥ ప్రమదమెసఁగనంది వాడబగిన్నాఘ
కవిరచించినట్టి వివిధపద్య
వకమిూకుకృపను నవరత్నహారపై
తేజమొసఁగు నీసతీపతులకు. 11.

## 65. శ్రీమత్కిడాంబి వెంకటశేషాచార్యులుగారు.

వీరు కాంచీపుర సమీపంబునందలి "అరకాణపాలయ" మనుగ్రా
మంబునుండి వీరి పెద్దలీదేశంబునకు వచ్చిరి. విశ్వగుణాదర్శన లక్ష్మీసహస్రా
దిగ్రంథకర్తలగు వేంకటాధ్వరిగారి వంశస్థులు. ప్రస్తుతనివాసము బెజవాడ.
శ్రీవైష్ణవులు. ఆత్రేయగోత్రులు. ఆపస్తంబసూత్రులు. తండ్రివరదాచార్యుల
వారు. తల్లిరాఘువాంబ. ప్రభవసంవత్సర చైత్రమాసమునజననము. ఆంధ్రగీర్వా
ణహూణ యవన ద్రావిడ భాషాజ్ఞానవంతులు. మొదటిమూఁడు భాషలఁగవి

త్వముఁ జెప్పఁగలరు. ప్రస్తుతము బెజవాడ మిషన్ హైస్కూలునం దుపాధ్యాయులు. సర్వకళాశాలా ప్రవేశపరీక్ష, భాషాంతరీకరణపరీక్ష, ఉపాధ్యాయయోగ్యతాది పరీక్షలందేరిరి. ఉత్తరాంధ్రమహాభారతము, మతత్రయాచార్యదీపిక, కొండపల్లెచరిత్రము, సత్యాద్రౌపదీ సంవాదము మున్నగునవివిరచించిరి. ఆంధ్రగీర్వాణ కవిత్వములును, ఇంగ్లీషు కవిత్వమును, మిక్కిలి రసవంతములుగా నుండును.

శ్లో॥ శుభం హైమవతీ సీతాజయలక్ష్మ్యముపేయుషః
భూయాద్వేంకట సత్యశ్రీ నారాయణవిభోస్సదా. 1.

సీ॥ బహురత్నశోభిత బ్రహ్మాండభాండమా
యతదివ్యనవ్య సింహాసనముగ
స్ఫురదష్టదిగ్వ్యాప్త భూరినభోభాగ
మద్భుతాంచద్వితానాంశుకముగ
నిబిడచ్ఛటాసమన్విత భానుహిమభాను
లతులితజ్యోతిర్ద్వయంబుగాఁగ
నమితతేజోల్లసదద్భుతతారాళి
బలుముత్తెముల తలఁబ్రాలుగాఁగ
గీ॥ సకలదేవాళి సత్సభాసదులుగాఁగ
నాగమంబులె యాశీరవాళిగాఁగ
సిరులచెలిఁ బెండ్లియైన లక్ష్మీవిభుండు
ఎలమినీదంపతులఁ బ్రోచు నెల్లప్రొద్దు 2.

శా॥ శ్రీనారాయణశంకరైక్యతయు లక్ష్మీగార్యభేదంబులన్
దానే దెల్పఁగలక్ష్మి హైమవతియై తా సీతయై వేర్పనన్.
భూనాథుండు భుజంగరాయ జనకాంభోరాశికిన్ బట్టియై
మానాస్త్రప్రతిమానుగూడె నరవేషున్ సత్యనారాయణున్ 3.

శా॥ శ్రీరామున్ మహిజాత, పార్వతిహరున్ శ్రీలక్ష్మివిష్ణున్వలెన్
తా, రాజాసుతియైన హైమవతి సీతాలక్ష్మినారాయణున్
గోరన్ మాసమయంబు, సీత, యుమ, లక్ష్ముల్ నైజసత్ప్రేమది
ప్రారాయుస్సుఖముల్ ఘటించెదరు సద్దాంపత్యమున్ వీరికిన్ 1.

చ॥ హరునకు భూషణంబు హరి కించితిశయ్య యజాండధారిభూ
వరుఁడు భుజంగరాయఁడని వారలు వారని ప్రేమనిచ్చ భూ
వరులకు నాయురర్థ విభవంబులనంచిరి పుత్రపౌత్రసు
స్థిరసుఖముల్ ఘటించెదరు స్వీయజనావన వృత్తిలోఁ దుకిన్ 2.

## 66. గొల్లపూడి లక్ష్మణశాస్త్రిగారు.

వీరి నివాసస్థానము వంగవోలుతాలూకా బ్రాహ్మణనిడమానూరు. వెలనాటి వైదికులు. ఆపస్తంబ సూత్రము. కౌండిన్యస గోత్రము. తండ్రి రంగాపురము ఎస్టేటు జమీందారుగారగు మాడపాటి వెంకటేశ్వరరావు పంతులుగారి యాస్థాన వేదవిద్వాంసులగు వేంకట్రామావధానులుగారు. తల్లి శేషమాంబ. జననము ప్రమాదినామ సంవత్సర ఆశ్వయుజ బహుళ దశమీ భానువాసరము. ఆంధ్రగీర్వాణ సాహిత్యవ్యాకరణ వేదవేదాంత సంగీతములయందుఁ బరిశ్రమముకలవారు. బెజవాడ యండలి, సి. యం. యస్. హైస్కూలులోఁ బ్రధానాంధ్రోపాధ్యాయులు. వీ రుభయ భాషలలోఁ గవిత్వము సమయోచితముగఁ జెప్పుటకలదు. కాని గ్రంథస్థముగఁ జేసి యుండలేదు. మఱియు సంస్కృతాంధ్ర భాషాప్రచారకార్థమీ విజయవాటిక యందే, "శంకరప్రసాద్ అండ్ కంపెని" యను పుస్తక క్రయశాలను బెట్టించి మంచిపుస్తకముల లభింపఁ జేయుచుఁ బద్యాజమాన్యమును గలిగియున్నారు.

శ్లో॥ శ్రీమత్పండిత భూయిష్ఠసభాసే శంకరాయచ
శాస్త్రిణే బ్రహ్మరూపాయ నమస్సజ్జ్ఞానదాయినే. 1.

శ్లో॥ శ్రీమద్భుజంగరాజాజ్ఞాకల్పకతల్పేయ యౌవ్వరాజేతే
తాళివహారీభవేతాం భూహైత్యైతస్యైవ దుహితృజామాత్రోః 2.

శ్లో॥ శ్రీహైమవతీ సీతాజయలక్ష్మ్యౌ ప్రాణవల్లభస్యాస్య
దీర్ఘాయుష్యం భూయాదైశ్వర్యం పుత్త్రపౌత్రవృద్ధిశ్చ 3.

సీ॥ సంస్కృతాంధ్రముల వైశద్యంబునకుమంత్రి
ప్రగడవంశాఖ్య యేర్పడు సాక్షి
వసుమతీభార నిర్వహణంబునకునీదు
భుజగరాయాఖ్య యేముఖ్యసాక్షి
పండితకవిలోక భవ్యసంఘటనకు
రాజెల్లులక్క వరంబెసాక్షి
పుణ్యాత్ముఁడనుటకుఁ బుత్త్రియల్లుఁడుజయ
లక్ష్మీనారాయణుల్ సాక్షులౌర.

గీ॥ వాక్పమత్కృతికగు మంజువాణిసాక్షి
కయితకునుసాక్షి సద్గ్రంథకలనభుజగ
రాయ !యిన్నింట నీకీర్తిరమ్యమయ్యె
నహాహా ! నీభాగ్యగరిమ మేనఁగనచ్చు. 4.

సీ॥ శ్రీమంతులోకవంకఁ జేరికానుకలుదల్ప
మతిమంతులోకచెంత నుతులుగొల్వ
గాయకులోకచక్కి గానముల్పచరింపఁ
బండితుల్ శాస్త్రార్థ ఫక్కిసల్ప
నైదువలొక్కెడ నారాత్రికలఁబట్టి
పెండ్లిపాటలఁ దమపేర్మిఁదెలుప
ఘనజటావల్లభుల్ ఘనజటల్ పఠియించి
“ యాయురాశాస్తే ” యటంచుఁబల్క

గీ॥ నవ్యమంగళవాద్య నినాదమెసఁగ
వారకాంతలనాట్య ముల్వరుసఁగొల్ప
భాగవతహాస్య రసములు ప్రాభినిల్ప
నీవధూవరులెపుడు వర్ధిలుతజగతి. 5.

## 67. చెరకుపల్లి వెంకటరామయ్యగారు.

వీరి నివాసస్థలము పీఠికాపురము. తెలుగాణి వైదికులు. ఆపస్తంబ సూత్రము. శౌనకస గోత్రము. తండ్రి కృష్ణయ్యగారు. తల్లి సోమాంబ. తారణనామ సంవత్సర చైత్రబహుళ చతుర్థశి జన్మదినము. ఆంధ్రమందు పరిచయము గలదు. శ్రీపీఠికాపుర సంస్థానా ధీశ్వరులగు శ్రీరాజారావు వెంకట మహిపతి గంగాధర రామారావు బహద్దరు వారి కళత్రమగు శ్రీరాజారావు భావయ్యమ్మారావు బహద్దరు వారియొద్ద లేఖనోద్యోగిగా నుండెడివారు. ప్రస్తుతము ఏలూరుమండలి ఏ. వి. హెచ్. యల్. యస్. పాఠశాలలోఁ దెనుఁగు పండితులు. వీరిచే రచింపఁబడిన గ్రంథములు. 1. ద్రౌపదీవస్త్రాపహరణము (నాటకము) 2 కాంతామతి (నాటకము) 3 ఇంద్రవిజయము (నాటకము) 4 ఇంద్రవిజయము (వచనము) 5 బాలనీతి.

సీ॥ పసపునిగ్గులుదేరు పసిఁడిపుట్టముగాదె
వాటుగాధరియించి నీటుగులుక
సంపత్ప్రదంబని చాటుకన్ దమ్ముల
ఘనసారసంయుతాం జనముఁదీర్చి
కస్తూరివాసనల్ గ్రమ్ముఁగఁజెక్కుట
నీటుగాఁజెలువమిక్క పెరయదిద్ది
నవరత్నవిభ్రాజిత వివిధభూషణసమా
క్రాంతిహస్తంబున రక్షగట్టి

గీ॥ నొసటఁగల్యాణపు తిలక మెసఁగఁదీర్చి
రమ్యపదములఁబసపు పారాణిబెట్టి
మెడనవర్ఘ్యముక్తా హారమడరఁదాల్చి
హైమవతిపెండ్లికూతురై యలరెనహహ! 1

సీ॥ గౌరీమహాదేవి కైలాసవాసువా
మాంకవిభూతిచే నలరెననుచు
శ్రీరమాకాంత యాశ్రితపక్షపాతివ
క్షోనివాసపుభాగ్య మూనెననుచు
వాణీసరోజాక్షి వనజగర్భుఁడను
స్థితలసత్సౌభాగ్య గతిని జెందె
ననుచుసతీత్వంబు వినుతింప హైమవ
తీసతి చేఁబట్టె దినకరాభు

గీ॥ చంద్రవదనుఁ గురుమతినుతవసునీతి
పద్మమన్నాటి వంశపావను, నెబాను
మేలు మేలనుచు జనంబు మెచ్చి నేస
లలరుసోనకైపడెఁ జల్లియ బ్రమంద. 2

## ఉత్పలమాలిక.

బోటికరాంబుజాతమునఁ బొల్పుగనిల్పిన యాణిముత్తెముల్
నూటిగఁబద్మరాగరుచిఁ జొక్కుచుమూర్ధసమీపగాములై
చాలెనుకుందసూనముల చాయను పెన్నతి గుంపునందుదా
మోటుపడెన్సురేంద్రమణు లొప్పెదుప్రక్రియ నంచుదేవతో
ద్ఘాటపచక్రపసూనములు కర్ణమహోత్సవ మాచరింపవా
మేటిధనుష్సెక్కుడఁగ మేలుబళీయని మానిసంఘము

ల్మాటికిమాటికిన్ గురుతమంబుగ మెచ్చ సురాంగనామణుల్
పాటలనవ్యరీతులను బాడుచువాడుచు నాకసంబునన్
గోటిశతంబులైనిలిచి కోమలగంధ మిళత్సుమంబులన్
పాటలగంధిసీతతల బ్రాలనుబోయుచు నుండఁజల్లఁగా
హాటకచేలుఁడాశ్రిత సురాగమురాముఁడు సీతకేలుదా
గాటపుఁబ్రేమఁబట్టు గుణగణ్యవధూవరు లెప్పుడిమ్ము
న్నాటికులాబ్ధిసోముని గుణంబులప్రోవు భుజంగరాట్సుతం
గోటిశతాయురున్నతుల కొడుకుల్ఁగూఁతులఁ బౌత్రులందగన్
సాటియనంగరాని ఘనసంపదలొప్పఁగ నిచ్చిసద్దయన్
నీటుగసూర్యచంద్రులిల నిల్చెడువాఁకను బ్రోతురెంతయున్. 8.

## 68. జంధ్యాల వెంకటప్పయ్య శర్మగారు.

వీరితండ్రి లక్ష్మీనారాయణ శాస్త్రులు గారు. వయస్సు సుమారు ఇరువదిరెండు సంవత్సరములు. మంజువాణీ ప్రబంధము, నీలలోహిత శతకము, కన్యావిక్రయము, భార్గవ విజయము (నాటకము) ఇరువురిచే రచింపఁబడినవి.

## 69. జంధ్యాల శివన్న శాస్త్రిగారు.

వీరితండ్రి లక్ష్మీనారాయణ శాస్త్రులు గారు. వీరి పూర్వులు పరమేశ్వర స్తోత్రము, (సంస్కృతము) రాజయోగ సారము- (సీసార్థములు) వయస్సు సుమారు పదునెనిమిది సంవత్సరములు. ఇద్దఱునుగలిసి "జంధ్యాల వేంకట శివకవులు" అని పేరుపెట్టుకొన్నవారు. వీరి గురువులు జగద్విఖ్యాతింబడసిన తిరుపతి వేంకటేశ్వర కవులు.

సీ॥ శ్రీరస్తు శుభమస్తు గీరస్తు సుఖమస్తు
చిరతర సంకల్ప సిద్ధిరస్తు

పుత్రరంజనమస్తు పుణ్యమస్తు యశోఽస్తు
ధనమస్తు శాశ్వత దానమస్తు
సఖ్యమస్తు మహోఽస్తు శక్తిరస్త్వనవద్య
సుఖమస్తు సంతత సుగుణమస్తు
సామ్రాజ్యమస్తు శాశ్వతభాగ్య తతిరస్తు
వృద్ధిరస్తు మహాప్రసిద్ధిరస్తు

గీ॥ దేశికేంద్రాంఘ్రి భక్తిప్రదీప్తిరస్తు
శాంతిరస్తు మహాకథా శ్రవణమస్తు
జ్ఞానమస్తు మహేశ్వర ధ్యానమస్తు
క్షేమమస్తు సదాభీష్ట సిద్ధిరస్తు. 1.

సీ॥ ఫాలమందు సువర్ణ లీలనొప్పు నశ్వత్థ
పర్ణ ముక్తాఫల ప్రభలు నెగడ
వక్షమునంగునమణి వ్రాతనిర్మితమైన
పులిగోరు పతకంబు పొలుపుమీఱ
శ్రవణభూషితరత్న సంపన్న కాంచనా
ర్జునశిలాటంకములు సొంపుమెఱయ
శింజానవైడూర్య మంజీరములుపాద
వనజంబులందు సొంపానరుచుండ

గీ॥ మెండిడాలునమొలత్రాడు బాహుభూష
ణములచిన్ని వెన్నెలలొప్ప నవ్వులలరు
రాముఁడోముతెను భుజంగరాయసుతను
సత్యనారాయణామాత్య సంతతంబు. 2.

సీ॥ శ్రీమదఖండలక్ష్మీ మహావైభవా
ఖ్యాయురారోగ్యాదు లమరఁగాత

ఆచక్రవాళ పర్యంతంబు కీర్తియు
క్తులచేతనరులను దోఁచుఁగాత
అభ్యుదయపరంప రాభివృద్ధిఁగులంబు
తామరతంపరై తనరుఁగాత
ఆమోదమెసఁగఁగ నాచంద్రతారకా
ర్కముగసత్కీర్తి నిక్కముగుఁగాత

ఆ॥ రహిని శ్రీభుజంగరావుకుమారికి
రైన హైమవతికి నమలమూర్తి
సత్యనారాయణునకును సంతతంబు
నిష్టకామ్యార్థముల నీశుఁడిచ్చుఁగాత. 8.

## 70. శ్రీమాన్ వింజమూరి వీరరాఘవాచార్య కవిగారు.

వీరి నివాసస్థలము తణుకు తాలూకా దొంతవరము అగ్రహారము. వీరు దాక్షిణాత్య ద్రావిడ శ్రీవైష్ణవులు. ఆపస్తంబ సూత్రులు. కౌశిక గోత్రులు. వీరి తండ్రి శ్రీనివాసాచార్యులవారు. తల్లి కనకమ్మగారు. వీరు పరీధావినామ సంవత్సర ఆశ్వయుజమాసమందు జన్మించిరి. రోహిణీనక్షత్రము జన్మతార. వీరు సంస్కృతాంధ్ర భాషలయందుఁ బ్రబంధములను గావ్యములను రచియింపఁగలవారు. నూజవీడు కాపురస్థులను జగద్విఖ్యాత పాండిత్య శతావధాన నిపుణులును నభినవపండిత రాయేత్యాది బిరుదాంకితులునగు శ్రీమాన్ మాడభూషి విద్వాన్ వేంకటాచార్యులవారును దామొనరించిన భరతాభ్యుదయాది మహాప్రబంధముల రచనలో నీకవిగారి సలహాలను బుచ్చుకొనుచు వచ్చిరి. వీరికి సంస్కృత వ్యాకరణమునందుఁ బరిశ్రమ గలదు. ఆంధ్రభాషయందనేక వ్యాకరణంబులును గావ్యములును బ్రబంధములులను బఠించినవారును గొందఱు శిష్యులను ఆంధ్ర భాషయందుఁ గృతార్థు

లను గాంచేసిరి. వీరు కొంతకాలము నూజవీడు సంస్థానములో విద్వాంసులుగా నుండిరి. మఱియు బెజవాడ మిషన్ వారి యుత్తమ పాఠశాలయందు సంస్కృతోపాధ్యాయోద్యోగమునందుండిరి. వీరు లౌక్య విద్యయందును బరిశ్రమఁ జేసినవారే. వీరు రచియించిన గ్రంథములు, సంస్కృత భాషయందు:—1. మానస సందేశము. (ముద్రితము) 2. హనుమత్సందేశము, స్వకీయ చరితము, పచనరచన. (అముద్రితములు) 4. రఘువీర గద్యవ్యాఖ్యానము. (ముద్రితము) 5. శ్రీరామానుజ శ్లోకత్రయీ చతుశ్శ్లోకీ వ్యాఖ్యానములు. (అముద్రితము) 6. మానససందేశ వ్యాఖ్యానము. (అముద్రితము) 7. విశ్వామిత్ర సూత్రవ్యాఖ్యానము. (విగ్రహారాధన విషయము) (అముద్రితము) 8. శ్రీపానక నృసింహస్తోత్రము. (ఆంధ్రభాషయందు) 1. విశ్వరూప సందర్శనము, నాటకము, ముద్రితము. 2. సత్యభామాపరిణయము, (డిటో) 3. విష్ణువిక్రమము. (అముద్రితము) 4. వివేకప్రపంచాయని, పచనరచన (ముద్రితము) 5. భ్రమరగీతా తత్వసారము (వేదాంత తాత్పర్యము) డిటో. 6. విశిష్టాద్వైత ప్రకాశికయను మాసపత్రికయందు 6 గ్రంథములు. సంస్కృత ద్రావిడములనుండి యాంధ్రీకృతములు. ఇంకను గొన్ని చిల్లర గ్రంథములు గలవు. ప్రస్తుతము గుంటూరు పురంబున నివసించియుండిరి.

శ్లో॥ శ్రీపతిశ్శుభమాతర్యా ద్దంపత్యోర్వరనయోస్సదా
భూయాంసుర్యాదుమానాథో దంపతీచ చిరాయుషౌ. 1.

శ్లో॥ శివకేశవయోర్ధైక్యం యద్వదంతమనీషిణాం
తద్వదనయోస్తుదంపత్యో రక్షీణసఫలంభవేత్. 2.

శ్లో॥ శ్రీమహాసీతేతిచ నామ్నాయా తివిజయలక్ష్మ్యైర్ఖ్యా
పాత్రవేసత్యాఖ్యం నారాయణమేవ సుజ ర్త్రారం. 3.

శ్లో॥ దంపత్యోర్వరయోర్మృకండుతనయో యుష్యంఛతేత్సర్వదా
పైశ్వర్యంసుమహానురాగసహితం సౌఖ్యంచ [illegible]తాం

పాండిత్యంకవితాచమత్కృతిరపి ప్రద్యోతితాకీర్తయో
రౌదార్యంకవిపండితేషు సతతం ప్రఖ్యాతిమాయాస్సువి. 4.

శ్లో॥ గౌరీనాథరమాపతీకరుణయా సంరక్షితౌదంపతీ
ఏతౌ వైభవశాలినౌ సుగుణినౌ వాస్తామిమౌదంపతీ
శ్రౌతస్మార్తవిధానకౌతుకపరౌ వాస్తామిమౌదంపతీ
దీర్ఘాయుష్యమహానురాగసహితౌ స్యాతామిమౌదంపతీ. 5.

సీ॥ వరవర్ణమన్నాటి వంశ్యుండౌ వేంకట
సత్యనారాయణ సరసమణియు
హైమవతియుసీత యారాజ్యలక్ష్మియు
నౌక్క నామములుగల యువిదయు నిల
ధర్మభార్యలుగాఁగ వసుమతిరంజిల్ల
నాయంశశాస్త్రీయటంచు ద్విజులు
వేదమంత్రంబులు విస్తరించి పఠియింప
నైగువుల్ శుభగాన మాచరింప

గీ॥ నక్షతారోపణంబు నన్యోన్యదర్శ
నంబునాఁటి యానందమతిశయించి
చిరము నాయువు సంపదల్ స్థిరముగాఁగ
ధనములనుగాంత్రుగాక యీదంపతులిల. 6.

శ్లో॥ శ్రీమంత్రిప్రెగడాన్వయ జలధేః పూర్ణేందురేషః జయతాద్యః
శ్రీమద్భుజంగరాజేత్యభిధాం రేభేకళామహిభారాత్. 7.

సీ॥ మంత్రిప్రెగడయను మహనీయనామంబె
యిహపరహితముల నెఱుకపరుప
సర్వవిద్యాశాలి భుజంగరాయాభిఖ్య

భూపాలవంబును బొందుపరుప
నిజమంజువాణిచే నిఖిలజనంబుల
నానందమగ్నులై యాదరింప
లక్ష్మవరాదులౌ లక్షగ్రామంబుల
పడుపునధనముల వార్తదెలుపఁ
గీ॥ బుడమివిద్వత్కవీంద్రుల పూజలెపుడు
ముదముతోడనుజేసెడు పుణ్యమూర్తి
నృపలలాముఁడు రాముఁడేయితనికెనయ
టంచుసరసులుబొగడంగ నలరుఁగాత. 8.

గీ॥ అవనినీనృపుపట్టిరే హైమవతియు
సీతయువిజయలక్ష్మిరై చెన్నుమీఱ
సత్యనారాయణుండె సాక్షాత్కరించి
తానె జామాతయయ్యెను దరమెపొగడ. 9.

## 71. కర్నూలు తాయనకవిగారు.

వీరి నివాసస్థలము కర్నూలు. జన్మస్థానము బళ్లారిజిల్లా, ఆలూరు తాలూకాలో హత్తిబెళగల్లు. జననకాలము రుధిరోద్గారి సంవత్సర మాఘ బహుళ చతుర్దశి. తండ్రి జగ్గయగారు. తల్లి యెల్లమాంబ. నూతపంశము. గుంపిలిగోత్రము. ఎఫ్. ఏ. పఱకుఁజదివిరి. కర్నూలు కలెక్టరాఫీసు నందుద్యోగియులు. ముగ్గురుకొడుకులలో నైదుగురు కూఁతులలో న్రగ జులు. సంతానము, ఇరువురు పుత్త్రికలు, ఒకపుత్త్రుఁడు. రచియించిన గ్రంథములు:—నాటకములు-హరిశ్చంద్రీయము, ఏకాదశీ మాహాత్మ్యము, అజ్ఞాతవాసము, కలావతి, పార్వతీ పరిణయము, వాసవ కన్యాభ్యుద యము, అపవాద శారంగధరము, విజయరాఘవము, శ్రీగిరీశ శతకము, (నీతి పద్యావళి)

ఉ॥ శ్రీయమునానదియన్నదులు జేరడిచోఁ జెర లాడుచున్నగా
రోయక నేకదంతుఁ డొడికొప్పరహించు పురాణదంపతుల్
శ్రీయుతపార్వతీశ్వరులు చేయుత హైమవతీ సమేతనా
రాయణునిన్ జిరాయువహిశాస్త్రరమాసుయశశ్రీప్రాప్తిఁ గాన్.

ఉ॥ ఏవాడసత్యమేవిజయ మేలును నానుడి పాటిసత్యనా
రాయణరావు ప్రేమ విజయాంకితలక్ష్మము కేలువట్టెస
త్ర్యాయుధజాయమాన విజయాయతకీర్తి నిరంతరంబుఁ జై
సేయుతమీ వధూవరుల శ్రీకమలాక్షు కటాక్షవీక్షణన్. 2.

ఉ॥ పాయనిలోకయాత్ర యనువార్ధివిమాయము పేరిచీఁకటిన్
దాయుఁ వధూవరప్లవపు దారికిదిక్కులు చూపుయంత్రమై
రోయబిరానఁదోఁచెడి యరుంధతి హైమవతీ సమేతనా
రాయణరాయమాళికి దయంగ ఇప్పు సృగృహస్థధర్మముల్. 3.

ఉ॥ తోయజమిత్రుఁ జుట్టు చనుతోయజవైరి యుతోర్విమాత్రిగా
సేయనలుం బదక్షిణము సేఁగెను హైమవతీ సమేతనా
రాయణుఁ డావహుతాశనుఁడు హర్షముతోడుత నీవధూవరి
శ్రేయము పెంపశాశ్వతవుఁ బ్రేమరగుల్పుఁ దదాత్మ వేదికన్. 4.

సీ॥ దేవాదిదేవుని దేహధారులభక్తి
సేవింపదివిరెడి చిత్తమెసఁగ;
అర్గురుశత్రులట్లాడు దాసులువీడి
సత్యమార్గము గోరుపాంతమమర;
కలనైననన్నృతముల్ కలుషభాషణములు
పలుకనినిర్మలభావములర ;
విద్యాధనంబును విపులధనంబును
వృద్ధిసేయఁగదంగు బుద్ధిరవర ;

గీ|| రాజబిరుదాంకిత భుజంగరాయసుతకు
నమలకీర్తివేంకటరామ యాత్మజునకు
సకలసమ్మానములసంతసించుఁగనిన
యీకవిబుధకోటి దీవనలిచ్చుఁగాత. 5.

## 72. కొత్తూరి సుబ్బయ్య దీక్షితులుగారు.

వీరి జన్మస్థలము కోనసీమయం దమలాపురమున కాలుమైళ్లదూరము. ననున్న పోతవరము. కోనసీమద్రావిడులు. రథీతరసగోత్రము. తండ్రిరామయ్యగారు. తల్లి సోదెమాంబ. జన్మము ది 5-1-1894. వీరాంధ్రమందు మంచి సాహిత్యము గలిగి చక్కని నవలలను, వ్యాసములను, నాటకములను వ్రాయఁ బ్రసిద్ధులు. ఆంధ్రాంగ్లములందు మంచి వక్తలు. పసితనముననే శ్రీ ఊర్లాము సంస్థానాధిపతులగు కీర్తిశేషులైన శ్రీ కందుకూరి మహాలక్ష్మమ్మ జమీందారిణీగారి కృపకుఁబాత్రులై కవితాచమత్కృతిఁ జూపించిసన్మానము నడసిరి. వీరు జ్యోతిషశాస్త్రమందుఁజక్కని పండితులు. "బాలపరాశర" బిరుదాంకితులు. "జ్యోతిషప్రకాశిక" వీరి శాస్త్రానుభవజ్ఞానములను ప్రకాశింపఁజేయుచుండును. వీరు జాలవిద్యా (Mesmariam) నిపుణులు. విమర్శకులు. అగ్రామ్యవాదులు. ప్రస్తుతము కాకినాడయందు పిఠాపురము రాజావారి కళాశాలలోఁబ్రథమశాస్త్రపరీక్ష (Intermediate) తరగతియందు శిక్షపడయుచుండిరి. వీరు రచించినగ్రంథములు:—(అముద్రితములు), 1. ఆదిత్యవిజయము, (ప్రబంధము) 2. కుసుమావతి, (నాటకము) 3. సౌభాగ్యసుందరి, (నవల)

క|| శ్రీమానితకీర్తినిభువి
హైమవతీ సత్యమూర్తులనయములరుచిన్
శ్రీమతియుతులై నిరతము
హైమవతీ సత్యమూర్తులన్నారయుతన్. 1.

సీ॥ సకలదిగంత విక్రాంతవిజయశశిప్ర
భలురగపతి కాంతి నెలమి మించ
నిజమౌళిహీరమాణిక్య కాంతివితతి
ఫణిఫణాగ్రస్థసన్మణులఁదెగడ
నొడులధరియించు నాంధ్రభాషాలోక
మల్పభూధరగణంబు నతిశయింపఁ
పెనదుశ్శృంగార ధీదర్పంబు వేనోళ్ల
మించివారసనిత మేళవింప

గీ॥ వక్రగమనాది హేయస్వభావవిధము
వెదకిచూచిన లేదనివిమలసంశ
విభవమేర్పడఁబలుకంగఁబ్రసిద్ధిభుజగ
రాట్కృతిని మించెదు భుజంగరాట్కృతీంద్ర. 2.

సీ॥ కాంచనస్థాపితకమనీయవజ్రర
త్నమణిసుభూషితద్వారచయము
చిత్రశిల్పాది రాజితనిరుపమదేవ
తాగృహసమవినోదసదనతతి
కఠినశిలాద్రవకరదివ్య కామినీ
గానోపమ మధురగానలహరి
గురుముఖ్యసుమనస్క కోవిదతులసర్వ
పండితకవి సభాప్రౌఢసరణి

గీ॥ వేయియేలవారునిఁగ నారాయణా నహా!
ఒకటలక్ష్మివివాహమున నొనగూర్చి
స్వపురపరమును భూలోకస్వర్గమనఁగ
రహినొనర్చితివిబళి! రారాజ! రత్న
గర్భుఁడెవఁడలంచిఁగాని కార్యమున్నె. 3.

చ॥ ధరణిశచీ సురేశులవిధంబు నుమాహరులట్లు లిందిరా
కరివరదుల్ బలెన్ లలితకాంతి సతీకమలాప్తులట్లులన్.
నిరుపమభాగ్య కీర్తియుతనిష్ఠులమైత్రి నెసంగనీవధూ
వరులననుగ్రహించుత నపారకృపామతి విఘ్నుఁడెప్పుడున్. 4.

గీ॥ అవని " బాలపరాశరి " యనఁగఁబరగు
సుకవివర్యుండు కొస్తూరిసుబ్బయాఖ్య
దీక్షితుండిట్లు పాలుపారఁదలియఁబల్కెఁ
బ్రథితమైత్రివాశీర్వాద రత్నమాల. 5.

## 73. శ్రీపాదసుబ్రహ్మణ్యశాస్త్రిగారు.

రామచంద్రపురము తాలూకాయందలి పాలమూరు నివాసస్థలము. ప్రస్తుత నివాసము రాజమహేంద్రనగరము. వెలనాటివైదికశాఖ. ఆపస్తంబ సూత్రము. కాశికగోత్రము. తండ్రి లక్ష్మీపతి సోమయాజులుగారు. తల్లిమహాలక్ష్మిసోమిదమ్మ. ఖరసంవత్సర చైత్రశుద్ధ చతుర్దశి జన్మదినము. ఉభయభాషాసాహిత్యము కలవారు. సంస్కృత కవిత్వమున విశేషపరిశ్రమలేదు. వీరు రచించిన గ్రంథములు, (నాటకములు) 1. వారకాంత, 2. శివరాయాభ్యుదయము, 3. చరమచుంబనము. 4. ఉషాపరిణయము. 5. కంసవధ, 6, కీచకవధ, 7. ఇందుమతి, 8. కుశలవచరిత్రము, 9. రామదేవవిజయము, 10. సాహసికరాజపుత్త్రము, 11. పాణిగృహీతాశ్రవణానందశృంఖల. (విమర్శ గ్రంథము.) 12. జగన్మోహిని. (నవల) 13. మిథునానురాగము. (నవల) 14. గీతమంజరి. (చిన్నపద్యకావ్యము.)

గీ॥ అమృతసారమ్ములతుల సౌఖ్యాకరమ్ము
లమలకీర్తిప్రదములు నిరంకుశములు
ప్రథితకవిసార్వభౌములభాషణములు
కరుణనేలుత మివ్వధూవరులనెపుడు. 1.

## 74. ఇవటూరి సుందరయ్యగారు.

వీరి నివాసస్థలము, ఆచంటవేమవరము. ప్రస్తుతము రాజమహేంద్ర వర నివాసులు. శైవబ్రాహ్మణులు. ఆపస్తంబసూత్రము. కాశ్యపసగోత్రము. తండ్రిభవానీశంకరారాధ్యులవారు. తల్లిసర్వమంగళాంబ. వృషసంవత్సరశ్రావణశుద్ధ విదియజన్మదినము. వీరాంధ్రగీర్వాణములయందు సాహిత్యముగలవారు. ఆంధ్రమందు సరసమయిన కవిత్వముఁ జెప్పఁగలవారు. "మినుమంచలిపాడు" అగ్రహారీకులు. శ్రీజార్జిచక్రవర్తిగారి మకుటధారణోత్సవాది సమయముల యందనేక పద్యములు రచియించినవారు. శ్రీకృష్ణభారత విమర్శనగ్రంథకర్తలు. వీరనేకములు చాటుపద్యములు రచించినవారు.

సీ॥ శ్రీగాంగచటులోర్మి వేగాయతధ్వనుల్
  తతభేరికాఘణంఘణలు గాఁగ
మణికూటములవెల్గు మాణిక్యరాసులు
  విలసితహస్త దీపికలు గాఁగ
పవనపూరితములౌ ప్రకటకీచకరుతుల్
  లలితకళ్యాణమురళులు గాఁగ
శశికాంతపాషాణ సమకుట్టిమస్థలి
  పెంపొందఁగాఁ బెండ్లిపీట గాఁగ.

గీ॥ శిశిరగిరి శిఖరగళిత శిశిరబిందు
పటలిముత్తెపుఁ దలితలంబ్రాలు గాఁగఁ
బరఁగుగౌరీశకళ్యాణ వైభవంబు
నిరతమును బ్రోచునీవధూవరులసిరుల. 1.

ఉ॥ ఆయతమంత్రి పెగ్గడకులాబ్ధివిధుండు భుజంగరాయఁడా
రాయనిపట్టి హైమవతి రంజిలునామెకు వేదుసత్యనా

రాయణువర్ణమన్నటిశుభాన్వయువిన్ బతిఁజేసి బ్రహ్మదాఁ
బాయఁగఁగల్గెలోకమునఁ బ్రాజడుఁడన్నదురాపవాదమున్. 2.

గీ॥ రాజబుధకవి గురులుగారాబమొప్ప
శుభపదస్థితిఁ జెన్నొందిసుముఖులగుచు
నలరఁగళ్యాణ వైభవంబరయుచుండఁ
బెంపుఁగనకున్నె శుభము లీదంపతులకు. 3.

గీ॥ హైమవతియును సత్యనారాయణుఁడనఁ
బరగునీదంతులకు సంపదనొసంగి
పుత్త్రపౌత్త్రాదిసంతతిఁబొదలఁజేసి
సిరియుహరియును నెపుడురక్షింత్రుగాత. 4.

చ॥ కవిజనమండలిం బిలిచిగాదిలిపట్టి వివాహవేళగౌ
రవమొనరించి వారికిఁగరంబుముదంబునఁగాన్కలిచ్చిసం
స్తవనము నొందనొప్పుఁడు భుజంగసమాహ్వయ సత్ప్రభుండునేఁ
డవనిజనుల్ నుతింపఁబ్రమదాంబుధి నందఱినోలలార్చుచున్. 5.

75. గోటుగంతు వెంకట్రామశాస్త్రిగారు.

“శ్లో॥ నత్వాసుందర మిందిరారమణ సన్మందార పాదాంబుజం
భక్తానామపవర్గమార్గ దలసత్సోపాన ఘూర్ణాంకితం
శ్రీమద్వేంకటరామ పండితకవి ర్వక్తుశ్శక్తానందత
శ్చారిత్రం నిజమిందిరాకరుణ యాజీయాచ్చిరంభాసురం. 1.

శ్లో॥ ధాతాబ్దేకృష్ణపక్షేనభసి శుభయుతేహ్యుత్తరాభాద్ర తారా
యుక్తాయాంశ్రీచతుర్థ్యామజనిజననుతాయాంసుభద్రాంబికాయాం
శ్రీమత్కాన్కామధాసేః ప్రవిమలయశసో రామచంద్రాకతానా
దాపస్తంబీయసూత్రగ్రథితముకరసత్కర్మ ముక్తాఫలాళిః. 2.

శ్లో॥ శ్రీమత్తొండపరాఖ్యపత్తనవరే శ్రీశోనసీమ్నిస్థితే
విద్వద్భూసుర రత్నరాజిలసితే లీలాగృహోల్లాసితే
రమ్యోత్తుంగ సురేంద్రనందన నిభారామైస్సదాశోభితే
శ్రీతొండేశ్వర కేశవప్రభుయుతే హ్యాసీత్సతామగ్రణీః. 3.

శ్లో॥ శ్రీలక్ష్మీనరసింహపండితవర శ్రీసంగమేశార్యతో
ప్తవ్యభ్యస్తాఖిల తర్కవాక్యసరణి శ్శ్రీవత్సగోత్రోద్భవః
శ్రీమద్వేంకట రామపండితవర శ్శ్రీగోరు గంట్వన్వయే
సంజాతో వెలనాటి వైదికవర స్సమ్యక్కృతాధ్యాపకః. 4.

శ్లో॥ పిఠాపురవరస్థానే న్యాయశాస్త్రైచవార్షికం
దత్వోత్తమపరీక్షాంచ హ్యగృహ్ణాత్పారితోషికం. 5.

శ్లో॥ ఊర్లామసంస్థాన నగాధినాథలక్ష్మీ ప్రసాదాహ్వయరాజసన్నిధౌ
దత్వాపరీక్షాం విభుధప్రియంకరం జగ్రాహ తత్రోత్తమవార్షికంచ.

శ్లో॥ నైజాంసంస్థాన విభ్రాజద్వేమసూరు పురీవసే
శేషగిర్రాయనికటే విద్యాంగ్రాహితుం క్వచిత్స్థితః 7.

శ్లో॥ జోగారాయమహావిద్యాజి బుధోత్తమ సుధీమతేః
నికటేకతిచిత్కాల మవాత్సి సద్విజోత్తమః 8.

శ్లో॥ అద్యావసన్నిజే గ్రామే శిష్యానధ్యాప యన్సుధీః
వంకవిశ్వేశచయన శ్వశురార్యగృహేసుఖం. 9.

శ్లో॥ నవరత్నమాలికైషా వెంకట్రామాఖ్య శాస్త్రిణా
విఘ్నేశతుష్టిసిద్ధ్యర్థం ప్రాభూచ్చక్రే రసస్థిరా.” 10.

శ్లో॥ శ్రీమంత్రి పెగడాన్వయాంబుధి నిశానాథస్య దిగ్వ్యాపినీ
శ్రీమచ్ఛ్లాఘ్య భుజంగరాయ సుకవేర్జజియ్యతే సత్సభా
విద్వద్భిర్మిధిలాపతేరివ కవిశ్రేణీభిరానందితా
శ్రీమల్లాకికశేఖరై ర్వరవధూ భాభాసుఖాభాసురా. 1.

శ్లో॥ శ్రీమద్ధైమవతీవధూవరివృతం శ్రీసత్యనారాయణం
రక్షత్వాయురతుల్య సంపదమరం దత్వావరంభాసురం
సీతావక్త్రవిలోకనోత్క నయనః శ్రీరామచంద్రప్రభుః
కళ్యాణైకనికేతనో జనకరాట్కళ్యాణ సద్మస్థితః. 2.

శ్లో॥ శ్రీమచ్ఛైలసుతాసమంచిత తనుశ్శ్రీ నీలకంఠోవర
స్త్వాయుర్దీర్ఘమతుల్య వైభవమరం ప్రీతింమిధోభాసురాం
వధ్వాశ్చైవ దదాత్వజస్ర మఖిలా భీష్టప్రద శ్రీకరో
వేంకట్రామసుధీమణేర్హృదిసదానిత్యానుషక్తశ్శివః 3.

శ్లో॥ కళ్యాణభావమఖిలార్థకరంభజంతౌ
శ్రీభూమిజాదశరథాత్మజరామచంద్రౌ
దత్వాస్వయంవరవధూవరయోరజస్రం
కళ్యాణభావభజతో శ్శ్రియమాయురర్థం. 4.

శ్లో॥ శ్రీమద్ధైమవతీసతీచభగవాన్శ్రీసత్యనారాయణ
స్తన్నామ్నాకధితాంవధూంచ సుగుణాం శ్రీసత్యనారాయణం
దత్వాయుర్ధనసంచయంతనుభవానందంతయోస్తృప్తితః
శ్రీమంత్రిప్రెగడోపనామక భుజం గార్యంసదారక్షతు. 5.

## 76. చింతలపాటి లక్ష్మీపతి శాస్త్రిగారు.

"శ్లో॥ శ్రీమద్ధారితగోత్రవార్థి శశభృద్వేదాంగపారంగతః
శ్రీమచ్చింతలపాటివంశ సుభగో రామయ్యశాస్త్రీబభౌ
పత్నీతస్యరమాసమాన విభవా శ్రీపేరమాంబాతయోః
పుత్రోహంగిరిజాసుతాప్తసుమతి ర్లక్ష్మీ పతిర్నామకః. 1.

శ్లో॥ కాణాదసూత్ర పటుసాదరపాతిరేకా
భోగేంద్రపాణిని వచోమృతపారపూతా

గంభీరభావయుత శంకరభాష్య బ్రహ్మ
సూత్రావగాహనిపుణారసనామదీయా. 2.

శ్లో|| ఆపస్తంబంతుసూత్రమ్మే వెల్నాడీ వైదికోస్మ్యహం
ఆంధ్రగీర్వాణసాహిత్యే కుశల శ్శిష్యబోధకః. 3.

శ్లో|| శ్రీజనార్దనగోపాల శతకేతు మయాకృతే
ఆంగీరసేవత్సరేతు శ్రావణా మేందువాసరే
జననంఘంటశాలాయాం తత్రైవచ మమస్థితిః." 4.

సీ|| శ్రీవల్లమన్నాడ శ్రితకీర్తి మద్వంశ
పాథోధి చంద్రుండు పరమగుణుఁడు
దానమానక్రియా దక్షుండు వేంకట
రామనామాంకిత రమ్యమూర్తి
తత్పుత్రుఁడతుల సౌందర్యాభియుక్తుండు
విమలవాక్ప్రౌఢిని విబుధతతిని
గురుజన మాన్యుండు కువలయ నేత్రుండు
సరసవిద్యావృతి సాగరుండు
సుకుమార గాత్రుండు సురపతి సుతనిభుం
డనఘుఁడార్యవినోద నారతుండు
వలరు వేంకటసత్య నారాయణాఖ్యుండు
నట్టిబాలున కాత్మనతి ముదమున

గీ|| రాయబహదూరు శ్రీమంతు రాట్సుమంత్రి
ప్రగడవంశాబ్ధిసోముండు భద్రయకుఁడు
భుజగరాడాహ్వయుం డాత్మ పుత్రి హైమ
వతినిసమ్మతితోనిచ్చి వసుధలోన.
సిరిని హరికిడ్డజలనిధి చెన్నువడసె
నమిత సత్కీర్తి నాచంద్ర తారకముగ. 1.

శా॥ రత్నస్తంభ సుతోరణాంచితమహద్రమ్యాంగణోద్భాసితా
యత్నోద్గుంభితరత్న మౌక్తికలతా యామావితానాంచితా
రత్నాకీర్ణ వివాహవేదిగతులన్ రాజీవ నేత్రుండుమా
రెత్నంబొప్పఁగఁబ్రోచు హైమవతి నిస్త్రీసత్య నారాయణున్. 2.

శా॥ వినుఁడుగిరిశుండు రాముండు విష్ణులోకట
రమణ వేంకట సత్యనారాయణుండు
గాఁగ గిరిజాతభూజాత కమలజాత
లాయెహైమవతీ సీతలక్ష్మియనఁగ. 3.

శా॥ సారాసారవిశారదుల్ గుణపరుల్స న్మానినర్య ల్విభు
ల్కారుణ్యామృతసాగరుల్ హరిహరుల్ కళ్యాణధాముల్ ఘనుల్
గౌరీపుత్త్రికు లాచతుర్ముఖముఖుల్ కామ్యార్థ సంసిద్ధులం
జేరంబ్రోతురుగాత హైమవతినిన్ శ్రీసత్యనారాయణున్. 4.

శా॥ రారేమీరలు రామలార! సుమతి న్రాజీవనేత్రిస్గుణా
సారన్ హైమవతింగరంబుఁ గొనఁగన్ సత్యాఖ్య నారాయణా
కారుండై భవుఁ డేగుదెంచెనిటకుం గాంతాసమాజంబిదే
సేరంజూతమటంచుఁ బల్కుదివిజాల్ క్షేమంబు మీకీవుతన్. 5.

గీ॥ తొల్లి హైమవతీదేవి తోయజాక్షుఁ
గూడి సుఖములనొందద కూర్మినట్లు
లలిత హైమవతీసీతలక్ష్మి నేడు
సత్యనారాయణునిగూడి సంతసమున. 6.

శ్లో॥ యాదేవీలోకమాతా సకల బుధజనాహ్లాది సూక్తిప్రసంగా
యాసర్వాధారమూర్తి శ్చిదితి శ్రుతిశిరస్సార భూతాంతరాత్మా
యామాహుస్సర్వభూతి ప్రకృతిరితియయా ప్రాణవః ప్రాణవంతః
సావేదార్థాః ఫలదానత సురవనితాసంపతిపాతు గౌరీ. 7.

శా॥ యస్సర్వజ్ఞః పరాత్మా ప్రభురఖిలవిభుః ప్రార్థితో దేవదేవః
సత్యః పూర్ణో వికారీ స ఇతిశ్రుతిభిః పఠ్యతే తత్త్వశాస్త్రైః
యస్సంసేవ్యో౽భిరామం సురనరభుజగో భోగిగంధర్వదైత్యైః
శంభుశ్శ్రీయాం సిదత్వావతు శుభఫలదో దంపతీ సర్వకాలం. 8.

శా॥ ఆయుష్మాన్భవధైర్యవాన్భవమహా రాజ్యాభిషిక్తోభవ
సౌమాంగల్యవతీభవాత్మజయుతా సౌభాగ్యయుక్తాభవ
విద్యావాన్భవబుద్ధిమాన్భవ పతిప్రేమాభియుక్తాభవ
ఇత్యేషా వరకన్యయోస్సుఫలదా సత్యాసదాశీర్భవేత్. 9.

శ్లో॥ త్వంహాలాహలభృత్కరోషి మనసో మూర్ఛాం మమాలింగతో
హాలాం నైవభిభర్మి నైవచహలం ముగ్ధే కథం హాలికః
సత్యం హాలికతైవ తే సముచితా సక్తస్య గోవాహనే
న క్రోశ్యాతిజితా హిమాద్రిసుతయా స్మేరో హరః పాతువః. 10.

శ్లో॥ గజాననో గిరీశశ్చ జలజాక్షశ్చతుర్ముఖః
సిద్ధేశ్వరీమహాదేవి పాతులక్ష్మీస్సరస్వతీ. 11.

77. సూరంపూడి సీతారామమూర్తిగారు.

శా॥ ఇంపారన్ విక్రమకార్తికంబునను శుద్ధైకాదశీ శుక్రవా
రంపుం గర్కట లగ్నమందుపరి భాద్రాద్యర్క్షయుక్తిం జన్మస్థితిన్ సూ
రంపూడన్వయ రామమూర్తికవికిన్ రాజాస్య సుబ్బాంబకున్
బెంపుంజెందితి పెద్దతండ్రియగు సంప్రీతాత్ముచే బెంపగన్. 1.

సీ॥ ఆర్వేలకులజుండ నరయ నాపస్తంబ
సూత్రుండ నాత్రేయ గోత్రజుండ
నవసతోఁ దపతిసంపరిణీయ సంయుక్త
నిర్యాణతారా పతిచరిత్ర

ములదృశ్యరూపకములు గాఁగ వ్రాసితి
బాల్యచాపలమునన్ బాధపరుప
అదిగూడ ముద్రింప నైతిస్వభావమ్ము
గ్రమ్మిన యలసదనమ్ము చేత

గీ॥ పండితుఁడఁగాను దక్కృపా భాజనుండ
సరసకవితా విలాసభానురుఁడఁగాను
తెలుఁగుబాస నేరిచినాఁడ వలఁతినాదు
నామధేయ మెన్నఁగ సీత రామమూర్తి. 2.

ఉ॥ చెప్పెడివాఁడనాకువును జిన్నతనంబునఁగొంతధాటిగా
నిప్పుడునాశరీరమున నిమ్ముకొనెన్ రుజదాని చేతనే
దప్పెమనోజవంబు కవితారమణీమణి యేవగించితా
చప్పనజారుమన్న యదిజారజరాశ్రయ భర్తనుంబలెన్." 3.

చ॥ చదువులుకొద్దిశాస్త్రముల చాయలనైన నెఱుంగ గూఢమా
పదములయర్థమే నెఱుఁగఁ బ్రాజ్ఞులనెయ్యము గూడ లేదునీ
పదములెనమ్మినీకరణిఁ బండితవర్యుల మోలఁబద్దముల్
చదువఁగఁబూనినాఁడ సరసంబగు వాక్తతి నిమ్ము భారతీ. 1.

ఉ॥ పెండిలిసేతునా సుతకుఁ బ్రేమనుమీ రయబెండటంచునీ
పండితరాట్ భుజంగవరపాలుఁడు పాలనజేసిపిల్వమీ
యండకుఁజేరినాఁడలప మైన నెఱుంగఁ గవిత్వతత్వమీ
పండితులార ! కేల్మోగిచి ప్రార్థనసేతు క్షమింపఁ దప్పులన్. 2.

గీ॥ సముఁడుభోజునితో నీభుజంగరాయ
ధరణిధవుఁడీ మహామహు దర్శనంబె

కవితచెప్పెడి సామర్థ్యగరిమనిచ్చెఁ
గానిపాండిత్య మన్న నే కలను నెఱుఁగ. 3.

సీ॥ శ్రీరస్తు మీకని శ్రీదేవివచియింప
నభ్యుదయోస్తని హరియుఁబల్క
విజయోస్తుమీకని యజురాణిబల్కసాం
బ్రాజ్యమస్తను హంసవాహనుండు
సౌభాగ్యమస్తని శర్వాణిదీవింప
నాయుష్యమస్తని హరుఁడు చెప్ప
లావణ్యమస్తని రతియనరిత్యయా
నవమస్తుమీకను వనజశరుఁడు

గీ॥ సకలసౌఖ్యాభివృద్ధి రస్తనిశచియన
వాహనపరంపరాస్తను పాకవైరి
మిధునవిడియంపువేళ నిమ్మిధునమునకుఁ
దక్కుగలదేవతల్ తథాస్తనంగ. 4.

క॥ ఇమ్మిథునమునకు చెప్పెదు
సమ్మతితో హరియుహరుఁడు సారసభవుఁడుం
గొమ్మని యీపుత్రసకలసు
ఖమ్ములు జవ్వనము ధనముకలకాలంబున్. 5.

క॥ రతిమదనులపోలికనీ
సతియుఁబతియును విలాససాగరమునవీ
క్షితివాచంద్రార్కంబుగ
వతికయగతిమీఱునోల లాడెదుగ తన్. 6.

## 78. లక్కావజ్ఝల వేంకటకృష్ణ శాస్త్రిగారు.

వీరిజన్మస్థానము గుడివాడతాలూకా కురుమద్దాలి. ప్రకృతావాసము పామఱ్ఱుపురము. వీరు వెలనాటివైదికులు. ఆపస్తంబసూత్రులు. జనకుఁడు సుబ్రహ్మణ్యసిద్ధాంతిగారు. తల్లి సుబ్బమాంబ. సర్వజిన్నామ సంవత్సర జ్యేష్ఠ శుద్ధతదియజని దినము. వీరున్యాయనిగమాంత జ్యోతిష సాహిత్య గీర్వాణకవితాభిజ్ఞులును, నైకఛాత్రులకు విద్యాదానము చేయుచున్న విద్యాగురువులును, బరోడామొదలగు సంస్థానములయందు సన్మానితులునైయున్నారు. వీరిచే నిర్మింపఁబడిన సంస్కృత గ్రంథములు. 1. స్తోత్రకదంబము. శ్రీరామస్తవమాలా. 3. కథామంజరి. 4. విభవసమీమాంస. 5. ప్రశ్నకల్పతరువు.

శ్లో॥ చక్రాబ్జాంకిత పాణేః లక్ష్మీలీలాకటాక్ష సంగస్య
నారాయణనామైతద్యుక్తం నాన్యద్వరస్యతజ్జీయాత్. 1.

శ్లో॥ భార్యే హైమవతీతినామయదభూత్ సార్థంభవేదద్యభో
యస్మాత్స్వయగృహేమలం సమభవద్ధామంహితద్వాగ్యభూత్
సర్వోత్కృష్ట యశాద్భూపవిజయా సమ్యక్సదా మాస్థితేః
లక్ష్మీర్నామ బభూవ కేవలమియం కన్యాకమన్యాబుధైః. 2.

శ్లో॥ అనవరతవివరకైక పరాయణధిషణంచ శ్రీభుజంగాఖ్యం
అరవిశారక మవతా ఛ్ఛ్రేయాంసి వితీర్యజానకీ జానిః. 3.

శ్లో॥ వరబుధనుతవర్తినీతి మార్గాను వర్తిశతరిపుసమవర్తి చక్రవర్తిపవర్తి
జయతుజయతుమాన్యః శ్రీభుజంగాఖ్యరాజాజయతుజయతునిత్యశ్రీ
వధూః శ్రీవరశ్చ. 4.

శ్లో॥ లక్కావజ్ఝులవంశ దుగ్ధజలధి శ్రీసోదరోద్భూతతే
సుబ్రహ్మణ్యసుధీశ్వరో విజయతే కాన్తాంచిత గ్రామణీః

తత్పుత్రేణతు కృష్ణశాస్త్రికవినా సామర్థ్యపూర్ణాయునా
నైకగ్రంథకృతా ముదా విరచితా శ్రీరత్నమాలాభృతం. 5.

## 79. చిఫుకుల వేంకటాచల శాస్త్రిగారు.

వీరి నివాసస్థలము సికింద్రాబాదు. వెలనాటి వైదికులు. ఆపస్తంబసూత్రులు. భారద్వాజగోత్రులు. ఒంగోలుతాలూకా కారుమంచి గ్రామవాసులగు చిఫుకుల పురుషోత్తమ సిద్ధాంతిగారి కౌరసపుత్త్రులు. సికింద్రాబాదుపురనివాసులును సుప్రసిద్ధులును పండితతిలకులునగు చిఫుకుల వేంకటాచలశాస్త్రులవారికి దత్తకపౌత్త్రులు. సీతారామశాస్త్రిగారికి దత్తకపుత్త్రులు. సర్వజిత్సంవత్సర చైత్రబహుళప్రతిపత్తు జన్మదినము. వీరికి సంస్కృతాంధ్రసాహిత్యములయందును, ఉభయకవిత్వములయందును, కనుమాత్రము గీర్వాణవ్యాకరణమందును ప్రవేశమిప్పటికిఁగలిగియున్నది. త్రైలింగ్యభాషలో వీరిచేరచియింపఁబడి యముద్రితములుగనున్న గ్రంథములు:—1. మిత్రశతకము. 2. చంద్రకళాశారద ప్రకరణము

మ|| కవఁకన్నెన్నదురాకుఁబోత్తముల లెక్కల్ దత్తినాచిత్యమే
ర్పడఁగా వ్రాసియొగింజతుర్యగసహస్రంబోపకన్ పుచ్చినా
ప్పుడుపాయంతన కృత్యముల్సలుపఁగా బుద్ధిన్విలోకింపుమినా
సుడివాల్గాలుపుపట్టి దంపతులకిచ్చుంగాత దీర్ఘాయువుల్ 1,

ఉ|| అంజనపుంజకల్ప తిమిరాపహదీధితిమంజుమంజరీ
పింజరితంబుగా పసలబిట్టలరించి జనప్రమోదబ
ద్ధాంజలిపాత్రుఁడై కృపలతాఫలముంచునతివ్ రహింపుమినా
కంజహితుం డనామయముగా మిథునంబును బ్రోచుఁగావుతన్ 2.

చ|| జగమునఁజాలు తెల్లదము పర్వెదుజన్మములందు హాస్యముల్
తగఁగొనిమూటఁగట్టుకొని దానవవైరులపాలికేగినా

సిగనవిహారి కప్పురము సేయుచు మహాత్ముఁడు హవ్యవాహనుం
డగణితరీతిదంపతులకయ్యయి సంపదలిచ్చుఁగావుతన్ 3.

ఉ|| మానుగనొక్క వైపు ఫణిమండనమండల మండితాంగనో
ప్పూనమిఁకొక్కవైపు హిమసోమమృణాళమరాళసన్నిభా
నూనవిభూతిలి ప్రసుమనోహరపూరుషవేషభాస్వరం
బైనశరీరమొప్ప శివుఁడన్నిట వీరికిజ్ఞానమిచ్చుతన్. 4.

చ|| మలయసమీరపోతములమందపవన ప్రియకీరకాకలీ
కలకలముల్ ద్విరేఫకృతగానములుల్లసదిందు చంద్రికల్
పెలుచసహాయముల్సలుప వేడ్కఁజరించుతలంపు చూల్కియుం
పలరఁగనూత్నదంపతులకచ్చపుఁబేర్మి ఘటించుఁగావుతన్. 5.

ఉ|| గ్రావమునందునెక్కొనిన కప్పకుఁజేటికలోని చీమకేన్
హావడిగల్గకుండఁగడునాదరమేదుర చిత్తవృత్తితో
జీవికసంఘటించెడి వృష్టికవిభుండగు మాధవుండు సౌ
ఖ్యావహమైన కోర్కులనయంబిడి యామిథునంబునోముతన్ 6.

మ|| తొలుతన్ మర్దళధంధణాధణఘుఘుంఘుంఘుంకిటాత్కారస
మ్మిళితంబైఘునతాళనిక్వణము సేవింపంగహాహాహూహూముఖా
ఖిలనాకస్థితగాయకోత్తములు రక్తింబాడనానందతుం
దిలుఁడౌచ్రజికి మృగ్యమౌపదవి ప్రాప్తింపంగనౌ వీరికిన్. 7.

చ|| జనకవసుంధరాధిపుఁడు జానకిఁకిందగఁ బెండ్లిసేయుచు
ట్టనను మహర్షివర్యులఁబట్టుప్రతి భాయతుఁకే మహాత్ములం
దనయిలుసేప్పి వాకలయథార్థవిధిం గయిసేకి ట్లుస
జ్జనుఁడు భుజంగరాజు కవిసత్కృతిఁజేసెడి సూత్రపెండ్లిలోన్ న.

సీ॥ క్రమపదఘనజటార్భటీపూరితాఖిలా
కాంతరమా శ్రోత్రియవ్రాజంబు
ఘటపటశబ్దసంఘటితవాగ్వర్గంబుఁ
గురిపించుతార్కికవరగణంబు
టిద్దాణభాష్యపటిష్ఠసూత్రవిచా
సక్తమీమాంసాబ్దికసంచయంబు
దశవిధవ్యంజనధాతు గోపుచ్ఛాది
యతిపటుత్వమైన గాయకనివహము

గీ॥ ప్రీతి నీతెంచియుండ మంత్రి పెగడభు
జంగరాయలు సుతను లక్ష్మ్యంబ నిపుడు
రామనందగు సత్యనారాయణునకు
నొసఁగి యుద్వాహమును జేయుచుండెనయ్యయ్య ! 10.

సీ॥ ఈభుజంగనృపాలుఁ డెలమి సత్కవివరౌటఁ
గాంచనంబునకు సౌగంధ్యమబ్బె
నీకవివరుఁడు భూమీశవంద్యుండౌటఁ
గిమ్మకస్తురులకుఁ గాంతులబ్బె
నీసద్గుణఖనిమహీదేవకులుఁడౌటఁ
జందనాగమునఁ బుష్పంబులమరె
నీమహీదేవుండహీనగుణుండౌట
నలరుకన్నుల ద్రావఫలము లెసఁగెఁ

గీ॥ గావున నెయాంధ్రదేశసత్కవుల నెల్ల
నాదరంబున రావించి యాత్మజాత
కుపయమంబును సలుపుచునుండె నట్టుల
నెవ్వరేన్ జేసిరే ? యీమనీషి గాక. 11.

## మంగళమహాశ్రీవృత్తము.

మంగళమనారతమమందముగఁ గల్గుత సుమాకృపను దంపతులకెందున్
మంగళమనారతమమందముగఁ గల్గుతను మాకృపను భూధవునకెందున్
మంగళమనారతమమంద్రముగఁ గల్గుత సుమాకృపను దేశమునకెందున్
మంగళమనారతమమందముగఁ గల్గుతను మాకృపను సత్కవులకెందున్ 11.

## 80. ద్విభాష్యంపుల్ల కవిగారు.

వీరి నివాసస్థలము పీఠికాపురసంస్థానమందలి దుర్గవాటికయను నామాంతరముగల దుర్గాడ. ఆరామద్రావిడ బ్రాహ్మణులు. ఆపస్తంబసూత్రులు. వాలఖిల్యసగోత్రులు. వైశ్వామిత్ర, అఘమర్షణ, కౌసిక, ఋషేయము. తండ్రి జగన్నాథముగారు. తల్లి వేంకమాంబ. వీరిది పండితవంశము. మాతామహులు రాజమంత్రులు. ఆంగీరస సంవత్సర భాద్రపద శుక్ల పంచమీ ఆదివారము రాత్రి అనూరాధా నక్షత్ర ప్రథమచరణ కర్కాటక లగ్నమందు గురుకుజులు లగ్నమందును, రవిబుధులు సింహమున, తులను శుక్రుఁడు వృశ్చికమునఁ జంద్రకేతువులు, ధనుస్సునశనియు, వృషభమునరాహువునుం డఁగా ఆ 1872 సం|| సెప్టెంబరు ది 8 తేదిని వీరుజన్మించిరి. ఆంధ్రగీర్వాణములలో నాంధ్రసాహిత్యమధికము. ఉభయకవిత్వములలోఁ దెలుఁగుకవిత్వమునఁగడునిపుణులు. ఆశుధోరణియుంగలవారు. వీరి కవిత్వము పండితపామరజనరంజకంబుగా నవరసభూయిష్టమై శృంగార లతికాలవాలముగ మృదు మధురవచన రచనమ్ముల ముగ్ధులుగులుకుచు జిలిబిలిపలుకులఁదేనియలొలుకుచుండును. వీరు పదకవనమునందుఁగూడ మిగులరసికులు. వీరు జ్యోతిశ్శాస్త్రమునందును బరిజ్ఞాతలు. వైదికలౌకికప్రజ్ఞాచతురులు. మఱియును ధనస్థితికొలంతస్థైనను నిత్యాన్నదానత్యాగభోగ పరాయణులగుచు, కవిత్వమహత్వమున ననేకమహనీయులచే సన్మానింపఁబడుటయేగాక, పలువురగు పండి

త కవీశ్వరులవలన నాశీర్వదింపఁబడియు పదపద్యాదులనందియు వారి వారిని శక్త్యను సారముగసన్మానించిన వదాన్యులుగూడనై యుండిరి. వీరు శ్రీపిఠాపు॥ సంస్థాన శ్రీరాజారావు వేంకట కుమారమహీపతి సూర్యరావు బహాద్దరు జమీందారువారి వార్షికమగు వేతనమువలన గ్రామోద్యోగులై గౌరవముగఁబోషింపఁబడుచు ననేకప్రభుజనస్థానములఁబట్టాంబరసువర్ణాలంకరణములచే నలంకరింపఁబడి యత్యానందముగ సన్మానింపఁబడిరి. వీరు రచించిన గ్రంథములలో శ్లాఘాపాత్రమగు బభ్రువాహనవిజయమను ప్రబంధము, దైవికమగు వైపరీత్యమునకులోఁబడి నశించుటచే పునరుద్ధారణ ప్రయత్నమునమన్నది. నానాప్రభుజన సందర్శనసమయసూక్తియను చాటుపద్యమాలికా ముక్తావళియనునది. ప్రబంధమునకంటెఁబద్యసంఖ్యయందింత లెక్కుడుగ నుండుటయేగాక మిగులమనోహరముగ నుండును. వీరు రచించిన గ్రంథములు:- 1. శ్రీసూర్యరాయవిలాసము, 2.శృంగారరసము, స్వభావోక్తి, 3. బభ్రువాహనవిజయము. నవరస మిశ్రమము. పునరుద్ధారణ ప్రయత్నమునమన్నది. నానాప్రభుజన సందర్శన సమయసూక్తియను చాటు పద్యమాలికా ముక్తావళి, 5. నీతిగీతశతకము, 6. వేణీకలాపము, అర్ధచంద్రికాసంపుటపద్యకావ్యము, 7. దండకమండలము. దేవీస్తవాదికము. 8. శ్రీకృష్ణగోపీ జలక్రీడా భాగవతము. యక్షగానము. వీధినాటకము. 9. భజనకీర్తనలు, జావళ్లుమొదలగునవి. 10. మఱికొన్నిచిల్లరవి.

సీ॥ శ్రీరమారమణీమణీరమ్య కుచకుంకు
మంబురంబునఁ బౌరుషంబుఁదెలుప
నీళాధరాకామినీ మణులుభయపా
ర్శ్వములందు వింజామరములు వీవ
బంగారుజలతారు పచ్చపట్టురుమాలు
కాయంబుపైవింత కళలనీన

శార్ఙ్గచక్రగదాది సాధనంబులుచతు
ర్బాహుభూషణములై పరిఢవిల్ల

గీ॥ నొలయు శ్రీపతి కరుణ నాయువును సిరులఁ
గాంచెదరుగాత మంత్రి పెగడ భుజంగ
రాయరాజేంద్ర పుత్త్రికారత్నమైన
హైమవతియును సత్యనారాయణుండు.

సీ॥ శ్రీమద్రమారమణి సీమంతిని ప్రవిమల
స్వాంతపంకేజాత భాస్కరుండు
స్వర్లోక విషయగర్వ గ్రస్త దైతేయ
వాహినీవిపిన వైశ్వానరుండు
క్రోధలోభాతిశత్రుసమూహమత్తదం
తావళావీమృగ నాయకుండు
నిర్జరివానీంద్ర నికురుంబ విమలప
త్కల్హార శర్వరీకాంతుఁడైన

గీ॥ హరియొసఁగు భోగభాగ్య దీర్ఘాయువులను
ననఘమంత్రి పెగడ భుజంగాత్మజాత
యైనసీతావిజయ రమా హైమవతికిఁ
దద్వరుఁడు సత్యనారాయణోత్తమునకు.

సీ॥ శ్రీమేదినీ బాలికామానసోత్ఫుల్ల
పంకేజభాస్వత్ప్రభాకరుండు
నమితనిర్జర సంఘకమనీయమకుట సం
ఘటితరత్నప్రభాకలిత పదుఁడు

ప్రశ్నోచయోమ్నాత సారభాష్యార్థమును
 దంకురవ్యాప్తదిగంతరుండు
కరిరాడరాతి వక్ప్రభాభంజిత
 చక్రబానితకరసారకుండు

గీ॥ శ్రీరమేశునికృప వలరిదరుగాత
భుజగరాయతనూజయా విజయలక్ష్మి
పద్మమన్నాటి సత్కులవార్ధిచంద్రుఁ
డైన వేంకట సత్యనారాయణుండు.

సీ॥ శ్రీరాధికాధరామృత సుధాధారలఁ
 గ్రోలువాఁ డఖిలంబు నేలువాఁడు
వక్షస్థలమునఁ బుష్పపుఁబేరు లెన్నియో
 వ్రేలువాఁ డాగమ శాలివాఁడు
క్షణములోపలను లోకములఁ జెంపుముగింపఁ
 జాలువాఁ డఘములఁదోలువాఁడు
ననవరతంబు యోగానందవార్ధిలోఁ
 దేలువాఁడర్క్రేలఁ గ్రాలువాఁడు

గీ॥ మేలువాఁడర్థిజనముల పాలివాఁడు
కలిమిచెలిసోఁడు పామువు చిలువ తోఁడు
సకలవేషమ్ములును వేయఁ జాలువాఁడు
వాఁడుమిమ్ముకోర్కు లీడేర్చువాఁడు సేడు. 4.

సీ॥ శ్రీవనితాధవుండీ పధూవరులకు
 సిరి సెప్పుడును దయసేయుఁగాత

శ్రీభారతీశుఁడీ శోభనదాంపత్య
మునకాయువునొసంగి మనుచుఁగాత
శ్రీమేనకాత్మజా స్వామియీయాయుగళికి
శాశ్వతైశ్వర్య మ్మొసంగుఁగాత
శ్రీవిష్ణుపతికరుణా వంతుఁడగుచునీ
యమళమ్మునకవిఘ్న మహువుఁగాత

గీ॥ నరయసీతావిజయ రమా హైమవతికి
వల్లమన్నాటి సత్యదేవప్రభునకు
శ్రీమహారాజబిరుద మంత్రిపెగడ భు
జంగరాట్కృవిమాతంగ మంగళాంగ. 5..

## 81. సూరిసుబ్బారాయ శాస్త్రిగారు.

వీరి నివాసస్థానము తణుకు తాలూకా బోడపాడు అగ్రహారము. తెలుగాణి వైదికులు. ఆపస్తంబసూత్రము, భారద్వాజ సగోత్రము. తండ్రి రామావధానులుగారు. తల్లిలక్ష్మాంబ. ప్రభవ సంవత్సర మార్గశిర బహుళనవమిగురువారము జననము. వీరుసంస్కృతపండితులు. శ్రీకాశీలోఁబదమూఁడు సంవత్సరములు గురుకుల వాసముఁజేసి పతంజలిమహాభాష్యశాంతిఁజేసినవారు. వీరిని వ్యాకరణపండితులనుగాఁజేసినవారు బ్ర॥ దండిభట్ట విశ్వనాధ శాస్త్రులుగారు. ప్రకృతము విజయవాడ (బెజవాడ)లోఁ జర్చిమిషన్ సొసైటి హైస్కూలులో సంస్కృతోపాధ్యాయులు.

శ్లో॥ శ్రీసద్గోత్రభుజంగరాయ నృపతేతే భోజపామ్యంకుతః
భోజంపశ్యతి పామరేనుకవితా పాండిత్యమాగాత్కుల
త్వత్తోగౌరవనీయమాన శుభశేఖాదర్శ శేసైవతు
శబ్దశ్లేషవిశేషమాశుకవితా పాండిత్యమాపేదిరే. 1..

శ్లో॥ విద్వద్రాజభుజంగరాయ నృపతేకస్త్రాదృశోభూతలే
శ్రీరాజద్విజ రాజరాజకవిరాడ్భూపరాజ నామాఖిలు
శ్రీమన్మంజులవాణ్యుపాత్తుకృత నానాదేశ కార్యజ్ఞక
త్వన్నామ్నాయది నాగరాజ ముఖినాశేగీయతేత్వద్యశః. 2.

శ్లో॥ శ్రీమంత్రిపెగడాన్వ యోదధివిధుంపూర్ణేందు మందస్మితం
ముక్తాహారకిరీట కుండలధరం సౌరాజ్యసౌఖ్యప్రదం
ఆవంశాద్ధృతి ఛత్రచామరయుగం సద్రాజ్యచిహ్నాంచితం
శ్రీమంతం సభుజంగరాయ నృపతిం పాయాదనాదిశ్శివః 3.

శ్లో॥ కస్తూరీ ఘనసారకుంకుమలసచ్ఛ్రీచందనాలంకృతే
సామంతేపిమలేందు రత్నఖచితే వైవాహికేమండపే
పాయాసుస్సనధూవరౌ సవయసౌ సౌభాగ్యభాగ్యోత్తమౌ
ఆసీనావనిశం తదంజలిపుట న్యస్తాః పవిత్రాక్షతాః 4.

శ్లో॥ కాంచీనూపురహారకంకణ లసత్కర్ణావతం సోజ్వలాం
సీతాహైమవతీవి పూర్వకజయే నాహూతలక్ష్మీంవరః
శ్రీమద్వేంకట శబ్దపూర్వకలసచ్ఛ్రీ సత్యనారాయణః
కన్యాంపర్యణయద్వదాను మనసాంపృష్టిస్సువర్ణాపతత్ 5.

శ్లో॥ శ్రీసౌగంధ్యమదాంధ సింధుర ఘటాసంఘట్టనాద్ధుస్తరః
దిగ్గోదన్యను విస్థచంద్రవిలసత్కర్పూరదీపావళిః
మంత్రిపెగ్గభుజంగరాయ నృపతేః కన్యాప్రదానోత్సవో
భోభోస్సైఖిలదేశరాజ తనయాకల్యాణసన్మోహనః. 6.

---

## 82. కాలనాధభట్ట నారాయణశాస్త్రిగారు.

వీరు కాకినాడ తాలూకా, ఆర్యవట్టగ్రామవాసులు. వైదిక బ్రాహ్మణులు. కృష్ణయజుర్వేదులు. భారద్వాజగోత్రులు. ఆపస్తంబసూత్రులు. కాసలనాడివారు. అనితల్లికలువచేరు శాసనములోను, ముమ్ముడిసింగభూపాల అక్కలపూడి శాసనములోను పఠిహితాచార్యులయొక్కయు మల్లినాథాచార్యులయొక్కయు వంశములోని కాలనాధీయమను ధర్మశాస్త్రకర్తయయిన కాలనాధుఁడు మొదలు కాలనాధ భట్టయనుగృహనామముగలవారును వైద్యాది సర్వవిద్యా స్వతంత్రులగు వేంకటశాస్త్రులవారి పుత్త్రులును రెండు వందల యేబది రామపట్టాభిషేకములుచేసి యిరువదినాలుగు శ్రీమద్రామాయణ ప్రతులువ్రాసి భుక్తులసదక్షిణ గానిచ్చిన వెంకన్నగారి పౌత్రులును దమ పూర్వులవలెఁదామును వైద్యవిద్యా స్వతంత్రులును వేదాంతములయందపరశంకరులును యజుర్వేదమందు సాంగాధ్యాపకులును, నిర్విఘ్నముగనిరువదియైదువత్సరములు స్మార్తాగ్ని హోత్రము నొనర్చిసప్తపాకయజ్ఞములు చేసిన సూర్యనారాయణశాస్త్రిగారి కనుజులైవారివలనఁ దమవలెసర్వవిద్యలుఁగఱపఁబడివానియం దాచరణము గలిగినవారును, ఉభయభాషాపటిమగలిగి బాణాసురవిజయమను నొకచంపువును, హనుమద్విజయమను నొకగ్రంథమును సంస్కృతమునఁజేసిరి. ఆంధ్రమున శ్రీరామశతకమును రచించిరి.

శ్లో॥ గుహావిహారివారహార్యమానగుహా విహారక
స్పహామహాః ప్రవర్ధనోగుహాతిశాయివిక్రమః
అహార్యరాడ్ధరోహారివజ్ర హీకృతాహిమర్దనః
శ్రియామ్ఘభాని సంతతం భుజంగరాట్పుతాపతేః 1.

శ్లో॥ ఇలాకులాచలా కలప్రలాలపాదరాంచితః
కలాపిలాంఛనప్రియః వలాశనేశనాశనః

బలారిసచ్ఛిలాభరుక్కలాధరాధిసేవితః
శ్రియాచ్ఛుభాని సంతతం భుజంగరాట్సుతాపతేః. 2.

శ్లో॥ సురాసురాదరార్చితో మురాంతకః పరాత్పరః
కరారవిందమూర్తి మద్దరాది పంచలక్షణః
ఇరాభరాక రామరారిరాజరాజివారకః
శ్రియాచ్ఛుభాని సంతతం భుజంగరాట్సుతాపతేః 3.

శ్లో॥ ఘనాఘనాభవిగ్రహో ఘనాఘనాశనః పరో
వనాశనావనేరతః కునాశనస్వనాతినః
ననాటనా ప్తకానవాట నాగపాలనాదరః
శ్రియాచ్ఛుభాని సంతతంభుజంగరాట్సుతాపతేః 4.

శ్లో॥ యమాదిమాష్టయోగయుక్ప సూధిగమ్యచిష్టనః
కుమాసమాదిరార్చ తాంఘ్రు రాదపూరుషః పరః
క్షమాసమాభిమానభృచ్ఛ్రమాదిరాక్షసాంతకః
శ్రియాచ్ఛుభాని సంతతం భుజంగరాట్సుతాపతేః. 5.

## 83. మైనముపాటి హనుమంతరావుగారు.

వీరి నివాసస్థలము వంగిపోలుతాలూకా మైనముపాడు. ఆఱువేల నియోగులు ఆపస్తంబ సూత్రము. భారద్వాజగోత్రము. తండ్రి సీతారామయ్యగారు. తల్లి పుల్లమ్మ. విజయసంవత్సర చైత్రబహుళ త్రయోదశి జన్మదినము. ప్రస్తుతము వంగవోలు ఏ. బి. యం. హైస్కూలులో స్కూలు పైనలు విద్యార్థులు. అన్నలు రాఘవరావుగారు వెంకటప్పయ్యగారు. వీరు రచించిన గ్రంథములు:—1. రంగనాయక తారావళి. 2. తానీషా. (విషాదనాటకము.)

ఉ॥ శ్రీమహనీయరూపగుణవిశేష, సముంచిత వాగ్విలాస, యా
భూమిధరాత్మజాత, పరిపూర్ణదయాకర, లోకమాత, మా
కామితముల్ సతంబు ననుకంపమెయి న్వెలయించుతల్లి, మా
హైమవతీవధూటి మన హైమవతిం బతితోడఁ బ్రోచుతన్. 1..

ఉ॥ కూఁతువివాహమంచుఁ గవికోటులఁ బిల్వఁగఁ బంచివారిచేఁ
గైతలనందివారలను గారవమొప్పఁగ నాదరించి వి
ఖ్యాతిదిగంతభూముల నఖండముగా నెలకొల్పినట్టి యి
ఖ్యాతతపుణ్యమూర్తి సుజనావనదక్షు భుజంగరాయనిన్
భూతనయామనోహరుఁడు పూర్ణచిరాయురుపేతుఁ జేయుతన్. 2..

సీ॥ జిహ్వాద్వయంబునఁ జెలఁగియుండుటఁజేసి
యేకజిహ్వాత్వంబు నిలను నిలుప
నిమ్నరంధ్రాన్వేష ణమ్మొనర్చుటను రం
ధ్రాన్వేషణత్వంబు నడఁగఁజేయ
నేలపైఁ బ్రాకుటంజేసి దుష్టగణంబు
నేలపైఁ బ్రాకించు నేర్పుసూప
పక్షపాతంబున బాధఁజెందుటఁజేసి
పక్షపాతగణంబు భంగపఱుపఁ

గీ॥ గోరితొలిభవ మందలి కొదువ లెల్లఁ
దీరిచికొనంగ వచ్చియుదీర్ణలీల
నవతరించిన భుజగుఁడో యనఁగమించె
నమలయశుఁడు భుజంగరాయాభిధుండు. 3..

సీ॥ మహనీయకావ్య నిర్మాణ ధుర్యులరవ
భవదీయకృతకావ్య పాళిసాక్షి

పండితసమ్మాన్య భావములరసమీ
సకలాంధ్రపండిత సభయెసాక్షి
అతులసంపద్విరాజితులన మీకున్న
రాజాది బిరుదవర్గంబెసాక్షి
ధర్మమార్గానువర్తన తత్పరులన మీ
కాంతమెుల్కొడిముఖ సరణిసాక్షి

గీ|| ఇన్నిఁటికిమీరుకీర్తి యత్యున్నతముగఁ
బర్వఁగఁడుఁజెన్ను మీఋనీ యుర్విసాక్షి
మంత్రిపెగ్గడవంశ్య ! సమ్మాన్యచరిత
సకలజనగేయ ! రాజాభుజంగరాయ ! 4.

ఉ|| ఆయతచారులోచనుఁ డపూర్వతితేజుఁడభీష్టసిద్ధుఁడుం
బాయక యెల్లవేళలను భక్తులకోర్కుల దీర్చువాఁడునా
రాయణుఁడబ్జకుంబియుఁడు రాజలలాముఁడు శౌరిసత్యనా
రాయణులక్ష్మితోడ ననురాగునిఁజేయును గాతసర్వదా. 5.

## 84. ఎడపల్లి శంకర సోమయాజిగారు.

వీరి నివాసస్థలము కృష్ణా డి|| తాలూకా నందిగామ. తెలుగాణి వైదికులు. ఆపస్తంబసూత్రము. ఆత్రేయసగోత్రము. తండ్రి అప్పయసోమ యాజిగారు. తల్లి సీతాసోమి దేవమ్మగారు. వృష సంవత్సర మాఘ బహుళ అష్టమి వీరిజననము. ఆమూలాగ్రముగఁ గృష్ణయజుర్వేదము మూలమును, ఆధానపంచకము శ్రౌతమును, గర్భాధానాది షోడశకర్మలను సంస్కృతాంధ్రకావ్యములును, కర్మకాండ ననుసరించిన యావద్ధర్మశాస్త్రమును, జ్యోతిష శాస్త్రమును, ఆమూలాగ్రముగ శైవాగమమును అధ్యయనించి విద్యార్థులకుఁ జెప్పుటయెగాక దక్షిణవల్లూరు యెస్టేటు రాజావారి యిలాకా

కొప్పాక మొదలగు వింశ ననేక స్థలములయం దాచార్యత్వము వహించి శైవాగమ, స్మార్తకర్మలును, సికింద్రాబాదు మొదలగు ననేకస్థలములయందు నేత్రావధానములును, మహాపండితాగ్రేసరుల యెదుట నిరాతంకముగా నెరవేర్చి, ఆగమజ్ఞ, శిఖామణి, యాజ్ఞికాగ్రణి, నేత్రావధాన వేది, యనుబిరుదములతో బంగారు పతకములను బహుమతుల నందిన వారు. ఇపుడు లక్షణగ్రంథములఁ జదివి కవిత్వముఁ జెప్పుటయేగాక కష్ట సాధ్యమగు నేత్రావధానములతో సహా, అష్టావధానమును జేయుచున్నారు. మఱియుఁ గర్మకాండ ననుసరించిన ధర్మశాస్త్రములయందుఁగల రహస్యాంశములను, ఆంధ్రీకరించుచున్నారు.

“శతమానంభవతి శతాయుః పురుషః శతేంద్రియ ఆయుష్యే వేంద్రియే ప్రతితిష్ఠతి.”

ఉ॥ శ్రీకరుఁడవ్యయుండు సురసేవితుఁడాద్యుఁ డనంతుఁడుర్విలో
భీకరుఁడాది ఘోణి సుమబాణునితండ్రియనారతంబునీ
లోకములెల్లనిండి మనలోనసియించెడు శౌరిలక్ష్మియున్
మీకొనగూర్చు నెప్పుడును మీరలుకోరిన కోర్కెలన్నియున్. 1.

ఉ॥ నూరజనాళివింగనినఁ జూపవలెంగడుభక్తి, బీదల
న్నోరుపుతోడఁ గావవలె నుండినయంత కొలందిదంపతుల్
మీఱిన ప్రేమలన్నొకరి మీఁదమఱొక్కరు జూపఁగావలెన్
ఈరు ప్రవేశమున్ననిన యింటికపారపు కీర్తి తేవలెన్. 2.

గీ॥ నేనుముక్త్యాల పల్లురాస్థానములను
మన్ననలఁబొంది బిరుదులంగొన్నవాఁడ
వేదశాస్త్రాది బహువిద్య విదుఁడనిట్లు
ప్రేమ కడపల్లి శంకర సోమయాజి.

## 85. ఓంకారము గురవరాజ కవిగారు.

వీరి నివాసస్థలము నెల్లూరుజిల్లా కనిగిరిదుర్గము తాలూకా నల్లగండ్ల గ్రామము. ప్రస్తుతము విద్యార్థిత్వమున గుంటూరుజిల్లా నరసారావుపేట తాలూకా కొప్పురములోనుండిరి. కాస్యపగోత్రులు. తండ్రి వెంకటసుబ్బ రాజుగారు. తల్లి రామానుజమ్మగారు. జన్మదినము జయసంవత్సర కార్తీక బహుళ పంచమీ సోమవారము. ఆశుకవిచక్రవర్తుల శిష్యులు. అష్టావధానా శుకవిత్వముల నిప్పుడిప్పుడే యభ్యాసపడుచుండిరి.

శా॥ రాజశ్రీసత్కవితాభివర్ధనత గీర్వాణాంధ్రభాషాద్వయిం
దేజస్ఫూర్తిఁగొనంగఁజేసిన జగద్విఖ్యాత కీర్త్యున్నతుల్
భోజక్ష్మావరు కృష్ణరాయనరపాలున్ మున్న మఃకారమే
తేజంగాంచఁగ నప్పులట్టిరు భుజంగోర్వీశుఁడో సత్కవుల్. 1.

ఉ॥ ఏతరుణీమతల్లికృప యించుకఁబర్వినఁ బోవు లేములే
నాతికి గేహమబ్జము జనార్దనుఁడే పతి జీవితేశుఁడే
శీతకుగంగలోచనకు వేల్పుచెలుల్పని కత్తెలాసరో
జాతదళాక్షి లక్ష్మికృప నాకు నధూనరుల న్నితాంతమున్. 2.

మ॥ మురువుంజూపి రమాసతీమణికి సమ్మోదంబు ప్రాపింపభా
స్వర వైకుంఠపురీ నిశాంతము మునీశవ్రాత మున్వీడిసు
స్థిరచిత్తంబునఁ బాలవెల్లినడుమన్ దీప్యత్సుఖంబందుశ్రీ
ధరుఁడాశ్రాంతము నీవధూనరుల నొందంజేయుతన్ సౌఖ్యమున్. 3.

మ॥ కరిచర్మంబును బన్నగేరులును భిక్షాపాత్రముంగాంచి యీ
శ్వరుఁడీతండను మాకుమారికిఁడో ప్రాణేశుఁడంచుల్లసం
బురహింజూపెడి చెల్మికత్తియల పెంపుం దమ్మికై నాగియా,
శ్వరుసుదాప్తపా పుకోళఁజెల్చిన యుమామాతాశీ మిమ్మేలుఁగా.

శా॥ రాజాబాహాదరాది మేల్బిరుదముల్ రాజిల్లనెవ్వాఁడు రా
రాజుల్ సత్కవిరాజులున్ బొగడఁగన్ రాజ్యప్రతంత్రంబులన్
దేజుంగాంచియు సత్కవిత్వకలనన్ విద్యావిశేషమ్మునన్
భ్రాజత్కీర్తిని గొన్నరాట్కవిసుతం బ్రాపించుఁగళ్యాణముల్.

సీ॥ మీతల్లిదండ్రులమేయ సౌఖ్యాఢ్యులై
కనికరమ్మున మిమ్ముఁగాంచుచుండ
స్తుతభావసౌభాగ్యవతి హైమవతి భవ
దర్ధాంగియానంద మందుచుండ
మీయుత్తమాములు శ్రేయస్సమున్నతి
వంశాభివృద్ధిగా వఱలుచుండ
సోదరీసోదరా మోదంబుతోడ మీ
యెల్లబంధువుల మేలెసఁగుచుండ

గీ॥ నవనిమీయిల్లె యిల్లుగానమరుచుండ
మఱపురానట్టి చెలిమిమాపమ్మరయుమయ్య
గాజదోంకారవుంగురు రాజకవిని
అమలగుణధుర్య సత్యనారాయణార్య 6.

## 86. గుండు సోమనాథశాస్త్రిగారు.

వీరి నివాసస్థలము ఖాశింకోట. కరణకమ్మవైదికులు. ఆశ్వలాయన సూత్రము. అగస్త్యగోత్రము. తండ్రి బుచ్చయ్య శాస్త్రిగారు. తల్లినరసమాంబ. ఆనందసంవత్సర ఆశ్వయుజ మాసమందు జన్మించిరి. వీరాంధ్రగీర్వాణసాహిత్యములందును, వ్యాకరణశాస్త్రమందును, సంస్కృత కవిత్వమందును ప్రవీణులు. పెక్కురను సాహితీవంతులనుగాఁజేసినవారు. వీరుచాలకాలమునుండి ఖాశింకోట సంస్థానాధిపతులగు శ్రీమాన్ వేంకటాచలము పంతులువారి యా

స్థానవిద్వాంసులు. వీరు రచించిన గ్రంథము, భీమవిక్రమము. వ్యాయోగము. అముద్రితము.

శ్లో॥ కళ్యాణాంకలధౌతకాంతి కలితః కళ్యాణసత్కార్ముకః
కళ్యాణాంబరబాణపాణిరనిశం కళ్యాణనామోజ్వలః
కళ్యాణాలయసర్వసద్గుణనిధిః కాంతోజ్వలద్విగ్రహః
దంపత్యోర్విదధాతుశంభురుమయాసాకంసదానందధీః 1.

శ్లో॥ గౌరీపాదపయోజ సంగ్రహావిధౌ ప్రస్విన్న సర్వాంగుళిః
పాషాణాక్రమణా సహిష్ణురసకృన్మంచన్ని వాలంబయన్
పర్యాయేణపదానిసప్తవిధిన ద్యోంకారయానీలయా
దంపత్యోరమ రాగమాకలయతాదన్యోన్యమావ్యక్ష్యనః

శ్లో॥ మార్కండేయ సమాయుపౌవితను తాన్మార్తాండచంద్రానలై
ర్భాస్వత్త్ర్యంబక సుందరాశ్యరుచిరస్సేత్రరాకరో ష్ఠోజ్వలః
శ్రీగౌరీపరిరంభ సంభృత లసత్కాశ్మీరవక్షస్థల
మృత్యుంజయనామశోభితయశా బాలావిమాదంపతీ. 2.

శ్లో॥ కాంతాంవక్షసితత్సహోదరయుగంనేత్రేచ హారావళీ
బిభ్రత్తత్పితురంకగస్సకుతుకో నాథేచతన్మందిరం
పాయాద్ధామవతాంవధూంవరమిమం శ్రీసత్యనారాయణం
దత్వాయుశ్శతమక్షయాఖిలసుఖంప్రీత్యంచలక్ష్మీపతిః 3.

## 87. ద్వివేదినారాయణశాస్త్రిగారు.

వీరి నివాసస్థలము వింజరము. ఆరామద్రావిడులు. ద్రాహ్యాయణసూత్రము. భారద్వాజగోత్రము. తండ్రివేంకటరామశాస్త్రిగారు. తల్లిశాగాంబ. సర్వధారి సంవత్సరమాఘశుద్ధైకాదశి జన్మదినము. వీరుసామవేదమందును,

సంస్కృతాంధ్రసాహిత్యములయందును. నుభయకవిత్వములయందును ప్రవీణులు. వీరు స్వగ్రామమున సంస్కృత పాఠశాలలోఁగొంతకాలము ఉపాధ్యాయులుగానున్నవారు. మద్రిమండలస్థ సంస్కృతకలాశాలా పరిశోధకులగు, రా. కృష్ణమాచార్యులవారివల్ల బాలసరస్వతీ బిరుదంబును, కాకినాడ తాలూకా బోర్డు ప్రెసిడెంటు గారగు గంటిసుబ్బానాయఁడుగారివల్ల, ఉభయభాషాకవిబిరుదంబును బొందినవారు. ప్రస్తుతము, ఎర్నగూడెము, గౌరీపట్నము ప్రాప్రయిట్లగు చిత్రాడగ్రామవాస్తవ్యులనగు శ్రీరాజాచెలికానిలచ్చారావుగారియొద్ద నాస్థానపండితులుగనున్నవారు. వీరు రచించిన సంస్కృతాంధ్ర గ్రంథములు:—1. శృంగారరసాయనభాణము, సంస్కృతము. 2. స్తోత్రరత్నావళి, సంస్కృతము. 3. విక్రమోర్వశీయనాటకము, సంస్కృతమునకుఁదెనుఁగు. 4. రత్నావళి, సంస్కృతమునకుఁదెనుఁగు. 5. జానకీపరిణయనాటకము, సంస్కృతమునకుఁదెనుఁగు. 6. రుక్మిణీకళ్యాణము, అచ్చతెనుఁగు, 7. హాస్యసుధానిధి, (బిడ్డచట్టీయము) 8. రసాభాసము, 9. మురారిశతకము. ప్రస్తుతము కాళికాపురాణము ఆంధ్రీకరించుచున్నారు.

శా॥ శ్రీరాజీవ ముఖీపయోధరలసచ్ఛ్రీగంధసంవాసిత
స్ఫారోదారభుజాంతరుండు ధరణీభామామనోభర్తగం
భీరస్వాంతుఁడనంతుఁడాశ్రితజన ప్రేష్ఠుండు విష్ణుండుప్రా
గ్భారంబొప్పఁగ నీవధూవరులఁదాఁగారుణ్యభావంబునన్. 1.

శా॥ శ్రీవాణీకలభాషిణీ హృదయనీరేజాత భానుండుచి
ద్భావుండిద్ధలలాటలేఖనకళావ్యాపార పారీణుఁడున్
దేవేంద్రాది సురాభిపూజితుఁడునై దీపించులోకత్రయీ
దేవుండీవుతనీవధూవరులకున్ దీర్ఘాయురారోగ్యముల్ 2.

ఉ॥ శ్రీయువతీ లలామయయి నశేషసురార్చితుఁడైనయాదినా
రాయణమూర్తియున్ భుజగరాయయనుంగుఁగొమార్తయైనసీ

తాయికిం బ్రస్తుతి ప్రియయుం డుదారగుణాఢ్యుఁడునైన సత్యనా
రాయణరావుకున్ సిరిఁ జిరాయువొసంగుతఁ జేర్మితోడుతన్ 3.

సీ॥ వాణీవిరించులవలె నుందురందుమా
వారికే వోకాంతపోరు కలదు
శ్రీకేశవులరీతిఁ జెలఁగుదురందుమా
వారిక్కైనను లోటు వరలుచుండె
యులపార్వతీశులవలెనుందు రందుమా
వారికైనఁ గొంతపరిధవిల్లు
రతిమన్మథులపోల్కెఁ గాలుదు రందుమా
వారికైనఁ జెనరునారడియును

గీ॥ భళిర ! యీదంపతీ కృతభాగ్యమహిమ
యేటిలోటునుగనసున్న యేడనైన
సిరికిని సరిసాటియై వెలయుమంత్రి
సకలసుకవీంద్రగేయ భుజంగరాయ 4.

శా॥ పార్వత్యాః పరిణీతిమంగళ సభాంతర్భేశహస్తంపున
ర్జ్ఞాత్వాబహుణమితీశభూషణ చయోనన్మహోత్తమాంగో జ్ఝ
పశ్యంల్లజ్జగదీశ్వరః ప్రహసితో హస్తేన సందర్శ్యచ
దేవ్యాఃపాతువధూవరౌ సకరుణంచంద్రార్ధచూడామణిః. 5.

## 88. బొగ్గవరపు శ్రీరామ శర్మగారు.

వీరి నివాసస్థానము త్రిపురుషోద్దేశముగ గుంటూరు జిల్లా వినుకొండ తాలూకా చిలాపురం అగ్రహారము. ఆఱువేలనియోగులు. ఆపస్తంబసూత్రము. భారద్వాజసగోత్రము. తండ్రి సుబ్బరాయకవిగారు. తల్లిసీతమ్మగారు. విరోధికృత్సంవత్సర చైత్రబహుళ 30 బుధవారము, అశ్వనీ నక్షత్రయుక్త

జన్మదినసము. పితామహుఁడు పాపరాజామాత్య భూషణము. వీరాంధ్రగీర్వాణభాషాభిజ్ఞులు. మిశ్రభాషాకవితాభిజ్ఞులు. “విగతభవపాశ ! అలవాలవేంకటేశ” అని భాగవతకథతో సీసశతకమును జేసిరి. వీరికి పితృగారైన సుబ్బరాయకవిగారు అన్నివిధముల నాజనకసముఁడే “భద్రగిరిసీతారామచంద్రప్రభో” అని రామాయణకథతో శతకమును జేసిరి. (మూఁడు యామములలో) వీరు వడ్లమన్నాటి వేంకటాచల ప్రభువుగారియొద్ద నాస్థానపండితులు. విశ్వగుణాదర్శము తెనుఁగు సవరణకర్తలు. వీరు పెక్కురను బంచకావ్యములను బఠింపించిన విద్యాప్రదులు. వీరీ యీ శ్రీరామశర్మగారికి ఫాలమందు పాదతాడితకమిడి, “ఒ, న, మః,” మొదలు, ఆంధ్రగీర్వాణ సాహిత్యపారంగతునిగఁజేసిరి. ఈశ్రీరామశర్మగారును వైదిక వైష్ణవనియోగి భేదవృత్తిలేక, మూకులకు మురారినాటకము వఱకు సాహిత్యకవితా విశేషబోధనలు యవారు గద్వాలమొదలు సంస్థానములలో రాజీనాస్వీకారులైయున్నారు. మోపాసకులుగాన, “రామవిభుండు మనపాలఁగలండు విచారమేటికిన్” అనుమకుటముతో శతకముం జేసిరి. బళ్లారి జిల్లావారపనహళ్లిలో వడ్లమన్నాటివేంకటాచల ప్రభువుడిస్ట్రిక్టకలెక్టరుగానుండి తాలూకా గుమాస్తాపనినిచ్చి చేయించిరి. తర్వాత నిప్పటికి సంవత్సరము క్రిందటివఱకు ఆచితాపురగ్రామ గ్రామణిగానుండి ప్రస్తుతము నరసరావుపేటలో స్థిరమైననివాసమందిరమును, ఏర్పరచుకొని సకుటుంబముగ వాస్తవ్యులయిరి.

మ॥ తనుసౌఖ్యంబున, గానమాధురిని, గాత్రశ్రోత్ర పర్వంబుఁగ్ర
న్ననఁగల్గించుచు, సృష్టికార్యమునకున్, వాఁదోడు జేఁదోడునై
యనుమోదంబిడువాణి, నాస్యగృహ మందత్యంతమాప్రేమని
ల్పనలోకేశ్వరుఁ డివ్యధూవరుల సప్రేమమ్ముగాఁ బ్రోచుతన్.1.

సీ॥ కులుకు వెలందితోఁ బలుకఁ బ్రాఁజదువులఁ
గన్నతెలుపు, తెద్దఁగన్నవాఁడు

కడకంటమడివోని కలుముల కెలయించు
కలుముల జవరాలు గలుగువాఁడు
కొలలనువిదళింపఁ గలుగు వేలుపుశేటి
మిన్నునుగూఁతుగాఁ గన్నవాఁడు
వేఁడివెలుంగు రేవెల్గు జోదునుగనుల్
రాజగాలను నేలఁ గలుగువాఁడు

గీ॥ పాలమున్నీటి తరగలఁదేలువాఁడు
మన్నుమిన్నునుదానయి యున్నవాఁడు
నైన వెన్నుఁడుప్రోచునీ యాలుమగలఁ
గోరుకోరిక లెల్లఁ జేకూరఁజేసి. 2.

మ॥ సురలున్ సర్వదిశాధిపుల్ ప్రముఖులున్ జోహారులర్పింప, నా
హరియున్ స్రష్టయు,సృష్టికార్యములుఁ గర్తవ్యంబులుండల్పఁగన్
గిరిరాణ్ణందనియర్ధదేహమున రాణింపంగ భద్రాసన
స్థిరతన్ వెల్గిన రాజశేఖరుఁడు రక్షించునిమ్మున్ దంపతుల్. 3.

సీ॥ పిలిపించెనేమేటి ప్రేమదైవాఱంగ
సుకవిపండిత కదంబకము శేఁడు
పెట్టించెనేమేటి ప్రీతిమైనిష్టమ్ము
ప్తొన్నముత్కలప్తి మేకాధ్వరముగఁ
గప్పించెనేమేటి కాశ్మీరపున్ సేల్వ
లిమ్ముగావిద్వ జ్జనమ్ములందు
వెలయించెనేమేటి విమలయశంబఖి
లాశాంగనామణీహాసితమనఁగ

గీ॥ నట్టిసుకవి ప్రభుప కేణ్యునఖిలగణ్యు
భుజగభూపాలదేవేంద్రుఁబుణ్యసాంద్రు

వరగుణనిధాను సుకవితావర్ధమాను
శ్రీసతీవల్లభుండు రక్షించుఁగాత. 4.

సీ॥ కవిరాజభరణ జంగమదేవతాభూజ
భూజన స్తవనీయపుణ్యతేజ
తేజఃప్రభావసాధిత సర్వరిపురాజ
రాజన్మహాభాగ్య రాజరాజ
రాజీవలోచనారసికత్వరతిరాజ
రాజతాచల శివప్రాగావరాజ
రాజాశ్వరాజ నిర్మలకీర్తిసురపూజ
పూజనీయోజ్వల పుణ్యగణ్య

గీ॥ గణ్యమంత్రిప్రెగడ భుజంగనృపవర్య
ధైర్యజితహేమనగవర్య ధరణిధుర్య
సతిసుతభ్రాతృజామాతృసహితుమిమ్మ
విధిహరిహరులు ప్రోతురు విహితగతుల. 5.

## ఉత్పలమాలిక.

శ్రీరమణీశశంకరు లచింత్యపవిత్ర చరిత్రులిప్పుడే
లూరుపురీవరంబునను లోచనసంపదసార్థకంబుగా
హరివివాహవేళయని హైమవతీ సతిసత్యవేంకట
స్మారమణీశయుక్తరని సర్వసుపర్వసమేతులైనయా

పారసగర్భవాసవుల సారెకుఁజూచి జయాదిహోమమం
దేరసయుక్తహవ్యములు నిర్మలనిస్తులచిత్తులైనవే
సారెకునారగింపనహసాదని వారును వారివారలం

గూరిమిఁబిల్చుకొంచుఁ దమకోరిక దీరభుజించువేళని
స్సారపుగూరలేనహి ససారమునన్నము భక్ష్యభోజ్యముల్
నోరులు మారఁజేయుఁగదనోష్య పదార్థములేశమైనలే
దోరిటనూరుగాయలు మహోన్నతరుచ్యములంచుఁదించుమం
దారసుమాళి గంపలునవారితము న్వెసఁ గుస్మరించిరా
ఘోరిమృదంగతమ్మట విభేదము గ్రామ్యముగాకయుండదన
ట్లారమణీయులాస్యగతి లాలసపల్కులుగల్లు హేమరిం
భోర్వశిఁగూడి పాడఁగ విమోహితచిత్తులు విప్రులెరిప
హార్వరమణీయతంచనిరి వైశ్యులుబాహుజులప్పుడేతిమిన్
సారెకుఁగూడ యత్నములె సల్పిరిపాదజులేమనన్వలెన్
ధీరులువేదవేత్తలును దివ్యము భవ్యమటంచుఁబల్కుచున్
సారెకునాది దంపతులె సాటికి మాటికి వీర కంచువే
దేరితవాక్యవైఖరివదించిరి నూరు పదారువర్షముల్
గూరిమిఁబుత్రపౌత్రులను గుంపులు గుంపులు గాఁగనన్వలెన్
ధారుణినన్న యప్పుడితధా స్తనిరామరి శంకరుల్ దయన్. 6.

## 89. బొగ్గవరపు రామకృష్ణశర్మగారు.

వీరి నివాసస్థలము గుంటూరుజిల్లా వినుకొండ తాలూకా చితాపురము అగ్రహారము. ఆఱువేలనియోగులు. ఆపస్తంబసూత్రము. భారద్వాజస గోత్రము. తండ్రి శ్రీరామశర్మగారు. వికారిసంవత్సర శ్రావణ బహుళ రా ఆదివారమర్ధ రాత్రివేళ శ్రీకృష్ణోద్భవకాలమందు జనించిరి. ఇప్పటికి పదు నేను సంవత్సరములు. నైషధకావ్యము పఠించుచున్నారు.

శ్లో॥ శ్రీమంత్రి పెగడ శ్రీమద్వద్దమన్నాటి సంశజా
రాజాభుజంగరావ్వేంకట్రామ ప్రభుసుతావిమా 1.

శ్లో॥ శ్రీహైమవతి సీతావిజయలక్ష్మ్యో ముదోద్వహన్
శ్రీమద్వేంకట సత్య శ్రీనారాయణవిభుర్విభౌ. 2.

శ్లో॥ యథాగౌరీపరిణయే శంకరోలోకశంకరః
సీతాపతీరుక్మిణీ శావివాోద్వాహమహోత్సవే 3.

శ్లో॥ యావద్వసుమతీభాతి యావచ్చంద్రదివాకరౌ
తావదేతౌవరౌ పుత్రపౌత్ర నప్తృభిరావృతౌ
మహదైశ్వర్యసంయుక్తౌతిష్ఠేతామాశిషాసతాం. 4.

శ్లో॥ యావత్తిష్ఠతి కాశ్యపీశ్వరకృపా సంశోభితానందితా
యావచ్ఛంకరభాష్యసార లహరీసద్బుద్ధిభాజాంహృది
యావద్రామకథా సుధామధురిమా యావద్భవశ్శంకర
స్తావత్పుత్రకపౌత్రనప్తృసహితావాస్తావిమౌదంపతీ. 5.

శ్లో॥ యావచ్చంద్రదివాకరౌగగనగౌ యావద్ధ్రువస్సుస్థిర
స్తారామండల మభ్రగంహరిహరౌ రక్షాభిశిక్షాకరౌ
ధాతాస్థావరజంగమ త్రిభువన ప్రస్తావనలోర్ధ్వంజ్వలే
త్తావత్పుత్రకపౌత్రనప్తృసహితా వాస్తావిమౌదంపతీ. 6.

## 90. బులుసు మల్లుసోమయాజులుగారు.

వీరి నివాసస్థలము గోదావరి జిల్లా రాజవోలు తాలూకా పొడగట్ల పల్లి రామచంద్రపురము. వెలనాటి వైదికులు. ఆపస్తంబసూత్రము. గౌతమస గోత్రము. తండ్రి షడంగసహితవేదాధ్యయన సంపన్నులు అగ్రహీతల్గను వెంకయ్యగారు. తల్లి సుబ్బమ్మగారు. వృషసంవత్సర మార్గశిర బహుళ చతుర్థిజన్మదినము. వీరు వేదమందు ఘనాంతమునకును త్రిభాష్యము వ్యాప శిక్షవగైరాలక్షణగ్రంథములయందును శ్రౌతమందును, ఆధానపంచకమునకు కును స్మార్తమందుఃబూర్ణముగాను సాహిత్యమందు సంస్కృతములోను

ప్రవీణులు. వర్తమానమువఱకు వీరు ఈగ్రామ సంస్థానాధిపతులగు కందుకూరి లక్ష్మీప్రసాదరావుగారు చేయించిన ప్రమాదీచ సంవత్సర శ్రావణీసభయందు అగ్రేసరత్వమును వహించి యున్నారు.

శ్లో॥ అంకేనాథునిషేదివాన్ గిరిసుతా వక్షోజదుగ్ధంపిబన్
వస్యోరోజజిఘృక్షయాం నిజకరం వ్యాకుచ్య చాపల్యతః
వక్షోజేసతి తత్ర తద్గతఫణిన్ దృష్ట్వామృణాళాంకుర
భ్రాంత్యాసాదరమస్పృశత్సగణితామ్ పాయాదిమాదంపతీ. 1.

శ్లో॥ శ్రీమద్భూరిభుజంగరాయ విదుషంపుత్రీ వివాహోత్సవం
ద్రష్టుంసమ్యగుపేత్య శైల తనయా శ్రీసత్యనారాయణః
తన్నామ్నాలసత్ శ్రియం వరవధూయుగ్మస్య దీర్ఘాయుషం.
దత్వారక్షతుపుత్రికాతతి మరం వృద్ధిప్రవర్ధోన్నతిః. 2.

## 91. భువనగిరి విజయరామ శాస్త్రిగారు.

వీరి నివాసస్థలము గుంటూరు. తెలుఁగునాటి వైదికులు. ఆపస్తంబసూత్రము. భారద్వాజగోత్రము జనకతండ్రి పట్టాభిరామ సోమయాజులుగారు. తల్లి బ్రహ్మేశ్వరమ్మ. పాలకపితపట్టాభిరామ శాస్త్రిగారు. తల్లి రంగనాయకమ్మ. తారణ సంవత్సరమాఘశుద్ధ ౧౫ జన్మదినము. గుంటూరు కలెక్టరుకచెహరీలోనుద్యోగము. 1. జీవయాత్ర, 2. భీష్మచరిత్ర, 3. హరిహరనాధశతకము, 4. మతవైచిత్ర్యము. ఇవి వీరిచే రచియింపఁబడినవి.

శా॥ శ్రీకళ్యాణగుణాకరుండు, సుఖసంజీవుండు, సంతానభా
గ్యాకల్పుండు, యశస్కరుండు, శుభగవ్యాపారి, యోశౌరి, యా
యాకాలంబుల, నీవధూవరుల కాయాభావసంభావనో
త్సేకుండై, సతతంబు వీరలను, ధాత్రీప్రేమరక్షింపుతన్. 1.

సీ॥ ఇచటసంగీత సాహిత్యసభల్ గూడె
రావమ్మ నీవుసరస్వతమ్మ !
ఇటనిత్యకళ్యాణ మెసఁగుచున్నదిరమ్మి
లక్ష్యమిందిడి వేగలక్షుమమ్మ !
ఇందువేదాళి కహీనసత్కృతిగల్గె
రావయ్యయిటుబమ్మదేవరయ్య !
ఇటభక్తజనులు నిన్నెగొల్చెడినిరమ్మి
ధీయుక్తిచెలఁగ నారాయణయ్య

గీ॥ యనుచువేంచేసి విప్రయుగ్మాళినిలిచి
సేసలిడికోర్కులన్నియుఁజెల్లునట్లు
దీవనలసల్పుచున్నారు దేవతలిట
సత్యహైమవతులకు భాస్వన్మతులకు. 2.

సీ॥ గుత్తులైనెత్తావిఁగురియు పుష్పవనంబు
నందురఘుమ్మను తేంట్లయారవంబొ
చిగురుటాకులకునైజేరి సందడిఁబాటు
శుకపికాలాప విశుద్ధరవము
అత్మరవాను గుణ్యధ్వనింబ్రతిపాయు
పికజాతసముదయోద్వేగరవము
మందమందానిలస్పందమాన శిఖావ
తీనాట్యసహితసుధ్యానమొక్క

గీ॥ నాఁగఁదనరు మనోహరరాగములను
బ్రీతసైతివటంచు విఖ్యాతవాణి
కాయుదునలఁకేరి మంగళహారతి నిడె
సత్యహైమవతులకు భాస్వన్మతులకు. 3.

సీ॥ మినుకు మినుకుమంచు మెఱయుటే గాని సు
స్థిరకాంతిగలదె వసిష్ఠుకాంత
కధికుఁడే తేరంగ ననుమానమే గాని
యొసఁగునే స్థిరభూతి యింద్రుసతికి
ప్రౌఢకవిబ్రహ్మ బరఁగునంతకె గాక
స్థిరమైత్రిగీర్బ్రహ్మలరయఁగలరె
ఆర్తరక్షణకునై యవతరింపక కాక
స్థిరభోగమలరునే హరికిసిరికి

గీ॥ వారివలె వీరిదాంపత్యభావమనెద
చేలస్థిరవృత్తి దనరవభీష్టసిద్ధి
చెలఁగవలెనంచు దీవనల్ సలుపుఁడిపుడు
సత్యహైమవతులకు భాస్వన్మతులకు. 4.

సీ॥ గంగాసముద్రసంగమమట్లు సంతత
సంపూర్ణసౌఖ్యంబు జరుగవలయు
భూతములాల్గునిప్పుడమిఁగొల్చెడిరీతి
మిత్రాదులెందును మెలఁగవలయు
సవితృసత్కరసహస్రము భాతి నధికసం
తానమాత్మయశంబుఁదాల్పవలయు
నృపమండలఖ్యాతి దోఁపంగఁజిరతరా
యుష్యంబుఁగీర్తియు నొనరవలయు

గీ॥ వలయునవి యివియనుచుఁ దెల్పంగనేల
గ్రహములతి శుభులగుమనగ్గలముఁగాఁగ
వలయునన్నియు నిడుచుండవలయు నెపుడు
సత్యహైమవతులకు భాస్వన్మతులకు. 5.

సీ॥ శ్రీకరకనకభూషికసుకల్పక మెప్పు
సరసనొసఁగుఁగాత శ్రీతహితము
ధీమతిమహిమ సంధిలనిలనలగౌరి
ముదమునోమునుగాత భూతహితము
ఇందిర దినదినమెసఁగిసస్యసమృద్ధి
గలుగఁగఁగనుఁగాత ఖ్యాతహితము
తలఁబ్రాలఁజెలఁగుత తద్ధితమితపూర్తి
మనుమహామహఁపూత మతహితమ్ము

గీ॥ నీవివితరణ నిజదేశభావిరక్ష
వీర్యమతి ధైర్యము నవార్యవీర్యపటిమ
తనరుఁగావుత నెప్పుడీదంపతులకు
సత్యహైమవతులకు భాస్వత్సుతులకు. 6.

## 92. జోశ్యులవెంకటశాస్త్రిగారు.

శ్లో॥ ఐడ్లమన్నాటి వంశాబ్ధిశశాంకాయవరాయచ
వేంకప్పయజ్వనోనప్త్రేసుశీలాయసుధీమతే. 1.

శ్లో॥ వేంకటాచల పౌత్రాయ వేంకట్రామార్యసూనవే
కౌండిన్య గోత్రసంభూత సత్యనారాయణాయచ 2.

శ్లో॥ భుజంగరాజనప్త్రీంచ మల్లికార్జునపౌత్రికాం
భుజంగరాజస్తనయాంజయలక్ష్మీం సుధార్మికాం. 3.

శ్లో॥ లక్ష్మీహైమవతీ నామ్నీంకన్యాం ప్రాదాత్సుధార్మికః
సీతాకల్యాణవిధివత్కృత్వారాజా ప్రయత్నతః 4.

శ్లో॥ సర్వాన్దేవాంశ్చసంపూజ్య వివాహేతుయథాక్రమం
అతృప్యదన్నదానేన భూదేవాంశ్చ సమాదరాత్. 5.

శ్లో॥ సుబ్రహ్మణ్యసుస్సర్వ ఆయురారోగ్యసంపదః
దంపత్యో స్తేనయోస్సమ్యగ్దత్వా రక్షంతుసర్వదా. 6.

శ్లో॥ మంత్రి ప్రెగడ వంశాబ్ధి సోమస్య స్యస్తునిత్యశః
భుజంగరాయాధిపతే పుత్త్రపౌత్రప్రవర్ధనం 7.

## 93. అల్లమరాజు సోమకవిగారు.

వీరి నివాసగ్రామము గోదావరిజిల్లా పిఠాపురము తాలూకాలోఁ జేరిన చేబ్రోలు. చిత్రభాను సంవత్సర భాద్రపద బహుళ సోమవారము వీరి జననదినము. హారితసగోత్రము. ఆపస్తంబసూత్రము, తండ్రి సుబ్రహ్మణ్యకవి గారు. తల్లిచిన్నమాంబ. వీరు రచించిన గ్రంథములు:—1. రాధాకృష్ణశతకము, 2. ముకుందశతకము, 3. భద్రవతీ పరిణయము.

శా॥ శ్రీమత్సర్వజగత్పవిత్రపూర్ణమగుచుం జెల్వొందినానావసు
గ్రామంబుల్ ధరియించుచున్విడుచు మంగైవల్యముంబూనుచో
సామంతంబగు బ్రహ్మమేలుసతమున్ సంతోషసంధాయిగా
ప్రేమన్ దంపతులంచు హైమనతినిన్ శ్రీసత్యనారాయణున్ 1.

సీ॥ శ్రీరమానయన రాజీవప్రభాతప్ర
భాకరుండవిత శోభాకరుండు
సర్వసుపర్వసంస్తవనీయగుణరత్న
బంధురుండు సుగుప్తసింధురుండు
సాధుసంసజ్జన్మ సంసారబంధవి
మోచనుండు రవీందులోచనుండు
నిజపదాంభోజాత భజనాభిరతభక్త
రక్షకుండు నిశాటశిక్షకుండు

గీ॥ శంఖచక్రగదాఖడ్గశారజధారి
గరుడవాహనుఁడత్యంత కరుణతోడ
హైమవతి సత్యనారాయణాభిధాన
యుతులనీదంపతుల శుభోన్నతులఁజేయు. 2.

సీ॥ తమవిహారంబులు త్తమమానిమానస
వీధులం దనిశంబువి స్తరిల్ల
తమమహాతేజంబు లమరాదులకుఁబరం
జ్యోతిస్స్వరూపవిఖ్యాతిఁగొలుప
తమదయాదృష్టులా ర్తజన ప్రకాండంబు
లకుసమ స్తసుఖంబులను ఘటింప
తమపదధ్యానముల్ తత్వజ్ఞులకుము క్తి
కాంతావినోద విశ్రాంతిఁజొనుప

గీ॥ జగములకుఁదల్లిదండ్రులై నెగడుచున్న
పార్వతీపరమేశ్వరుల్ ప్రాకటముగ
హైమవతి సత్యనారాయణాభిధాన
యుతులనీదంపతుల శుభోన్నతులఁజేయు. 3.

గీ॥ అనఘవేంకట సత్యనారాయణాఖ్య
వరుఁడు హైమవతీ వధూవిరచితాను
రాగమునఁబుత్త్రపౌత్రాభి రాముఁడగుచు
స్వాన్వయమునకు నెపుడు సద్యశమొసఁగుత. 4.

శ్లో॥ ఆరోగ్యమస్తు శుభమస్తు చిరాయురస్తు
సౌభాగ్యమస్తు ధనధాన్య సమృద్ధిరస్తు
విద్యాశ్చరూపవిభవాన్విత హైమవత్యా
నారాయణాహ్వయవరస్యవివాహితస్య. 5.

## 94. ముక్తినూతులపాటి గోపాలకృష్ణశర్మగారు.

వీరి నివాసస్థలము వంగవోలు తాలూకా ముక్తినూతులపాడు. ఆఱు వేలనియోగులు. ఆపస్తంబసూత్రము. వసిష్ఠగోత్రము. తండ్రి సీతారామ శాస్త్రిగారు. తల్లి సీతాంబ. కృష్ణసంవత్సర పుష్య బహుళచతుర్థి జన్మదినము. వీరు ఆంధ్రగీర్వాణములయందు, ఉభయవ్యాకరణ విశిష్టంబులగు సాహిత్యములయందును, ఉభయకవిత్వములయందును, సిద్ధాంతజాతక ముహూర్తములను స్కంధత్రయాత్మక జ్యోతిషశాస్త్రమును, తత్త్వశాస్త్రమునందును ప్రవీణులు. వీరు పెక్కురను కార్తాంతికులుగను, సాహిత్యవంతులుగను జేసిన విద్యాగురువులు. ద్రావిడాంగ్లేయభాషలయందును, కృతపరిచయులు. వంగవోలులోని, ఎ. బి. యమ్. కళాశాలయందు, ఆంధ్రగీర్వాణభాషాపండితులు. వీరు రచియించిన గ్రంథములు, 1. మానసికశాస్త్రము, 2 హిందూమతాచార రహస్యము, 3. రసస్వరూపనిరూపణము, 4. జాతకభూషణము, 5. సిద్ధాంతసంగ్రహము, 6. జ్యోతిషకల్పద్రుమము, 7. భక్తిసుధార్ణవము, మఱియుఁ గొన్ని చిల్లరవి.

శ్లో॥ యస్త్రేధాగుణత స్తనోతి జగతస్సర్గావనేచాప్యయం
యద్వాచో మనసశ్చ నైవ విషయో యత్రేశ్వరత్వంపరం
పద్మాజానిముఖానయస్యకల యన్త్యంశేంద్యసన్నాయకా
ఏంపలోక్యైకశ్శుభమాతనోతు సతతంవామార్ధవామంమహః 1.

శ్లో॥ శ్రీమంత్రిప్రెగడాన్వవాయజలధౌ జాతాసుధాసోదరీ
కళ్యాణీహ్యచలాత్మజాగుణవతీ కంజాతకమ్రాననా
శ్రీమద్రాజభుజంగ భూపతిసుతా సీతారమాదేవతా
ఛేజేవేంకట శబ్దపూర్వవిలస చ్ఛ్రీసత్యనారాయణం. 2.

శ్లో॥ శయ్యాభూషణకారణా న్నిజపతేస్తుష్టాంతరంగా సతీ
లక్ష్మీర్హైమవతీ భుజంగనృపతేః కన్యాఽభవద్భాగితే

అద్వైతంశ్రుతిదర్శనాదధిగతం తత్త్వంపరంధీమతా
షట్చక్రోర్ధ్వగతేసహస్రదళయుక్చక్రేధృతంరాజతా. 3.

శ్లో॥ యథాచంద్రం జ్యోత్స్నా సుకవివదనం సార్ధహితవాన్
ప్రభావాపద్రత్నం పరిమళఝరీవా తరుసుమం
తథానాథం సత్యంసమధిగమయంత్యుచ్చపదవీం
సతీసీతాలక్ష్మిస్స కలగుణ సాంద్రావిజయతాం 4.

శ్లో॥ జయతు భుజగరాయస్సర్వసంపన్నివాసః
సకలగుణవిలాసస్సజ్జనాలంబయష్టిం
జయతుచతనయాఽస్యశ్రీమతీసల్లభేన
శ్వశురకులమజస్రంమణ్డయంతీగుణౌఘైః 5.

శ్లో॥ శ్రీశేశాజరమాశివాగిర ఇనేంద్వారైందవార్యోశనా
స్సౌర్యగ్వంకఖగాః ప్రభావ విభవాయుశ్శ్రీవిభూతీకళాః
భారుగ్భాఘ్రణధీశుభస్థితి ధృతీరత్నానిదద్యుః క్రమా
ద్దంపత్యోర్నిరతాను రాగయుతయోర్లక్ష్మీహృషీకేశయోః 6.

6. వివరణము:—శ్రీశ=విష్ణువు, ఈశ=శివుఁడు, అజ=బ్రహ్మ,రమా=లక్ష్మి, శివా=పార్వతి, గిరః=సరస్వతి, ఇన=సూర్యుఁడు, ఇందు=చంద్రుఁడు, ఆర=కుజుఁడు, ఐందవ=బుధుఁడు, ఆర్య=గురువు, ఉశనాః=శుక్రుఁడు సౌరి=శని, అగు=రాహువు, అంక=కేతువు.

## 95. శ్రీపాదశివరామ సిద్ధాంతిగారు.

వీరి నివాసస్థలము గోదావరి జిల్లాలోని మహేంద్రవాడ. వెలనాటి వైదికులు. ఆపస్తంబసూత్రము. కాశ్యపసగోత్రము. తండ్రి లక్ష్మీపతి సోమయాజిసిద్ధాంతిగారు. తల్లిమహాలక్ష్మి సోమిదేవమ్మగారు. విక్రమసంవత్సర జ్యేష్ఠ

బహుళ ౮ శనివారము జన్మదినము. వీరు జ్యోతిశ్శాస్త్రమందు అనఁగా స్కంధత్రయమను జాతకముహూర్త సిద్ధాంతములయందును, నాటకాలంకార సాహిత్యమందును, గీర్వాణకవిత్వమందును, ప్రవీణులు శ్రౌతమందుఁగూడఁ బ్రవేశముఁ గలవారు. వీరు ప్రతిసంవత్సరము బంచాంగములనుజేసి ప్రచురించు చున్నారు. వేగాయమ్మపేట (దొడ్డమపేట) సంస్థానమందును, సంఢంగి సంస్థానమందును, ఆస్థానపండితులు.

శ్లో॥ ధాతాయుష్యమనామయంతి తరతాద్వాగీశ్వరస్సర్వదో
విష్ణుర్జ్ఞానమనుత్తమంవితరతాల్లక్ష్మీశ్వరశ్శర్మదః
ఇంద్రః పుత్రసమృద్ధి మేవభవతోదద్యాచ్ఛచీ నాయక
స్తేసర్వేదురితం హరంతుచవుషః పుష్ణంతు కాంతింపరాం 1.

శ్లో॥ శ్రీమంత్రి ప్రెగడాన్వయాబ్ధి శశభృచ్ఛ్రీమద్భుజంగేంద్రజా
యుక్తం వేంకట సత్యదేవమిథునం శ్రేష్ఠంచిరంజీయతాం
శ్రీసూర్యాబ్జకుజేందుజామరగురు శ్రీశుక్రసూర్యాత్మజా
యుక్తారాహుశిఖిద్వయేన సతతంయచ్ఛంతు పుత్రాదికం. 2.

శ్లో॥ భుజంగరాజుభవతో సుపుత్రః కులదీపకః
ఆవిర్భవతు మేధావికుమారశ్శివయోరివ. 3.

## 96. ఉపాధ్యాయుల సుబ్రహ్మణ్య శాస్త్రిగారు.

వీరి నివాసస్థలము గోదావరి జిల్లాయందలి చిత్రాడ. వేసూరు ద్రావిడులు. ఆపస్తంబసూత్రము. కౌండిన్యస గోత్రము. తండ్రి సూర్యనారాయణావధానులుగారు. తల్లి అచ్చమ్మాంబ. ఖరసంవత్సర శ్రావణ శుద్ధపంచమి జన్మదినము. వీరు నాటకాలంకారాది సాహిత్యగ్రంథములను జెప్పగానభ్యసించి ప్రస్తుతము వ్యాకరణ శాస్త్రమభ్యసించు చున్నారు.

స్రగ్ధర॥ శ్రీమద్గంగాస్రవంతీ ఝురనికటతటీ మల్లికామాలికాభిః
ప్రాతఃప్రాయం మహోర్భి ర్మునిభిరవనతైః శ్చైత పారాద్యమానః
దీవ్యత్కల్లోలిని వాఃకణగణపటు విస్ఫూర్తిమత్కేశపాశః
పాయాదాచంద్రతారం పరమకరుణయా దంపతీ చంద్రమౌళిః 1.

శ్లో॥ సపాయాదపాయాత్సదాదంపతీతా
లసద్రత్నమాలావిభూషాభియుక్తా
కిరీటేకరేశోలలాటేహుతాశో
భుజేభోగిరాజో గరో యస్యకంఠే. 2.

## 97. బేతపూడి ప్రకాశముగారు.

వీరు ఆఱువేలనియోగులు. శ్రీవత్సగోత్రులు. ఆపస్తంబ సూత్రము. నివాసము గుంటూరు జిల్లా రేపల్లెతాలూకా బేతపూడి. తండ్రి మల్లయ్యగారు. తల్లిమహాలక్ష్మి. ప్రస్తుతము వీరుహిందూ హైస్కూలు నందాంధ్రోపాధ్యాయత్వము వలన బందరులోనే నివసించి యున్నారు. విద్యాగురువు రేపల్లె నివాసులగు బ్రహ్మశ్రీ రామడుగు సూర్యనారాయణ శాస్త్రిగారు. వీరికి సంగీత సాహిత్యములరెంటను బరిచయము గలదు. భరతప్రకాశికయను గ్రంథమొకటి తెనుంగుననే రచియించిరి. ఆంధ్రవ్యాకరణ మొకటి చేసియుండిరి. ఇంకఁగొన్ని నాటకములు, హరికథలు, చాటుపద్యములు రచించిరి. జన్మదినము పరీధావిసంవత్సర ఆశ్వయుజ బహుళ ౫ అంగారకవారము.

శ్లో॥ పాయాద్ధైమవతీ సీతాజయలక్ష్మీంవధూంశివః
సత్యనారాయణాభిఖ్యం వరం వేంకటపూర్వకం 1.

సీ॥ శ్రీమంత్రిపెగ్గడ సింధుశీతకరుండు
భుజగరాయాహ్వయ భూమినాథుఁ

డాత్మపుత్త్రికను శ్రీహైమవతీపూర్వ
సీతావిజయలక్ష్మి లెన్నమీఱ
వడ్లమన్నాట్యన్వవాయ వేంకటసత్య
నారాయణున కిచ్చి భూరిలీల
ముద్వాహమొనరించె నూర్జితంబుగ నెల్ల
జనులు సుప్రీతులై వినుతిఁ జేయ

గీ|| వారినామాంతములయందు వరలునట్టి
లక్ష్మినారాయణుఁడును విలాసలీల
నాయురారోగ్య భాగ్యములమరఁ బొసఁగి
దయను రక్షించుఁ గాత నీదంపతులను. 2.

సీ|| హైమవతీ శబ్దమాఖ్యనుండుటఁ జేసి
గౌరీసుమాంగల్యగరిమ నొప్పి
సీతాహ్వయంబును జేరియుండుట చేతఁ
బూతచారిత్రయై ఖ్యాతిమీఱి
విజయశబ్దంబును వెలయుచుండుటఁ బట్టి
విజయురాలై యెల్లెడ వినుతిఁ గనుచు
లక్ష్మిసమాఖ్యయు రంజిల్లుట కతన
నిఖిలభాగ్యములచే నెగడుచుండి

గీ|| మంత్రిప్రెగడ భుజంగరాజాత్మవేశు
పుత్రి తననామమునయందు పోలఁతులవలెఁ
దనదుపతితోడఁ బుత్త్రసంతతులతోడ
నాయురారోగ్యముల వృద్ధినందుఁ గాత. 3.

సీ॥ శ్రీకరుండును సర్వలోకరక్షకుఁడును
విబుధాళివంద్యుఁడై వెలయువాఁడు
దేవుఁడు హైమవతీ దేవియనునాది
దంపతు లిర్వురుదయదలిర్ప
స్థిరముగ హైమవతీ పూర్వసీతావి
జయలక్ష్మి వేంకట సత్యపూర్వ
నారాయణాభి ధానములఁ జెన్నొందిన
దంపతులకు సర్వసంపదలును

గీ॥ నాయురారోగ్యభాగ్యము లమితసుఖము
సంతసముగల్గునట్లు సత్సంతతియును
భువిని సత్కీర్తివృద్ధినిఁ బొందునట్లు
గాచిరక్షించుఁగాతనే కాలమునను. 4.

సీ॥ మానితమైన యనూనగౌరవముచే
బంధుప్రకరమెల్ల బళియనంగ
నీప్సితార్థప్రాప్తి నెంతయుఁదనియుచు
యాచకులెల్లరునహహా ! యనఁగ
నన్నదానంబుచే నధికసంతృప్తులై
బాడబులెల్లరుఁ బ్రస్తుతింప
సాటిమామ్యలు దానధాటిని వీక్షించి
శహబాసటంచుఁ బ్రశంససేయ

గీ॥ మంత్రిప్రెగడ భుజంగరాణ్మనుజనాథుఁ
డాత్మపుత్త్రికిఁ బరిణయమాచరించి
రాజసూయాధ్వరము ధర్మరాజొనర్చు
పగిదిజగమున సత్కీర్తిఁ బడసెనహహా ! 5.

సీ॥ ఒకపంకగాయకు లొనరించుగానముల్
జనముల చిత్తరంజనముఁజేయ
నొకచోటనాటకులొనగూర్చు వేషముల్
ద్రష్టలచిత్తసంతసముఁజేయ
నొకచోదసకవివరు లొనరించు వర్ణనల్
వినువారి చెవులకు విందుసేయ
నొకచక్కిబ్రాహ్మణు లొనరించునాశీర
వంబులు వినుచు విద్వాంసులలర

గీ॥ మంత్రిపెగడ భుజంగరా ణ్మనుజవరుఁడు
ప్రథమపుత్త్రికిఁబెండిలిబర పెనార !
సురలుమెచ్చంగ నెల్ల భూసురులు హెచ్చ
సంతసంబునమునుఁగుచు సంతతంబు. 6.

## 98. తోపల్లి వేంకటరామ సిద్ధాంతిగారు.

వీరి నివాసస్థలము ఖాశింకోట. వెలనాటి వైదికులు. ఆపస్తంబసూత్రము. కౌశికగోత్రము. తండ్రి వెంకన్నగారు. తల్లి సుబ్బాంబ. శాలివాహనశకగతవర్షములు ౧౭౭౭ నల సంవత్సర పౌషబహుళ ద్వాదశీ గురువాసరము జన్మదినము. వీరు స్కంధత్రయాత్మకమగు జ్యోతిశ్శాస్త్రము నందును, సాహిత్యమునందును, సంస్కృత కవిత్వమునందును నిపుణులు. వీరనేకులను స్కంధత్రయ ప్రవీణులనుగాఁజేసిన విద్యాగురువులు. శ్రీఖాశింకోటజమీదారువారగు మారెళ్ల వేంకటాచలము పంతులువారి యాస్థానసిద్ధాంతులు. వీరు రచించిన గ్రంథములు:—శాలివాహనశకము ౧౮౨౪ సంవత్సరమున శ్రీరాక్షీవంశసంభూత సర్వతంత్ర స్వతంత్రదైవజ్ఞ సార్వభౌమ బిరుదాంకితము వారెళ్ళచిన్నరసింహ కవిగారిచే సౌరసిద్ధాంతానుసారముగా రచియింపఁబడిన తిథికల్పవల్లియను గ్రంథమునకు మంజరియను వ్యాఖ్యానమును రచించి ప్రచు

రించిరి. పిమ్మట ౧౭౭౬ శకమున కరణరత్నమను కరణగ్రంథమును, సూర్యసిద్ధాంత సమ్మతముగను, దృక్సిద్ధసమ్మతముగను రచించిరి. ఏతద్గ్రంథానీత రవ్యాదిస్ఫుటగ్రహములకును, గ్రీన్‌విచ్ ప్యారిస్ మొదలగు ప్రసిద్ధ ఆల్మెనుక్కులలోనున్న సాయనగ్రహములకును, అయనాంశ దేశాంతరాంతరము మాత్రము గలిగి యుండును. ౧౭౩౭ శకమున వైశ్యవేదోక్త క్రియావిచార వ్యవస్థాఖండనము శ్రుతిస్మృతి పురాణజ్యోతిశ్శాస్త్రసమ్మతముగ రచించి ప్రచురపరచిరి.

శ్లో॥ సౌమాంగల్యం దత్వా హైమవతీ సర్వమంగళా సతతం
పాయాద్వధూలలామా మేతాం శ్రీహైమవత్యంబాం 1.

శ్లో॥ కలాంచితం వేంకటశబ్దపూర్వం
శ్రీసత్యనారాయణమబ్జనాభిః
సురేంద్రముఖ్యామర సేవ్యమానః
పాయాదజస్రం వరమాదరేణ. 2.

శ్లో॥ పరస్పర ప్రీతివిశేషభాజౌ
వృషాధిరూఢౌ విబుధైకమాన్యౌ
సుధాంశుభాసౌ నితరాం దిశేతాం
పరస్పరం ప్రేమవధూవరాభ్యాం. 3

శ్లో॥ పద్మేక్షణస్సర్వ సుపర్వసేవ్యః
పద్మాం ముదా వక్షసి కౌస్తుభం చ
బిభ్రజ్జగద్రక్షణ దక్షదీక్షో
వధూవరౌ రక్షతు పద్మనాభః. 4

శ్లో॥ ధాతా దదాతు శ్రుతిసిద్ధమాయు
ర్వాణీ కళాకౌశల మబ్జబంధుః

ఆరోగ్యమైశ్వర్య మలంకురేంద్రో
వధూవరాభ్యాం ముదమబ్ధికన్యా. 5.

## 99. శివ వెంకలింగయ్య శాస్త్రిగారు.

సీ॥ అవనిమంత్రి పెగడాన్వయ చంద్రుండు
భుజగరాణ్ణామక భూవిభుండు
నాంధ్రదేశంబున నభిమాని భూసుర
పోషకుండు సుగుణ భూషణుండు
ఆత్మపుత్రికగు శ్రీహైమవతీకన్య
సత్యనారాయణసరి సవరున
కొసఁగి వైవాహంబు పొసఁగంగఁ జేయుచుఁ
బండితులకు నిచ్చె బహుమతులు

గీ॥ వారిదీవనలన్నియు వరుసనంది
భాసుఁగాపాడఁగల్గు నృపాగ్రగణ్య
నిష్టకామ్యార్థముల నిచ్చి సృష్టికర్త
కాచిరక్షించుఁగాతనే కాలమునను. 1.

గీ॥ హరియులక్ష్మియు నధికంబు సిరులనొసఁగి
నాయురారోగ్యమైశ్వర్య మందఁజేసి
యీవధూవరులనిల నెపుడు మీఱఁ
బ్రోచుఁగావుత నూరేండ్లు పాలుపొసంగ. 2.

సీ॥ నీదుసౌభాగ్యము నెలమినివర్ణింప
నేరితరంబగు శేర్వమీఱ
నీదుసుశీలంబు నెలమిని బొగడంగ

చేరితరంబగు చేర్పుమీఱ
నీదువితరణంబు నెలమినిగొనియాడ
చేరితరంబగు చేర్పుమీఱ
నీచాకచక్యంబు నెలమిని వినుతింప
చేరితరంబగు చేర్పుమీఱ

గీ॥ మహినినీవంటి విద్యాభిమాని లేడు
మంత్రిపెగడ భుజంగమమానవేశ!
విబుధసురభూజ! విద్యావివేకభోజ!
ధరణివర్ధిలు మాచంద్ర తారకముగ. 3.

## 100. గబ్బిట యజ్ఞనారాయణశాస్త్రిగారు.

వీరి నివాసస్థలము, ఏలూరు తాలూకా రామారావుగూడెము అగ్రహారము. తెలుఁగునాటి వైదికులు. ఆపస్తంబసూత్రులు. గౌతమగోత్రులు. తండ్రి సూర్యనారాయణగారు. తల్లి అన్నపూర్ణాంబ. ఆంగీరస సంవత్సరము వీరి జననము. గానవిద్యయందు మిక్కిలి ప్రవీణులు. కాకినాడ గానసభమొదలయిన గొప్పచోట్ల గానమొనరించి విశేషబహుమతులొందినవారు. ఆంధ్రభాషయందు రెండు వందల పద్యములుగల వేంకటేశ్వరశతకమును, భద్రాచలసీతారామశతకమును, నూతనమైనవర్ణమెట్లేర్పరచిచెప్పిన యిరువది సంఖ్యగల కృతులు, జావళులు, భజనకీర్తనలుగల పుస్తకమును, మఱియు ననేకచాటుపద్యములను రచియించియున్నారు. ఈకవిత్వము వీరు శ్రీరామానుగ్రహమువలన సంపాదించుకొనిరేకాని లక్షణగ్రంధములనంతగాఁ జదివినవారుకారు.

సీ॥ శ్రీమహావిష్ణుమూర్తి దయార్ద్రభావుఁడై
మంచిజ్ఞాన మొసంగిమనుచుఁగాక

ముక్తిప్రదాతయై మునులఁ బ్రోచెడిబ్రహ్మ
ఘనతరాయువు లిచ్చి కాచుఁగాక
చల్లనిదృష్టి నైశ్వర్యంబు లొసఁగుచుఁ
శ్రీపట్టి శివుఁడు రక్షించుఁగాక
గౌలమితో మఱియు దేవేంద్రాదిదిక్పతు
లెల్లసౌఖ్యము లిచ్చి యేలుఁగాక

గీ॥ అందముగ నీనభూనరులైనయట్టి
పెద్దమన్నాటి సత్కులాభరణుఁడైన
సత్యనారాయణాఖ్యుని సతిని హైమ
వతినిసుమతిని సద్గుణవతిని గాపుడు. 1.

శా॥ శ్రీలక్ష్మీశ్వరుఁ డేలుఁగాక యెపుడున్ శ్రీస్థైర్యగాంభీర్యవి
ద్యాలాలిత్యయశస్సుధీబలవిశేషారోగ్య సంపత్తతుల్
చాలఁ బ్రేముడి నిచ్చియద్భుతముగా సౌజన్యసౌందర్యసం
శీలన్ హైమవతీ సతీతిలకమున్ శ్రీసత్యనారాయణున్. 2

సీ॥ శ్రీమహీసుర శుభాశీర్వాదములు మీఱ
వరపురోహిత మంత్రవాక్కులలర
మెచ్చి లౌకికకోటి స్వాచ్ఛరికలుసేయ
ఘనతూర్యమంగళ ధ్వనులు మ్రోయ
ముదమొప్ప గాయకుల్ మృదుగానము లొనర్పఁ
బాఠకస్తోత్రశోభలుదలిర్ప
సత్కవుల్ తనమహోత్సవకథల్ వర్ణింపఁ
బరివారజనమెల్లఁ బ్రస్తుతింప

గీ॥ ఆత్మసత్పుత్రియైనట్టి హైమవతిని
సత్యనారాయణునకు రాజాభుజంగ
రావుగారిచ్చి పెండిలిరహిఁనొనర్చె
జానకీరాములకుఁ బెండ్లిజరిగినట్లు 3.

శా॥ శ్రీమంత్రిప్రెగడాన్వయోద్భవయశశ్శీలుండు విద్వత్కవి
స్తోమప్రీతి మనస్కుఁడాంధ్రకవితాధుర్యుండు భూదేవతా
భూమీశుండు భుజంగరాయపతి సత్పుత్రీ వివాహంబుబల్
సేమంబొప్పసురేంద్ర వైభవముగాఁజేసెన్ జనుల్ మెచ్చఁగన్ 4.

## 101. వెంపటి వేంకటనారాయణగారు.

వీరి జన్మస్థానము భాగవతుల కూచిపూడి. వెలనాటి వైదికులు. హరితసగోత్రము. ఆపస్తంబసూత్రము. తండ్రి నాగేశ్వరముగారు. తల్లి గంగమాంబ. ఈశ్వరనామసంవత్సరమున జన్మమునందిరి. నరసాపురము డిస్ట్రిక్టు మ్యున్సబుగారి వలనను, కాకినాడ జంట్రీపాలకొల్లువర్తకులవలనను మచిలీబందరు కలెక్టరు కోర్టువారి వలనను దృశ్యప్రబంధ ప్రదర్శనమున సెన్నికంగాంచి బంగారుపతకములంబొంది యున్నవారు. వీరు రచించిన గ్రంథములు 1, చంద్రకాంత నాటకముఁ 2. గోపీచందననాటకము, 3. జయంతిజయపాలీయనాటకము,. 4. హరిశ్చంద్రీయనాటకము, 5. సుగ్రీవపట్టాభిషేకనాటకము, 6. లంకాదహనము మొదలైనవి.

శా॥ శ్రీపద్మాయతధారుణీ సతినిఁగూర్మిన్సంతతోత్సాహకే
ళీపాండిత్యముచేతఁజన్పుచు బుధాళీధర్మసంత్రాతయౌ
గోపీచందన చర్చితాంగుఁడగు శ్రీగోపాలకృష్ణుండును
శ్రీపూర్ణస్థితి నీవధూవరుల వాసింబ్రోచుతన్ సత్కృపన్. 1.

చ॥ సిరిపదమొత్తజామరముఁజేకొని భూసతిపిపనారదుం
డురువడితుంబురుండు సుమహోన్నతి వీణియమీటిపాడనుం
దరముగదేవకాంతలు ముదంబుగనాడ ఫణీంద్రుకయ్యనే
దొరకయనించెజిష్ణుఁడు వధూవరులన్ గృపఁజూచుఁగావుతన్ 2.

ఉ॥ పాయుఁగరాని బాళినలపర్వతి నర్యని పుత్త్రియైనకా
త్యాయనితోడఁబాచికలనాడఁ నోడంగినఁదొల్తపందెమున్
నాయకయుంచు టొప్పునన నవ్వ్రతిశూల ధరుండు సత్యనా
రాయణ లక్ష్మిరయుగ్మము ననారతమున్సిరు లిచ్చికాచుతన్ 3.

## 102. నందివాడ వేంకటశేషకవిగారు.

వీరి నివాసస్థలము చెన్నపురి రాజధానిలోని కృష్ణామండల మందలి యేలూరు తాలూకాలోని సానిగూడెమను నామాంతరముననందిగు స్వామి పురము. ఆర్వేలవెలనాటినియోగి బ్రాహ్మణులు. ఆపస్తంబసూత్రులు. భారద్వాజగోత్రులు. జనక తండ్రిసుబ్బారాయఁడుగారు. జనకతల్లి అచ్చమాంబ. పాలకతండ్రి మదనయ్యగారు. పాలకతల్లి సూరమాంబ. జగన్నాథకవిగారి కనుజులు. తారణసంవత్సరాశ్వయుజ బహుళ చతుర్దశి జన్మదినము. సానిగూడెమునకుఁగరణముపనిఁజూచుచున్నారు. కీర్తిశేషులయిన పండితదాసు శ్రీరామకవీంద్రుని శిష్యులు. వీరు రచించిన గ్రంథములుఁ మిశ్రభాషలో, 1. రామశతకము, 2. శివశతకము, 3. బాలశతకము, 4. నీతితారావళి, 5. భజనకీర్తనలు, మఱియుంగొన్ని చాటుపద్యములు.

శా॥ శ్రీలున్నంతతిరయుం జిరాయువును సంకీర్తియంబు వాక్ప్రౌఢియున్
బాలున్నీరును బోలెమైత్రియును సత్పాండిత్యమున్సత్యమే
కాలంబార్యజనానువర్తనము సాకల్యంబుగా శ్రీసతీ
పాలుండీవుత నీవధూవరులకున్ భావంబులింపొందఁగన్ 1.

శా॥ మౌనుల్గొల్వఁగనక్రమున్ వెలయ జంభద్వేషిముఖ్యాదిదే
వానీకంబులసత్కిరీటముల దివ్యద్రత్నముల్వాణిపీ
ఠానాదబున వేఁగరంగి నిజపాన్నాళికముల్ ముంపఁగా
నానందించు విరించనుండి దుతదీర్ఘాయుష్యమీజంటకున్. 2.

శా॥ చూడాగ్రంబునభవ్య దివ్యనదియున్ సొంపొందు బాలేందుఁడున్
జోడై నీవ్వడక నర్ధదేహమున మెచ్చుల్గాంచు రుద్రాణియున్
మూఁడక్షుల్గలవేల్పుఁ బ్రోడసతతంబున్సత్య నారాయణున్
లేడిన్ హైమవతిం బొనర్చుత మహిన్ లీలాప్తభూత్యుక్తులన్ 3.

## 103. అఖండం భానుమూర్తి శాస్త్రిగారు.

వీరు గోదావరిజిల్లా కాకినాడ తాలూకాలోఁజేరిన సర్పవరము గ్రామమునంగల సంస్కృత పాఠశాలలోఁబాఠములుచెప్పి విద్యార్థులను తయారు చేయుచున్నారు. వీరి తండ్రి రామన్నగారు. తల్లి కామేశ్వరిగారు. వీరు కాశీలో పదిసంవత్సరములు తర్కశాస్త్రమును భాధాంతము గదాధరగ్రంథములు కర్ణాటసీతారామశాస్త్రులుగారి దగ్గఱచదివిరి. కలకత్తా, బరోడా, గద్వాల, కాశీమొదలైన గ్రామములలో పరీక్షనిచ్చియున్నారు. వీరికి "తర్కతీర్థః" అనియుపాధియిచ్చినారు. కలకత్తాలో వేదాంత శాస్త్రము ప్రస్థానత్రయమును, అద్వైతసిద్ధి గౌడబ్రహ్మానందీయమును, ఇంకను వేదాంత గ్రంథములును కాశీలో శ్రీద్రావిడ సుబ్రహ్మణ్య శాస్త్రులవారియొద్ద నధ్యయనము చేసినారు.

శ్లో॥ ఇమావధూవరౌపాయాద్విధి విష్ణుశివారుణాః
దత్వాదీర్ఘాయు రైశ్వర్యశుభారోగ్యాణిసంతతం. 1.

శ్లో॥ స్వనామధారణాద్ధైమవతీ హైమవతీ వధూం
సత్యనారాయణ స్సత్యనారాయణమువత్విమం. 2.

శ్లో॥ శ్రీసీతాజయలక్ష్మ్యాశ్చ సత్యనారాయణస్యచ
పరస్పరానురాగోస్తు సీతారాఘవయోరివ. 3.

## 104. దేవరకొండ సోమనాథశాస్త్రిగారు.

వీరి నివాసస్థానము గోదావరి జిల్లా రాజోలు తాలూకాలోని వెలిచేరు. తండ్రి రామబ్రహ్మశాస్త్రిగారు. తల్లి శేషమాంబ. హారితస గోత్రము. ఆపస్తంబసూత్రము. యువసంవత్సర వైశాఖశుద్ధ త్రయోదశి జనన దినము.

శ్లో॥ యస్యాంగనామంగళ దేవతాపా
యస్యాత్మజః చేత్ జగతాంచ స్రష్టా
యస్యాగ్రజోభూత్ సురలోకరాజః
విష్ణుస్స్వయం మా వతు దంపతీసః. 1.

## 105. దేవరకొండ మాణిక్యముగారు.

క॥ శ్రీ చెలువొందు గావుత
వాచాలత హెచ్చుగాత వరగుణమతులై
యాచిన్నిదంపతులు భువి
నాచంద్రార్కంబు శోభనలరెడిగాతన్. 1.

సీ॥ ఈవధూవరులకింపెనసి కృపాళుడై
యాయువిచ్చెడుగాక యలవిధాత
ఈవధూవరులకే యేవేళలందైన
నారోగ్యమిడుగాక యల విధాత
ఈవధూవరులకు నిలమీదదులలేని
యైశ్వర్యమిడుగాక యలవిధాత
ఈవధూవరులకు వెడమువం బొనరింప
నగుసంతునిడుగాక యలవిధాత

గీ॥ జనని జనకుఁడు తమ్ముఁ గన్గొని వినోద
ములఁ జెలంగఁగ సంతానములఁ జెలంగి
కలిమి మైవారిపై వాహికములొనర్చి
యలరునటు శౌరి ప్రోచుఁ గాక లలిఁ ధాత. 2.

గీ॥ పద్మమన్నాటి కులవార్ధి వనజవైరి
యైన శ్రీసత్యనారాయణాఖ్యునకును
నతని సతి హైమవతికిని చతురమతిని
మూఁడుమూర్తులు సుఖమిచ్చి ప్రోచుఁ గాక 3.

సీ॥ హైమవతీ వివాహాడంబరము విన్న
గిరపతికైనఁ గ్రోగ్గింపరాదు
సీతావివాహప్రసిద్ధి నాలింపంగ
మిథిలాధిపునకున్న మెప్పులడఁగు
చెలఁగి శ్రీవిజయలక్ష్మి వివాహముగన్న
పాలకడలిగుట్టు బయటబడును
యుమపేరరమపేర నొప్పనీక న్నియ
పెండ్లిపులోముని పెంపడంచు

గీ॥ నహాహ! యిటువంటి పరిణయంబవని లేదు
సరసగుణగేయ! రాజాభుజంగరాయ
ధరణినినుబోలు మఱియొక ధన్యతముఁడు
గానఁబడఁడయ్య వినవయ్య కల్ల గాదు. 4.

సీ॥ కవులసత్కారంబు గావించు నెడనీకుఁ
గల్పవృక్షముపాటి గాదుసుమ్ము
అన్నప్రదానంబు నాచరించెడు నెడ
నన్నపూర్ణమ్మ నీయంతగాదు

అందటి నొకభంగి వరయునొపికనీకు
వసుధరాయినను పాటివచ్చుటరిది
రమణీయమంది రారామవైభవముల
జంభాసురారినీ సాటిరాడు

గీ॥ వసుధనిరియున్నచోట వైభవములేదు
విభవముండిన సిరిలేదు విద్యలేదు
ఇన్నియును గల్గెనీవున్నమేమొకాని
పరిసగుణగేయ రాజాభుజంగరాయ. 5.

## 106. కర్త్రాపాపయ్య శాస్త్రిగారు.

శ్లో॥ "ప్లవంగవత్సరేదివ్యే మాఘమాసే జనిర్మమ
అసితే ప్రతిపద్యాఖ్యే శుభగ్రహయుతేదినే
శ్రీమదుత్పలపాకాడు గ్రామేతుకతిపత్సరాన్
నీత్వాపరోః రమతరంపట్టణం విజయాభిధం.
ప్రవిశన్ పాఠశాలాయాం కావ్యనాటకగ్రంథాదీనపఠం స్మృతిసం
గ్రహంపురాణాంచ కేషాంచిదచ్ఛిడద్రాతు"

శ్లో॥ కల్యాణానామవాపః కవినగభిదురః వాంఛితార్థప్రదాతా
భూపుత్రీనేత్రయుగ్మోత్పల వికసన సంపూర్ణచంద్రః కృపావాన్
శత్రూణాంకాలతుల్యః సురనగసదృశోభక్తజాలస్యరామః
దంపత్యోస్సర్వకామాన్ ప్రదిశతుసతతంతాత వాక్యానువర్తీ. 1.

శ్లో॥ శ్రీవాణీరుచిరాస్య పద్మమిహిరః పద్మోద్భవః శర్మదః
శ్రీవిష్ణుః కమలాపతిశ్శశికళాలంకార భృచ్ఛంకరః
దీర్ఘాయుష్యమహీపతిత్వ మహాదైశ్వర్య ప్రదానక్షమాః
దంపత్యోశ్శుభదాభవంతు సుచిరాంతౌస్తాస్సదాదేవతాః. 2.

శ్లో॥ ఏకోగురు ర్నాకసుతే స్వభాయాంకళావివేకః కవికేక ఏవ
భుజంగదేవస్య సదస్యకేషాః కళావదః స్పర్ధురవః కవీంద్రాః 3.

శ్లో॥ బుధానాంబంధూనాం సపదివసతాం సర్వసుహృదాం
వివాహేస్మిన్ దివ్యాన్ వివిధబహుమానాన్ ప్రవితరన్
తరాం శ్రీమన్మంత్రి ప్రెగడఫణిరాట్ప్రభువరో
రసాతూమాకల్పంజయతు జగదానందజనకః 4.

## 107. ఆకెళ్లసోమనాథ శాస్త్రిగారు.

శ్లో॥ సకలజన సుతీనాం పాత్రముద్యద్గుణానాం
అపిచవినవసీరా పండితగ్రామణీనాం
అతధనదవిరాజత్సంపదా మాకరోయం
జయతిజగతిరాజ భుజంగరాట్సార్థికేంద్రః. 1.

శ్లో॥ తస్యపుత్రీమహాలక్ష్మీ సత్యనారాయణోవరం
అన్యోన్యాస్యసక్తమనసౌ జీయ్యాస్తాసంపదాన్వితౌ. 2.

## 108. పావరాజు వెంకటకృష్ణరాయశర్మగారు.

వీరు శ్రీయాంజనేయ చరణారవింద సేవాభిరతులును, గుంటూరు జిల్లా నరసారావుపేట తాలూకా యెల్లమంద పురవాసులును, నార్వేల నియోగులు. కాశ్యపసగోత్రాపస్తంబ సూత్రపవిత్రులు. ఇరువది యెనిమిది సంవత్సరముల ప్రాయమిప్పటికి గలవారు. భక్తిరసప్రధానమగు కోటిలింగ శతకము, శ్రీజనార్దన శతకమును రచించిన సజ్జనవిధేయులు. ప్రస్తుతము నెన్నలిగ్రామ పాఠశాలోపాధ్యాయులు. వేంకట్రాయ భద్రమాంబలకైదవ కుమారులును, చుక్కమాంబ, దమ్మక్కమ్మ శ్రీరామరాయహనుమంతరాయ కాళిదాసు లక్ష్మణమంత్రుల సోదరులు.

శా॥ శ్రీరంజిల్లుపనంద నాదిమును లాశృంగార రంగస్థలిన్
ధీరాగ్రేసరులైన వేల్పులను సందేహంబు లేకుండఁగా
నారాధించిన యట్టిలేకవులు నే డానంద భావంబుతోఁ
బ్రేరేపించి పరాగ్రగణ్యులను సంప్రీతిచ్ఛవర్ణింతురా. 1.

శా॥ శ్రీనారాయణపాదసేవకరులున్ శ్రీలక్ష్మిచింతామణీ
గానాకారిణి శారదాంబ ధరగంగాదేవియున్ గౌరియున్
ధేనువ్రాతము దేవతాగణములున్ దీవింత్రు నాగాంగనల్
సానందంబుగ నీవధూవరులకుద్యత్కీర్తిసంధిల్లఁగన్. 2.

సీ॥ శ్రీదేవిభూదేవి శృంగారి సురటుల
 వింజామరల్ వీచువింపగాను
సూర్యచంద్రాగ్నులే సోదరులైనిల్చి
 తమకార్యములఁ దెలుపుచుండఁగాఁగ
పరిమాగిల్ జంట గానానందములఁ గేరి
 పక్షిసంతోషముల్ పాగనిచ్చి
సురపతిగణపతుల్ సొంపుపెంపులమీఱి
 కల్యాణరంగంబుఁగా నుచుండె

గీ॥ రంగుమీఱంగఁ బండితరాజకవులు
మంగళంబుగఁ గళ్యాణమంటపమునఁ
గొల్వుదీరినదంపతుల్ కోర్కెలెల్ల
నిచ్చిరక్షింప నీశ్వరు డెంతుమదిని
ప్రకటగుణసాంద్ర శ్రీభుజంగకవిచంద్ర! 3.

సీ॥ పంచభూతంబు లీపలుమాటలికఁ జేల
 నాయురారోగ్యభాగ్యంబు లిచ్చు

సురబృందమదియెల్ల సొంపు శేమందునో
బలధైర్యముల పెంపు బాగనిచ్చు
ముని బృందములకీవి ముమ్మారు నేమందు
మూలమంత్రంబులముగ్ధఁదెల్ప
శాస్త్రవేత్తలపెంపు శాంతమే మందునో
ధర్మంబులే దెల్పి ధాన్యమిచ్చు

గీ|| సత్యనారాయణాఖ్యుని సౌరుఁ దెల్ప
ధాత్రి నను పార్వతీధవునకైనఁ
దరముగాదమ్మ సీతాంబ ధరణిలోనఁ
దనరుమీకీర్తిచంద్రార్క తారకముగ. 4.

సీ|| సత్యంబునకు హరిశ్చంద్రుండు సరివచ్చుఁ
జంద్రుండు సొగసుకు సమమువచ్చు
సుగుణసంపత్తిని సూర్యుండు సరివచ్చు
ధాటికి బలరాము సాటినొందు
పాండిత్యగరిమకుఫాలాక్షుఁడనవచ్చు
దానంబునంగర్ణు ధాటినొందు
కవితారసముఁజూపఁగాళి దాసనవచ్చు
ధర్మరాజుతో కీర్తిదనరవచ్చు

గీ|| బుడమిలోమంత్రిపెగ్గడ భూసురాగ్ర
ణీభుజంగరాట్సుతయుఁబానింపుమీఱ
నిన్ను వరియించెఁగైకొము నింద్రతుల్య
రమ్యగుణముఖ్య సత్యనారాయణాఖ్య. 5

## 109. రాచర్ల వెంకటకృష్ణారావుగారు.

వీరి కాపురస్థలము గోదావరి జిల్లాయందలి గూటాల. తల్లిదండ్రులు వరహాంబా వెంకటరత్నార్యులు. వైదికులు. త్రిలింగనాములు. ఆ 1894 సం వత్సరము నవంబరు 24 తేదిని జన్మించిరి. వీరు వ్రాసిన గ్రంథములు:—ప్రచండరాఘవము, శ్రీకృష్ణరాయ బారము మొదలగునవి.

శా॥ శ్రీరంజిల్లసుధాబ్ధిలోఁ బొడమి రాజీవారి తోఁబుట్టువై
ధీరప్రజ్ఞభుజంగరాయ ఘనమద్ధిన్వేవలిన్ జూపివ్వ
శ్వేతాజంబులఁ గల్మలీను జయలక్ష్మిం గొన్న నారాయణుం
డారోగ్యాదికముల్ వధూవరుల కత్యంతంబుఁ గూర్పుం గృపన్ 1.

ఉ॥ గోమునఁ బిన్న గూర్చియతిఘోరతపం బొనరించి నార్యనా
సోమముఖిన్ మృగాక్షినతి సుందరగాత్రి విభూతిఁ గాంచి యా
హైమవతింబు నెంచిజపయంవముఁ జూచి భుజంగరాయక
న్యామణి గానరించు హరుఁడట్లు వధూవరులం గృపంగనున్. 2.

చ॥ జిలిబిలి తేనె మాటలను జిల్కకుఁ బల్కులు నేర్పు పేణాతం
త్రులుబిగియించి పాడుచు శ్రుతుల్ గమనించి భుజంగనాథుమే
ల్కలుపుచు సత్యమే తనకు లోకముగాఁ గలముద్దులాడిము
ద్దులదొర సత్యరూపుఁడు వధూవరులన్ దయనేలుఁ గావుతన్. 3.

సీ॥ సద్గుణసంఘాత జనపాలసంభూత
కవితావిఖ్యాత మంగళము నీకు
విశ్రాణనోపేత విప్రకన్యాపూత
ఘననామసీతమంగళము నీకు
లలితతనూజాత లసదుత్తమశ్రీశ
కరజలజాతమంగళము నీకు

ప్రణుతబుధవ్రాతవర కటాక్షసమేత
కలుషనిర్ఘాత! మంగళము నీకు

గీ|| శ్రీభుజంగరాయల తపశ్శ్రీఫలంబ
పుత్త్రపౌత్త్రాభివృద్ధితోఁ బోలుపుగాంచి
సత్యవర్తనగమనించి సాధ్వివగుచుఁ
జిరతరాయువు లొందు లక్ష్మీకటాక్ష! 4.

గీ|| పరులుగన్నట్టి బాలనీపాలఁబడియె
జవ్వనం బెల్లనీకుఁదాజన్నెగట్టె
నిన్నె సత్యంబుగాఁగోరెఁగన్నె మిన్న
బాళిమైనేలు కరుణాలవాలయింక. 5.

## 110. బొండాడ సూర్యనారాయణగారు.

వీరి నివాసస్థలము, విశాఖపట్టణము. తెలగాలు. తండ్రి కోదండరామస్వామిగారు. తల్లిపేరమాంబ. ఆ 1878 సంవత్సరము జూలై నెలలో జన్మించిరి. ప్రస్తుతము గంజాముజిల్లా బర్హాంపురము ఎగ్జిక్యూటివు ఇంజనీయరు ఆఫీసు హెడ్డుగుమస్తాగానున్నారు. వీరు రచించిన గ్రంథములు:—శ్రీచన్నకేశవశతకము, శ్రీజనార్దనచరిత్రము, శ్రీవేంకటేశశతకము, పట్టాభిషేక సంభావణ మొదలైనవి.

సీ|| శ్రీపద్మలోచనుల్ శ్రీపార్వతీశ్వరుల్
వాణీపితామహుల్ వసుధలోనఁ
గరుణతో నివ్వధూవరులకు దీర్ఘాయు
రారోగ్యసౌఖ్యాదులందఁజేసి
సతతంబు శ్రీ హైమవతిని, శ్రీవేంకట
సత్యనారాయణు సత్యవచను

రక్షింత్రు గాపుత్రపౌత్రభార్యాతిబంధుమి
త్రాదులనుచుండనంగ, ప్రధిత

గీ॥ పుత్త్రపౌత్త్రాదులను గాంచి భూరిభాగ్య
గరిమశోభిల్లహర్షసాగరమునందు
నలశచీజంభభేదులట్లులరి, యెపుడు
పరలు మండెదరిష్వధూపరులు కరము. 1.

ఆ॥ పెండ్లికొమరునందుఁ బెండ్లికూఁతురు మిన్న
యందు విష్ణుకళయు వారిఁ జూటి
కళయునుండు ననుమ గ్రంథరాజములలోఁ
బెద్దవారు నుడువవింటిమి గద. 2.

ఉ॥ కావునసద్వివాహములఁగన్నులు పండువుగాఁగఁజూడఁగాఁ
బోవుజనావళుల్ శుభముఁబొందుట నొవ్యమె? మేల్మికార్యముల్
ధావుకశీలమై జరుపువారతి ధన్యులుగారె? వారలన్
గావముకుందుఁ డెల్లపుడు గంకణమున్ ధరియింపఁజే? కృపన్ 3.

ఉ॥ వారని పేర్మితోడ సిరినల్లభుఁ డెప్పుడుఁ బ్రోచుఁగావుతన్
సారవిచారుని న్విమలభాస యశూరునిధీరునిన్మహో
దారుని శూరునిన్ దురితదానవశౌరి విచారశేముషీ
మూరుభుజంగరాయ బహుమూరుని నార్యజనోపకారినిన్. 4.

క॥ ఏలూరిపుణ్యమేమో
వాలాయంబితని కీర్తిసరదీప్తులచే
మేలొంది యూరులన్నిటి
నేలెడిఁగద కాకయున్న నేలూరగునే! 5.

## 111. నూతలపాటి వసంతముగారు.

క॥ శ్రీయును శౌర్యము ధైర్యము
నాయువుఁబూర్ణముగనొసఁగి యానందములో
న్నాయువు ప్రాణముగాఁగల
యాయీశ్వరుఁ బ్రోచు పతిని ననవరతంబున్. 1.

క॥ భోగమునవింద్రుకంటెను
రాగముకిన్నరులకంటె హరిగనొప్పన్
త్యాగముపూర్వులకంటెను
నాగేంద్రులకంటెఁగాంతి నయముగనొప్పన్. 2.

క॥ మన్మధునికంటెనేర్పరి
మన్ననయావిష్ణు కంటె మతిమిక్కుటవగా
సన్నపుగు నడుము మిక్కిలి
వెన్నునిదిలకించు దేహమేర్పడియుండన్. 3.

క॥ హైమవతిఁబోలు బాలయు
దమయంతిని బోలుచక్కదనములయందున్
ఆమన్మధ భార్యనుతా
నామంబుగణించు నన్నివిషయములందున్. 4.

క॥ ఈదంపతులను దేవత
లందఱును బ్రోచుననవరతం బిద్ధరలోన్
మీదండన లేకుండఁగ
వేదంబుల తెల్పిబ్రోవు వేదాధ్యయనా 5.

క॥ హరిహర బ్రహ్మములందఱు
వరరాజగునట్టి మంత్రిబగడ భుజగరా

యురుమహిభర్తను శీలిని
నరపదిమోముల వెలుపు రక్షించుచుండెన్. 6.

క॥ నూతలపాటిని సంతము
ఖ్యాతిగనీపద్దములను గట్టినతప్పుల్
చాతుర్యవిహీనతచే
మాతప్పులు దిద్దుడయ్య నరనాథమణీ. 7.

## 112. ప్రతివాదిభయంకర కృష్ణమాచార్యులుగారు.

వీరి నివాసస్థలము కృష్ణామండలములోని విజయరాయి అను గ్రామము. వైష్ణవబ్రాహ్మణులు. శ్రీవత్సగోత్రులు. ఆపస్తంబసూత్రులు. తండ్రి అప్పన్ నైనారాచార్యులుగారు. తల్లి కృష్ణమాంబ. సర్వజిద్వత్సర వైశాఖ బహుళ పంచమి జన్మదినము. వీరికి ఆంధ్రగీర్వాణములయందు మంచి సాహిత్యము కలదు. సంస్కృత వ్యాకరణమునం బ్రవేశముకలదు. రెండు భాషలయందును గవిత్వము చెప్పంగలవారు. వీ రాంధ్రమున, 1 సంస్కృత శబ్దప్రవేశము, 2. సంస్కృతశబ్దసుబోధము, అనువ్యాకరణ గ్రంథములును, 3. సావిత్రీవిజయము అను నాటకమును రచించిరి.

శ్లో॥ శ్రీమన్మైథిలరాజదత్త మమితానందాస్పదం జానకీ
పాణిం మంగళరంజితం సపులకం గృహ్ణన్ ముదా రాఘవః
శ్రీమద్ధైమవతీ కరం భుజగరాడ్వత్రం శుభైరావృతం
స్వీకుర్వంతమతి ప్రభం సమవతాచ్ఛ్రీ సత్యనారాయణం. 1.

శ్లో॥ లక్ష్మీతాండవరంగ మందిర తలే శ్రీవత్సమన్వాటివం
శార్ఙ్గాజాతమమందసుందరమముం పూర్ణేందు మానందదం
శ్రీమద్వేంకట సత్యపూర్వక లసన్నారాయణాభిఖ్యకం
బాలం హైమవతీ యుతం కమలజాదేవీ సదా రక్షతాత్ 2.

శ్లో॥ మంత్రిప్రెగ్గడ వంశదీపకమణే ర్భాషాంబికాసేవకాత్
రాజోత్తంసభుజంగరాయ సుధియో జాతాంసుశీలాన్వితాం
బాలాంహైమవతీం సతీంసువర సంయుక్తాంనవోఢామిమాం
సీతాహైమవతీం తథావిజయలక్ష్మీ చావతాన్నిత్యశః. 3.

శ్లో॥ దేవీవారిజ సంభవా సకలదేవాధీశ్వరః కేశవ
శ్శ్రీగౌరీత దధీశ్వరశ్చ మహితా వాణీచధాతా తథా
అన్యేమంగళదాస్సురాస్సతతమిద్దా యుష్యమారోగ్యసం
పత్తింసద్ధనధాన్య వృద్ధిమతులాందత్తాత్తథాసుప్రజాః 4.

శ్లో॥ దేవాస్తోము దీరయంతు సకలా భూదేవతాశీఃక్రియా
నిత్యాసత్యఫల ప్రదావిజయతాం మాంగళ్యముజ్జృంభతాం
గేహేస్మిన్నవయోగ్య నంచభవతాదష్టాధికాస్సుప్రజా
ఆరంభాశ్చ సదాయతి ప్రచురతామాలంబిషీరన్ సదా. 5.

ఉ॥ శ్రీయుతుఁడై పయోధి నతిశీతల శుభ్రభుజంగశయ్యపైఁ
గాయముఁజేర్చి భక్తజనకామితముల్ సమకూర్చుచుండునా
కాయజుదండ్రి గోరికల గల్గునట్లను గూర్చియిచ్చుచుం
బాయకగాచుఁగాత మనబాలకదంపతులన్ ముదంబునన్. 6.

ఉ॥ శ్రీలసమానమై వెలుఁగఁజేకొని జానకిపాణిపంకజం
బాలలితాంగి తోడమణి భాసుర పీఠమునన్ ముదంబుతో
లీలసుఖోపవిష్టుఁడగు శ్రీరఘురాముఁడు సంపతిద్ధయా
లాలసుఁడైవధూవరుల రంజిలఁజేయుతనిష్టదాతయై 7.

ఉ॥ యామునసైకతంబుల నహర్నిశముం దగసంప్రవృద్ధమై
ప్రేమలు పొంగఁగా సరసరీతులఁగ్రీడలనుండు రాధికా

కాముకుఁడీవధూవరులఁ గాంచి పరస్పరమందు తోషముల్
కామమిూఱఁజేరి యొసఁగం బొసఁగించి రయాన ప్రోచుతన్ 8.

ఉ॥ భూములనుండు నప్పుడల పూతవరాహము వారులందు శ్రీ
భామలమీనముం గిరుల భాసురరూపుఁడు నారసింహుఁడున్
సామయికంబుగా నితరసర్వవసుంధర వాసుదేవుఁడున్
సేమముఁగూర్పఁగానగుచు శ్రీపతియీ మిధునంబునోముతన్ 9.

ఉ॥ శ్రీసుతుఁడారతీసతిని శ్రీలు జెలంగఁగఁ బెండ్లియై సదా
భాసురమూర్తులౌ విబుధ వర్యులమధ్య మెలంగఁ జూచియా
శ్రీసతియున్ దదీశుఁడును జేరలఁబోలెడు కంటికింపలం
బూసల పేర్లు నాపిడుచు పూతసుదృష్టులు వీరిఁగాచుతన్. 10.

## 113. మరింగంటి చక్రాచార్యులుగారు.

వీరి నివాసస్థానము కృష్ణాజిల్లా నందిగామ తాలూకా జగ్గయ్యపేట. నర్సారావుపేట రాజాగారి యాస్థాన విద్వాంసులగు శ్రీమత్తిరుమల నల్లాన్ చక్రవర్తి వేంకటరామ నృసింహాచార్యులవారి శిష్యులు.

క॥ శ్రీరామకరుణచేతను
భోరాజామంత్రి పెగడ భుజగేశ్వరియా
వారాసియుక్త ధరణిని
ధారాళము వెలయునీదు ధామము శింగాల్. 1.

క॥ హరియును హరుఁడు విధాలియుఁ
దిరముగ లక్ష్మియు సరస్వతియు శాంభవియున్
వరమూర్తి నధూవరులను
మురియుచుఁ బాలింత్రు గాత మోదముతోడన్. 2.

గీ॥ ఆయురారోగ్యమైశ్వర్య మష్టపుత్త్రి
బహుధనంబులు భోగముల్ బలుతెరఁగుల
ముదమునసమానరాజ్యముల్ పొసఁగనిచ్చి
సురలురక్షింతు రీవధూవరులనెపుడు. 3.

క॥ ఏలూరు పట్టణంబున
వాలాయము జరుగునీవివాహాంచితులౌ
లీలాయుత దంపతులను
హేలాగతినేలు యాదవేంద్రుఁడు పేర్మిన్.

## 114. నందూరు శేషాచార్యులుగారు.

వీరి నివాసస్థలము కానుమోలుపురము. శ్రీవైష్ణవ బ్రాహ్మణులు. ఆపస్తంబసూత్రులు. కౌశికసగోత్రులు. తండ్రినరసింహాచార్యులుగారు. తల్లి లక్ష్మణాంబ. వికృతిసంవత్సర నిజభాద్రపద శుద్ధ ౧౦ మంగళవారము జన్మ దినము. వీరాంధ్రమునందే ప్రవీణతగలవారు. సంగీతమునందుఁగూడ నించుక పరిచితిగలదు. వీరు రచించినగ్రంథము :—1. రుక్మిణీపరిణయనాటకము. ఈనాములు వగైరా జీవనముగలవారు.

సీ॥ వైకుంఠనాథుని వక్షఃస్థలంబున
నిందిరయుండాక యింపుమీఱు
పశుపతిమేనిలోభాగంబుఁ గొన్నయా
పార్వతి యుండాక పరిఢవిల్లు
పద్మగర్భునిముఖ పద్మంబుచెంతను
భారతియుండాక ప్రబలుచుండు
పాతాళమువనుండి ఫణిరాజుపొంపుగా
నిలభారమొందాక నెసఁగుచుండు

గీ॥ పృథివినందాక రైశ్వర్యవృద్ధిఁజేసి
పాడిపంటయు భాగ్యంబు బాగుమీఱ
హైమవతిసత్య నారాయణాఖ్యులకును
దనరఁజేయుత నాచంద్ర తారకముగ.

## 115. కొదమగుండ్ల కేశవాచార్యులుగారు.

వీరినివాసస్థానము నెల్లూరుజిల్లాలోని కాంచనూరివారి అగ్రహారము. బంధకవిత్వమునందు నేర్పరులు.

### నాగబంధము.

చ॥ పరఖగరాజవీర హరవారణ రక్షిరమావధూసహా
పరశులభానతార రతపాతకహృద్రజ సుందరీరతా
స్థిరభువనేశ ఘోరశరధీర హరస్తుతభాగభాహరీ
పరమదహారహీరగర పారదసద్యశశైలధారణా. 1.

ఉ॥ శ్రీకమలామనోజ్ఞవిలసీకృత భానువిలాసమూర్తివై
వీకతొయేలురాజ్యపురి వీస్యనిశత్సువిలాసమూర్తివై.
శ్రీకరమంత్రిపెద్దకుల సింధుశశాంకభుజంగరావు సు
శ్లోకునకిష్టకామ్యము నసింపఁగృపామతిఁ బ్రోతె శ్రీపతీ 2.

ఉ॥ శ్రీధరుఁడార్తభంజనుఁడు సింధుమదాంధవిదారి భక్తహృ
ద్బృందమిళిందభాక్ త్రిదశబృంద సదానుతనందనందనా
నందవిలాసుకంజనయనాంచిత హేమవతీసతీద్వయకున్
సాదరమొందరాజ కులపార్థివకుఁ దమ్మునినిచ్చుఁగావుతన్. 3.

---

## 116. సేనాధిపత్యం వేంకటనరసింహాచార్యులుగారు.

వీరి నివాసస్థానము ఖాళింకోట. జనకులు శేషాచార్యులుగారు. యువ సంవత్సర శ్రావణ శుద్ధవిదియా గురువారము జన్మదినము. వీరు జానకీపతి శతకమును వ్రాసియున్నారు.

శా|| శ్రీరాజాబిరుదాభిరాముఁడయి యక్షీణప్రతాపాఢ్యుఁడై
సారాసార విచారధైర్యఖనియై సంగీత సాహిత్యవి
స్తారోదారనిరూఢతత్వనిధియై ధర్మస్వభావప్రభా
గారుండైన భుజంగరాయ ప్రభుసింగాకృష్ణుఁడేలుంగృపన్. 1.

క|| భాసురలీలన్ హైమవ
తీసీతావిజయలక్ష్మి దివ్యవివాహం
బాసీతాకళ్యాణము
వాసింగను గాత భక్తవత్సలు కరుణన్ 2.

మ|| పరభూపాల కిరీటరత్న విలసత్పాదాంబుజద్వంద్వుఁడీ
శ్వరకోదండ ప్రఖండనుండు ధరణీ జాతాసమేతుండు భా
స్కరవంశోద్భవమండనుండు కరుణాస్వాంతుండు శ్రీరాజశే
ఖరుఁడౌ రాఘవుఁడివ్వధూవరుల వేడ్కం బ్రోవుతన్ నిచ్చలున్ 3.

చ|| ప్రమథగణంబు లెల్లెడలఁ బ్రస్తుతులుం దగఁ జేయుచుండఁగా
నమరవరుల్ మునుల్ గొలువ నద్రిజకున్ ఘనరామతత్వమున్
బ్రమదముమీఱఁ దెల్పి నిజ భక్తులకోర్కు లనెల్లఁ దీర్చు శ్రీ
హిమగిరికన్యకారమణుఁ డేలుత దంపతులం గృపామతిన్. 4.

సీ|| సరసిజాప్తుని రాణి ఛాయాసమానయై
విఖ్యాతినలరుమా విజయలక్ష్మి

అత్రిమానినిసుపత్నియనసూయ పోలిక
విఖ్యాతినలరుమా విజయ లక్ష్మి
పురుహూతుసతిశచి పోలుపునరాజిలి
విఖ్యాతినలరుమా విజయలక్ష్మి
శ్రీరామదేవి యాశ్రీజానకీ భాతి
విఖ్యాతినలరుమా విజయలక్ష్మి

గీ॥ వినుతచరితవుగమ్మ శ్రీవిజయలక్ష్మి
వినతులొప్పుత్తులను గనువిజయలక్ష్మి
విమలకీర్తిని నలరుమా విజయలక్ష్మి
విజయలక్ష్మిని బోలుమా విజయలక్ష్మి. 5.

గీ॥ పట్టమన్నాటి వంశపావనుఁడు ఘనుఁడు
ప్రథితవేంకట సత్యనారాయణుండు
శ్రీవిజయలక్ష్మి ప్రేమతోఁ దీనధూటి
తోడసౌఖ్యంబులను గులఁదూఁగుఁగాత. 6.

## 117. కందాడ నరసింహాచార్యులుగారు.

క॥ “ శ్రీకందాళ కులాబ్ధివి
భాకరరామానుజార్య పావ్రతపని
ర్భీకులుతత్తనయులు నా
శ్రీకర శ్రీ శ్రీనివాసు శేఖరులరయన్. 1

క॥ శ్రీమంగళగిరియనునొక
భూమాన్వితదివ్యదేశ భూషణమొప్పన్
శ్రీమన్నరహరినిచ్చలు
కామితములొసంగు పానకము గ్రోలునటన్. 2.

క|| ఆసులలితదివ్యస్థల
వాసులుకందాడవారు వాధూలులునై
భాసిల్లుచుందు రిపుడును
భాసురతత్తీర్థకార పరమగురువులై." 3

చ|| మెల్లని తేటమాటలును మేలొనగూర్చుమనంబు నెల్లరం
జల్లఁగఁ జూచుచూడ్కియును జాలినవిద్యయు సచ్చరిత్రముం
గొల్లగనచ్చునై సకల కుంభినినిండిన కీర్తియున్ రమా
వల్లభుసత్కటాక్షమున వాటిలెనమ్మక చెల్లమీకిలన్. 1.

శ్లో|| ధనకనకసమృద్ధిః ధాన్యమైశ్వర్యవృద్ధిః
యువతిజనసమృద్ధిః పుత్రపౌత్రాభివృద్ధిః
పరిజన పరివృద్ధిః కౌశలంధర్మవృద్ధిః
భవతుసమస్తం శాశ్వతం మంగళంచ 2.

## 118. కోగంటి లక్ష్మీనరసింహాచార్యులుగారు.

వీరు శ్రీరామానుజ మతస్థులు. శ్రీవత్ససగోత్రులు. వేంకటాచార్య పుత్రులు. శరీరమాత్రభేదముగలవారై శ్రీమాన్ శ్రీ సముద్రాల అప్పలాచార్యులవారును వీరును గలిసి యొకచో భాషాభ్యాసము గావించి యొకచోనవధానక్రమము గ్రహించి ప్రస్తుతము గ్రంథరచనకుంగడంగియున్నవారు. వీరి నివాసము కాకినాడ జగన్నాథపురము. వీరి యశోలతలోకము నావరింప నిప్పుడిపుడె చివురుపెట్టుచు సాగుచున్నది. వీరి విషయమై శతావధాని దివాకర్ల తిరుపతిశాస్త్రిగారును, కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారును సదభిప్రాయములను వెల్లడించి యున్నారు. శృంగారకవి సర్వారాయఁడుగారియొద్ద వీరు విద్యాభ్యాసము చేసియుండిరి.

శ్లో॥ శ్రీమద్ధైమవతీభుజంగతనయా శ్రీసత్యనారాయణా
భిఖ్యాతార్జున నవ్యదంపతి దిదృక్షా కౌతుకాదాగతైః
కృష్ణోయచ్ఛతు భూరిసంపదధి కారోగ్యాద్యమీభ్యాంముదా
విప్రాశీర్వచనాత్మకో భుజగ రాడ్గేహే స్థితాభ్యాంసదా 1.

మ॥ తలిదండ్రుల్ ధనదీయసత్క్రియల మోదంబందగా వస్త్రమా
మలుగర్వింపఁగ బంధుమిత్రములు సమ్మానింపగా మెచ్చఁగాఁ
జెలియా హైమవతీకుజా విజయలక్ష్మీ దేవితోఁగూడి భా
సిలుమా చంద్రదినేశ తారకముగా శ్రీసత్యనారాయణా. 2.

మ॥ కులధర్మంబులు నిత్యధర్మములుగా క్రమ్మిన్యగాఁ బెద్దవా
రి వాక్యంబులు వేదవాక్యములుగా రాజాంకుఁడ వేల్పుగాఁ
జెలియా హైమవతీకుజా విజయలక్ష్మీదేవితోఁగూడి భా
సిలుమా చంద్రదినేశ తారకముగా శ్రీసత్యనారాయణా. 3.

మ॥ పినవాఁడంచును దోడివారలు, బుధుల్ విద్వాంసుఁ డేయంచు, వై
తనికుల్ కేవల ధర్మరాజనుచుఁ, బుత్రప్రాయుఁడంచుంబరాం
గనలేవేళనునిన్ను మెచ్చికొన మెల్లం జాలుమీమించుమిం
చినయా హైమవతీ సతీయుతుఁడవై శ్రీసత్యనారాయణా. 4.

మ॥ బలిమిన్ బంధుసుహృజ్జనాదరమునన్ భద్రక్రియా ఒత్కృతం
జెలిమిన్ శాంతమునన్ దయారసమునన్ శిష్టనతాసక్తిని
శ్చలభక్తిం దగుదానధర్మములనా చంద్రార్కమున్ మించిభా
సిల్లెదున్ హైమవతీకుజావిజయ లక్ష్మీదేవి ప్రాణేశుతోన్. 5.

మ॥ వెలయుంగాత సమస్తసౌఖ్యములతో విజ్ఞానసంపత్తితోఁ
జెలఁగుంగాతనుబుత్త్రరత్నములతో శ్రీమించుభాగ్యమ్ముతో

నలరుంగావుత కీర్తిచంద్రికలతో నాచంద్రతారార్కమున్
మెలఁగుంగావుత భర్తతో విజయలక్ష్మీదేవి ఛాయాకృతిన్. 6.

## 119. చిలకమర్తి యెంబెరుమానాచార్యులుగారు.

వీరి ప్రస్తుత నివాసస్థలము ఏలూరు. జననము రక్తాక్షిసంవత్సర శ్రావణ బ॥ ౧౧ శుక్రవారము. విద్యాప్రారంభము యువసంవత్సర చైత్రమాసములో వీరితండ్రిగారియొద్ద భారవికావ్యమును జదువుకొని మాఘుకావ్యమును, నైషధమును పురాణపండ మల్లయ్య శాస్త్రిగారియొద్దఁ జదివిరి. బ్రహ్మశ్రీవాజపేయ యాజుల సోమనాధశాస్త్రులవారియొద్ద సిద్ధాంతకౌముదిఁ జదివి యనంతరము లౌకిక వ్యాపారనశ్యతనుబట్టి వైద్యవిద్యయందు వైద్యశాస్త్రాభి ముఖ్యములగు చరకాదిభావ ప్రకాశాంతము నటుకుఁగల గ్రంథములను, సింధూరాది రసోను కల్కరసాయనాది తంత్రముల నభ్యసించియున్నారు. వీరిపూర్వికులు ఆశ్వలాయన ఋషితుల్యులు. ఆశ్వలాయన సూత్రులు. వీరి పితృపితామహప్రపితామహులు రంగాచార్యులవారను పట్టాభిరామాచార్యులవారు. తండ్రి పట్టాభిరామాచార్యులవారు. శ్రీవైష్ణవబ్రాహ్మణులు. జన్మస్థానము కృష్ణాజిల్లా తెనాలితాలూకా తాడిపఱ్ఱు.

ఉ॥ శ్రీయువతీలలామయనఁ జెల్వువహించిభుజంగరాయగ
ర్భాయతరత్నమైయలరు హైమవతిన్వరియించె సత్యనా
రాయణుఁడీవధూవరుల ప్రాభవమొప్పఁగ నేఱుసత్యనా
రాయణుఁడెల్లభంగులఁజిరాయువొసంగుచు సర్వకాలమున్. 1.

## 120. నల్లాన్ చక్రవర్తుల పట్టాభిరామాచార్యులుగారు.

వీరి నివాసము గుంటుగొలను. ప్రస్తుతము ఏలూరు. శ్రీవైష్ణవులు. ఆపస్తంబసూత్రులు. కౌశికగోత్రులు. కీలకనామసంవత్సర ఆషాఢశుద్ధ ౫

బుధవారము జననదినము. ఆంధ్రగీర్వాణములయందును, యజుర్వేదము నందును, స్వమతి గ్రంథములయందును పాండిత్యముగలవారు. ఇదివరలో చేసిన తెలుఁగు గ్రంథములు:—శ్రీరంగనాథజనార్దన మాహాత్మ్యము, సప్తగ్రహకూట చరిత్రము, మొదలగునవి.

సీ॥ శ్రీరఘూరమణుఁడా శ్రితజనావనధుర్యుఁ
డభయంబొసంగు మీకనవరతము
వహ్నిల్లలాటుండు భక్తసంత్రాణుండు
విజయంబొసంగును వేడ్కతోడ
వాక్సతీజాని సద్వాక్యజాలములైన
శాస్త్రచయంబుల సర్వమొసఁగు
హైమవతీవాణులబ్జాలయయుమిమ్ము
ననయంబుఁబ్రోచెద రతిప్రమదమున

తే॥ మంత్రిపెగడకులాంబుధి మహితచంద్ర
భూతిలేంద్రాధినాథ భుజంగరాయ!
విబుధసంసదియందు సువినయమహిమ
నెంచ శక్యంబె యహిలోక నేతకైన. 1.

ఆ॥ రాజరాడ్భుజంగరావు పుత్రికాలామ
పతియనంగనొప్పు వారిజాక్షి
ననుగుభర్తయైన యాసత్యనారాయ
ణాఖ్యవరునకొసఁగె నమరులలర. 2.

కం॥ వారివివాహోత్సవమున
వారిజభవభవమురారి వర్గంబెల్లన్
సారమతి నాశిషోక్తుల
వారలవాశీర్వదించి వచ్చిరివేడ్కన్. 3.

ఆ|| అవనిసురలు వారియాస్థానమందున
వేదవాఙ్మురీవివేక ఫణితి
నఖిలసంపదలను నాయురారోగ్యతై
చంద్రసూర్యులట్లు చందమొంది. 4.

ఆ|| ఉండుఁడనుచుఁ బల్కనుత్సాహముననార
లొసఁగినట్టి శాల్వులసదృశముగఁ
గొనుచు వేగిరంత కోర్కెలుసమకూర
బ్రహ్మవాదులెల్ల సమ్ముదమున. 5.

## 121. మల్యాల వెంకటరావుగారు.

### గీతమాలిక.

పరమభక్తితత్పరుఁడైన ప్రభువరుండు
రాజబిరుదాంకితుఁడు కవిరాజరాజు
మంత్రిపెగ్గడ వంశసంభవుఁడునైన
శ్రీభుజంగరాట్ప్రభునకుఁ జెన్నుమీఱ
నుదయమందితిననుమాట మదిని నిల్పి
పుట్టినింటికి మఱియు నీమెట్టినింటి
కినియశంబును గీర్తియు ఘనులు పొగడ
నూర్జితంబుగ సమకూర్ప నుత్సహించి
పరమపావనచరిత్రవై పరిఢవిల్లి
“కరముబట్టెడు వేళ నాకాంతుతోడ
ధర్మమునకు సంతతికిని నిర్మలంపు
బ్రహ్మచర్యసంపత్తికిఁ బరుని గోర
ననివచించితి” ననుమాట ననవరతము

స్మరణఁజేయుచుఁ బతిపూజసలుపుచున్న
హైమవతియను పేరు నీకమరియుంట
నిక్కమగు హైమవతి యని నిదునుగఁదు
తలచుకొనుచున్నాఁచరియింపు ధన్యచరిత!
సత్యనారాయణుండునీ సఖుఁడుగాన
నాతఁడును చేరునకుఁదగి యమరుఁగాద
యిరువు రనురాగమువనుజరించునట్టు
లాయురారోగ్యవంతులై యమరునట్లు
దీవనలొసంగి కాపాడు దివ్యమూర్తి
కరుణతోడుతఁ బ్రేమ శ్రీకాంతుఁ డెపుడు.

## 122. పుత్రేవు నాగభూషణముగారు.

వీరి నివాసస్థలము ఏలూరు. తండ్రి వేంకటసుబ్బరాయ మంత్రిగారు. తల్లి శేషమాంబ. ఉపాధ్యాయులు. వయస్సు ఇప్పటికి 22 సంవత్సరములు. ఆర్వేల నియోగులు. వెలనాటిశాఖ. ఆపస్తంబసూత్రము. యజుర్వేదము. పరాశర్యసగోత్రులు. వీరిచే రచియింపఁబడిన గ్రంథములు:—1. రసభావనాయికా సాంప్రదాయము, 2. దాసపోషక శతకము, (అచ్చుపడ్డాయాలైనవి) 3. అభినయచూడామణి, 4. శ్రీనివాస కళ్యాణము, 5. బిల్హణీయము, (ఇవి రెండును నాటకములు) 6. బల్టక్కరురావు ఫార్సు, 7. డంబాచారి ఫార్సు, 8. శ్రీయాశోపాఖ్యానము, 9. సీతాకళ్యాణము, 10, మార్కండేయచరిత్ర, 11. విప్రనారాయణచరిత్ర, (హరికథలు) 12. నాగభూషణశతకము, 13. భక్తియోగరహస్యము, 14, సామాన్యా సాంప్రదాయము. 15. భరతరసకుసుమము. 16. భరతనృత్యావళి.

శా॥ శ్రీకారుణ్య గుణాభివృద్ధియశమున్ క్షేమంబు ప్రేమంబునున్
రాకానందము నాయురున్నతియు సామ్రాజ్యంబు పూజ్యంబుసం

స్తోకంబున్ శశిభానులుండు వఱకున్ శోభాయమానంబుగా
శ్రీకన్యామణి ప్రోచు హైమవతినిన్ శ్రీసత్యనారాయణున్. 1.

శా॥ శ్రీకళ్యాణసమస్త వైభవములున్ శ్రేయంబు న్యాయంబును
శ్లోకత్వంబును నిత్యసత్యనియతిన్ సుజ్ఞానమున్ మానమున్
సాకల్యంబభివృద్ధిఁజేయుచు మహాసంతోషముల్ గూర్చియా
శ్రీకంఠుండును ప్రోచు హైమవతినిన్ శ్రీసత్యనారాయణున్ 2

శా॥ త్యాగంబుంగుల శీలధర్మము మహాధైర్యంబు స్థైర్యంబునున్
రాగంబున్ ఘనశాంతవృత్తి జయమున్ రమ్యంబు సౌమ్యంబునున్
భోగంబున్ వరపుత్రసంతతియు సంపూర్ణంబుగానిచ్చియా
శ్రీగౌరీసతి ప్రోచు హైమవతినిన్ శ్రీసత్యనారాయణున్. 3.

శా॥ ప్రాపైబాంధవకోటి విప్రగణముల్ పౌరోహితుల్ స్నేహితుల్
దాపైపండితసత్కవీంద్ర తతులుండండోపతండంబుగాఁ
గాపైనిత్యము గొల్చుచుండఁగ మహాకళ్యాణముల్ గూర్చియా
శ్రీపద్మాక్షుఁడు ప్రోచు హైమవతినిన్ శ్రీసత్యనారాయణున్. 4.

శా॥ సేవింపంగను యాచకావళి భటుల్ శ్రేష్ఠంబుగా నెప్పుడున్
దీవింపంగను వంది మాగధబుధుల్ దివ్యప్రకారంబులన్
జీవింపంగను భూతలంబునఁ జిరంజీవిత్వముం గూర్చియా
శ్రీవాగీశ్వరి ప్రోచు హైమవతినిన్ శ్రీసత్యనారాయణున్ 5.

## 123. గుడిగుంట లక్ష్మీపతిగారు.

### ఉ త్ప ల మా లి క.

శ్రీయనువాణిచేరిన విశేషయశమ్ము ప్రతిష్ఠనమ్ములన్
బ్రోయఁగ సర్వమంగళ సమున్నతినొందెడి పూన్కి సత్యనా

రాయణరావు హైమవతిరాజ ముఖిన్ నిగమోక్తప్రక్రియన్
జాయగఁదాకర గ్రహణసల్పి సుమంగళసూత్రధారిణిన్.
జేయఁగ వేదమంత్ర విధిఁజేరినయట్టి త్రయస్త్రింశకోటిసం
ఖ్యాయతవేల్పులైహికసుఖమ్ములనెల్ల నొసంగుచున్ సదా
శ్రేయము సత్యభాషణము శీలసుభూతి దయాప్రశస్తిదీ
ర్ఘాయువులిచ్చి దంపతుల రక్షణజేతురహర్నిశమ్ములన్ 1.

సీ॥ తొలిపల్కువిధినిదాఁదొయ్యలిబెండ్లాడె
  బ్రహ్మప్రోచును సతీపతులనెపుడు
ధర్మసంసిద్ధికై తరుణినిజేపట్టె
  మాపతిప్రోచుదంపతుల నెపుడు
అష్టసంపదలకైయతివనుగైకొనె
  ధూర్జటిప్రోచు వధూవరులను
సంపూర్ణతజెలంగ సతిగూడెభూతిసం
  తతిప్రోచు జాయాధిపతుల నెపుడు

గీ॥ హైమవతి సౌఖ్యములఁ గూర్చునల్లపతికి
సత్యనారాయణుఁడు ప్రోచుసతిననిశము
హైమవతి సత్యనారాయణాఖ్యదంప
తులకుసుఖములు కరతలామలకమిలను. 2.

సీ॥ సర్వమంగళములు సమకూరుననుటకు
  సర్వమంగళయుత సతియెసాక్షి
సతిపతులనురాగయుతులౌదురనుటకు
  సమరూపప్రాయశీలములెసాక్షి
బహుసుపుత్రధనమ్ముఁబడయుదు రనుటకు
  ననుకూలదాంపత్యమగుటెసాక్షి

ఇహ పర సుఖపూర్తి నెనయుందురనుటకు
జ్ఞానసత్పూర్తి సంగతియొసాక్షి

గీ|| ఇట్టిసాక్ష్యములెన్నని యేకరీతి
భావిఫలనిశ్చ యాహ్లాదపటిమగొలుప
హైమవతి సత్యనారాయణాఖ్యదంప
తులు మహాభోగములను వర్ధిలుదురిలను
సద్గుమన్నాటి వంశదీపకులనంగ
మంత్రిపెగడ సువంశపావనులనంగ. 3.

క|| ధర్మార్థకామమోక్షము
లర్మిలినొసగూర్చి చిరతరాయుష్యమ్మున్
నిర్మలదేహారోగ్యము
చర్మాంబరధరుఁడొసంగు సతిపతులకిలన్. 4.

మ|| శ్రుతులందెల్లెడిసుస్వరోక్త మహాదాశీర్వాదమంత్రాన్వయో
న్నతియే సత్ఫలదాయకమ్మయి మహానందమ్ముఁజేకూర్పదం
పతులత్యుత్తమ ధర్మమార్గహితులై వర్తించి సచ్చింతనా
రతినిందేలి సుఖించుచుందురతి దీర్ఘాయుష్యతన్ ధీరతన్. 5.

## 124. శ్రీపతి నరసింహారావుగారు.

సీ|| శ్రీరాజరాజ రంజితపండితసమాజ
అర్థికల్పకభూజ యాంధ్రభోజ
మంత్రిపెగడవంశ మహితోదధిశశాంక
కవిపండితప్రశంస కులవిశాల
నిజరూపజితమార నుజనసంఘాధార
యలఘుమహోదార యబ్ధిధీర

అవఘారుదేవనే నాశీర్వదించెద
నీవఘూవరుల నాశీమ్మ్ముదల

గీ॥ నీదయామృతనిష్యంది నీకృతావ
గాహనంబునగాదె యీ దేహయాత్ర
గడుపుచున్నాడదినమొక్క గడియంబోలె
సరసజనభాగధేయ భుజంగరాయ. 1.

ఉ॥ ఆయతకీర్తిశంకరుడు నార్య సరస్వతి యున్నజాడల
త్క్మీయుతుండైనశ్రీహరియు క్షేమప్రమైన కటాక్షవీక్షలన్
యేయెడనీవధూవరుల నీక్షణసేయుచుం బుత్రపౌత్రది
వ్యాయురఖండసౌఖ్యముల నర్థిలంజేయుంత నెల్లకాలమున్. 2.

## 125. మల్లాది వేంకటసుబ్బారావుగారు.

వీరి నివాసస్థలము గోదావరిజిల్లా శివకేశ్వరము. జననము, 25-12-1894 సంవత్సరము. వెలనాటి వైదికులు. తాత అచ్చన్నశాస్త్రిగారు. తండ్రి సీతారామయ్యగారు. తల్లి సుభద్రాంబ. వీరిచేరచియింపంబడిన గ్రంథములు :—1. చంద్రహాస చరిత్ర, 2. అగస్త్యేశ్వర శతకము, 3. మాయావతి మొదలగునవి. ప్రస్తుతము స్కూలు ఫైనలు విద్యార్థులు.

శా॥ శ్రీతన్విన్ గుతుకమ్ముతోడవిజయ శ్రీలొప్పం బెండ్లాడిమేల్
చాతుర్యమ్మున భూమినేలిశుభముల్పంధించు నాతండుశ్రీ
సీతాహైమవతీసతీవిజయ లక్ష్మీనృత్యనారాయణం
ప్రీతింగాంచియొసంగుగాత పతమున్ దీర్ఘాయురారోగ్యముల్.1.

మ॥ నిరతైశ్వర్యముతో ధరాస్థలినిం గాంతింబొల్చి యొల్లప్పుడు
ద్ధురకీర్తింగవియువ్వధూవరులు సంతోషానురాగంబులం

బరగన్నిత్యసుఖంబులంబడసి సద్భావంబులుంగల్గిసం
చరణంబుంబొనరింత్రుగాత యవనీస్థానంబులోఁ బిల్లఁగన్. 2.

ఉ. పాయని ప్రేమయున్విమల భావములుంగలుగంగ సత్యనా
రాయణమూర్తి హైమవతులల్లనఁ జక్కని వర్తనంబుఁ గై
సేయఁగ సద్గుణంబులను జేసి ప్రతీతికి నెక్కి తాము సు
శ్రీయలరించి మించఁగఁ జరింతురుగాక ధరాతలంబునన్. 3.

గీ|| పతిదలంపఁగఁ దనకు దైవంబటంచుఁ
బత్నిఁ దలఁపఁగఁ దనకెల్లఁ బ్రాణమనుచు
హైమవతియును సత్యనారాయణుండు
నెఱిఁగి వర్తింత్రుగాత తామెల్లయపుడు. 4.

సీ|| ఘనకార్యములఁ జేసి మునుకీర్తిఁగొని ధరా
స్థలి మించినట్టివారలఁ దలంచి
సన్మార్గములకు నాస్థానంబులైన సౌ
శీల్యాదిగుణముల సేకరించి
పుడమి మంచివిగాఁగఁ బూర్వార్జితములైన
యాచారపద్ధతు లభ్యసించి
గరిమతో మంత్రిపెగడ వట్టమున్నాటి
వంశమ్ములకుఁ గీర్తి ప్రతిభ నించి

గీ|| పుత్రపౌత్రాభివృద్ధిచేఁ బొలుపుఁగాంచి
భవ్యమతులైన యివ్వధూవరులునైన
హైమవతియును సత్యనారాయణుండు
శ్రీకరంబగుయశము నార్జింత్రుగాత. 5.

ఉ॥ అందముగావివాహసమయంబున మున్నొకయప్పుడున్ముదం
బందుచుఁబండితోత్తముల నందఱఁబిల్వఁగఁబంచివారినిం
బందరునందుఁగూడఁగనొనర్చిన సంగతివిన్నవారమా
చందముమాకునిచ్చుటను జక్కఁగఁగానఁగ నయ్యెవేడుకన్. 6.

మ॥ కవియుంబండితుఁడైప్రధానియయి భూకాంతుండునైయార్యసం
స్తవనీయుండభుజంగరాణ్ణృపతి విద్యాపోషకుండీతఁడం
చుపచింపంగవు వెల్లవారిఁబిలిచెన్ శోభాయమానంబుగా
భువినిట్లైగదకీర్తినింపుదురు సమ్మోదమ్మునన్సజ్జనుల్. 7.

గీ॥ ఇచటనేలూరుపురమున కేగుదెంచి
కోవిదుల్గూడి మాటాడుకొనుటయెల్లఁ
బరగుభవదీయ సత్కృపాపరతఁగాద
సరసగుణసముదాయ భుజంగిరాయ. 8.

గీ॥ వడ్లమన్నాటివారికిఁ బ్రతిభఁగాంచి
వరలుమంత్రిప్రెగడ సంశభవులకిపుడు
కలిగియుండినవిఖ్యంపు కతనఁజేసి
సర్వజనులకు హృదయముల్సంతసిల్లె. 9.

గీ॥ తవరుపనురాయసుకవి ఛాత్రప్రధాన
ఆశుకవితానిధాన యష్టావధాన
శోభమల్లాదివెంకట సుబ్బరాయ
రచితమైనవిధపశేశ్వరంబు మాది. 10.

## 126. న్యాపావజ్ఝల సత్యనారాయణమూర్తిగారు.

వీరి నివాసస్థలము ఖాశింకోట. వికృతినామసంవత్సర మార్గశీర్షశుద్ధ ద్వాదశి జన్మదినము. తండ్రి జగన్నాధముగారు. శ్రీవత్ససగోత్రులు. వీరిచే

రచింపఁబడిన గ్రంథములు:—1. చక్రిశతకము, 2. అమూల్యరత్నము (నవల) 3. మోహిని (చరిత్రవిషయిక నవల.)

సీ|| పతియురంబుననిల్చు భాగ్యమ్మమహిమాక
చేకూరెననిసంతసించుసాధ్వి
యవతారములతోడ నవతరింపఁగసాక
చేకూరెననిహాళిఁ జెంగుసాధ్వి
ధనమూలమీజగత్తనిలోకు లెంచునా
సిరితానెయగుటకు మురియుసాధ్వి
ముల్లోకములునేలు వల్లభుపారితాను
పొందినంగులకు నుప్పొంగుసాధ్వి

గీ|| ఐరుఁడుశ్రీపద్మనాభ్నాటి ఐంశభవుఁడు
ప్రథితవేంకట సత్యనారాయణునకు
వధువుసౌభాగ్యవతి హైమవతికినెపుడు
శ్రీలొసంగుచుఁ బ్రేమతో నేలుఁగాత. 1.

సీ|| ఏలేమముదముతో నీశ్వరానుగ్రహం
బందియర్ధాంగియై యలరుచుండు
నేకాంతబూచుల రొుకిమానిపదపద్మ
ములఁగొల్చి మెప్పించికులుకుచుండు
నేవారిపతిభక్తినే నమ్మిజన్నంపు
వేటకానికిఁ బ్రేమఁ బెంచుచుండు
నేచావతనప్రేమ కీడెద్దియనితెల్ప
గిరళకంఠునిముద్దు లారయుచుండు

గీ॥ హాయిగా నేలునా పై బ్రహ్మ్మీయము వొసఁగి
వరుఁడు శ్రీవల్లమన్నాటి వంశభవుఁడు
ప్రథితవేంకట సత్యనారాయణునకు
వధువు సౌభాగ్యవతి హైమవతికి నెపుడు. 1.

సీ॥ నిల్పియుండెనుగదా నెమ్మితో నాభర్త
తలవాకిలిల్లుగా నెలవొసంగి
ఇచ్చియుండెనుగదా యింపునాపైనుంచి
హంసరాజమును వాహనము గాఁగఁ
గూర్చియుండెనుగదా కూర్మి నాపైనుంచి
సిరికోడలను నామ మరయ నాకు
చెలఁగియుంటినిగదా చెల్వొందు ప్రేమచే
సకలవిద్యలకును స్థానముగను

గీ॥ అనుచు మురిసెడి వాణివిద్యలనొసంగు
వరుఁడు శ్రీవల్లమన్నాటి వంశభవుఁడు
ప్రథితవేంకట సత్యనారాయణునకు
వధువు సౌభాగ్యవతి హైమవతికి నెపుడు. 2.

సీ॥ మద్రాసుఁబాలించు మహితుండు పెంట్లఁడు
ప్రభునిరీతిని వారి పత్ని రీతి
భరతఖండపు రాజప్రతినిధి హార్డింజి
ప్రభునిరీతిని వారి పత్ని రీతి
ఘనుఁడు హిందూదేశ కార్యదర్శియును క్రూ
ప్రభునిరీతిని వారి పత్ని రీతి
రాజరాజేంద్రుఁడై రాజిల్లు శ్రీజార్జి
ప్రభునిరీతిని వారి పత్ని రీతి

గీ॥ నేఁడుఁగావుతదేవుండు శ్రీలొసంగి
వరుఁడుశ్రీవడ్లమన్నాటి వంశభవుఁడు
ప్రథితవేంకటసత్య నారాయణునకు
వధువుసౌభాగ్యవతిహైమవతికినెపుడు. 4.

సీ॥ కనులవైకుంఠంబుఁ గావించినారలే
దంపతుల్ పెండ్లి సందర్భమందు
నవనిజాకళ్యాణ మనిపించినారలే
దంపతుల్ పెండ్లి సందర్భమందు
స్వర్గసౌఖ్యముస్ఫురింపఁగఁ జేసినారలే
దంపతుల్ పెండ్లి సందర్భమందు
సర్వమ్మునకుహాళి సమకూర్చినారలే
దంపతుల్ పెండ్లి సందర్భమందు

గీ॥ వారికిడుదేవుఁడాయువు వర్షశతము
వరుఁడుశ్రీవడ్లమన్నాటి వంశభవుఁడు
ప్రథితవేంకటసత్య నారాయణునకు
వధువుసౌభాగ్యవతిహైమవతికినెపుడు. 5.

## 127. నిడుముక్కుల కనకయ్యదాసుగారు.

వీరి నివాసస్థలము ఏలూరుపురము. ఆఱువేలనియోగులు. ఆపస్తంబ సూత్రులు. కౌండిన్యసగోత్రులు. తండ్రి జానకిరామయ్యగారు. తల్లి సుబ్బమాంబ. యువసంవత్సర భాద్రపదశుద్ధ పంచమి జన్మదినము. వీరాంధ్రభాష యందు సముచిత ప్రవేశముగలవారు. మఱియు హరికథాకథన ప్రవీణులు. కవితారచనాభిలాషులు. వీరిచే రచియింపఁబడిన హరికథాసంబంధ చాటుధారలు, కథలుకొన్నిగలవు. వీరు స్వకీయమైన రొయిలిమెంటరీ పాఠశాలా ప్రధానోపాధ్యాయులై యున్నారు.

సీ॥ పూవునఁదావియుఁబొదలిన యట్లుండు
ఈవధూవరులునిం పెసఁగఁబొసఁగ
నీరునుబాలతోఁజేరిన యట్లుండు
ఈవధూవరులునిం పెసఁగఁబొసఁగ
హేమంబురత్నంబులెనసిన యట్లుండు
ఈవధూవరులునిం పెసఁగఁబొసఁగ
రతిమన్మథునిఁగూడి రంజిల్లునట్లుండు
ఈవధూవరులునిం పెసఁగఁబొసఁగ

గీ॥ హరిహరాదులు కృపఁజూచి హైమవతిని
సత్యనారాయణంబును సత్యముగను
బ్రోచిరక్షించుశుద్ధని బుద్ధినిచ్చి
ధరనువర్ధిల్లఁజేయును తథ్యముగను. 1.

సీ॥ బీదసాదలనెల్ల ప్రీతితోరక్షింప
నీదంపతులబుద్ధి హెచ్చుఁగాత
కవిగాయకులనెల్ల సవినయంబుగఁబ్రోవ
నీదంపతులబుద్ధి హెచ్చుఁగాత
కులబంధువులనెల్లఁ గూర్మితోఁగాపాడ
నీదంపతులబుద్ధి హెచ్చుఁగాత
ఘనవిప్రవరులను గరుణతోఁ బోషింప
నీదంపతులబుద్ధి హెచ్చుఁగాత

గీ॥ హరిహరాదులు కృపఁజూచి హైమవతిని
సత్యనారాయణమ్మును సత్యముగను
బ్రోచిరక్షించిశుద్ధని బుద్ధినిచ్చి
ధరనువర్ధిల్లఁజేయును తథ్యముగను. 2.

## 128. కొల్లివ్వాడి రామకవిగారు.

వీరు ఆఱువేలనియోగి శాఖాబ్రాహ్మణులు. ఆపస్తంబసూత్రులు. హరితసగోత్రులు. తండ్రి లక్ష్మీనారాయణగారు. తల్లి నాగమాంబ. జనన కాలము విభవసంవత్సర శ్రీరామజయంతి. వీరు ఆంధ్రమున ధారాళముగఁ గవిత్వముఁ జెప్పువారు. భీమవరము తాలూకా ఆరేడు స్వగ్రామము. వీరు రచించిన గ్రంథములు.—1. ఇళోపాఖ్యానము, 2. దేవాసుర నాటకము, కాండపంచకము, అష్టమస్కంధకథ. 3. సత్యభామా విలాసము, (యక్షగానములు) 4. చిత్రరాఘవము (పద్యకావ్యము) 5. అభినవమోహిని (నాటకము) 6. పరశురామనాటకము, 7. గాంగేయోపాఖ్యానము, 8. ప్రహ్లాదనాటకము, 9. దురోదరోపాఖ్యానము (పద్యకావ్యము.)

శా|| సీతారాములుమామహేశ్వరులు లక్ష్మీకేశవుల్ రోహిణీ
శీతాంశుల్ యమునామురారులు రతీచేతోద్భవుల్ సంతత
ఖ్యాతిందామరతింపరైకులము పొంగందమ్ములంబోల్చి సం
ప్రీతింగూర్చుదరీవధూవరులకున్ శ్రేయంబులెల్లప్పుడున్. 1.

క|| ఈభాషాచతురాస్యుల
శోభనదంపతులనతుల సుగుణాన్వితులన్
శ్రీభాషాచతురాస్యులు
ప్రాభవమునఁగాతు రవుడు భద్రప్రదులై. 2.

క|| హైమవతీసర్వజ్ఞుల
నీమహానీయోరుమతుల నీదంపతులన్
హైమవతీసర్వజ్ఞులు
నేమరకెను గాచుచుందు రెంతయుఁబ్రీతిన్. 3.

సీ॥ వరధైర్యగుణహిమవంతుఁడౌ రాజాభు
జంగరావమల విశాలయశుని
వరకుమారికి హైమవతియనుకన్యక
నర్థమన్నాటి సద్వంశజలధి
చంద్రుఁడౌ వేంకట సత్యనారాయణ
రావునకునుదగు రాజసమున
వలరునీసత్య నారాయణ శ్రీ హైమ
వతికినిఁగును శుభంబులోలుకు

గీ॥ మమతరాజాభుజంగరామ్మంత్రి మౌళి
పట్టియగుహైమవతిఁబెట్టఁ బట్టఁబట్టి
యితఁడుసద్విజ్ఞుఁడయ్యెనీ యిర్వురకును
గూర్చినవిధాతశుభములఁ గూర్చుఁగాత. 4.

గీ॥ అవనిసీమంగళాదేవి యైన హైమ
వతికిసత్య నారాయణస్వామియనఁగఁ
బరగుసద్విజ్ఞునకును దాంపత్యమెలమిఁ
గూర్చినవిధాతశుభములఁ గూర్చుఁగాత. 5.

## 129. సత్యవోలు అప్పారావ్ గారు.

వీరాఱువేల నియోగులు. జన్మస్థానము రామచంద్రపురము తాలూకా జన్నాడయను గ్రామమైనను జిన్నతనమునుండియు వీరు రాజమహేంద్ర వరమున వాసముఁ జేయుచుండిరి. తండ్రి శేషయ్యగారు. తల్లి సర్వమ్మ. క్రీస్తుశకము 1887-వ సంవత్సరమున జన్మించిరి. కోటిలింగశతకము, పున్నాగాయియను చిత్రవచనకావ్యము, నీతిబోధయను నీతిశతకమును, సుమనోల్లాసమను పద్యకావ్యమును రచించిరి. మఱియు భారతమునుండియు, భాగ

పతము, రామాయణములు మున్నగు పూర్వకవులచే రచియింపఁబడిన పురాణములు, ప్రబంధములు మున్నగువానినుండియు నీతిబోధకములయిన పద్యముల నెత్తి "ఆర్యసూక్తిముక్తావళి" యని పేరిడి యొకగ్రంథమును బ్రచురించిరి. వీరు ప్రకృతము మానవసేవయను మాసపత్రికకు సంపాదకులైయున్నారు.

సీ॥ చెల్లముజిలకఱ్ఱపెట్టి మూర్ధంబున
బాసాడికరమును బట్టినావు
ప్రతిదేవతలునిన్ను బళిబళీయని మెచ్చఁ
గంధరంబునఁదాలి గట్టినావు
మానిసిమణులెల్లమదిని సంతోషింప
నింపుగాఁదలఁబ్రాలు నింపినావు
పావనచరితయౌ బాలవెన్నంటిరా
నగ్నిదేవునిసాక్షి యడిగినావు

గీ॥ హైమతినిదుకులకాంత గైనదింక
నెల్లవేళలదయతోడ నేలుమయ్య
వల్లమన్నాటిసప్వంశ వార్ధిచంద్ర
రమ్యగుణసాంద్రసత్య నారాయణేంద్ర! 1.

సీ॥ నియమవ్రతుండవై నీతిదొఱంగక
బ్రహ్మచర్యముపల్పు భార్యతోడ
సత్యశీలుండవై సద్ధర్మముల నేర్చి
నెఱపుముసత్కర్మ నియతితోడ
ధర్మస్వరూపంబు దాల్చినవాఁడవై
కాపాడుదీనుల కరుణతోడ
పరమశాంతుండవై నిరతంబుమనమునఁ
బరమాత్మునేవింపు భక్తితోడ

గీ॥ ధనమువిద్యయుఁగల్గిన ధన్యులమని
మాన్యులగువారుతలఁపరు మానసమున
వారిపథమునఁజనుట యూవలయునయ్య
రమ్యగుణసాంద్ర సత్యనారాయణేంద్ర! 2.

సీ॥ సకలశాస్త్రంబుల సారి మెఱింగిన
పండితులకుఁగీర్తి ప్రబలునింక
దేశభాషలలోనఁ దేజరిల్లినమహా
కవులకువిఖ్యాతి గలుగునింక
సంగీతవిద్యా విశారదులగువారు
గౌరవంబెల్లెడఁ గాంతురింక
గతులనేర్చినయట్టి గరిడీలుపగ్గమై
పంచినన్మానింపఁ బడుదురింక

గీ॥ విబుధవరులార! పెండిలి వేళలందు
ఆంధ్రభాషావిశారదుఁ డమలమతియు
సత్కవియునైనయట్టి భుజంగరాయ
ప్రభువతంసము సభనిల్చినరలెఁగాన. 3.

## 130. పాపరాజు కోదండరామశర్మగారు.

వీరినివాసస్థలము గుంటూరుజిల్లా నర్సారావుపేటతాలూకా యల్లమంద గ్రామము ఆఱువేలనియోగులు. ఆపస్తంబసూత్రులు. కాశ్యపసగోత్రులు తండ్రి సుబ్బయ్యగారు. తల్లి వీరలక్ష్మాంబ శ్రీముఖనామసంవత్సర వైశాఖ బహుళదర్శిసోమవారము, రోహిణి, సింహలగ్నమందు జన్మించిరి. ఆంధ్ర గీర్వాణసాహిత్య ఆశుధారకవిత్వములయందు పేశలులు. షోడశకర్మాధికారులు. ప్రేమరి, సర్వి, హ్యాసయినవారు. వీరు రచించిన గ్రంథములు:—విజ

**యవిలాసనాటకము, 2. రుక్మిణీ కళ్యాణనాటకము, 3. శ్రుతకీర్తి మహా
రాజు చరిత్రము, 4. మఱియుఁగొన్ని చిల్లరవి.**

శా॥ శ్రీక్షోణీతనయా కుచాగ్రరచిత శ్రీగంధపంకోల్లస
ద్వక్షోభాగుఁడు సానురాగుఁడు దయాభావుండు రాముండు భ
క్తక్షేమంకరమూర్తి దాశరథి కోదండోజ్జ్వలత్పాణిసం
రక్షించున్ దయనీశభూపవరుల సన్మానింమ శ్రేప్రార్థులన్. 1.

సీ॥ శ్రీభారతీరమా శిఖరీశపుత్రిక
లాత్మసీమంతినులగుచు రెసరు
నారదమార సేనానులజస్రంబు
లాత్మనందనులుగా నగుచు రెసరు
అమరులు కపికుల ప్రమథగణంబుల
త్యాప్తబృందములుగా నమరి రెసరు
భానస్య వైకుంఠ కైలాసలోకముల్
రాజధానులనఁగఁ బ్రబలె నెవ్వ

గీ॥ రట్టియాదిమదంపతు లనవరతము
హైమవతిసీత విజయలక్ష్మాంబమణికి
సత్యనారాయణునకును శాశ్వతముగఁ
జిరసుఖైశ్వర్య మిచ్చి ప్రోచెదరుగాత. 2.

ఉ॥ భానుఁడు కాంతినిచ్చి సితభానుఁడు సంతసమిచ్చి ధారుణీ
సూనుఁడు రాజ్యమిచ్చి శశిసూనుఁడు చారువివేకమిచ్చి ప్ర
జ్ఞానిధి భూమమిచ్చి శిఖజాతుఁడు వర్ణనశక్తినిచ్చి స
న్మానితసత్కృతిన్ బ్రోచెదరు మాన్యులదంపతులన్ శుభోన్నతిన్. 3.

శ్రీ త్తదంపతులకు నీవు కోర్కెలిచ్చి
యలరనాశీర్వదింపుమా యజ్ఞనేత్ర ! 5.

## 132. గుత్తిభాస్కర రామచంద్ర రావుగారు.

వీరి నివాసస్థలము అనంతపురముజిల్లా గుత్తి. తండ్రి రామకృష్ణమాచార్యులుగారు. తల్లి వేంకటలక్ష్మమాంబ. స్మార్తబ్రాహ్మణులు. మురికినాడులు. ఇనాముదారులు. గౌతమసగోత్రము. ఆపస్తంబసూత్రము. యజుర్వేదము. నలుగురు సోదరులలో వీరు తృతీయులు. ఆంధ్రము, గీర్వాణము, కన్నడము, ఈభాషలయందు సమానమగు పాండిత్యమును కవితా ధోరణియుంగలవారు. వీరు రచించిన గ్రంథములు:—1. మాలతి, 2. ప్రకృతిశాస్త్రనీతి గీత పంచాశతి, 3. ప్రఫుల్లాపట్టాభిషేకము, మాతామహుండు పూర్వకవి రత్నము. పెదతండ్రి మృత్యుంజయులు, విద్వద్గజము.

శ్లో॥ అమోఘకల్యాణ గుణాశ్రీరామా
భుజంగరాడ్భూషణ విభూషితాంగీ
గౌరీచగౌరీత్యవిజయశ్రియౌశ్రియం
సభర్తృకాయైముదమాదదాతు. 1.

గీ॥ సత్యమెటనుండు విజయమచ్చటనెయుండు
నెచటనారాయణుండుండు నచటెలక్ష్మి
కనుక శ్రీసత్యనారాయణునకు విజయ
లక్ష్మియేర్పడె నెడమనల్పకుండరంబె. 2.

గీ॥ మంత్రి పెగడ భుజంగరాణ్మౌళికాలము
ఇట్లమన్నాటి సంశము వన్నెమీఱ
సత్యనారాయణుని మనస్సరసిజాత
సీమవిహరింపు విజయలక్ష్మిలలామ. 3.

ఉ॥ శంకరటంకరల్ నడలు వచ్చియురానిసుధామృదూక్తులా
టంకములేక పంకజ విటంకములందు భుజంగరాజ ప
ర్యంకమునందు బాల్యదశపోయిన వచ్చితె వింత ధర్తతో
లంకెగఁగూడి యావిజయలక్ష్మివె నామనమేండ్లునూరిలున్. 4.

చ॥ అతిదయనగ్ర భాగమున హైమవతీ సతిసీత లెందునీ
కతులితకీర్తిసంపదలు పోయిఘటిల్లఁగఁ "బెండ్లికూఁతురా!
సతతసుమంగళీభవ, ప్రశస్తసుపుత్త్రవతీభవ" యంచుఁబ
ల్కితరణదీవనల్డిగ వేలకువేల్గురి పింత్రుకావుతన్. 5.

ఉ॥ ప్రాయము కాయమున్ యశము పాయములేక వెలుంగనెప్డు దీ
ర్ఘాయువు, సత్సుతోదయము, హాయి, వివేకము, మైత్రియుప్పుసు
శ్రీయుతులైరి యన నశేషజనంబు మనుంత సత్యనా
రాయణరాయఁడా విజయలక్ష్మియు పూవును దానిప్పరునన్

శ్లో॥ ఏతా ప్రసిద్ధావిబుధాశ్చలక్ష్మీ
నారాయణౌ తౌ హి వివాహవేషః
భుజంగరాడ్భోగసహస్రశీలా
శాలాక్వచాన్యప్రహితం వదంతు.

## 133. మల్లంపల్లి కోటీశ్వర శాస్త్రిగారు.

వీరి నివాసస్థానము కృష్ణామండలములోని యేలూరు పురము. తండ్రి పద్యాంధ్ర వ్యాకరణ శివలీలాపంచవింశత్యాద్యనేక కృతికర్తలగు మల్లికార్జున శాస్త్రిగారు. తల్లి సుందరమ్మ. ఇప్పటి కిరువదిసంవత్సరముల ప్రాయము. హరితసగోత్రము. ఆపస్తంబ సూత్రము. శైవ బ్రాహ్మణులు. ఏలూరు మిషన్ హైస్కూలులో నాంధ్ర ప్రధానోపాధ్యాయులు.

ఉపజాతి॥ పాయాదుమాయాః పతిరిందుమౌళి

శృభాని నిత్యందయయోద దానః
శ్రీసత్యనారాయణ నామధేయం
వరంవధూం హైమవతీ సమాఖ్యాం. 1.

క॥ శ్రీమార్కండేయేశుఁడు
హైమవతీ ప్రాణనాథుఁడనిశంబుఁగృపన్.
క్షేమంబులొసఁగి ప్రోచున్
హైమవతీ వధువు సత్యనారాయణునిన్. 2.

## 134. శివశంక నాగభూషణముగారు.

వీరి నివాసస్థలము ఏలూరునకు సమీపముననున్న వంగూరు. శైవ బ్రాహ్మణులు. ఆపస్తంబసూత్రము. పాలంకాయనస గోత్రము. తల్లిదండ్రి కన కయ్య అయ్యవార్లంగారు. తల్లిమహాలక్ష్మమ్మ. అంగీరస సంవత్సర చైత్ర బ ౧౧ ఆదివారము (1872 సం॥ ఏప్రిల్ 28 తేది) జననము. 20 సంవత్సరము లనుండి స్కూలుమాస్టరుగానున్నారు. 1898 సం॥ జరిగిన ప్రాక్టికల్ టెస్టు పరీక్షలోఁ జెన్నపురిరాజధానియందు ఫస్టుగాప్యాసుఅయి కొందఱు విద్యార్థులను లోయరు సెకండరీ పరీక్షకుఁగూడ తర్ఫీయతుచేసినారు. శనివారపు పేట సమస్థానపులోయరుసెకండరీ స్కూలులో రెండవ సహోపాధ్యాయులుగాఁ గొంతకాలము పనిచేసి ప్రస్తుతము చోదిమెళ్లబోర్డుస్కూలు హెడ్మాస్టరుగా నున్నారు. ఆగమశాస్త్రమునందుఁ బ్రవేశముండుటచే, బలివె, ఏలూరు మొదలగు చోట్లనున్న శివాలయములకు వీరు స్థానాచార్యులుగా నుండి కళ్యాణోత్సవములు చేయింతురు. వీరికి పదకవిత్వమునందెక్కువ అభిలాష. 1910 సం॥ డిశంబరులో గుంటూరు కాలేజిలో జరిగిన "ఎడ్యుకేషన్ రెగ్యులేషను కమిటీ" కి, ఆహ్వానింపఁబడినపుడు, ఆసభకువెళ్లి శ్రీచక్రవర్తిగారి మీఁదను, డైరక్టరుగారి మీఁదను, ప్రసిడెంటుగారి మీఁదను, కృతులిచ్చిరి. వీరుకొన్ని శివభజన కీర్తనలు రచియించి వీరి పితామహులగు మల్లవా

రాఘవ్యులవారు రచించిన శివతరంగములు మొదలైన వానితోఁజేర్చి "శ్రీశివ భజనకీర్తనలు" అనుపేర నచ్చొత్తించి ప్రకటించిరి.

## మంగళహారతి.

జంఝూటిరాగము-ఆదితాళము.

హారతి శ్రీమతి । హైమవతీసతికి ।
హారతివేంకట సత్యా । నారాయణరావునకు ॥ హారతి.

1. అస్తపుత్రులను । ఇష్టకామముల
సృష్టికర్తసం । తుష్టిగనొసఁగుతన్. హారతి.

2. ఇమ్మహిఁ జెప్పఁడు । కమ్మపిల్తుని జనని
సమ్మతిశ్వరిపద । నమ్మునవసియించున్. హారతి.

3. చిరకాలముపేరు । స్థిరతరకీర్తులై
పరిపరివిధములఁ । బ్రస్తుతినొందుతన్. హారతి.

4. నాగభూషణుని । వేగరక్షించెడి
భోగిభూషణుఁడు । భోగములొసఁగుతన్. హారతి.

## 135. పోతరాజు విశ్వనాధకవిగారు.

వీరి నివాసము నరసారావుపేట తాలూకా, ఏరుమూరు. ఆఱువేల నియోగులు. ఆపస్తంబసూత్రులు. శ్రీవత్స సగోత్రులు. తండ్రి రామకవి గారు. తల్లిసంజీవమాంబ. జన్మదినము విళంబి నామసంవత్సర శ్రావణ శుద్ధ త్రయోదశి. శ్రీమిన్నికంటి గురునాధకవిగారితోఁ గలిసి జంటకవులై "గురు విశ్వనాధకవులు" అనునామమున వ్యవహరింపఁ బడుచున్నారు. విద్యావిషయిక విమర్శనలు వ్రాయుచుందురు. వీరు రచించిన గ్రంథములు:—1. సోమసేనవిజయము, 2. హనుమచ్ఛతకము, 3. చాటుపద్యములు.

గీ॥ సీతయును విజయలక్ష్మియుఁ జేతమలర
భోగభాగ్యాయురారోగ్యముల నొసంగి
హైమవతితోడ సత్యనారాయణాఖ్యు
స్థిరకృపాదృష్టి నెపుడుఁజూచెదరుగాక. 1.

క॥ కనకాంబరుండు శ్రీశంకరి
ఘనకరుణా యుక్తుఁడగుచుఁ గాచుత నెపుడున్
గణనీయ హైమవతినిం
దనుజాలోపముని సత్యనారాయణునిన్. 2.

## 136. పుల్లాభట్ల సత్యనారాయణమూర్తిగారు.

వీరి నివాసము పూవులసానెపల్లె యగ్రహారము. ఏలూరు తాలూకా కృష్ణాజిల్లా. ఆపస్తంబసూత్రులు. తెలుగాణి వైదికులు. తండ్రి శ్రీరామావధానులుగారు, తల్లిరామాంబ. వికృతి సంవత్సర భాద్రపద శుద్ధ ౧౫ మిజననదినము. కృష్ణయజుర్వేదము నందును, నేత్రావధానము సల్పుట యందును, పిల్లన గ్రోవితో శ్రుత్యుచ్చారణ మాచరించుట యందును సమర్థతగలవారు. తెనుఁగున సాహిత్యముకలదు. తెనుఁగునఁగవిత్వము ధారాళముగఁజెప్పు ప్రజ్ఞయునున్నది. మఱియుఁదెనుఁగునఁ బరశురామవిజయమును, వృకాసురచరితమును, కృష్ణాపవాదమును, నాటకములుగను మఱికొన్ని చిన్న గ్రంథములును విరచించిరి. ప్రస్తుతము ఎర్రగూడెము తాలూకా అమ్మపాలెముగ్రామమున కుట్రయ్యాన్ ఆఫీసరుగా నున్నారు.

ఉ॥ శ్రీగిరిజాసతీవరుఁడుఁ జిన్మయుఁడాఢ్యుఁడు నిందుమౌళి స
ర్వాగమవేదితుండు రజతాచలవాసుఁడు వందితుండుస
ద్యోగపదాబ్ధి రత్నముఁడు ధూర్జటినంది తురంగుఁడీశుఁడున్
భోగిసుభూషణుండు దయఁబ్రోవుతఎంపతులన్శుభంబుగన్ 1..

ఉ॥ శ్రీకరమంగళా కరనిశీథప శేఖరసత్కటాక్షర
త్నాకరకాలకంధర సదాశివమూర్తి పరాత్పరాశివా
ప్రాకటవైభవాసుగుణ రాజిత పూజిత భక్త పోషణా
వేకరుణించి పూర్ణముగఁ బెండ్లి కుమారునిఁ గన్నినోముమా. 2.

ఉ॥ శ్రీయుతకీర్తిశాలిగుణ శీలుఁడు సజ్జనపాదసేవక
ధ్యేయుఁడు సత్యవాక్య పరుఁడింగిత వంతుఁడునైన సత్యనా
రాయణమూర్తి హైమవతిరంగుగఁ గైకొనెఁ బత్నిగాఁగభ
ద్రాయితరూపులై యిరువురాయువుగల్గి సుఖింతు రెప్పుడున్ 3.

ఉ॥ పాడియుఁబంటలు న్భృతులు వాహనము ల్పరిచారకుల్సదా
కూడునుగుడ్డలుంగలిగి క్షోణితలంబున భోగభాగ్యులై
వీడని ప్రేమతోడుతను వృద్ధినిబొందఁగ నెన్నొడీనల్
నేడడుచుంటి దంపతులు నిత్యముసౌఖ్యము నొందుచుంటయున్ 4.

గీ॥ హైమవతికింక సోదరులీమహీస్థ
లమునను జనింపఁగాన లెలలితగుణులు
గానలెను ధర్మనిరతులుగా వలెనుసు
మంతులై ధనవంతులై మనఁగవలెను. 5.

## 137. పరవస్తు గోవిందస్వామిగారు.

వీరినివాసస్థలము విశాఖపట్టణముజిల్లా దేవాడ. శ్రీవైష్ణవులు, గార్గ్యులు, ఆపస్తంబసూత్రులు. శ్రీనివాస వరదాచార్యులయ్యావార్లంగారి పుత్త్రులు. ఇప్పటికి వయస్సు 22 సంవత్సరములు. సంస్కృతాంధ్రోభయ వ్యాకరణ విశిష్టకావ్యాలంకార శాస్త్రజ్ఞులు. అభిమానవిద్య వేదాంతశాస్త్రము. విజయనగరమునఁ బ్రచురింపఁబడు "ఆనందవర్ధిని" యను మాసపత్త్రికకు సంపాదకులు.

శ్లో॥ శ్రియాసౌశీల్యాది ప్రథితగుణ సంపన్నిలయ యా
సదాయుక్తోదేవఃసకల జనరక్షైక నిరతః
పరాంభక్తింస్వస్మిన్ కులసముచితాం ధర్మనిరతిం
సవాంఛద్యాద్విష్ణుశ్శుభగుణగణా లంకృతతనుః. 1.

శ్లో॥ భీషాయస్మాచ్చలతి పవనస్సూదయంయాతి భాస్వాన్
భీషాయస్మాద్దహతి దహనోమానవానత్తి మృత్యుః
దీర్ఘాయుష్యం బుధజనమనస్తోషణం జంపతిభ్యాం
సౌశీల్యంశత్త్వవిశతు పరంబ్రహ్మలక్ష్మీస నాథం. 2.

## 138. పిన్నమరాజు వెంకటరమణయ్యగారు.

వీరి నివాసస్థలము హేలాపురము. యాజ్ఞవల్క్యులు. కౌండిన్యస గోత్రము. జనకతండ్రి నల్లగొండ జానకీరామయ్యగారు. జనకతల్లి సుబ్బమ్మగారు. దత్తతతండ్రి వెంకటసుబ్బన్నగారు. దత్తజనని చలమమ్మగారు. ఈశ్వరసంవత్సర మార్గశిర శుద్ధ షష్ఠిజన్మదినము. వీరాంధ్రాంగ్లో భాషల యందుఁ బ్రజ్ఞగలవారు. తెనుఁగు, ఇంగ్లీషు కసరతులందుఁ బ్రవీణులు. మల్లవిద్య వీరియభిమానవిద్య. మల్లవిద్యలయందనేకులఁ బ్రవీణులఁజేసిన మల్లవిద్యాగురువులు. వీరు మల్లవిద్యాప్రవీణులని పతకములఁ బొందినవారు. వీరు స్వతంత్ర భూజీవనులు. వీరి మల్లవిద్యాగురువులు మహారాజశ్రీ ద్రోణమరాజు రామారావు పంతులుగారు. వీరు రచించిన గ్రంథములు :—1. సీతాచరిత్రము, రామశతకము. ప్రస్తుతము రచించుచున్న గ్రంథములు :—1. మల్లవిద్యావిధానము, 2. సైంధవవధ మొదలైనవి.

ఉ॥ శ్రీగిరిజేశుచాపమును రెండుగఁజేసిన బాహువీర్యమున్
లోఁగొనియాడుచుం గమలలోచనజానకి పొంగుచున్నదిం

దాగళమందు వైచు పువుదండకు మెచ్చిన రామచంద్రుఁ డెం
తే కృపఁ బ్రోచుఁ గాత భుజగేంద్రుని గాదిలి కూఁతునల్లునిన్. 1.

ఉ॥ శాంతుఁడు భక్తవత్సలుఁడు సజ్జనవంద్యుఁడు లోకరక్షకుం
డంతము లేనివాఁడు దనయంతన దానరుదెంచి జ్ఞానమున్
వింతగఁ దెల్పియేసనెడు పేరువహించిన భద్రమూర్తి తా
సంతతమున్వధూవరుల సంతసమందఁగఁ జేయుఁ గావుతన్. 2.

శా॥ శ్రీరంజిల్లఁగ నిత్యభోగములచేఁ జిత్తంబు శోభిల్లనిం
పారన్ స్వేచ్ఛకాల వెల్లి గొల్పుచు దినంబత్యంతమానందము
వ్వారిన్నించెడు మీవివాహ మరుదై వర్ధిల్లఁగాఁ జేయుచున్
గౌరీనాథుఁడు శంకరుండు శుభమెక్కాలంబు మీకిచ్చుతన్. 3.

గీ॥ కర్ణనేత్రోత్సవంబులఁ గలుగఁజేసి
నట్టియాశుకవీంద్ర సింహములఁగంటి
మార! యొవరిపెండిలినట్టి హైమపతికి
సత్యనారాయణునకును నిత్యశుభము. 4.

గీ॥ ఆయురారోగ్యభాగ్యము లందనయము
నోలలాడుచుండెడు నట్టులొనరఁ జేయుఁ
గాత జానకీరమణుండు కలికి హైమ
పతిని సత్యనారాయణుఁ బ్రమద మెసఁగ. 5.

## 139. ఉప్పల మార్కండేయ శాస్త్రిగారు.

వీరి నివాసస్థలము కృష్ణాజిల్లా నూజవీడు తాలూకా కానుమోలు. ఋగ్వేద కర్ణకర్మ వైదికులు. ఆశ్వలాయన సూత్రము. భారద్వాజసగోత్రము. జనకులు శేషాద్రిశాస్త్రిగారు. తల్లి వెంకటసుబ్బాంబ. వీరిసోద

రులు జ్యోతిష నవనీతగ్రంథకర్త అప్పన్నశాస్త్రిగారు, వికృతిసంవత్సర మాఘశుద్ధ పంచమి జన్మదినము. మెట్రిక్యులేషనువఱకు నాంగ్లేయభాష నభ్యసించిరి. వీరిచే రచింపఁబడిన గ్రంథములు :—1. శ్రీరామజనన హరికథ, 2, శ్రీరామనక్షత్రమాల. 3. గ్రహచారశతకము. పురాణ విద్యాభ్యాస మొనర్చెడికాలమందు నేర్చిన విద్యయేగాని యింతవఱకు నేరియొద్దను శుశ్రూషఁజేసి యెఱుంగరు. ఆనంద వాణీనిలయమను నొకపుస్తక భాండాగారము వీరిచే కానుకొలుమ స్వగృహమునందే నెలకొల్పఁబడియున్నది. సుమారు 100 గ్రంథములవఱకునుండి యున్నవి.

శా॥ శ్రీరంజిల్లఁగ వామభాగమున శ్రీసీతామహాదేవితోఁ
గారుణ్యాకరులైన తమ్ములుమువుర్ కల్యాణముల్ దెల్పఁగా
గారాబంబుగ వాయునందనుఁడు మీపాదంబులనొత్తఁగా
తారాసూనుఁడు జాంబవంతుఁడును మీదర్పంబుల న్మెచ్చఁగా
కూర్మిన్ దాసులఁగాచు రాముఁ డెలమిన్ కోర్కుల్ దగన్దీర్చుతన్.

ఉ॥ గాధితనూజుయాగమును గాచినదోర్బలశాలి రాతినిన్
సాదరమొప్పనాతినిగఁజేసిన భక్తులజీవనుండుతా
సాధుజనావనుం డెలమి సౌఖ్యముశీలము నాయువెప్పుడున్
మోదముమీఱ రాముఁడిల మేదినిమిమ్ములఁ బ్రోచుఁగావుతన్. 2.

సీ॥ భర్తముఖంబుపైఁబరగు చుండెడివాణి
యెలమిని మీకిచ్చు నెల్లవిద్య
భర్తశిరంబుపైఁ బరగుచుండెడిగంగ
యెలమినిమీకిచ్చు నెల్లపదవి
భర్తవక్షంబుపైఁ బరగుచుండెడిలక్ష్మి
యెలమినిమీకిచ్చు నెల్లశిరులు
భర్తదేహంబులోఁ బాలుగొన్నట్టియా
పార్వతిమీకిచ్చుఁ బాడిపంట

సీ॥ సకలసిరులును శుభములు జరుగునటుల
వేదముల్ తెచ్చి విధునకు వేగనిచ్చు
వనజానిజనకుండు మీకిచ్చు నాయువెపుడు
పుత్త్రపౌత్త్రప్రవృద్ధిగాఁ బుడమిలోన. 8.

## 110. మొటపర్తి సోమయ్యగారు.

వీరు కృష్ణాజిల్లా యేలూరుతాలూకా దెందులూరు గ్రామకాపురస్థులు. తండ్రి సుబ్బన్నగారు. తల్లి సీతమాంబ. సువర్ణఫలగోత్రము, కమ్మ వారు. ఖరనామసంవత్సర శ్రావణశుద్ధ 3 శనివారము జన్మదినము. బ్ర॥ చింతలపాటి లక్ష్మీనృపతిశాస్త్రులవారి శిష్యులు.

### మత్తేభమాలిక.

సరసాగ్రేసరులార నేఁటమహోత్సాహంబున న్మేదిని
సురభూనాయక వైశ్య పాదభవులన్ సూక్తిస్ఫురద్భావస్ఫుర
ద్వరపాండిత్యవిశేషసంభవ కవిత్వావంబసంభావనా
పరులన్ బంధులమిత్రులన్ సుమతులం బాండిత్యధౌరేయులన్
వరకిన్నోర్వపయమారు కాలమునఁ బున్ భాషాభివృద్ధింగనన్
గిరిమంచెల్వఁగనంపితిన్ కృతులనో గాంభీర్యపద్యావళీ
చరితార్హావిమలప్రకాశ కిరరాజామంత్రిప్రసిద్ధాన్వయో
ద్ధరసామ్రాజ్యభుజంగరాయులు మహోద్దండార్థ కీర్తిప్రభా
కరులైయాంధ్రకవిత్వభానుని కలంకారమ్ముఁజేకూర్చియు
ద్ధరనత్యంతమహోపకార రచనావశ్యాత్ములైరున్నతిన్.. 1.

ఉ॥ శ్రీయును శ్రేయమాయువు సుశీలతయుం బ్రియమున్నమంచుతే
ప్రాయము విద్యయున్ సుఖము బాడియుఁ బంటయుఁ బుత్త్రపుత్త్రికా

దానమునిచ్చిదంపతులఁ దద్దయువర్ధిలఁజేయుమాధవుం
డాయతవైభవస్థితు లపారమునొందఁగ నిద్ధరాస్థలిన్. 2.

141. ఈక్రిందియాశీర్వచనపద్యములు వ్రాసినవారు వివాహసమయమునఁజదివి పద్యములకాకితమిచ్చునపుడు వారి సంతకమును, అడుగునఁజేయకుండ నిచ్చుటచే నామము తెలియలేదు. ముందుకూర్పువేళకు తెలిసినయెడల చేర్చి ముద్రించడమగును.

---

## 141

ఉ॥ శారదమేఘబృంద హరిసామజహంస శశాంకహీరనీ
హారనిశాపకాంతమణి హారసుమౌక్తిక హాసమల్లికా
చారుయశః ప్రకాశపరిపూరితభూరిదిగంతరుండు నా
ధీరవరుండు పెంపెసఁగ ధీనిధివీరభుజంగరాయడన్, 1.

గీ॥ నిగమసారజ్ఞ నగమంత్రి పెగడవంశ
జలధిద్విజరాజ ధీరభుజంగరాయ
నీదుశాంతము ధర్మము నీదుయశము
జగతివ్యాపించియుండె సజ్జనులుబొగడ. 2.

సీ॥ సరులగుసంగీత పాఠకులొకచెంతఁ
ప్రౌఢిమమీఱఁగఁ బరిఢవిల్ల
ఆశుకవిత్వమండలరఁగఁ బ్రఖ్యాతిఁ
బొందినకవివరుల్ బొలుపుమీఱ
నొకవంకనకలంక సకలశాస్త్రజ్ఞులు
నొకవంక వేదపాఠకగణంబు

నాకచోటవేదాంత నికరవాక్యార్థంబు
లాకదారినాటక ప్రకటనములు

గీ॥ విదితమైయున్న కళ్యాణవేదియందు
హైమవతి సంయుతుండయి యమరియున్న
సత్యనారాయణుని శోభసభికులన్న
వశముగాదని యెంచఁడీవాసిమీఱ. 3.

గీ॥ రాజితుండైన సత్యనారాయణునకు
సత్యభామను బోలిన సాధుపుత్రి
నొసఁగి వైవాహికంబు నీవొనరఁజేసి
రంగుమీఱంగనుంటి భుజంగరాయ. 4.

గీ॥ హేమగాత్రియునైయున్న హైమవతియు
సత్యనారాయణుండను సాధుమంత్రి
యనఁగఁబతిసతులిరువుర ననయమునను
శౌరిదయఁజూచిరక్షించు సిరులనొసఁగి. 5.

గీ॥ నాడెమలరంగ వర్ణమన్నాటినంశ
జలజభాస్కర శృంగారఫలరసజ్ఞ
సత్యనారాయణాఖ్యని సతినిగూడి
పుత్రపౌత్రాభివృద్ధిచేఁ బొదలుమెపుడు. 6.

శ్లో॥ శృత్వాభవంతం కవితాధురంధరం
కృత్వాభవద్దర్శన లోలుపంమనః
గత్వాగృహంతేసతతం శుభానహం
దృష్ట్వాభుజంగాఖ్య మహంహిహృష్టః. 7.

142. ఈక్రింది యాశీర్వచనపద్యములు వ్రాసినవారు వివాహ సమయమునఁ జదివినపద్యముల కాకితమిచ్చునపుడు వారి సంతకమును, అడుగునఁ జేయకుండ నిచ్చుటచే నామము తెలియలేదు. ముందుకూర్పువేళకుఁ దెలిసినయెడల చేర్చిముద్రించడమగును.

---

శ్లో॥ మంత్రిపెద్దకులాబ్ధీందుర్భుజంగ నృపతేస్సుతాం
నామ్నా హైమవతీం సత్యనారాయణాఖ్యరాయచ
దత్వాసర్వవిభూషైశ్చభూషితాం వంశవృద్ధయే
తస్మాద్బ్రహ్మేంద్ర ముఖ్యాశ్చదేవతాస్సముపేయుషః. 1.
ఆశీస్సంపుత్త్రపౌత్రాదిం కామయంతోదదాత్తయోః .

శ్లో॥ యావద్గంగాతరంగాన్వహతి సురనదీ యావదాచక్రవాళం
యావత్ క్షోణీధరేంద్రా భువనతలగతా స్తత్రశీతాంశుమాలి
ర్ద్యావత్తావచ్చపుత్రాచ్ఛుభ విభవగుణాన్సర్వదాసంపదంవాం
సర్వైర్విద్వాంససంఘైస్సముదితి వచనైస్స్వీయజామాతృపుత్ర్యోః.

శ్లో॥ నిశ్శేషమంబరతలంయదిపత్రికాస్యా
త్సప్తార్ణవీయదిసమేత్యమషీభవిత్రీ
వక్తాసహస్రవదనః తవపుత్రికాయా
వైవాహికీవిభవమత్ర విభేదదక్షః. 3.

శ్లో॥ శ్రీమాన్ వామార్ధజానిర్జలజ భవగురుస్సర్వ స్వర్లోకవాసా
స్సంఘీభూయావనీంద్ర ప్రథితగుణనిధేః పుత్రికాంశ్రీసమానాం
కృత్వానారాయణస్య ప్రథితగుణగణే వడ్లమన్నాటివంశే
సంజాతస్యాస్యవోఢాంసకల గుణగణాచారితార్థా బభూవుః. 4.

## 143. మంత్రిప్రెగడ వెంకటరమణయ్యగారు.

వీరినివాసస్థానము పీఠికాపురము. మొదట హేలాపురంబనం బరగు వేలూరు వాస్తవ్యులే. వీరి ప్రపితామహులగు జగ్గరాజుగారికి పీఠికాపుర సంస్థానాధిపతులగు శ్రీరాజానీలాద్రిరావు బహద్దరువారుసంస్థాన ప్రధానోద్యోగంబు (సూపరింటెండెంటు) నొసంగి వారిరాజధానియగు పీఠికాపురంబునకుఁ దీసికొనిపోయిరి. పితృపితామహులకుఁగూడఁ దత్సంస్థాన ప్రధానోద్యోగంబుల నొసంగఁబడుటచే వీరుపీఠికాపుర వాస్తవ్యులని ప్రస్తుతము చెప్పఁబడినది. వీరు అమాత్యకులులు, అనఁగా నాఱువేల నియోగులు. తండ్రి సాంబశివరావుగారు. తల్లి శంకరమ్మగారు. వీరి పెదతండ్రిగారు జగ్గరాజుగారు పోషకజనని జగ్గరాజుగారిభార్య వియ్యమాంబగారు. హరితసగోత్రము. వీరాంగ్లేయభాషయందుఁ బ్రవేశపరీక్ష (మెట్రిక్యులేషన్) వఱకు నభ్యసించిరి. వీరికి కవిత్వమందుఁ బ్రజ్ఞకలదు. లౌకిక వ్యాపారజీవనులయ్యును గవిత్వాభిమానముగలదు. వీరికి బాల్యమునుండియు నాంధ్ర గీర్వాణములందభిరుచియు నభిమానంబును గలదు. వీరికిఁ బలువిధములగు వంశములం గూర్చియుపన్యాసంబొనర్చు నేర్పుఁగూడఁగలదు. వీరు ప్రస్తుతము పీఠికాపుర సంస్థానోద్యోగంబునంబట్టి చామర్లకోటలో నివాసంబుగనుండిరి. వయస్సిప్పుడికి 50 సంవత్సరములు.

ఉ॥ శ్రీరమణీప్రియుండు సరసీరుహలోచనుఁడైన భక్తమం
దారుఁడు రామచంద్రుఁడు ముదంబుననాయువు పుత్రపౌత్రులన్
భూరిమణీమయంబులగు భూషణరాసులొసంగుచుండఁగన్
భూరికృపన్వధూవరులఁ బ్రోచెడుఁగావుత సార్వకాలమున్. 1.

చ॥ సిరిమగఁడాయుమాధవుఁడు శీతమయూఖుఁడినుండుభారతీ
వరుఁడుధనంబుబుద్ధియును వాణిశమంబును సౌఖ్యసంపదల్

కరముగరంగుసన్మతియుఁ గాంతిచిరాయువులున్ భుజంగరా
డ్వరునికుమార్తెకల్లునకు వాంఛితభంగినొసంగి ప్రోవుతన్. 2.

చ॥ పతికనురక్తిభావమునఁ బంకజనాభుని పాదభక్తిస
న్మతియయుతులౌ సఖీమణుల మాటలసక్తిశరీరశక్తియున్
సతతముకీర్తివాక్యముల సారతరంబగు యుక్తినిచ్చుచున్
సతిపతిఁబ్రోవుహైమవతి సమ్మదమొప్పఁగ సత్యమూర్తితోన్.3.

## 144. వింజమూరి సూర్యనారాయణగారు.

వీరినివాసస్థలము పీఠికాపురము. తెలుగాణి వైదికులు. ఆపస్తంబ సూత్రము. గౌతమసగోత్రము. తండ్రి మీనయ్యశాస్త్రిగారు. తల్లి గంగమాంబ. యువసంవత్సర శ్రావణమాసమున జన్మించిరి. వీరు సంగీతసాహిత్యముల యందు నేర్పుగలిగి రెండిటియందును గవిత్వముచెప్ప నలవాటుగలవారు. వీణనువాయించుటలోఁ జాలపరిశ్రమచేసి యున్నారు. వీరు రచించినగ్రంథములు :—నీతిదర్పణము మొదలైనవి.

సీ॥ తల్లిదండ్రులొనర్చు దానధర్మంబులు
    సెడఁబాయకేప్రొద్దు నిచ్చుశుభము
వేదశాస్త్రజ్ఞానవిద్యాంస దీపనల్
    బాలచంద్రునిరీతిఁ బ్రబలఁజేయ
కవిపుంగవులమాట జనఁదాటకేప్రొద్దు
    తోడునీడుగనాట లాడుమమ్మ
ముత్తైదువులచేత ముట్టికట్టినయట్టి
    గళముమంగళమాచుఁ జెలఁగుమమ్మ

గీ॥ తల్లిదండ్రులకన్నులు చల్లజేసి
ప్రియునితోఁగూడి యత్తింటఁ బేరుపడసి

పుత్త్రపౌత్త్రాదిసంపదఁ బొందవమ్మ
సుగుణములఁజల్లి శుభములనొగడుతల్లి. 1.

సీ॥ గుజ్జనగూళ్లంచుఁ గూర్చుండుటలు కాదు
కలదు లేదనుదానిఁ దెలియవలయు
చెమ్మచెక్కలటంచుఁ జేయెత్తుటలు కాదు
పూవుఁజేసన చేతఁ బూనవలయు
గచ్చకాయలురువ్వి గంతువేయుటలు కా
ద త్తమామల సేమ లందవలయు
నాటపాటలమీఁద నాహ్లాదమున కాదు
మించ భృత్యులనాద రించవలయు

గీ॥ సత్కులమునందు జన్మించి సహజమైన
రూపగుణములనైశ్వర్య రూఢిఁ జెంది
భర్తతోఁగూడి పుత్త్రులఁ బడయుమమ్మ
రాజబహదూరు సుభుబంగ రాయతనయ. 2.

చ॥ మగనిమతి క్రమించి పలుమాటలనాడకు మమ్మ భర్తరో
జగమునిరోయుంచుమమ్మ కడుసౌఖ్యముఁ జెంది సుపుత్త్రపౌత్రులం
బొగడఁగరానిసంపదలఁ బొందెదవమ్మ పరాకులేక నా
యగుపలుకాలకించు కులధన్యవు హైమవతీ మతల్లిరో. 8.

సీ॥ కలిమిగలైనటంచు గర్వించఁబోకమ్మ
మించఁబీదలనాద రించుమమ్మ
పుట్టఁభోగినినంచుఁ బొంగిపొర్లకుమమ్మ
పతికిసంతసమూనఁ బలుకుమమ్మ

అత్తమామలమనంబంటి చరించుము
గర్వించిమాటల గసరకమ్మ
ఇంతకంతకుగోప మెంచిపండకుమమ్మ
పుట్టింటవాలెఁ బ్రేమఁ బూనవమ్మ

గీ॥ పాలలోముంచినీచేయి భర్తచేతఁ
బెట్టినంతనె యత్తింటి పట్టినమ్మ
అత్తమామలె తలిదండ్రులనుచు నెపుడుఁ
దలఁచి మెలఁగిన సుఖములు గలుగునమ్మ.

సీ॥ ఒకవేళమీయత్తయొకటి రెండేమన్న
మోముచిట్లింపకుంగ ముదుసకమ్మ
మామగారొక వేళమన్నించినంతనె
సహవాసులతో చెప్పఁజనదుసుమ్మ
గారాబమున భర్తచేరదీసినయంత
పరియాచకములాడ జలదుసుమ్మ
బంధుబృందములింటఁ బ్రబలియుండినవేళఁ
పలలోని వాల్కువై మెలఁగుమమ్మ

గీ॥ ఎంటవారలు దాసీలుబంటులున్న
సంతసింపకచేతనై నంతవఱకుఁ
బనియుపాటలు నొనరించి భర్తమదికిఁ
బ్రియములొనగూర్చి ధరలోనఁ బేరుఁగనుము. 5

చ॥ మగనికి నెద్ది యిష్టమదిమక్కువతో నొనరించి సర్వదా
నగుమొగముప్పతిల్ల సుగుణంబులలోకులు సంతసింపసొం
పుగఁజరియించుమమ్మ కృతపుణ్యవు ధన్యవుతల్లిరీతిగా

నెగడుసుపుత్త్రలాభమున నిత్యశుభంబులఁ జెందుమమ్మయా
నగసుతసత్కృపా మహిమనార్యయ విచక్షణనీకొసంగుతన్. 6.

ఉ|| కోరిక లెల్లఁదీర్చు బుధకోటుల దీవనలంది భర్తతోఁ
గూరిమిమీఱఁగాఁ గొడుకుకొమ్మయుఁ గల్గినతల్లిదండ్రులే
తీరునసంత సించెదరొ తేటపడన్నగజాత సత్కృపన్
దీరుఁగదమ్మ కోరికలు దీర్చు హైమవతీ మతల్లిరో! 7.

సీ|| కొడుకు నెత్తుకు ముద్దుఁగొనుచున్న నీతల్లి
దండ్రు లెంతటిలోక ధన్యులమ్మ
తాతగారియొడినిఁ గూఁతునుంచెడివేళ
నమ్మగారెది సౌఖ్యమనఁగదమ్మ
తమ్ములతోఁగూడి తగవులాడెడివేళఁ
జామవారలకెంత శోభయమ్మ
కూఁతుబిడ్డలటంచుఁగూక లేయుటమాని
భుజముసెక్కుట దెంతభోగమమ్మ

గీ|| కూఁతురుండిన యింటింటఁగోర్కె లివియె
కానఁబిరుల ముచ్చట్లు మానసమునఁ
దలఁచిపతిసేవఁబాయక మెలఁగినంత
పుత్త్రపౌత్రుల సౌభాగ్యగాత్రి నమ్మ. 8.

సీ|| కైలాసమునమిమ్ముఁగనుట కష్టమటంచు
సగముమేనిమ్మని జగడమాడు
తలనిద్దఱిని మోచిమెలఁగఁజాలరటంచు
సగముమేనిమ్మని జగడమాడు
నెద్దుపైనిద్దఱు నెటులనెక్కెదరంచు
సగముమేనిమ్మని జగడమాడు

భక్తులఁగనమీతో బరువెత్తరేనంచు
సగముమేనివ్వని జగడమాడు

సీ॥ సపతిపోరునుబడఁ జాలసగముమేను
నీయకుండిన నేనింట నిలుననన్నఁ
గౌఁగిటను బట్టి ప్రియమున గారవించు
నీశ్వరుఁడు మీకు సంపత్తు లిచ్చుఁగాక. 9.

## 145. కాశీనాధుని వీరమల్లయారాధ్యులుగారు.

వీరు కృష్ణామండలియందలి గుడివాడ సీమలోనియలకుర్రు గ్రామవాస్తవ్యులు. శైవబ్రాహ్మణులు. ఆపస్తంబ సూత్రులు. ఆత్రేయస గోత్రులు. తండ్రి లింగయారాధ్యులుగారు. తల్లికాంతమాంబిక. ఈయనపాలిక జననీజనకులు కాశినాధుని వీరమల్లయ్య, మాచమాంబికలు. విక్రమసంవత్సర శ్రావణ బహుళ విదియ జన్మదినము. వీరికి పాఠశాలవిద్యాభ్యాస కాలమునందలవడిన కించిత్స్వభాషాజ్ఞానమును స్వయంకృషిచే వృద్ధిపఱచుకొని పండిత జనసాంగత్యముచేతఁ దమకైవదత్తమగు కవితాధారను గ్రమక్రమముగా శుద్ధపఱచుకొనిరి. వీరు రచించిన గ్రంథములు;—1. హరిశ్చంద్ర, 2. ఉషాపరిణయ, 3, తారాచంద్రీయ, 4. కన్యకాపరమేశ్వరీవిలాస, 5. గయోపాఖ్యాన 6. కుశలవపట్టాభిషేక, 7. లంకాదహననాటకములును, 8. మేనకాకౌశిక సంవాదము, 9. తెనాలిరామలింగని కట్టుకథలు, 10. సీతామనోహరప్రహసనము, 11. పూర్వహైందవస్త్రీలచరిత్రములు, 12. వ్యవహారబోధిని మున్నగునవియు.

శా॥ గౌరీనామముచేత దక్షుగృహమున్ గారించి శ్రీపార్వతీ
ధీరాఖ్యన్ గిరిరాట్తనూజయయితద్గేహంబుఁ బాలించి, భూ

దారుండైన భుజంగరాణ్మణి కపత్యంబైవిరాజద్యశ
స్ఫారుంజేయు జనించు హైమవతి యుద్వాహంబు శోభిల్లుతన్ 1.

కం॥ బంగరునమణిం గూర్చినపగిదినిన్ను
నర్లమన్నాటి కులవార్ధిబాలవిధుండు
సత్యనారాయణాహ్వయు సాధ్విం జేసె
జనకుం డుభయవంశోన్నతిం గనంగంగోరి. 2.

చ॥ గొనముల తీరుచేత, పదగుంభనచేత, వినీతిచేత, వా
సినిగను నర్థగౌరవముచేత, సుధీజనవేద్యమైభవ
జ్జనకుని కీర్తివర్దెసలంజాటెడు నీకవితాసహోదరిన్
మనమున నెంచి కీర్తినిడుమానడి హైమవతీ తలోదరీ! 3.

సీ॥ కవిజనాశీర్వాదకలన మీయుద్వతి
కాయురారోగ్యముల్లబ్బుంగాత
మీతల్లిదండ్రుల మేలుపుణ్యముచేత
ధనధాన్య వృద్ధిమిమ్మెనయుంగాత
మత్తమామల భాగ్యసంపత్తిచే మీకుస
త్పుత్రలాభప్రాప్తిపదముంగాత
సుమహార్ద్ర బలవిశేషముచేత మీయిర్వ
రకుస్నేహబంధంబు ప్రబలుంగాత

గీ॥ యెల్లసుఖసంపదలకు మీయిల్లునిలయ
మగునుగావుత శ్రీమనోహరుని కృపను
వనిత! మంత్రిప్రెగడ వంశవనధిపద్మ
జాత! విజయలక్ష్మి! గుణోపేతసీత! 4.

శా॥ హేలాపత్తన భాగ్యమేమొకద! సాహిత్యాగ్రణుల్ సత్కవుల్
మేలౌ గాయకు లెందఱెంద ఱొ సుహృన్మిత్రాళులై వచ్చిరీ
లీలల్ క్రొత్తవి నీదుతండ్రి కయితల్సెప్పంగ శక్తుండు వి
ద్యాలాభుండగుఁగాన సత్కవిజనాహ్లాదంబు సంధిల్లెఁదాన్. 5.

## 146. చింతపెంట వేంకట రమణయ్యగారు.

వీరి నివాసస్థలము రాణ్మహేంద్రనగరము. ఆర్వేలనియోగులు. ఆపస్తంబసూత్రులు. భారద్వాజ గోత్రులు. తండ్రి తమ్మిరాజుగారు. తల్లి అచ్చమ్మగారు. జయనామసంవత్సర మాఘశుక్ల పంచమీ గురువారము జననదినము. వసురాయ కవివర్యుని శిష్యులు. ప్రవేశపరీక్షయందుఁ గృతార్థులై, పట్టణపాఠశాలయందు సహాయోపాధ్యాయులుగ నున్నవారు. ఇరువదేడుల వయస్సిప్పటికి గలవారు భాషాజ్ఞానమును గ్రంథపరిచితియుఁ గొంచెమైనను, అభిమానము హెచ్చుఁగఁగలవారు.

చ॥ సిరిహృదయంబునన్నతముఁ జెన్నలరారఁగ శేషశాయియై
సిరులుసుఖంబులుం గలుగ శిష్టులఁబాలనఁజేయు కృష్ణుఁడీ
శ్వరుఁడు కృపావిభూషణుఁడుచక్కఁగఁబ్రోచెడుఁగాతమీవధూ
వరులఁజిరాయురాదిక శుభంబు లొసంగి విశేషపుంగృపన్. 1.

చ॥ ధరనృపుఁడై, కవీంద్రుఁడయి ధామిణినాథుఁడు కృష్ణరాయఁడొ
క్కరుఁడె ప్రసిద్ధిఁజెందెమును గబ్బము లంకితమందుచున్నభల్
జరుపుచుఁబండి తాళులఁ జక్కఁగ నాదరముం బొనర్చుచా
సరణిని నీవయొప్పుదు భుజంగనృపాలక! యట్లుకావునం
దిరముగఁబుత్త్రిపౌత్రులు జనించి మహింజిరజీవులౌదుకీ
శ్వరునసుకంపనీకుఁగడు సంతసవార్ధిఁదేల నెల్లరున్. 2.

గీ॥ పండితుండను కాసైన బాల్యచాప
లమ్మమైఁజేసితినయ యీలాగుపద్య
సమితిఁ జింతపెంటకులుండ సాఁవేంక
టరమణయ్య యనఁగధరఁబరఁగువాఁడ
ఐసుకవికుని శిష్యుఁడపండితార్య! 3.

## 147. మంచికంటి పాపయ్యగారు.

వీరి నివాసస్థలము గుంటూరు జిల్లా నరసారావుపేట తాలూకా, సంత గుడిపాడు, అను గ్రామము. ఈ గ్రామమునకుఁ కుంకలకుంట గుడిపాడు, అను నామాంతరముగలదు. వీరు, ఆఱువేల నియోగి బ్రాహ్మణులు. ఆపస్తంబ సూత్రులు. కాశ్యపగోత్రపవిత్రులు. తండ్రి రామకృష్ణకవిగారు. తల్లి వేంకట నరసమాంబ. 1875 సంవత్సరము ది 15 ఆగస్టుతేదిని వీరిజననము. నూతన గోపాలశతకాద్యనేక గ్రంథములు రచియించిన మంచికంటి వీరనారాయణ ముకుంద కవివర్యునకు ముఖ్యశిష్యులై కవిత్వ, లౌకిక, జ్యోతిషముల యందు సమానపాండిత్యమును సంపాదించినవారు. ఆశుకవిత్వప్రబంధరచనా సమ [illegible] కాచార పరాయణులు. 1899 సంవత్సరము వఱకు స్వగ్రామమునకు గ్రామణిత్వముగా నుండి కారణాంతరమునఁ బ్రస్తుతము, ఏలూరు టవును సర్వేయరుగా నున్నవారు. గ్రంథపఠనమాధుర్యమన్న వీరి సొమ్ము. వంశములోఁగవిత్వమనునది యనాదిసిద్ధముగా ననుక్రమముగా వచ్చుచున్నది. కాకునూరి అప్పకవిగారి ప్రణీతమగు, అప్పకవీయ మను గ్రంథములో వీరి వృద్ధప్రపితామహులగు మంచికంటి వోబనామాత్యవరునిఁగూడఁ జేర్పఁబడియున్నది.

సీ॥ శ్రీశుఁడై హేలాపురీశుఁడైనవమంద
హాసుఁడౌ శ్రీమజ్జనార్దనుండు

ధీరుఁడైభక్తమందారుఁడైముల్లోక
శంకరుండగు బాలచంద్రమౌళి
తాతయైపద్మ సంజాతయొ యుత్పత్తి
నేతయైయొప్పువాణీశ్వరుండు
మిత్రుఁడైపద్మినీ మిత్రుఁడైసన్నుతి
పాత్రుఁడైశగు కశ్యపప్రసూతి

గీ॥ రైనహరిహరచతురాన నార్కు లెపుడు
భోగభాగ్యచిరాయు సంపూర్ణ తేజ
ములనొసఁగుఁగాత ! ననదంపతులకువేడ్క
హైమవతి సత్యనారాయణాహ్వయులకు. 1.

సీ॥ గురుకవిబుధులతో సరిమించు ద్విజరాజ
నరులునాశీః పరంపరలు సేయ
నినశశికాంతుల నెనలేనిగ్గాన్లైటు
లాకాంతములనెల్ల నావరింప
తుంబురు నారదాదులమించి గాయకుల్
నవరసంబులను గానములు సేయ
శచిగౌరి యనసూయశారదలనఁబుణ్య
సతులుకర్పూర హారతులనీయ

గీ॥ మంత్రిపెగడ భుజంగ రాణ్మౌళిశరధి
హైమవతి సీతవిజయలక్ష్మమ్మ సాధ్వి
సత్యనారాయణుండు సాక్షాద్రమేశు
లైరికళ్యాణ విభవమెంతని వచింతు. 2.

క॥ వలిమలసుత, కలుములసతి
పలుకులచెలికీర్తి భోగప్రాభవవిద్యల్

చెలఁగఁగ నవదంపతులకు
కలకాలము నిచ్చిప్రోచుఁగాత ధరిత్రిన్. 3.

సీ॥ శ్రీమంత్రిపెగడాబ్దిసోముఁడౌరాజాభు
జంగరాట్సుతయనఁజెలఁగినావు
సుబ్బమాంబాగర్భశుక్తిముక్తాఫల
ప్రాయమైజనియించి ప్రబలినావు
పాటిబాలికలతోఁ దోటివిద్యార్థిని
గాఁదల్పితేటలుగాంచినావు
సత్యనారాయణస్వారాని జేపట్టి
బంధుగులను యశంబందినావు

గీ॥ హైమవతి సీతవిజయలక్ష్మమ్మతల్లి
తల్లిశాపిచిరాయు పుత్త్రికులఁగాంచు
మమ్మదీర్ఘసు మాంగళ్యవైసుకీర్తి
నెనయుమమ్మ ప్రపౌత్రులనెత్తుమమ్మ. 4.

గీ॥ శ్రీమహాలక్ష్మి విష్ణులరీతిఁదనరి
భారతిహిరణ్య గర్భులప్రతిభమించి
శచిమహాసాధ్వి పాకశాసనులనంగ
హైమవతి శంకరుల సుగుణానురక్తి
హైమవతితోడ సౌఖ్యములందు మయ్య
నిత్యమగుఁగాక మీదుదాంపత్యమెపుడు
వర్ధమాన్నాటి సద్వంశవార్ధిసోమ!
రమ్యగుణ సాంద్ర సత్యనారాయణేంద్ర! 5.

ఉ॥ శ్రీయుతులౌ సుపుత్త్రికు లజేయులుపల్వురుగల్గుఁగాక ! దీ
ర్ఘాయువుగల్గుఁగాక ! సుతలందఱు దీర్ఘసుమంగళాఢ్యలై

కాయజుఁబోలు పుత్త్రులను గాంతురుగాక ! త్వదీయసంతతుల్
తోయజబాంధవాబ్జముగ లోకములో నుతికెక్కుఁగాక ! శో
భాయుతమంత్రి ప్రెగ్గడ కులాంబుధిచంద్ర! భుజంగ రాణ్మణీ !6.

## 148. శ్రీరాజామంత్రి ప్రెగడ భుజంగరావు బహద్దరు జమీందారుగారు.

వీరి నివాసస్థానము ఏలూరు. హారితసగోత్రోద్భవులు. ఆపస్తంబసూత్రులు. ఆఱువేల నియోగులు. లక్కవరము, వెల్ల మొదలయిన యెస్టేట్ల జమీందారులు. జనక తండ్రి మంత్రిప్రెగడ మల్లయామాత్యవర్యులు. జనకతల్లి వేంకమాంబగారు. దత్తతజనకులు శ్రీరాజామల్లికార్జున ప్రసాదరాయబహద్దర్ జమీందారువారు, దత్తతజనని విజయలక్ష్మాంబగారు. దిగ్గజములనంటి పండితుల సభలోవీరు, అష్టావధాన మొనర్చి జయముంగాంచి మహామహోపాధ్యాయబిరుదాంకితులగు బ్రహ్మశ్రీకొక్కొండ వేంకట రత్నము పంతులుగారిచే మిక్కిలి గౌరవింపఁబడిరి. వీరువేగాయమ్మపేట జమీందారిణి వారగు శ్రీరాజావాడ్రేవు రంగనాయకమ్మగారి మనుమరాలి నిల్లాలుగా గ్రహించి శ్రితజన సంతానముం బోనిసత్సంతానముం బడసిరి. ఏలూరునందును, బెజవాడ యందును మార్గస్థుల కన్నసదుపాయము నిమిత్తము ధర్మసత్రములు స్థాపించిరి. మఱియు గుంటూరులో కుగ్లరుదొరసానిగారి స్త్రీరోగ చికిత్సాశాలాసమీపమున రుగ్ణజన సౌకర్యార్థమై శ్రీవారిధర్మపత్నియగు శ్రీచిన్నమ్మారావుగారి పేరట నొకవిశాలమగు వాసగృహమును నిర్మించిరి. ఇందు నలుబది కుటుంబములవారన్యోన్య సమ్మర్దము లేకుండఁగాపురము చేయవచ్చును. వీరుతమ ప్రథమపుత్త్రికారత్నమగు చి॥ సౌ॥ శ్రీహైమవతీ సీతా విజయలక్ష్మియను నీ వధూపరిణయోత్సవ సమయమున ననేక కవిపండితుల నాహ్వానముచేసి చాల గౌరవముచేసిరి. విద్యావిషయమున లోకోపకారహృదయులై ధనవ్యయమని

యాలోచింపక యొకముద్రాక్షరశాలను నెలకొల్పి మంజువాణియను మాసపత్రికా ముఖమున ననేక సనాతనాధునిక గ్రంథరాజముల ముద్రింపించి ప్రకటనఁగావించి కీర్తిఁగాంచిరి. వీరిజననకాలము. ధాతృనామ సంవత్సర చైత్ర బ ౫ గురువారము.

## వీరు రచించిన గ్రంథములు.

పద్యకావ్యములు :—

1. నసంతకుసుమము (శ్రీవిక్టోరియా మహారాజ్ఞిచరిత్రము)
2. వారకాంత.
3. శివగీతలు.
4. చారుమతి.
5. సుశీల.
6. సర్వమంగళాశతకము.
7. మార్కండేయశతకము.
8. మత్తయిసువార్త.
9. లూకాసువార్త.
10. యోహానుసువార్త.
11. మార్కుసువార్త.
12. సత్క్రైస్తవశతకము.
13. నీతివాక్యరత్నావళి.
14. క్రీస్తుమతసారము.
15. మధుపవిహారము.
16. గలతీయులు.
17. రోమీయులు.

18. అపొస్తలుల కార్యములు.
19. శివపురాణము.
20. కస్తూరితిలకము.
21. జార్జిపట్టాభిషేక వర్ణనము.
22. విక్టోరియా తారావళి (శ్రీవిక్టోరియా మహారాజ్ఞిగారి డైమండు జూబ్లికాలమున వ్రాసినది)
23. మార్కండేయ చరిత్రము.
24. మార్కండేయ తారావళి.
25. శంకరతారావళి.
26. విక్టోరియా స్వర్గయాత్ర.
27. అష్టావధానము.

నాటకములు :—

28. నలనాటకము.
29. శశిరేఖానాటకము.
30. చిత్రహరిశ్చంద్ర.
31. పాండవాజ్ఞాతవాసము.
32. శ్రీకృష్ణనాటకము.
33. చమత్కారరత్నాకర ప్రహసనము.
34. విధవావివాహ ప్రహసనము.
35. నిరపవాద ప్రహసనము.
36. మహాయోగి రహస్యప్రహసనము.

వచనకావ్యములు :—

37. మనోరమ (నవల.)
38. విజయాంక సాహసము (నవల.)

39 రాజహంస (నవల)

40. వాసంతిక (నవల.)

41. వచన నైఘంటుము.

42. ప్రార్థనావిధానము.

43. క్రైస్తవసూత్రార్థ ప్రదీపిక.

44. మోహంలేఖావళి.

45. స్వర్గసాయము.

46. శిశుసంజీవని.

47. గానామృతము.

48. సంస్కృతభాషా వ్యాకరణము.

49. బాలనీతికథలు.

50. సూక్తికథలు.

**English :—**

51. Inner Doctrines of Christianity.

52. The Power of Christ.

53. Baptism.

కృతినొందిన గ్రంథములు :—

1. ఆంధ్ర పరాశరస్మృతి.

2. ధర్మజ రాజసూయము.

3. భుజగరాజమణి శతకము.
4. అశ్వలక్షణసారము.
5. భుజంగనృపాలశేఖర శతకము.
6. కవిరాజసందర్శనము.
7. కనకవల్లి (నవల.)
8. హనుమద్విజయము (సంస్కృతము.)
9. మత్స్యపురాణము.

వీరు ప్రచురపరచిన పురాతనగ్రంథములు :—

1. మంజువాణి :—మాసపత్రిక. దీనిని సుమారు పదిసంవత్సరములు ముద్రించిరి.
2. సర్వలక్షణ సారసంగ్రహము.
3. అహోబల పండితీయము.
4. శకటరేఫ నిర్ణయము.
5. ఆంధ్ర చంద్రాలోకము.
6. రాజవాహనవిజయము.
7. కృష్ణరాయవిజయము.
8. అచలాత్మజా పరిణయము.
9. రామేశ్వరమాహాత్మ్యము.

10. దిలీపచరిత్రము.

11. వైజయంతీవిలాసము.

12. పారిజాతాపహరణము.

13. చిత్రసీమ.

14. ఆంధ్రలోకోక్తి చంద్రిక.

15. సంస్కృత లోకోక్తి చంద్రిక.

ఇట్లు విన్నవించు,

క్రొత్తపల్లి - సుందరరామయ్య.

## రాజావారి యాశీర్వచన పద్యములు.

ఉ॥ ఏలుతమివ్వధూవరుల నేనుజనప్రియకారిలోకమున్
మేలుగనాత్మబోధమున మేలుకొనంగ నొనర్చుచుండునా
వేలుపువేల్పనందగిన విశ్రుతసచ్చరితుండువీరిపై
జాలిగసత్కృపారసము సాగఁగఁజేయుచు నెల్లవేళలన్. 1.

క॥ చెప్పఁగలదేమియున్నది
యిప్పుడమిస్త్రీటులయిన యింతులలోనన్
మెప్పుంబడయుచుఁబతిలో
నొప్పులకుప్పవయి మెలఁగుచుండుముతల్లీ ! 2.

ఉ॥ ఏలికవైననీవెచుమ యిష్టసఖుండవు నైననీవెమా
బాలికకన్నుగావునను బ్రాణపదంబుగఁ జూడుమయ్యస
చ్ఛీలముమీఱ మేమెపుడు చెప్పితిమింతియె కాకనీవుఁద
త్పాలనరీతిఁగాంచిహిత భావమునంజను వీయకుందువే. 3.

క॥ ఇందునునందునుసుఖముల్
పొందుపడన్మిగులమీకుఁ బురుషోత్తముఁడా
నందమున రెండుచేతుల
నందిచ్చినకరణిఁదోఁప నమరంజేయున్. 4.

గీ॥ శుభపరంపరలిచ్చు నీశుండుమీకుఁ
జిరతరాయువులొసఁగును జిన్మయుండు
సిరులుసంపదలిచ్చు నశేషనేత
యొంగొరులఁ బ్రీతియిడుమీకు సురమహాముఁడు. 5.

క॥ మఱియాపరిశుద్ధాత్ముల
వరతనయుఁడుధర్మహితుఁడు ప్రాజ్ఞుండమితా
దరమున నేలుతనీకవ
భరమేలోకంబులేలు వానికినిదియున్. 6.

క॥ సతియుఁబతియుజక్కవకవ
గతిఁబావురములపగిదిని గాఢానురతిం
గృతకృత్యులగుటజనస
మ్మతమీశ్వరునిమతమవని మంగళయుతమున్. 7.

క. ఏమతములుబోధించిన
భామినులనవజ్ఞసేయ వలదనియేకా
ధీమహితులకిహపరములఁ
దేమానిమలర్హులని మదిన్మఱవకుఁడీ. 8.

చ॥ కుతుకముమీఱమీరు గవగూడిసుఖింపుఁడటంచు హెచ్చరిం
చితినదిసాజమెచ్చరకు జీవమునిచ్చిన దేవుఁ బ్రేమతో

సతతముఁగొల్చుటొండు తనసాటిగజీవులఁ బ్రోచుటొండునీ
క్షితిఁబరధర్మముల్ సుగతిఁజెందుటకియ్యవి యాలవాలముల్. 9.

సీ॥ ఇహసౌఖ్యములనెల్ల నేర్పడఘటియింపఁ
దల్లిమించినవారు ధరణిలేరు
పరసౌఖ్యములనునిర్బంధించి సమకూర్ప
గురునిమించిన వారగుపడరిలను
క్లేశంబుఁబాపిసుఖింపఁ జేయుటకెన్న
మిత్రులమీఱరీ ధాత్రినెవరు
దుష్టులశిక్షింప శిష్టులరక్షింప
భూజానిమీఱిన పురుషుఁడునహి

గీ॥ సతికిఁబతియునుభర్తకు జాయదలఁపఁ
దల్లిగురుడునుమిత్రుండు ధరణిపతియు
నైతనర్చుటకంటెయోగ్యంబులేదు
మీరలీగతిమెలఁగుఁడీ ధీరులగుచు. 10.

శ్రీ

# హైమవతీ పరిణయము.

# రెండవ భాగము.

వివాహ సమయమునకు రాజాలక
ఆశీర్వచనములఁ బంపిన కవుల
చరిత్రాదులు.

శ్రీ

# హైమవతీ పరిణయము.

## రెండవ భాగము.

### 149. ఇమ్మానేని వేంకటగోవిందరావు నాయనివారు.

వీరు, ఇమ్మానేని బాపనయ్య నాయనవారికుమారులు. ఆది వెలమ కులోద్భవులు. పూర్వదఋషి గోత్రజులు. ఆంధ్రభాషా విహంగంబున కిరు పక్షంబులంబోలు బ్రహ్మశ్రీ కొక్కొండ వేంకటరత్న శర్మగారికిని, బ్రహ్మశ్రీ కం॥ వీరేశలింగము పంతులవారికిని మిత్రులును, మైలాపూరు పెంతోము కాలేజి ప్రధానాంధ్రోపాధ్యాయులుగనుండి ఖ్యాతిఁగాంచి కీర్తిశేషులయిన బ్రహ్మశ్రీ వనము-గురుస్వామి శాస్త్రులవారియొద్ద నాంధ్ర సంస్కృతంబుల నభ్యసించి, వేదాంత విచారముచేసిరి. వీరు పెంతోము కాలేజిలో మెట్రిక్యులేషను, యఫ్. ఏ. పరీక్షలనిచ్చి ద్వితీయ సన్మానపుస్తకముల వడసిరి. 1901 సంవత్సరమున ప్రెసిడెన్సీ కాలేజిలోఁజేరి, బి. ఏ. ఆంధ్రభాషా శాఖయందుఁ జేరియున్నవారు. వీరిప్పుడు చెన్నపట్టణము పోలీసు ఇన్స్పెక్టరు జనరలు ఆఫీసులో నుద్యోగములో 1904 లాగాయతు నున్నారు. వీరప్పుడప్పుడు రచించుపద్యములు వార్తాపత్రికల మూలమున వెలువడుచుండును. వీరిటీవల నానాగొంది సంస్థాన యువరాజులుంగారి వర్ధంతి మహోత్సవ సమయమున రచించిన పద్యములు "ఆంధ్రప్రకాశిక" యందుఁ గాననగును. వీరు, ఆంధ్రవర్ణ దర్పణమను పేర నొక గ్రంథమును, భాషాపరిణామ మనుగ్రంథమును వ్రాయుచున్నారు, వీరు, ఆనాగొంది మహారాజులుంగారి యాస్థానపండిత మండలి కలంకార భూతులైయున్నారు.

శా॥ శ్రీకల్యాణగుణాకరుండు కరుణాసింధుండు పూజ్యుండున
స్తోకప్రాజ్ఞుఁడు పూర్ణుఁడచ్యుతుఁడు చిద్రూపుండుమాన్యుండుభూ
లోకఖ్యాతుభుజంగరాట్సుతను సుశ్లోకన్ సురూపాన్వితన్
శ్రీకిన్ నాథునిసేసి కెంతయును ధాత్రింజేయుతం బాత్రఁగన్. 1.

ఉ॥ కాయజాతంద్రిసద్ధన నికాయముకంజభవోత్తముండుదీ
ర్ఘాయువుశంకరుండు పరకామితసర్వసుఖంబులన్ మహో
పాయసువిద్యనిచ్చిప్రతి భారతిభారతి బ్రోచుఁగాత, నా
రాయణరావునన్ సుగుణరంజిత హైమవతీసతీమణిన్. 2.

ఉ॥ కోమలవల్లి హైమవతి కుంకుమశోభిత లోకమాతశో
భామలసర్వమంగళ సమంచితశోభన మంజువాగ్విలా
సామృత శైఖరీగిరిము సత్యప్రవర్తన సత్కులీనకున్
హైమవతీసతీమణి కహర్నిశమున్ గలుగంగఁజేయుతన్. 3.

ఉ॥ నిత్యులుబ్రహ్మవిష్ణు శివనిర్మలమూర్తులు సర్వలోకసం
స్తుత్యులువాణిలక్ష్మి శివసొంపగువామురు మర్ధదేహమా
న్నత్యమునంద్రిమూర్తి సురనాథులపత్న్యము నానుకూల్యదాం
పత్యమొసంగిబ్రోచుత కృపామతిదంపతులన్ గుణాఢ్యులన్. 4.

ఉ॥ శ్రీయుతమానిహృత్కమల సీమనివాని యనంతసత్యనా
రాయణమూర్తిదీనజన రక్షణదక్షు దిగంతకీర్తి, యా
మ్నాయకలాకలాప్తు, బుధమండను, రామయసూను, సత్యనా
రాయణరావుకిచ్చుత చిరాయువు, ధీ, వినయోక్తిసంపదల్. 5.

## 150. శ్రీవిక్రమ దేవవర్మగారు.

వీరి నివాసస్థలము విశాఖపట్టణము. వీరిప్పటి శ్రీజయపురము మహారాజుగారి కనిష్ఠపితృవ్యపుత్త్రులు. క్షత్రియులు. కాత్యాయన సూత్రము. భారద్వాజ గోత్రము. తండ్రిగారు శ్రీకృష్ణచంద్ర దేవమహారాజుగారు. తల్లిగారు శ్రీరేఖాదేవిగారు. శుక్లసంవత్సర జ్యేష్ఠబహుళ తృతీయాగత చతుర్థీభానువాసరరాత్రి (1869 సం॥ జూను తే 28ది) మేషలగ్నమున జననము. మాతృభాష ఉత్కలము. వీరు స్వప్రయత్నము వలననే సంస్కృతోత్కలాంధ్రాంగ్లేయభాషలను నేర్చినవారు. వీరు సంస్కృతమునఁగొన్ని యష్టకములను ఉత్కలభాషయందు రాధామాధవ నాటకమును, ఆంధ్రమున శ్రీనివాస కళ్యాణనాటకమును, మానసతీ చరితనాటకమును, నీతిగీతితతిని, కృష్ణార్జున చరిత్రమను ద్వ్యర్థిప్రబంధమునకుఁ డీకను రచియించియున్నవారు. వీరికి జయపురసంస్థానమునుండి మాసమునకు, ఎనిమిది నందల రూపాయలును, రావికమతమను గ్రామమువలన సంవత్సరమునకు రెండువేల రూపాయలును లభించును.

ఆ॥ శ్రీమతీశుఁడమర సేవితపాదుఁడు
శ్రీకరుండు మంగళాకరుండు
ప్రేమహైమవతిని వేంకటసత్యనా
రాయణుఁ జిరసుఖులఁ జేయుఁగాక. 1.

ఆ॥ అంగభవుని మాతమంగళదేవత
కలశజలధి తనయకమల నిలయ
ప్రేమహైమవతిని వేంకటసత్యనా
రాయణుఁ జిరసుఖులఁ జేయుఁగాక. 2.

ఆ॥ సర్వమంగళయును జంద్రచూడుండును
వాణియును సరోజభవుఁడు నెసఁగు
ప్రేమ హైమవతిని వేంకటసత్యనా
రాయణుఁ జిరసుఖులఁ జేయుదురిల. 3.

ఆ॥ సూర్యశశికుజజ్ఞసురగురు కవిభాను
పుత్త్రరాహుకేతువులు గడఁగి
ప్రేమ హైమవతిని వేంకటసత్యనా
రాయణుఁ జిరసుఖులఁ జేయుదురిల. 4.

ఆ॥ శక్రరోహితాశ్వశమన రాత్రించర
వరుణవాయు ధనద గిరిశులొప్పు
ప్రేమ హైమవతిని వేంకటసత్యనా
రాయణుఁ జిరసుఖులఁ జేయుదురిల. 5.

## 151. ఈశ్వర సత్యనారాయణ శర్మగారు.

వీరి జన్మభూమి విశాఖపట్టణపు జిల్లాలోని చోడవరము. నివాసస్థలము గంజాముజిల్లాలోని శ్రీకాకుళము. వెలనాటి వైదికులు. ఆపస్తంబసూత్రము హారితసగోత్రము. తండ్రి సీతారామయ్యగారు. తల్లి కామేశ్వరమ్మ. వ్యయసంవత్సర అశ్వయుజ షష్ఠి జన్మదినము. ఆంధ్రగీర్వాణముల యందుఁ జక్కని సాహిత్యము కలవారు. హూణభాషలో మెట్రిక్యులేషను పఱకుఁజదివియుఁ గులక్రమాగత విద్యయగుటచే నాయుర్వేదాభ్యాసముం జలిపి వాసిఁగనుచున్నవారు. రచించిన గ్రంథములు:—1. శ్రీకూర్మక్షేత్రమాహాత్మ్యము, 2. సత్యదేవ చరిత్రమను నామాంతరముగల సత్యనారాయణ మాహాత్మ్యము, 3. రఘుదేవరాజీయనాటకము, 4. జానకీశ్వరశతకము, 5.

భాస్కరనక్షత్రమాల మొదలగుc జిల్లరలు. రచనలోనున్న గ్రంథములు :— 1 హారీతసంహిత (వైద్యగ్రంథము. ఆంధ్రీకరణము) 2. వైద్యపద నిఘంటువు. (అకారాద్యక్షరక్రమము) 3. హర్షవల్లీ. (అరుసవల్లి) క్షేత్రమాహాత్మ్యము.

మ॥ గుణబద్ధంబయి, రమ్యనాయకముసై, గోమంతమై, లోకభూ
షణమై, నిర్మలమై, వరాక్షమయి, విశ్వప్రస్తుతామోదకా
రణమై, కప్రవుదండ పోలికను భద్రగ్రంథియై, యెల్లెడం
బ్రణుతింగాంచుత నీవధూవరుల దాంపత్యంబు దేవికృపన్. 1.

## 152. పేరి పేరయ్య శాస్త్రిగారు.

" శ్లో॥ పేర్యన్వయే జనిరముష్యకులం ద్విజానాం
తత్రాపి వైదికవరిష్కృతకే ప్రసూతిః
గోత్రస్తుగోతమ సుతస్యహి పేరయాఖ్యా
శాఖాయజుస్సక వైదిక కర్మహేతుః. 1.

శ్లో॥ వార్త్సమ్బ నిర్మితమవద్యభి దస్యసూత్రం
పేర్భట్టనామక పితాజననీచ లక్ష్మీః
జన్మాత్తయోర్జనిత భూతతిథా ప్రదోషే
సద్రావిడో న్యవసతి ర్భువిపీఠికాపూః. 2.

శ్లో॥ అశ్వత్థపాదభిజనో న్యనిర స్తదోషో
హోమప్రధూ మసురభీకృత సర్వదోషః
ఆచార్యశిష్యముఖ నిస్సృత వేదఘోషో
వేదోక్తకర్మకర సద్ద్విజచారుభూషః. 3.

శ్లో|| అత్రత్యపూర్వకృత కర్మవిపాకజన్మ
నాశాదిసంసృతి మహీరుహభేదదక్షః
యస్మాదయం నమథదద్భువి తత్ప్రసిద్ధా
మశ్వత్థపాడితి పరామభిధాంజగామ. 4.

శ్లో|| యస్యైకతో నిజతిరశ్చితతిత్రిపథుత్సా
సన్స్నానవౌఘ ఘనదోషనిరాసిపత్సా
కల్లోలినీ గురువసిష్ఠ మునేస్సుఖేత్సా
భాత్యన్యతః ఖగపజాతటినీ సుకృత్సా. 5.

శ్లో|| యత్రోషితాః కమలనాభ మహాప్రసాదా
దాస్తార్తి హృత్కమలవాసి రమాకటాక్షాః
నైర్ధేష్టసిద్ధకమలాసన సర్చనాప్తాః
దత్తోహమేన కమలాగ్రజదేవతాయై. 6.

శ్లో|| శాలాతురీయకృతి శిక్షణహేతుతోస్య
శ్రీకాకినాడ్భ్రితకలాభవనే దశాబ్దాః
అత్రాపిసప్తచగతాః పురతఃకిమమ్బా
జ్యేష్ఠానియోజయతి కర్మనృశంసశీలా. 7.

శ్లో|| సద్గ్రంథజాల సమపత్ర రసావిభూతాః
సారస్య పూరితమనః కమలావిభూతాః
దుశ్శబ్దజాలగిరిభేద పవిప్రకాణ్డా
స్స్వచ్ఛబ్ద తస్తవయనేజవినః కవీంద్రాః. 8.

శ్లో|| నాయంకవిః కనయితానచ కోశకర్తా
నస్యాత్తతోభువి కవీశపదాభిధేయః

అజ్ఞాతమాతనవ పల్లవదూర సజ్జః
కాకః కథంపికవిహంగ పదాభిధేయం. 9.

శ్లో॥ యద్యప్యయం కవిపదానభిధేయ ఏవా
ప్రజ్ఞస్తథాపిగణితః కవిరాజపజ్త్యా
లోకేమణిప్రవరగుమ్భిత మాలికాయా
మధ్యేక్షిపన్తినను కాచమణేన్ లతాజ్ఞ్యః. 10.

శ్లో॥ యోమాదృశానపి పదార్థవిచారశూన్యాన్
చక్రేకపీన హాహాపణ్డితమానినశ్చ
సోయంపరాత్పర తరః పరమాదిదేవః
ప్రీయాద్వసన్తతిలకా కుసుమప్రద్ధదామ్నా. 11.

శ్లో॥ ఆయుర్దారణి జోదదాతు వివిధైరాజ్యాదిభిస్తోషిత
స్సీతా హైమవతీసతీమణియుజా నారాయణేనానిశమ్
అష్టైశ్వర్యమనూన మాయురధికం నశ్చాస్తథా బ్రహ్మణో
దేయాన్మంగళ స్ఫుంహతి శ్రుతిరతిం వస్తై ర్వపయాయస్థిరామ్. 1.

శ్లో॥ ఇన్ద్రోవ్రదుశ్చ్యవనోదిసః పరిబృఢశ్చాయుతో భార్యయా
దాయాద్విఘ్నతతింకరగ్రహ భవాందేయాన్మహాప్రాభవమ్
రాయఃపుష్టిమనన్యభూపతిగతాం చాన్యోన్యరాగోన్నతిం
సీతా హైమవతీయుతాయ విభవేనారాయణా యానిశమ్. 2.

శ్లో॥ దేవోదేవగురుశ్చబుద్ధి మతులాంసద్గోచరాం సాత్త్వికీం
నృత్యానతశత భూరిసత్ఫలసుమస్సత్పుష్పిణీ వీరుధః
దేయాదాత్మభువః కరగ్రహ మహాప్రోద్వేష యోశతయో
ర్దంపత్యోశ్చ రనిశం భుజఙ్గనృపతిక్రీడ తస్సుఖాపుత్త్రయోః. 3.

శ్లో॥ యస్యాంమహేన్ద్రాది సురాశ్చపుత్రికా
జనింగతా లోకహితప్రధిత్సవః
దిశ్యాత్సునూస్సాదితి రాత్ర సత్క్రియా
యుతావిమావోజతు సుప్రజాస్త్వయా. 4.

## 153. కాశీ కృష్ణాచార్యులుగారు.

వీరు 1878 సంవత్సరము నవంబరు 10 తేదిని బందరులో జన్మించిరి. వీరిని గన్నతల్లి అక్కపిచ్చమాంబగారు. తండ్రి లక్ష్మీనృసింహాచార్యులవారు. గుంటూరు వాస్తవ్యులయిన కాశీవేదవ్యాసాచార్యులవారికి దత్తపుత్త్రులు. ద్వైతమతస్థులు. శ్రీ "మ" అక్షరాపురపు శ్రీనివాసాచార్యులవారు వీరి సాహిత్యగురువులు. కీర్తిశేషులగు శ్రీ "మ" మహీశూరు భీమాచార్యులవారును, బ్ర" గుమ్ములూరి సంగమేశ్వర శాస్త్రులవారును వీరి న్యాయశాస్త్రగురువులు. వీరు ప్రస్తుతము గుంటూరు టౌన్ హైస్కూలులో ప్రధాన సంస్కృతోపాధ్యాయులుగా నుండిరి.

శ్లో॥ శ్రీనాథః శ్రియమాయురంబుజభవశ్శర్వశ్చసర్వేశితా
మారోగ్యంద్యుమణిర్ముదం హిమకరస్సౌమాంగళ్య మంగారకః
జ్యోక్షత్వం గురుతాంగురుస్సు కవితాంకావ్యస్థిరత్వం శనీ
రాహుశ్శందద్వజి సింధ్వజః ప్రదిశతాద్వాం నూతనాదంపతీ. 1.

శా॥ శ్రీమంతంబగు గౌరిపెండ్లి తరిజేజేలందఱుంజేరిని
స్సీమానందము మంగళాష్టక ముఖాశీస్సుల్మొదలెట్టఁగా
నేమంత్రధ్వనిలో నొరుల్వినని యస్లేమోప్రసంగించుగా
రీమృత్యుం జయులిత్తురోహికమహా శ్రేయమ్ము మీకెప్పుడున్ 2.

సీ॥ కడుపుచల్లదనంబుగల దానవనుటకో
యమ్మనీ నామధేయమ్ముసాక్షి

ఆడితప్పని దానవనిపల్కఁదాలినీ
మెడనుగట్టిన పెండ్లి కొడుకు సాక్షి
అఖిలభోగములచే నలరారుదవఁగమ
హాభోగియైననీయయ్యసాక్షి
వ్యవహార సర్వస్వబహువేత్తయౌవవుదవ
మహితనీజనక వంశంబుసాక్షి

గీ॥ వివిధవిద్యా సరస్వతి వవుదువనఁగ
నిచటి పండితమండలి యెల్లసాక్షి
ఇట్టినిన్నేముదీవించి యిప్పటికిని
బుతపచస్కుల మనుకీర్తి నెనయఁగలము. 3.

ఉ॥ నీమహిమాధి కత్వమున నీపతినూతన రాజశేఖరుం
డామహనీయు నామమహిమాతిశయంబున నీవు, శ్రీవి, స్తైయై
యీమహిమీర లిర్వురు నుమేశరమాజగదీశులట్లుని
స్సీమసమ స్తసౌఖ్యములచే నలరారుచు నుంగుగావుతన్. 4.

గీ॥ ఐతివివాది, సత్యనారాయణుఁడవు
కన్యమహిమను రాజశేఖరుఁడవైతి
వందుచే నెప్డునీవు మేనాసవారి
విభవమందుచు నుందువో పెండ్లి కొడుక. 5.

## 154. అయ్యగారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.

వీరి నివాసస్థానము కృష్ణారాయని పెదపూడి. తండ్రి ఉమామహేశ్వరశాస్త్రిగారు.

శ్లో॥ భజేహంవ్యాఘ్రేశం సదసివర జాంబూనదమయే
పురః పీఠేరమ్యే సుఖమభి నిషణ్ణాంచగిరిజాం
ప్రనృత్యంతం శ్రీమద్భుజగ విభుకన్యాదయితయో
ర్విధాతుంకళ్యాణం విధిహరి సురేంద్రాది వినుతం. 1

శ్లో॥ పురావిధాతుర్దై త్తావదత్ప్రియం
మనోహరాంగా కురుసద్యవాసా
సృష్ట్యాతథాంగీకృత దారవాక్య
స్సంసక్తమేతన్మిధునంచకార. 2.

గీ॥ ప్రణవరూపకమైనట్టి పఞ్జరమునఁ
గీరబాలికయై యొప్పుగిరిజ నెపుడు
భక్తితోడుతఁ బ్రణుతింతు భావమందు
ధరణిసౌభాగ్య మొసఁగ నీదంపతులకు. 3.

శ్లో॥ ఉమామహేశపుత్రేణ సుబ్రహ్మణ్యాఖ్యశాస్త్రిణా
ఏతశ్లోకత్రయం విద్వాదరాత్క్రియతేముదా. 4.

## 155. నాదెళ్ల పురుషోత్తమ శాస్త్రిగారు.

వీరి నివాసస్థలము మచిలీపట్టణము. వెలనాటివైదికులు. ఆపస్తంబ సూత్రము. హారితసగోత్రము. తండ్రి కామావధానులుగారు. తల్లిసుబ్బమాంబ. రుధిరోద్గారి సంవత్సర వైశాఖ శుద్ధ పంచమీ గురువాసరము జన్మదినము. వీరనవద్య సంస్కృతాంధ్ర హిందూస్థాన భాషా సాహిత్యంబును, ఆంగ్లేయ పారసీక భాషాపరిజ్ఞాతృత్వమును, జ్యోతిశ్శాస్త్ర పరిశ్రమముంగలిగి యనర్గళ బంధగర్భ కవితా చమత్కృతింబట్టి సరస చతుర్విధ కవితా ధురంధరులను, బిరుదమున్వడసిరి. పలుమారు లష్టావధానాదికంబుల

నొనరించియుం గీర్తిగాంచిరి. 10 సంవత్సరములు ఋషివిధేయిని పత్రికా ప్రకటన మొనర్చియు, 22 ఏండ్లు బందరు హిందూ బ్రాంచిస్కూలులోఁ ప్రధానోపాధ్యాయులుగ నుండియుఁ బ్రస్తుతము హిందూబాలికా పాఠశాల కధ్యక్షులుగా నున్నారు.—1. అద్భుతోత్తరరామాయణము, 2. గురుభక్తి ప్రభావము, 3. కృష్ణానదీ మాహాత్మ్యము, 4. ఆంధ్రీకృతాష్టావక్ర గీతా, 5. సోమేశ్వరీయము, 6. మాహేంద్ర పురాణము, మున్నగు 15 ఆంధ్ర ప్రబంధములును, 8 తెలుఁగు నాటకములును, 32 హిందూస్థాన భాషా నాటకములును, ఇంకననేక విద్యార్థిబాలకానుకూల గ్రంథములను రచించిరి.

ఉ॥ శ్రీయుతులైమహోన్నతి వసింపఘటింపుమధీశ సత్యనా
రాయణుఁడన్వయవ్యధువు హైమవతిన్ ధరణీస్థలంబునం
గాయజునిన్ రతిం గమలగర్భునివాణిఁ బురంధరున్శచిం
బాయనిపోరునం జెలఁగు పాండితిభోగమునందుఁ బోలఁగన్. 1.

## చతుర్ముఖకందము.

గుణరాశి సత్య - నారా |
యణునిన్ వర హైమవతిని, న్యాయవిధి, వరణన్
గణియింపు మీధు - వనజవ |
ఘనులన్ పరిశేరనంగ, మనుప, న్వరదా. 2.

## భుజంగప్రయాతము.

అజా ! సత్యనారాయణాభిఖ్యతోడన్
భుజంగాత్మజంగూర్చి పోషింపుమీడన్
నిజానూనసద్భక్తినిన్నుం దలంపన్
భజింపన్నుతింపన్శుభం బుల్లసింపన్. 3.

శా॥ కవ్యుత్తంస! భుజంగరాయ! భవదుత్కంఠంబు ధీమజ్జన
స్తవ్యంబై కొనసాగఁగావుతవరేంద్రా! దాననీ జన్మమున్
భవ్యంబయ్యెనటన్న ఖ్యాతిగని శోభన్నీదు కబ్బంబుదే
శవ్యాప్తంబయి హర్షదంబగుచు నాచంద్రార్క మొప్పారుతన్. 4.

ఉ॥ శ్రీయలరార నెల్లపుడు శేషసుఖంబులఁ గాంచిసిత్యశో
భాయుతసుందరాంగియు స్వభావవినమ్రయునాగసత్కవి
స్తాయగుణప్రయుక్త యగుచుందనరారెడిఁగాత సత్యనా
రాయణమూర్తిఁగూడి యనురక్తిని హైమవతీలలామతాన్. 5.

చ॥ కలరిలనెందరేని నృపకాంతులువారలు మిమ్మమించిప్రో
జ్వలదురుదేశదేశ పరిపాలనముం బొనరించునట్టినే
తలనొకరైననిట్లు కవితాదరముంగనిరే? కపీట్చరి
త్రలఁబ్రచురింపనెంచిరి నరాధిప! సత్కవి పోషయాటచేన్. 6.

## 156. మయిలవరపు వెంకటరామయ్యగారు.

వీరి నివాసస్థలము గుఁటూరు. జన్మస్థానము గుంటూరుతాలూకా లోని కర్లపూడియను గ్రామము. తెలుఁగు నాటివైదికులు. ఆపస్తంబ సూత్రము. భారద్వాజస గోత్రము. తండ్రిసంగీత విద్వత్ప్రపంచమున, అనంతరామయ్యగారు, అను నామాంతరముగల హనుమయ్యగారు. తల్లి లక్ష్మీనరసమ్మగారు. సర్వజిత్సంవత్సర జ్యేష్ఠశుద్ధ ఏకాదశి. (అనఁగా 1887 సం॥ 2 వ జూను) జన్మదినము. వీరు 1907 సంవత్సరమున బి.ఏ. పరీక్షలోను, 1918 సంవత్సరమున యల్. టి. పరీక్షలోను కృతార్థులైరి. వీరు ప్రస్తుతము, విశాఖపట్టణములోని సి. బి. యమ్. హైస్కూలులో సహోపాధ్యాయులు. వీరిచే రచింపఁబడిన గ్రంథములు:— 1 విశ్వేశ్వర కవివిర చితమని ప్రచురింపఁబడిన చండీ తేతరలతుగాము. 2. ...

## 163. కళ్లేపల్లె వేంకటరమణమ్మగారు.

ఈమె యిదివరలో గాకినాడ సీకష్టమ్సు అఫీసు హెడ్‌క్లర్కుగా నుండి ప్రస్తుతము గోపాలపురము కష్టమ్సు కలక్టరుగానున్న శివరామయ్య పంతులుగారి ధర్మపత్ని. నివాసస్థలము గంజాము జిల్లాయందలి బరంపురము. భారద్వాజ గోత్రము. బలగన్నాటి కరణకమ్మ వైదికులు. ఋక్‌శాఖ. తండ్రి కురవిరామశాస్త్రిగారు. తల్లి కామనాంబ. యువసంవత్సర భాద్రపద శుక్లనవమి జన్మదినము. ఈమెగారికి ఆంధ్రగీర్వాణ సాహిత్యమును, సంగీత వేదాంత శాస్త్రజ్ఞానమును, ఉత్కలాంగ్లేయ విద్యాప్రవేశమును, కలదు. ఆంధ్రకవిత్వమునం బ్రౌఢురాలు. వ్యాసములును, విమర్శనములును వ్రాయుట యందు నిపుణురాలు. కృష్ణాపత్రికలో "తెలుగు దేశపుస్త్రీలమూర్ఖాచారములు, తన్నివారణములు" అనువ్యాసమును, కల్పలతాపత్రికా ప్రశ్నములకుత్తరములను, ఆంధ్రపత్రిక సంవత్సరాది దర్బారు సంచికకు "ఆంధ్ర స్త్రీలస్థితి" యనువ్యాసమును, దుర్గేశనందిని విమర్శనమును మొదలగు వానిని వ్రాసిపారితోషికములను, నర్సాపురము తాలూకాభివృద్ధి సంఘమువారి స్త్రీలపరీక్షయందు స్వర్ణపతకమును, విజ్ఞానచంద్రికామండలీ పరిషత్పరీక్ష యందు యోగ్యతా పత్రమును బొందియున్నారు కొందఱు స్త్రీలకు సంగీత సాహిత్యవేదాంత విద్యలునేర్పిన ఉపాధ్యాయులు. కాకినాడ యందు జరుపఁబడిన రెండవ ఆంధ్రమహిళామహాసభాధిపత్యము వహించియు, నిడదవోలునందలి మూఁడవ ఆంధ్రమహిళా మహాసభకు కార్యదర్శినిగానుండియు జయప్రదముగా సభలను జరిపినవారు. ప్రస్తుతము కాకినాడ విద్యార్థినీ సభాధ్యక్షురాలుగాను, హిందూసుందరీ పత్రికా సంపాదకురాలుగాను, ఉండివ్యయప్రయాసములను సరకుగొనక కోరిన స్త్రీసభలకధ్యక్షురాలుగానేగి స్త్రీవిద్యాభ్యుదయమునకై పాటుపడుచున్నారు. వీరిచేరచియింపఁబడిన గ్రంథములు:—1. వరలక్ష్మీపూజా విధానము, (యక్షగానము) 2. వరలక్ష్మీ

శతకము, (పద్యములు) 3. దుర్గేశనందిని నవలావిమర్శనము, (వచనము) 4. చిల్లర పద్యములు, మంగళారతులు, కీర్తనలు మున్నగునవి.

శా॥ శ్రీరామాసమయైన హైమవతితో శ్రీసత్యనారాయణున్
గారామారఁగఁగూర్చి వేడుకలరంగల్యాణముం జేయులో
కారాధ్యుండు భుజంగ రాట్ప్రభుని శేఖండోఁచుద్దైవమ్ముతాఁ
గారుణ్యమ్మున నవ్వధూవరులఁ గాంతుల్దీర్చి కాపాడుతన్. 1.

సీ॥ నామరూపక్రియ లేమియు లేకని
రాకారమై తో ప్తనలరిపిదప
నొకరూపమూని వేటొక రూపుఁగల్పించి
యారెంటికిలయికనట్టిజతల
ముమ్మూర్తులై వానిమూలమ్మునననత్తు
యాజాండ భాండమ్ములన్నియునయి
విశ్వోద్భవస్థితి విలయముల్జేయుచు
నిత్యమైసత్యమై నిఖిలమునయి

గీ॥ తనరుచుండెడు నజమనంతంబునక్షు
రంబుజ్ఞానంబు నిర్వికారంబునైన
బ్రహ్మమేవేళ నీవధూవరులసిరుల
నాయురారోగ్యముల వృద్ధిఁజేయుఁగాత. 2.

సీ॥ పతిభక్తిరతలు లోపాముద్రయును నరుం
ధతియననూయ పార్వతియులక్ష్మి
భారతిపౌలోమి భాగీరథియురతి
వసుమతిరోహిణి పద్మినియును

సీతయునాన్మిక సీమంతిని సుకన్య
    సావిత్రిదమయంతి చంద్రమతియుఁ
గృష్ణయురుక్మిణికీర్తి మాలినికుంతి
    చారుమతి సువేదిసత్యభామ

గీ॥ శీలగాంధారి కృపిమహాశ్వేతమాద్రి
వేదవతి చంద్రముఖిపుష్పవేణిసుముఖి
సుమతిమొదలైన సాధ్వుల సుస్వరూప
మిప్పధూవరులను బ్రోవనెంచుఁగాత. 3.

సీ॥ శ్రుతికర్తలగుగార్గి సూర్యయుమైత్రేయి
    శ్రద్ధయునితర వాక్సరసిజాస్య
సంస్కృతగ్రంథరచనఁ జేసినట్టిసీ
    తయుభామతియు మోహికయుసుశీల
తెలుఁగునఁగావ్యము ల్సలిపినమొల్లయుఁ
    దరిగొండ వెంకమ్మతత్త్వవేత్రి
సద్గుణవతుల సచ్చరితముల్ వ్రాసిన
    బండారు అచ్చమాంబాలలాను

గీ॥ మొదలుగాఁగల పండితల్ బ్రదికియున్న
వారుగాలోకమునవెన్నఁ బడుదురట్టి
వారికరుణను నిప్పధూవరులు ప్రేమఁ
గలిగిచిర జీవులై ఖ్యాతిఁగాంతురుగాత. 4.

క॥ అంగజు ననుజాని రాణియు
మంగళదేవతయు సర్వమంగళయుదయన్
మంగళ పరంపరలనునొ
సంగివధూవరుల రక్షసల్పుదురెపుడున్. 5.

మ త్త కో కి ల.

ఓవధూవరులార ! పెండిలియుత్సవమ్మున మిమ్ములన్
సావకాశములేకఁ జూడఁగఁజాలనైతిని గాన నా
భావమండలి ప్రేమఁజూపఁగఁ బంచరత్నములంపితిన్
జీవరత్నములంచు వీనిని స్వీకరింపుఁడు కాన్కఁగాన్. 6.

## 164. పులుగుర్త లక్ష్మీనరసమాంబగారు.

వీరి నివాసస్థలము గోదావరి జిల్లా కాకినాడ. వెలనాటినియోగులు. ఆపస్తంబసూత్రము. మ॥ పులుగుర్త వేంకటరత్నముగారిసహ ధర్మ చారిణి. చింతలపూడి నీలాచలము, అగ్గమగార్లపుత్రిక. కవివర్యులగునడ కుదిటిరామన కవిగారి దౌహిత్రి. వీరు ప్రమాదినత్సరమున జన్మించిరి. ఈమెకుఆంధ్రగీర్వాణ భాషలయందు మంచిసాహిత్యముగలదు. ఆంధ్రసాహిత్యమునందు ప్రవీణురాలు. ఈమె పెక్కు స్త్రీలకు విద్యగరపి సాహిత్యవతులుగఁ జేసినవిదుషి. తన సోదరీ లోకమునకంతకు విద్యాబుద్ధులు గరపవలె ననియెంచి శ్రీసావిత్రియను మాసపత్రికను నెలకొల్పిన సదాచారసంపన్నురాలు. ఈమెసాధ్వీలోకార్థము విద్యావతుల యర్హకృత్యములు, పాతివ్రత్యము, సత్సహవాసము, మున్నగుదాదాపు ముప్పది ఘనోపన్యాసములును, " కాముమంజరి, రాగతరంగిణి కళావతి, లోకబాంధవి, వజ్రపేటిక " మున్నగు ననేక నీతికథలును, స్త్రీల పూజాసమయ మందును, మంగళప్రద కార్యముల యందును పాడుకొనుటకు గారీవరముగ 100పాటలుగల మంగళారతుల శతకమును, స్త్రీలకు నయవిద్యనిఁటపు " స్త్రీనీతిగీతము " లను కీర్తనలపుస్తకమును, మహిళాకళాబోధినియను పద్యగ్రంథమును, సతీధర్మములు, నీతిపదములు, అనుద్విపదగ్రంథములుమతికొన్ని చిల్లరపాటలు, పద్యములు, దండకములు, రచించిరి.

క॥ శ్రీకరులుపదార్థముల
శ్లోకడగలవారు పార్వతీశ్వరులుసదా
స్తోకాయుస్సుఖములొసఁగి
సాకుతనీనూత్న బాలజంపతులఁగడున్. 1.

సీ॥ జీవేశువదనరాజీవాగ్రములఁగ్రాలు
శారదవిద్యా విశారదతయు
హృదయవల్లభుని హృత్సదనంబు నంగుల్కు
శ్రీమహాదేవి సుశ్రీసమృద్ధి
ప్రాణనాయకుని సామేనభాసిలుసర్వ
మంగళాదేవిసు మంగళంబు
అష్టవల్లభునివామాంకంబునందొప్పు
నలశచీదేవి భోగాతిశయత

గీ॥ పెండ్లికాన్కలుగాఁగసంప్రీతినొసఁగి
కృపయొలర్పఁగఁ గాంచురక్షింత్రుగాక
తమ్ముఁబోలెప్తైమనతమ్మదయితుఁగూడి
ధరణిపర్థిల్లనాచంద్ర తారకముగ. 2.

ఉ॥ సారసముద్భవించి ఘనసారసుగంధము వెల్లిజల్లికా
సారముమీఱఁజేయుగతి శారికవ్రాలిరుతంబుసేయుచా
యీగముఁగీరుసేయుగతి నీసతిభాసురధీసమేతయై
భూరిగఁబుట్టి నింటికిని బొందిన యింటికివన్నెఁదెచ్చుతన్. 3.

సీ॥ దయితుధీలతకుఁ బ్రాకయి కీర్తిఫలమంద
స్మృతినొసంగెను జంద్రమతికిసెవఁడు

వినుతపాతివ్రత్యమున నద్భుతక్రియల్
సేయ మని చెనసనూయ లేవఁడు
దురితాత్ముఁడగు తనవరు నేలవేల్పుల
కుముదలనిడఁ జేసెసుమతి యెవఁడు
పతిని జిరాయురున్నతుఁ జేయుసచ్ఛక్తి
వెలయించికాచె సావిత్రి యెవఁడు

గీ॥ అట్టిసత్యమయుండు లోకాద్భుతగుణ
శాలి, శాంతస్వరూపుఁడసాధ్యశక్తుఁ
డైనదేవుండు, పరమదయార్ణవుండు
శ్రీమతిని హైమవతిని దానోముఁగాత. 4.

## మంగళ మహా శ్రీవృత్తము.

శ్రీలలితసత్తుఁ డలశిష్టజనరక్షుఁడు వశీకృవితపక్షుడఁతిప్రేమన్
జాలఁబలిభక్తియును సత్కరణ శక్తియునసద్గుణవిరక్తియును వేత
ద్బాలికనుఛాయవలెఁ బాయకనిరంతర ప్రవర్ధిత వినిర్మలసుకీర్త్యా
వాలముగజేయునటుపాలనముసేయుతనపారమిడిమంగళమహాశ్రీన్

## 165. వుప్రేమెఅలీషాగారు.

వీరి నివాసస్థలము పీఠికాపురము. సున్నీశాఖ. మహమ్మదీయ మతము. ఖాదరియాగోత్రము. తండ్రిమొహియ్యద్దీన్ షాద్షాగారు. వీరు హిందూ మహమ్మదీయా ద్వైతశాస్త్రవేత్తలు. తల్లిచాన్బీయాంబిక. ఇప్పటికి 26. సంవత్సరముల వయస్సు. వీరు రచించినగ్రంథములు:— 1. గీతావళీ పరిణయము. 2. శారికాస్వయంవరము, 3. మణిమాల. 4. విచిత్రబిల్హణీయనాటకము, 5. చంద్రగుప్త. 6. బాణవధయను ప్రహ్లాదవిజయశతకము.

ఇవి నాటకములు. 7. తారావళి, 8. పద్మావతి, ఇవి నవలలు. 9. వారుణీదేవి, ఇది ప్రబంధము. 10. గులిస్తా, ఇది ఫారసీ గులిస్తానునకు భాషాంతరీకరణము. 11. స్వభావవిలసనము, ఇది నానా విధపద్యములుచాటువులుగా నప్పుడప్పుడు చెప్పినవాని సంపుటీ కరణము. ఇవిగాక మఱికొన్ని శతకములు, ఉపన్యాసములు. అద్వైతవేదాంత ప్రతిపాదకమైన చిన్నచిన్న పుస్తకములు.

శా॥ శ్రీలీలాలఁగనేర్చు సర్వజగముల్ సేవింపఁగా నోర్చునే
వేళంబాంసువిమిశ్రితాంబుకణమున్ విశ్వంబుగా మార్చుమా
యాలంకారము లార్చునే సహజమబ్జాతో ద్భవాండంబుగా
లీలందీర్చునో యాస్వభావ బలమోలిన్ శాంతచైతన్యమై
చాలన్గూర్చుత యీవధూవరులకున్ సౌభాగ్య మారోగ్యమున్. 1.

ఉ॥ శ్రీభాజితబ్రాహ్మణాన్వయము, పండితవంశము నారుభూరిరా
జాజయమంత్రి ప్రెగ్గడ భుజంగ నృపాలునకాత్మ పుత్రిసీ
తాజయలక్ష్మమాంబిక సదానుగుణా న్వితధన్యగా దలే
బోజయు శీలయాటను యశోధన యాటను సీతయాటచేన్. 2.

ఉ॥ ఆయమపూర్వ పుణ్యమున నద్భుత శీలుఁడునైన సత్యనా
రాయణరాయమంత్రిగుణ రాజితుఁడై వరుఁడయ్యెమున్నునా
రాయణుఁ డాదిలక్ష్మికిని హైమవతీ సతికాత్రిశూలియూవ
నాయకుఁడైన యట్లుబుధనంస్యను హైమవతిన్ దదీశ్వరుల్.
శ్రీయును మంగళంబును విశేషముగా సమకూర్చుఁగావుతన్. 3

సీ॥ సీతాపతివ్రత చెలఁగిరాఘవునకు
మించువేడుక నలరించినట్లు
రుక్మిణీరమణి సౌరుననొప్పిశ్రీకృష్ణు
మతికనురాగంబు మలచినట్లు

దమయంతి యింతిస్వాంతములోన నలునినా
రాధించికరము గరందినట్లు
ఆర్యామహాదేవి యమలశీలతచేత
స్థాణునివలపించి తనరినట్లు

గీ॥ హైమవతి సీతవిజయలక్ష్మీంబికయును
విభునివలరించుఁగాత సద్విధులచేత
లలితవిమలానురాగ వల్లరులచేత
వరుఁడు సత్యనారాయణవరలుఁగాత. 4.

గీ॥ లతలయందుఁ గపోతదంపతులయందు
దినములందును చంద్రచంద్రికలయందు
నెడతెగనిమైత్రిమీలోన నెగడుఁగాత
పటములోఁదోఁచు మీవధూవరులలీల. 5.

గీ॥ కోకిలముజంటమావిపైఁ గూరుచుండి
మధుసమయగీతి కలుసుధా మధురమొలుకఁ
బాడిప్రకటించు ననురాగపాటవంబు
లాశ్రయించుత మిమ్మనన్యోన్యమైత్రి. 6.

గీ॥ పల్లకములందు నవపల్లవాళియందు
కలితకల్లోలినీ జలకణములందు
రాగమలరారునదియ స్థిరంబుఁజేసి
మీయనురాగంబు స్థిరముగావింపనలయు. 7.

మ॥ ప్రతిరాగంబునఁ దేజమున్నది సుధావారాసిశోభావిసం
ప్రతిసేయందగదంచుఁ జెప్పనొక సద్రాగప్రవిష్టుండుమా

కితరంబేదియుఁబోల్పఁదోఁపదిఁకమీ యిచ్చం బ్రదీపింపుమనం
చితరాగంబె యొసంగుమీమిధున హృత్సీమావకాశంబులన్. 8.

సీ|| ఉరముపైనెక్కించె నువిదనొక్కఘనుండు
సగచీరనిడె నొక్క సదయహృదయ
అర్ధాంగిగాఁజేసెనతివ నొక్కనరుండు
అమ్మఁగాఁబడె నొక్కయతివమిన్న
ప్రాణార్థములనిచ్చెఁబడఁతి కొక్కప్రభుండు
తలమోసెపతి నొక్క తలిరుబోఁడి
రణములు ఛేదించె రమణికైయొక భర్త
పలుపలిచ్చెను నొక్క వనజగంధి

గీ|| ఇట్టులన్యోన్య ప్రేమతో నెంద రెంద
ఱనని పుణ్య సుశ్లోకంబు నందినారు
అట్టుమీమిధునంబు మోహానురాగ
రాగసంయుక్తమై ధాత్రిఁ గాలుఁ గాత. 9.

గీ|| ఇట్టులీవధూవరులకు నెలమినిత్య
మంగళముగూడ జయముదేవాంగనాళి
దివినిబాడఁగ నాశీర్వదించి వేడ్కఁ
గాలు ; పుంరాలిపాయను కవియొకండు. 10.

## 166. మల్లెల దావీదుగారు.

వీరి నివాసస్థలము బాపట్ల. క్రైస్తవులు. తండ్రి. రెవరెండు ఈసాకు గారు. తల్లి రెబ్బక్కమ్మ. వీరు 1890 సం|| ఆగస్టుమాస మాఱవతేదిని జన్మించిరి. ఒంగోలు కలాశాలయందు విద్యనభ్యసించి బాపట్ల మిషన్

క్రైస్తవులకు నెక్కుడనందుఁగొన్ని వత్సరములుపాధ్యాయులుగా నుండిరి. ప్రకృతము రాయపట్టణ వేదాంత పాఠశాలయందు వేదవిద్యార్థి. పదునా ఱేండ్ల నుండియే యనాయాసముగాఁ గవిత్వముఁజెప్ప నారంభించిరి. వీరు రచించిన గ్రంథములు:—1. సుహితశతకము, 2. సమూయేలుచరితము, 3. ఏ. బి. యం. మాహాత్మ్యము, 4. శ్రీయేసునామవిజయము. 5. యోనా కథావళి, 6. డిల్లానమంజరి, 7. మనశ్శతకము, 8. మఱియుఁగొన్ని పత్రికలు. ఈయన హైందవ క్రైస్తవాది జనోపయుక్తమగు "మన్నాశాల" ను గూడ స్థాపించిరి.

క॥ శ్రీకరుసిరులిడనీతిడి
వాకరుబెండిలికి నరుగనరగుణగణర
త్నాకరుశుభము లొసంగద
యాకరుదంపతులఁ బ్రోవనాత్మఁదలంతున్. 1.

గీ॥ హైందవులకును మఱిక్రైస్తవాదులకును
మంత్రిపెగడకులైక ధీమంతులకును
వర్ణనున్నాటివంశాబ్ధి వంద్యులకును
తివురనింతటి భాగ్యంబు దినముకలదె. 2.

సీ॥ క్రైస్తవజనయుక్త గ్రంథవినిర్మితా
సక్తిచాటదెదేవ భక్తినార!
స్వర్గరాజ్యమొయనఁ జనుహయాణరాజ్యాను
రక్తిచాటదె రాజభక్తినార!
ఆంధ్రమాతా క్షేమమరసి నీవదదోడ్డ
పాటుచాటదె దేశభక్తినార!
కవులెల్లమహాను భవులనొక్కటఁజేర్పు
శక్తిచాటదెగురు భక్తినార!

గీ॥ వేయిమాటలిఁకేటికి వినుమి పుత్త్రి
కావివాహోత్సవమున భాషావనితయుఁ
ధన్యయాయెఁగదయ్య నీపుణ్యమునను
సరసకవిగేయ ! రాజాభుజంగరాయ ! 3.

క॥ ఘనరిచార్డ్సు పరిణయమో
యనఁదనరుంగాత విబుధులరఁగ నేలూ
రున శ్రీవేంకటనారా
యణ హైమవతీ వివాహమతి వర్ధితమై. 4.

సీ॥ బాలదంపతులిలబహుచిరజీవులౌ
తంచుఁగోవిదులు దీవించుచుండ
బాలదంపతులకు బహుమానములనిడి
బంధుమిత్రులు ప్రీతిఁబరముమండ
బాలదంపతులకు స్త్రీలలామలుచేరి
మంగళారతుల నొసంగుచుండ
బాలదంపతులకు బాలికారత్నముల్
ప్రేమఁబూదండలర్పించుచుండ

గీ॥ నేమియొసఁగుటకును శక్తిలేమినలనఁ
బంచరత్నంబులను సమర్పించినాడ
నవధరింపుఁడు వేవేగవలఘుమతులు
దేవుఁడిలమిమ్ము నాశీర్వదించుఁగాత. 5.

వీరు రచించిన యాశీర్వచన పద్యముల యందలి రెండవతేట గీతము నందలి ప్రతిచరణాద్యక్షరములను జదివిన "హైమవతి" యనివచ్చును.

## 167. బాబుజాన్ చౌదరిగారు.

వీరి పూర్వికులనేక సంవత్సరముల క్రిందట వంగదేశములోని యొక భాగమునుండి గంజాముజిల్లాలోచేరిన శ్రీపర్లాకిమిడీ రాజావారి యాస్థానమున మిరాశిదారులుగనుండి కరణీకము జేయుచుండిరి. వారు జనపరిగణనమున గౌడబ్రాహ్మణులని తెలియఁబడుచున్నారు. వీరి ప్రపితామహులుగంగాధర చౌదరిగారు భారద్వాజగోత్రేయులు, కాత్యాయని సూత్రము. వీరివంశము లో రెవరెండు పురుషోత్తమ చౌదరిగారను వీరి చినతాతగారు 1833 సంవత్సరము కటకమునందు క్రీస్తుమతమవలంబించిరి. తండ్రిగారయిన గోపినాథ చౌదరిగారు 1873 సం॥ యజ్ఞోపవీతము త్రెంచి కటకపురియందే క్రీస్తుమతావలంబకులయిరి. జాన్ చౌదరిగారు 1876 సం॥ మే 25 తేది ధాతసం॥ చైత్ర బ ౧౧ నాడు జనన మొందిరి. మాతృభాష ఉరియా. క్రీస్తుసేవకులు. చౌదరుగారు తెనుఁగుదేశములో నున్నందున నీభాషాకృషిచేసి కొనుచున్నారు. రవిపత్రికకు ఉపసంపాదకులు. గౌరవార్థము భారత రాజన్యులకు క్రీస్తువార్త బంపుకార్యము నిర్వర్తింపుచు వారితో నుత్తరప్రత్యుత్తరములు సలుపుచుందురు. చిన్నమిరాసీదారులు.

చ॥ విమల వివాహబంధమున విశ్వములోపలనొప్పిగొప్పసౌ
ఖ్యములను బొందుచుంట యొకగౌరవకార్యముగాన దేవుఁడీ
క్రమమును సృష్టినిల్పెఁగనుకన్ జనులెల్లరు వృద్ధిఁబొందను
త్తమమగు నీతిరీతి యుదిత్వద్దయు మంగళమార్గమయ్యెడున్. 1.

చ॥ ప్రమదమనోజ్ఞశోభిత వివాహమొనర్చి భుజంగరాడ్వరుం
డమితమహోత్సవంబు వహియందగు పెద్దలకోర్కె మీఱఁగన్
సమయమువేచి నేఁడుకడు సంభ్రమ మొప్పఁగుమార్తెకున్ శుభం
బమరిన బంధువర్గహితమై చెలువొంద సమాచరంబునన్. 2.

సీ॥ మంగళ ప్రదమైన సంగీతవాద్యాది
విభవంబులొక వంక వెలయుఁగాక !
సన్మిత్రమృదువాద సహితాభినందన
ప్రకరంబులొక చాయఁ బ్రబలుఁగాక !
భక్తప్రమోద సంభావితాశీర్వాద
తతి యొక క్రేవ విస్తరిలుఁగాక !
అన్నత్రృప్తప్రజాభ్యన్నతస్తుతియతి
హితముగా నొకచెంత నెసఁగుఁగాక !

గీ॥ పరిమళద్రవ్యగంధముల్ పర్వుఁగాక !
నీశ్వరాశీర్వచనములు హెచ్చుఁగాక !
హైమవతి రాజపుత్రికల్యాణమెసఁగు
భాసురాహ్లాదకర శుభవాసరమున. 3.

ఉ॥ ఆయతలీలఁ దంపతులు లైయి సొబగొందుచునున్న సత్యనా
రాయణరావు హైమవతి రాజితకీర్తి ధరాతలంబునం
బాయని ప్రేమతోడ భగవంతుని భక్తినిగొల్చి పుత్రపౌ
త్రాయురరోగతాసుఖములన్వహమొంది సుఖింత్రుగావుతన్. 4.

ఉత్సాహము.

పరుఁడు క్రీస్తుకృపను మిమ్ముభవ్యదివ్యదీప్తితో
సరళమార్గమందునడిపి సర్వశుభము లొసఁగుచున్
నిరతరక్షణంబుఁగూర్చి నిండుకూర్మి వెలయభా
సురసుఖంబు లెపఁగఁజేసి శోభపెంపుఁజేయుతన్. 5.

---

## 168. కోకా శ్రీరామారావు నాయఁడుగారు.

వీరు ఆదివెలమకులజులు. పైలురుగోత్రులు. వేంకటాచలపతిరాయ పౌత్రులు. పండితాళ్వారు రాయనివారికిని తాయారాంబికకును బుత్త్రులు. అంగీరసనామ సంవత్సర చైత్రశుద్ధ నవమినాడు మచిలీపురము (బందరు) నజన్మించిరి. ఆదినము శ్రీరామనవమి యగుటను వీరికి శ్రీరామారావను నామకరణము చేసిరి వీరు బందరు హైస్కూలులో విద్యాభ్యాసమొనర్చిరి. మెట్రిక్యులేషను క్లాసులోఁ జదువుచున్న తరి హృద్రోగ బాధితులయి చదువుటమానవలసివచ్చినది. పిమ్మట నాంధ్ర భాషయం దభిరుచిగల వారగుటచేఁ బ్రాచీనకవి గ్రంథంబులును, లక్షణగ్రంథంబులును జదువనారంభించిరి. స్వయంకృషి వలననే విద్యాభ్యాసమునొనర్చిరి. 1892సం|| మెట్రిక్యులేషను తెలుఁగు టెక్స్టువిషయమయిన ప్రశ్నోత్తరములను వ్రాసిముద్రింపించిరి. ఆదినములలో బందరు నాటక సమాజములయందు వచననాటకములే ప్రదర్శింపఁబడుచుండుటచే హరిశ్చంద్రోపాఖ్యానము, కీచకవధ, దశరథనిర్యాణము మున్నగు నాటకములను వచనరూపమున వ్రాసియుండిరి. 1894 సంవత్సరము ఆగష్టునెలలో వైవాహికకార్యంబులు ముగిసినపిదప కారణాంతరమున 1896సంవత్సరము ఏప్రియలునెలలో బందరుపురమును విడిచి రాజమహేంద్రవరమున కరిగి యందలి సబ్కలెక్టరాఫీసులో కాపీస్టుగను, క్లర్కుగను, కొంతకాలము పనిచేసిరి. ఆదినములలో గోదావరి డిస్ట్రిక్టుబోర్డునకు వైస్ప్రెసిడెంటుగా నుండిన మ|| గంజాము వేంకటరత్నము పంతులుగారి ప్రోత్సాహమువలన 1897 సం|| ఏప్రియలునెలలో కాకినాడకుజని, యందలి లోకల్ఫండు ఇంజనీయరాఫీసులో క్లర్కుగాఁబనిసేయుచు, మనంబున నెనంగొనిన గ్రంథరచనాభిలాష చేత నుద్యోగమును విసర్జించి, 190[illegible] సం|| మున తిరిగి బందరు ప్రవేశించిరి. కుటుంబసంరక్షణార్థమయిన చిక్కులచే కృష్ణాజిల్లాకోర్టులో కాపీస్టుగా మరలఁ బ్రవేశించిరి. వీరిచే రచియింపఁబడిన గ్రంథములు:—1. ఆదిమచక్రవర్తీయము అనుపేర హరిశ్చంద్రకథ, అయిదాశ్వాసముల ప్రబంధము, 2. కథా

సంగ్రహము, అను పేర మనుచరిత్రకథ పద్యకావ్యము, 3 ఆంధ్రకవి కుసుమ మాలిక, అను పేర నాంధ్ర కవులచారిత్రమును నాటవెలది పద్యములును, సాహిత్యమునందేకాక సంగీతమునందును వీరికి బరిచయముకలదు. హరికథలను జెప్పుటయందుఁగూడఁ బ్రవీణులు. పద్యకవిత్వమేగాక పదకవిత్వమును జెప్పుటయందును నేర్పరులు. ఇంకను, ఆనందసాగరము, రామాయణసారము, విద్వద్దర్పణము, అను మూఁడు గ్రంథములను వచనరూపమున వ్రాయుచున్నారు.

ఆ॥ ఒడలనొక్కయింతి జడలనొక్క స్రవంతిఁ
గలిగి కేలజింకఁ గలను జింక
దాల్పుఁదాల్చువాఁడు దగరల యెకిమీఁడు
మనుచుఁగాక యాలుమగలవీఁక 1.

చ॥ పలుకువెలందికిన్ గరిమవాటిలఁజేసిన పండితాళియం
దలఘుఁడవీవటంచు నెదనారసి దానికి మాఱుమేలుగా
నలువభవత్తనూజవదనంబునఁ బంచిన వేడుకన్ స్వమం
గళిగఁజిరాయువుం బడయఁగాఁగలదంచు రచించెమిత్రమా! 2.

సీ॥ నింగికంగవఁగ్రాలు నిగరంపుఁబెనుజాలు
నాలుగావడి నెత్తినాఁచెననుచు
జగములకును దుంటయగురక్కసుని యింట
నడఁకువ దాస్యంబు నడపెననుచుఁ
గయిఁబునుక వహించి మెయిఁజిలువధరించి
కిత్తపక్కిబికిర మెత్తెననుచు
తిరుడంబు విడనాడి తీరంబు దిగనాడి
క్రీడితో నని చేసి రోలాడెననుచు

గీ॥ హైమవతి శర్వునర్చింప నాత్మఁ రోసి (=పార్వతి)
హైమవతిగతిఁ నిఁ దపంబాచరించి (=కరకచెట్టు)
హైమవతియనమీయింట నవతరించి
సత్యనారాయణుని బొందుసలిపెనవఘ! 3.

చ॥ వనజహితాన్వ వాయమను వార్థికిఁబూర్ణశశాంకుఁడైనరా
మునికడగంట చూడ్కి సతమున్ ధనధాన్యసమృద్ధిఁజెందినా
తనులగు దంపతుల్విరియుఁ దావియుఁబోలె మెలంగి పుత్త్రులం
గనిచిరకాలజీవులయి గారవమొందఁదలంతు మిత్రమా! 4.

## 169. సత్యవోలు సోమసుందరరావుగారు.

వీరి నివాసస్థలము పీఠికాపురసంస్థానములోని యుప్పాడకొత్తపల్లి. ఆపస్తంబసూత్రము. భారద్వాజగోత్రము. ఆర్వేలనియోగి బ్రాహ్మణులు. తండ్రిగారిపేరు వేంకట్రాయుడుగారు. తాతగారిపేరు సోమరాజుగారు. తల్లిగారిపేరు రామాంబ. పరీధావి నామసంవత్సర కార్తిక శుద్ధవిదియ వీరి జనన దినము. వీరు సంస్కృతాంధ్ర సాహిత్యవంతులు. సరసాంధ్రకవితాచతురులు. గానవిద్యావిశారదులు. వీణావాదనప్రవీణులు. వీరు లిదివరలో చాల కాలము శ్రీరాజారావు వెంకట జగ్గారాయనింగారి యాస్థానకవులుగా నున్నవారు. వీరిచేత నిదివఱకు రచియింపఁబడిన యాంధ్రకావ్యములు :—శ్రీవామననాటకము, (అచ్చుపడినది.) 2. శ్రీరుక్మిణీపరిణయనాటకము (అచ్చుపడలేదు) 3. మాహేంద్రనాటకము (అచ్చుపడలేదు) 4. కలియుగకృతయుగవర్ణనాంశములతో నిండియుండు శ్రీజగదంబానారద ప్రసంగమనెడు గ్రంథము. దీనిని శ్రీరాజాకొచ్చర్లకోట వెంకటరామ కృష్ణారావుగారచ్చువేయించి ప్రకటించిరి. 5. శ్రీజయదేవునిచే రచియింపఁబడిన గీతగోవింద కావ్యము నాంధ్రీకరించి రాధామాధవ విలాసమను పేరఁ బద్యకావ్యముగా విరచింపఁబ

డినది. (అచ్చుపడలేదు) 6. సంస్కృతకాదంబరి నాంధ్రీకరించి వ్రాయఁబడినవచన కావ్యము. (అచ్చుపడలేదు) 7. ముచికుందోపాఖ్యానము, హరికథ. (అచ్చుపడినది) 8. శ్రీసరలక్ష్మీ శతకము. (అచ్చుపడినది) 9. కుమారశతకము. (అచ్చుపడినది) 10. చమత్కారరత్నావళి. లోకోక్తిముక్తావళి యనెడు గ్రంథము. పద్యకావ్యము. (అచ్చుపడుటలోనున్నది) 11. సూక్తిముక్తావళిని తెనిఁగించి వ్రాసిన పద్యకావ్యము నీతి బోధకము. (అచ్చుపడుచున్నది) 12. శ్రీసర్వమంగళాశతకము, 13. శ్రీరాజశేఖర శతకము మొదలుగాఁగలవి, (అచ్చుపడలేదు.) వీరి పూర్వులనివాసస్థలము జమ్మాడ. సరసాంధ్రగీర్వాణకవితాచాతురీధురీణులై జగత్ప్రసిద్ధినిగొన్న శ్రీసత్యవోలు భగవత్కవిగారు. వీరికూటస్థులు, వీరి వంశజులు, కిర్లమపూడి. మంగితుర్తి, చదలవాడ, కొత్తపల్లి గ్రామములలో నివాసస్థులుగానున్నవారు. కిర్లమపూడి సంస్థానకవీంద్రులగు సత్యవోలు కామేశ్వరరావుగారు వీరికి సహోదరులు. వీరలిరువురునించుమించుగా నాంధ్రకవితా పాండిత్యంబున సమానులై యున్నవారు.

సీ॥ జానకీకరసారసద్వయి సెయ్యావి
పద్మరాగంబులభాతినలర
రఘురాముశిరముపైఁదలఁబ్రాలుచెయ్యావి
కుందబృందములన నందమొందఁ
ఘనుఁడైనశ్రీరాము తనుకాంతియుతముల
యేయువినీలాల చాయనెసఁగఁ
గళ్యాణమణివేది గ్రాలుముసెయ్యావి
నవరత్నములరంగునంజెలంగ

గీ॥ నట్టిశ్రీరామ వైవాహికాంచితంబు
లైనతలఁబ్రాలముత్తెముల్ మానితులయి
వెలయునీదంపతులకు సుస్థిరకలన
నొసఁగి శుభదాతుకము లౌచు నెసఁగుఁగాత. 1.

సీ॥ ఏవధూవరులను సేవించువారికి
తోరణంబుల మదవారణములు
ఏవధూవరులను భావించువారికి
మందురావళినశ్వ మండలములు
ఏవధూవరులను నేవేళల భజించు
వారిగేహముల సౌభాగ్యవతులు
ఏవధూవరులను చెలిమితోఁబూజించు
వారికి సద్యశో వైభవములు

గీ॥ నెసఁగున ప్పార్వతీ పరమేశ్వరులగు
శ్రీకరీపురాణ దంపతులేక కృపను
భాగ్యభోగ్యమ్ములాయు రారోగ్యములును
నొసఁగి యీదంపతులఁ బ్రోచుచుండ్రుగాత. 2.

చ॥ శ్రీయుతయౌట హైమవతి సీతయులక్ష్మియనన్ దదీయశో
భాయుతనామధేయయగు బాలికబెండిలి యాడెసత్యనా
రాయణరావుగారుఁ జిరాయువులై తగునీవధూవరుల్
స్వీయశుభాహ్వయేశులిడు శ్రీలువహించి సుఖింత్రుగావుతన్. 3.

## 170. సత్యవోలు కామేశ్వరరావుగారు.

వీరి జన్మస్థలము (ఉప్పాడ) క్రొత్తపల్లి. నివాసస్థలము కిర్లమపూడి. ఆర్వేలనియోగులు. ఆపస్తంబసూత్రులు. భారద్వాజస గోత్రులు. రామాంబావేంకటరాయుల పుత్త్రులు. సంగీతసాహిత్య లలితకవితాధురంధరులగు సోమసుందరకవిగారితమ్ములు. వేంకమాంబాలచ్చి రాజులకు దత్తులు. రుక్మిణీపరిణయాదిగ్రంథకర్తలై ప్రసిద్ధిఁజెందిన భగవత్కవిగారి వంశజులు. రక్తాక్షి సంవత్సర చైత్రబహుళైకాదశి జన్మదినము. వీరు మొదటినుండియు శ్రీకిర్లమ

పూడిసంస్థానమునందు యాశ్రితులైయుండి తదాస్థానకవులై తత్సంస్థానాధిపతులగు శ్రీరాజాయినుగంటి బుచ్చితమ్మయ్య, చిన్నరాజు నృపాలురయాజ్ఞానుసారముగా నీక్రింది యాంధ్రగ్రంథములను రచియించియున్నారు. మఱియు వర్తమాన ప్రభువులగు శ్రీరాజా యినుగంటి వేంకట రాజగోపాల సూర్యారావుబహదరు వారి యాజ్ఞానుసారముగా మఱికొన్ని గ్రంథములను రచియించుచున్నారు. వీరు రచించిన గ్రంథములు:—1. విశ్వగుణాదర్శనము, (వచనము, వేంకటాధ్వరికవి గ్రంథమునకుఁదెలుఁగు) 2. ఋతుసంహారము, (కాళిదాస ప్రణీతగ్రంథమునకుఁదెలుఁగు) 3. శ్రుతికంఠోపాఖ్యానము, (స్వకపోలకల్పితము) 4. రతిమన్మథనాటకము, (పండిత జగన్నాథకవి గ్రంథమునకుఁదెలుఁగు) 5. కాదంబరినాటకము, (బాణకవికాదంబరి నుండి తెలుఁగు) 6. మఱికొన్ని చిల్లరలు, జార్జిపట్టాభిషేక వర్ణనాదులు.

ఉ॥ ఒండొరులందుఁ గూర్మియును నోర్పును నేర్పునుదాసదాసికా
మండలి పైదయారసము మానితసంతతి సౌఖ్యమున్ సిరుల్
పండితబంధుమిత్రె గురుభక్తిచిరాయురశోగతల్ ముకుం
దుండిడుఁగాత మీకెపుడు నూత్నవధూవరులార! కూరిమిన్. 1.

చ॥ వదనమునందుదృష్టులిని వామశరీరమునందమందమా
ముదమున వాగ్రమాంబికలఁ బూనిపరస్పరరాగమెంతయున్
విదితముసేయు పద్మభవవిష్ణు మహేశులహీనసర్వసం
పదలిడిమీకు నొండొరులపైనను రాగముఁగూర్చి ప్రోచుతన్. 2.

## 171. కవితార్కిక సింహవేంకట వరదాచార్యులుగారు.

వీరి నివాసస్థలము కాంచీపురము. శ్రీవైష్ణవ వడగల ఆచార్యపురుషులు. శ్రీవత్సగోత్రము. ఆపస్తంబసూత్రము. యజుశ్శాఖాధ్యాయులు. వీరి పితామహులు వెంకట రాఘవాచార్యులవారు. వీరి జ్యేష్ఠభార్యా కుమారులు

శ్రీనివాస రాఘవాచార్యులవారు. వీరి తండ్రిగారు, వీరిరువురును జీవించి యుండడమువలన నిర్దతి నామధేయములును వ్రాయడమయినది. తల్లి శ్రీని వాసమ్మ. శ్రీతిరుమలై నల్లాన్ శ్రీవైష్ణవ చక్రవర్తి కవితార్కిక సింహస్వామి వారి వంశము శ్రీముఖసంవత్సర మిథునశుక్ల దశమి జన్మదినము. ఆంధ్రగీర్వా ణములయందు, ఉభయ విశిష్టవ్యాకరణముల యందును, సంస్కృత కవిత్వము నందును ప్రవీణులు. తిరుపతి సంస్కృత విద్యాకల్పవల్లీ పాఠశాలయందలి శ్రీనివాస తాతాచార్యులవారు, వైయాకరణ శ్రీనివాసాచార్యులవారు, కాళ హస్తి సంస్థానాస్థాన పండితులగు లక్ష్మీనరసింహశాస్త్రులవారు వీరికి విద్యాగు రువులు. వీరి పూర్వీకులు నైజాం యిలాకా జడ్ప్రోలు సంస్థానం రాజ గురు వులును, ఆస్థాన పండితులును, కార్వేటినగరం సంస్థానాస్థానపండితులును, వీరిపితామహులును దండ్రిగారును, మహారాజ రాజశ్రీబ్రహ్మశ్రీ వడ్లమన్నాటి వేంకటాచలము పంతులవారియొద్ద నాస్థానపండితులు. వీరు 22 సంవత్సర ములనుండి కాంచీపురము మిషన్ హైస్కూలునందలి సంస్కృతపండితులు. వీరు రచించిన గ్రంథములు:—సంస్కృతమున, 1. శ్రీవేణుగోపాల శత కము, 2. వరదరాజసప్తతి, 3. భాగవత దశమస్కంద సంగ్రహముగు శ్రీకృ ష్ణమంగళము, 4. యతిరాజస్తవము, 5. శ్రీరామానుజులవారి చరిత్రసంగ్ర హము, ఆర్యావృత్తాత్మికము, 6. దశావతార స్తోత్రము, 7. కల్యాణ వేంక టేశ సుప్రభాతము, 8. పద్మావతీ పంచరత్నము, 9. యథోక్త కారిస్వామి సుప్రభాతము, 10. వేదాంత దేశికులవారి సుప్రభాతము, మొదలగునవి. ఆంధ్రమునఁ బద్మావతీ పరిణయము, వచనము, కాంచీపురాణము వచనము, జగన్నాథ మాహాత్మ్యము మొదలగునవి.

శ్లో॥ సౌవర్ణతి మనోరమేమణిమయే కల్యాణసన్మండపే
సర్వత్ర ప్రతిబింబితాంజనకజాం పాణౌగృహీతుంముహుః
సంయుస్యన్నపి నవపేలాజనకే రాజ్ఞీర్దిశ్యమానాంకరే
గృహ్ణాస్త్వాశరథి స్సదానతుముదా దోదండపతీమాతనా. 1.

శ్లో॥ నారాయణో వేంకటసత్య పూర్వో
పరశ్చనధ్వా సహహైమవత్యా
ఆరోగ్యయుక్తం మహితంచదీర్ఘ
మాయుష్యమాప్నోతు సుతాంశ్చ సుష్ఠూన్. 2.

శ్లో॥ పధూవరౌ హైమవతీచదేవీ
నారాయణో వేంకటసత్యపూర్వః
సదాశచీంద్రావివ నిత్యభోగ
యుక్తాముదాస్తాం మహదీయ వేషా. 3.

శ్లో॥ శ్రీమద్ధైమవతీచ వేంకటపతి శ్రీసత్యనారాయణ
శ్చోభౌ శ్రీరతిమన్మథావివమహా సారూప్య సంపద్యుతౌ
ప్రీత్యుత్కృష్ట సమన్వితాచసతతం శ్రీరోహిణీందూయథా
రాజంతౌరమయాయుతో పరదిరాణ్మన్నాయకో రక్షతు 4.

శ్లో॥ కరిగిరినాథో దేవః కమలాజానిః కృపాపయోరాశిః
కలయతుతుకుశలం నవయోర్వరవధ్వో రేనయోస్సుభూషితయోః.

శ్లో॥ శ్రీకవితార్కికసింహ శ్రీవేంకట వరదచక్రవర్త్యార్యః
అకరోదాశీర్వాద శ్లోకాత్మక పంచరత్న మిదమగ్ర్యం. 6.

## 172. పాగనంది రామశాస్త్రిగారు.

వీరినివాసస్థలము పర్లాకిమిడి రాజధాని. వరుకాసలనాటి వైదికులు. ఆశ్వలాయన సూత్రము. కాశ్యపగోత్రము. తండ్రి ముఖలింగేశ్వరుడు గారు. తల్లి రామలక్ష్మమ్మ. పరీధావి సంవత్సర శ్రావణ శుక్ల నవమి జన్మదినము. వీరు ఆంధ్రగీర్వాణములయందునుభయవ్యాకరణ సమ్మితమగు సాహిత్యము కవిత్వమందును ప్రశస్తికలవారు. వీరియొద్ద కెక్కండ్రు ఛాత్రులు

కృతార్థు లయినవారు కలరు. వీరు బొబ్బిలిసంస్థానపండితులగు బ్రహ్మశ్రీ ముసల్లసీతారామశాస్త్రుల వారియొద్ద న్యాయవేదాంతములఁ జదివినవారు. పర్లాకిమిడిరాజకీయాంగ్లేయ పాఠశాలలో సంస్కృత ప్రధానోపాధ్యాయులు గాఁజాలకాలముండి ప్రస్తుతము సంస్థానపండితులుగానున్నవారు. వీరురచించి నగ్రంథములు:—సంస్కృతగ్రంథములు:—1. మధుకేశ్వరీయనాటకము, 2. ద్వైతాద్వైత సారాదర్శము, 3. శ్రీశంకరాశయా ఽఽదర్శమును భగవద్గీతాటిప్పణము, 4 కన్యావివాహావయః కాలనిర్ణయము, 5. సంక్రాన్తిపుణ్యకాలవివేచనము. తెనుఁగు గ్రంథములు:—1. ఆంధ్రమహాభారత విమర్శము, 2. భగవద్గీతార్థవిచారము, 3. స్త్రీపునర్వివాహవిధిజిజ్ఞాస. 4. స్త్రీపునర్వివాహఖండనము.

శ్లో॥ అర్ధాంగీకృతదంప తిత్వవిభవావత్యంత రాగాన్వితౌ
సంశ్లిష్టౌమనసాన కేవల మహోతన్వాపియావాదిమౌ
నామ్నా చాపిగుణేనలోక విదితౌ దేవౌశివౌదంపతీ
దంపత్యోర్వరము యోస్సదావితను తామవ్యాహతంమంగళం 1.

శ్లో॥ పాణౌగృహీతేయ ముదారభావా
వధూర్గృహీత్రాసహ మోదతాంచిరం
ముఖేగృహీతోరసివాగృహీతా
తనాగృహీతేవచ సర్వమంగళా. 2.

## 173. ఆలూరు వాసుదేవయ్యగారు.

వీరి వాసస్థానము చంద్రగిరితాలూకా పాకాలపేట. ఈపాకాలపేటకుఁబశ్చిమదిశగ నేడుమైళ్లదూరంబునను గార్గేయాశ్రమంబునకు నీశాన్యభాగంబుగనుండు పొల్కలయనుగ్రామము జన్మస్థానము. వీరుములికినాటి వైదికులు. ఆపస్తంబసూత్రము. కాశ్యపగోత్రము. తండ్రిరామ కృష్ణదైవజ్ఞులు. తల్లికృష్ణాం

బ. ప్రభవసంవత్సర జ్యేష్ఠశుద్ధ చతుర్దశ్యనూరాధనక్షత్రాన్వితజన్మదినము. వీరు జ్యోతిషాంధ్రములయందు సమర్థులు. వీరు రాయవేలూరు వూర్హీస్ కలేజియందుఁ బ్రధానాంధ్రోపాధ్యాయులు. వీరు రచించిన యాంధ్రగ్రంథములు:—1. జ్యోతిష్కల్పద్రుమము. 2. శ్రీసిద్ధేశ్వరీయము. 3. కాణిపాకపురీమాహాత్మ్యము. 4. ఖాదిరిపురీమాహాత్మ్యము. (ఇవి పద్యకావ్యములు) 1. చంద్రరేఖ, 2. చంద్రసేనవిజయము, 3. మలయమారుత, 4. మరుద్వతి, 5. శాంతమతి, 6. మదనవతి, (ఇవిగద్యకావ్యములు) 1. మిత్రరంజని, (గానయుక్తమగు నవీననాటకము.)

## ఉ త్ప ల మా లి క.

శ్రీయుఁ బతీమణింబొదలు ప్రేమనురోమణి యందువందముం
బాయక చూచుకొమ్మను నుపాయమునందన యంకపీఠికిం
దీయఁగఁజూచి లేనగవుతీరు మొగంబుఁ దురుంగలింపనా
రా! యనురాగమంచును గరంబుప్రియంబున మేనమాడవా
త్మీయముదంబుచిత్తమునఁదేలఁగ మెచ్చుచతుర్భుజుండుభ
ద్రాయతకీర్తిమూర్తివర హైమవతీ జయలక్ష్మిసత్యనా
రాయణరావులందయను బ్రాభవకీర్తిప్రశస్తివిద్యదీ
ర్ఘాయువుభోగభాగ్యములుఁ బ్రాకటపుత్త్రసమృద్ధిధైర్యముల్.
ధీయుతొసంగుఁగాత జగతింగృతకృత్యులఁ జేసియెప్పుడున్. 1.

## 174. ముడుంబ దొడ్డయాచార్యులుగారు.

వీరి నివాసస్థలము తాళ్లరేవు కేశవపుర అగ్రహారము. శ్రీవైష్ణవ బ్రాహ్మణులు. ఆశ్వలాయనసూత్రము. శ్రీవత్సగోత్రము. నరసింహాచార్యులుగారికి ఔరసులు. శేషాచార్యులుగారికి దత్తులు. తల్లి వెంకటాంబ. క్రోధనసంవత్సర శ్రావణబహుళ త్రయోదశిజన్మదినము. ఉభయభాషా పరిజ్ఞానులు. ఆంధ్రకవి

తాధురీణులు. కవితావిష్యైకకల్పలతాద్యనేక పారితోషికగృహీతలు. వీరు ప్రస్తుతము తాళ్లరేవుబోర్డు పాఠశాలాప్రధానో పాధ్యాయులు. వీరు రచించి నవి:—పద్యగర్భిత ముకుందశతకము. కొన్ని పాఠశాలా పఠనీయాంధ్రగ్రంథ ములు, మఱికొన్ని చాటుధారలు.

ఉ॥ శ్రీమహితుండు మంత్రికులశేఖరుఁడార్యుఁడు శ్రీభుజంగరా
డ్ధీమణిముద్దుకూఁతురు సుధీనిధి రాజిత సుందరాంగియౌ
హైమవతీ వధూమణికి నార్యయు, వాణియు, నాదిలక్ష్మియుం
ప్రేముడినాయువున్ సకలవిద్యలుసంపదలిచ్చిప్రోవుతన్. 1.

గీ॥ ప్రథితవేంకటసత్యనారాయణాఖ్యుఁ
డవి, మనసిజార్య, ఘన, వజ్రి, రవులధైర్య
రూప, మతి, దాన, విభవసద్గుణములమించి
తనరుఁగావుత నాచంద్రతారకముగ. 2.

క॥ ప్రోవుతననయంబునుభువ
నావనశీలుండు శౌరి హైమవతీసీ
తావిజయలక్ష్మి సిరులన్
దైవారుగుణాఢ్యు సత్యనారాయణునిన్. 3.

సీ॥ ఈవధూవరులువాణీ విధాతలఁబోలి
కళలనాయుర్వృద్ధి వెలయుఁగాత
ఈసతీపతులు శచీంద్రులఁబోలిసు
పుత్త్రవైభవములఁ బొరయుఁగాత
ఈదంపతులుపార్వ తీశానులనుబోలి
పతిభక్తిసతిరక్తిఁబడయుఁగాత
ఈయాలుమగలెప్డుఛాయారవులఁబోలి
పతిచేరికనుగాంతి వఱలుఁగాత

గీ॥ అనుమంగవులును బండితులార్యసమితి
వేడ్క హైమవతీసీత విజయలక్ష్మి
రమ్య వేంకట సత్యనారాయణాఖ్య
పరుసనాశీర్వదింపంగఁ బ్రబలు గాత. 4.

సీ॥ వివిధశాస్త్రపురాణ విజ్ఞానులొకవంక
నొకవంక వేదపాఠకచయంబు
సకలతత్త్వరహస్య సంవేదులొకవంక
నొకవంక సత్ప్రబంధకవితతియు
ప్రకటగీతాశాస్త్ర పరిచితులొకవంక
నొకవంక వందిగాయక జనంబు
ప్రథితబాంధవమిత్రవర్గంబు లొకవంక
నొకవంక ముదుసలియువిదగణము

గీ॥ చెలఁగి యొకమొగి నాశీర్వదింపఁదనరి.
వేడ్క హైమవతీ సీతవిజయలక్ష్మి
ప్రథితవేంకట సత్యనారాయణమిథు
నంబులక్ష్మీహరులఁబోలి దంబుమీఱతి. 5.

## 175. యగళ్లజానకీ రామయ్యగారు.

వీరి నివాసస్థలము గంజాముమండలమువందలి పాతటెక్కలిగ్రామము. ఆంధ్రకళింగులు. మౌద్గల్యస గోత్రము. తండ్రిబలరామయ్యగారు. తల్లిమహాలక్ష్మమ్మ. శ్రీముఖనామసంవత్సర శ్రావణబహుళద్వాదశి (1873 సంవత్సరము ఆగస్టు 19 తేది) జన్మదినము. ఆంధ్రగీర్వాణములయందును వ్యాకరణ విశిష్టమగు నాంధ్రసాహిత్యము నందును, అచ్చాంధ్ర, మిశ్ర, కవిత్వములయందును, ప్రవేశముగల భాషయం దష్టావధానముచేయుట యందును, ప్రవీణత

గలదు. మఱియునాంగ్లేయ భాషయందును, ఓ.ధమునందును, వ్యావహారికోచిత పరిజ్ఞానముకలదు. పాతబెక్కలి గ్రామమునకు గ్రామాధికారి పదవియందుండు ఇనాముదారులు. వీరు రచించిన గ్రంథములు:—సీతాకల్యాణనాటకము, 2. సావిత్రీనాటకము, 3. రాజరాజేశ్వర విజయమను నామాంతరముగల శ్రీపంచమ జార్జిచక్రవర్తి హిందూదేశాగమనము, 4. జంఝూమరుత్పంచాశతి 5. ఈశ్వరాభ్యుదయతారావళి, 6. దీనమందారశతకము, 7. శ్రీకృష్ణశతకము, 8. కాముకీవిలాసము మొదలగునవి.

శా॥ శ్రీవాణీ గిరిజాసరోజముఖులర్థింగోర్వఁగారుణ్యలీ
లావిర్భూతదృఢానురాగమునలోకాఘంబులంబ్రోచునా
శ్రీవిష్ణ్వంబుజ గర్భశంకరులు లక్ష్మీసుస్థిరాయుస్సుఖ
త్వావాప్తిన్ వెలయింతురిమ్మిథునముం బ్రాంచద్విభాధన్యమున్.1.

సీ॥ అనుకూలదాంపత్యములపడుఁగాతయీ
మంగళాంగికి జగన్మంగళునకు
సంతతామోదంబు సమకూరుఁగాతయీ
సుందరీమణికి నీసుందరునకు
వితతసౌభాగ్యంబు వెలయుఁగావుతమయీ
రామకుసుగుణాభిరామునకును
సత్సంతానాప్తివిస్తరిలు గావుతమయీ
యంబుజాక్షికి నంబుజాక్షునకును

గీ॥ సకలలోకప్రశస్తనిస్తంద్రసాంద్ర
విభవశుభలాభ విజయగభీరసార
సుగుణములుగల్గుఁగాత భూసురులకృపను
హైమవతికి నీసత్యనారాయణునకు. 2.

ఉ॥ ఇయ్యిలలోనదంపతులకెయ్యది కల్గినఁదల్లిదండ్రులున్
నెయ్యురుగారవింతురు మనీషిజనంబు ముదంబునొందు నా
తియ్యమునొంకొరుల్గని నుతింగొనపీరికి సమ్మదంబునై
నియ్యెడఁగల్గుసభ్యకవి బృందము దీవనలిచ్చుఁగావుతన్. 3.

చ॥ చెలువునిచిత్తపద్మమునఁ జేరినిజేశుని ముద్దుపల్కుచా
యలనెలప్రాణనాయకుని యర్ధశరీరమువై మహోన్నతిన్
వెలయుచుఁదల్లిదండ్రులకుఁ బ్రీతియొనర్చుమ యబ్జపాణిమం
జులకలహంసికాగమన శోభిని హైమవతీ శుభాకృతీ ! 4.

మ॥ అగజాశంకరులర్ధిమైనొసఁగు దీర్ఘాయుర్బలంబందిస
త్త్వగరిష్ఠుండగునంతకుంగెలిచి నితండ్రిన్సమస్తార్థపా
రగునింజేసిన యిష్టదైవతము మార్కండేయమానీంద్రుఁ డొ
ప్పుగనీకిచ్చుఁజిరాయురున్నతుల నుత్ఫుల్లాబ్జపత్రేక్షణా ! 5.

ఉ॥ అచ్చపుభక్తితోడి వినయంబు నయంబెనయన్ సతీజనం
బచ్చెరువందఁగొల్వు మనయంబిలువేల్పుల నత్తమామలం
బొచ్చెములేనికూర్మి సరిబోటులఁజూడుముపుట్టినింటిపెం
పచ్చుపడంబ్రశస్తిఁగొను హైమవతీ ! సుమతీ ! శుభాకృతీ ! 6.

సీ॥ గృహకృత్యములునిర్వహింపు మింపునఁదేలి
సద్గుణశాలి పాంచాలిఁబోలి
కైసేయు ముజ్వలాంగికముల రకముగాఁ
దరళాక్షిరుక్మిణీ తరుణికరణి
పతియెదైవంబను పల్కెదవాటించు
నూటిగాసీతావధూటి సాటి

రమణుఁడు స్వవశవర్తనుఁడుగా మెలఁగుమో
కమినిసాత్రాజితీ రమణరమణ

గీ॥ వర్ణమన్నాటి వంశపావనుని ఘనుని
సత్యనారాయణుని జనస్తుత్య గుణుని
రాణివై ప్రాణిలోకకల్యాణి వగుము
సుమతి ! హైమవతీ ! నుతసుగుణ నిరతి. 7.

సీ॥ పాలింపుఁడనరేలు ప్రజలనిక్కట్టులఁ
బొరయకుండఁగ దయాపరత మెరసి
యలరింపువివిధ దేశాగత బుధకోటిఁ
దద్దయువాంఛితార్థంబులొసఁగి
పోషింపుమఖిలభాషానవధూమణి
నవపద్యహృద్య విద్యానిరూఢిఁ
క్షేమింపుమలేక బీదసాదులఁ దన
దేశాభిమానంబు తిరము కొలిపి

గీ॥ మంత్రిపెగ్గడ వంశసంభవ భుజంగ
రావ్ బహద్దర్ జమీందార్ విరాజమానుఁ
డతనిసుతకు బుద్ధులుసెప్ప నవసరంబె
సుమతి సీతావిజయలక్ష్మి సుగుణనిరతి. 8.

సీ॥ తులలేనిరతనాల తొడవులు నెమ్మేన
నమునగు నెడల విన్ననువుసెరప
బంగరువుంబూలఁ బనిదేరుచీరకు
చ్చెరులు మీగాళ్లపై జీరుకాడఁ
గురులముందరనడఁకునఁ జూపునుసిగ్గు

నగుమోమునకు వింతనగనిగుడ్పు
సేమములొప్పనరుచు నెతిదిద్దు పున్నెపు
పొలఁతుకల్ కేలఁకులఁ బోడివిరొనఁగ

గీ॥ విభునితోడ వైవాహిక వేదిమీఁద
సొంపుగను నీదు పెంపు వర్ణింపఁగలిగెఁ
గవిజనంబుల కిట్టి భాగ్యంబుగలదె
సుమతి సీతావిజయలక్ష్మి సుగుణనిరతి ! 9.

ఉ॥ నెయ్యమెసంగ మీకొసఁగు నిర్మలకాంచన రత్నరాసులం
దొయ్యలులన్ సుగంధములఁ దోరపుటూళ్లుల నంబరంబులం
దియ్యనిపండ్లతోఁటలును ధేనుగజాశ్వ రథాళినెప్డుమీ
యయ్యభుజంగరాణ్ణృపతి హైమవతీ ! సుమతీ ! శుభాకృతీ !

## 176. వీటూరి వేంకటరామ శాస్త్రిగారు.

వీరి నివాసస్థలము యలమంచిలి తాలూకాలో చేరిన కొరుప్రోలు. ఆపస్తంబసూత్రము. భారద్వాజ గోత్రము. తండ్రి నాగేశ్వర శాస్త్రిగారు. తల్లి పద్మాంబ. తెలుగాణ్య వైదికులు. భావ సంవత్సరాషాఢ శుక్ల పూర్ణిమజన్మ దినము. వీరు యజుర్వేదమందు, ఆంధ్రగీర్వాణ సాహిత్యముల యందు, ముహూర్త జాతక సిద్ధాంతముల యందును, ఉభయశవిద్యల యందును, ఆంధ్రగీర్వాణ పురాణశైలియందును ప్రవీణులు. ఉర్లాముసభ యందు సంపూర్ణయజుర్వేద పఠనమందు యోగ్యతాపత్రికను పొందినవారు. ప్రస్తుతము గతించిన మహారాజశ్రీ పెద్దగుమ్మలూరు ప్రొప్రయిటరు ముంగమూరు మంగయ్యపంతులుగారు గవర్నమెంటువారి యనుమతినిస్థాపించిన వేదసంస్కృత పాఠశాలయందు వెనుక నుపాధ్యాయులు. ప్రకృతము గొలుగొండ తాలూకా ముస్తాదరులు యీనాందారులునైన బ్రహ్మశ్రీ రాఘుమూడి

## 177. భమిడిపాటి అయ్యప్పశాస్త్రిగారు.

వీరు ఉభయభాషాప్రవీణావధానకవులు. కృష్ణాజిల్లా భీమవరము తాలూకా పర్ణపురము (ఆకుగీడు) అనునది నివాసస్థానమైనను వీరి జనకులు వీరి జననమునకుఁ బూర్వము కృష్ణాజిల్లా గుడివాడ తాలూకా సిద్ధాంతాగ్రహారమును నివాసముగా నేర్పరచుకొనిరి. వెలనాటి వైదికులు. ఆంగిరస, బార్హస్పత్య, భారద్వాజ ఋషిత్రయ ప్రవరాన్విత గార్గ్యస గోత్రము. సుప్రసిద్ధసాంగవేదాధ్యయనపారీణానుక్రమణిక మగుపైతృకము. సుప్రసిద్ధ శాస్త్రపారీణానుక్రమణిక మగుమాతృకము. తండ్రి భమిడిపాటి అయ్యప్పావధానులుగారి కుమారులును, ఉర్లాముసంస్థానముఖ్య వార్షికహర్షకులునగు సుబ్బావధానులుగారు. తల్లిమద్దూరిసర్వభట్లశాస్త్రిగారికుమార్తె యగు గౌరమాంబ. తమ్ముఁడు కామేశ్వరరావుగారు ఆఱుగురు చెల్లెండ్రు. తరుణి, మాతృకానుక్రమణికాంచితు లగు మద్దూరి అచ్యుతరామశాస్త్రిగారి కుమార్తె యగు పేరమ్మ, తనయుఁడు, అచ్యుతరామశాస్త్రి. సర్వధారి సంవత్సర ఆషాఢ శుక్లసప్తమీ ఆదివారము. (15-7-1888)జన్మదినము. కొంతకాలము వేదాధ్యయనముం జేసిరి. గుడివాడ తాలుకా అంగళ్లూరు(అంగలూరు)బోర్డు ఎలిమెంటరీస్కూలునందు మాస్టరుగా నున్నారు. వీరు రచించిన గ్రంథములు ;—సంస్కృతగ్రంథములు, 1. రామతారక తారకావళి, 2. హనుమద్విజయము, ఆంధ్రగ్రంథములు, 1. రామశతకము, 2. నాగేశ్వరశతకము, 3. భక్తిరసప్రధాన కీర్తన శతకము, 4. మీరాబాయి చరిత్రము, (హరికథ) 5. అనిరుద్ధ వివాహము (నాటకము) 6. ఆంధ్ర రఘువంశము, (కావ్యము) 7. అన్నదానమహిమ, (వచనము) 8. భారతమును హరికథా పంచకముగాఁ జేయు చున్నారు.

శ్లో॥ శ్రీపద్మాంతః ప్రచారార్క కుసుమ శరతాత స్థిత స్థిత్యుదారా
భుక్తిప్రాధాన్యముక్తి ప్రదవిశద ధరాధీశ శ్రీశక్తిబీజః

జంత్రప్రాపీణ్య సర్వప్రథితముని నరాహీన హీనప్రకోపా
గమ్యప్రస్థానవిఘ్నఘ్నిరకరనరశో భావుభానద్య పాతు.

ఈ శ్లోకము నాలుగు చరణములయందలి యాద్యంత్యాక్షరములు "శ్రీభుజంగరాజఃపాతు" అని వచ్చునట్లు రచింపఁబడినది.

## వృత్తానేకగర్భిత సీసమాలిక.

వినుత సర్వాశ్రిత ప్రణవపోషితహిత సనజాసనవర శోభనుఁడఁ బొందు
వేంకటాశ్రమ నిగమాంక భాసకలోత్రజపచతుర్భుజ మహాశక్తిహరియు
కక్షితదుర్మ్రక్షితక్షు కశ్యపముఖమునివిరాజిత తపోధనుఁడు హరుఁడు
టంకారఘుంకార చంక్రమఃవినూత్న శైశాలవిలసిత వాక్పృతియును
సత్యవర్తనవిదా మాన్యపోషితగణేమూత్రవికాసిత మిత్రలక్ష్మి
త్యజనదుష్ప్యాపవర్గ జనితశోకవార్యచతుర కార్యవిహారగౌర
నాకజనేడ్య వశీకృతభారత ముఖ్యమానవ ధర్మమోహమతులు
రాజవిలాసనద్ధమనః ప్రచారిత గోత్రభిద నిరూఢిగుణవినతులు
యవరచితవిశుద్ధ బలిహితవచనసో మేష్టిసాధితవిధుఁ డిష్టకార
ణవరవిదతినద్భుహం నసనవప్నృదయా ధిష్టితార్జనవిధతిలకుఁడున్ వి
రాజ్యమానితబహుళ జ్యాధినాయకా కరవిశ్వసర్వ ప్రకారగురుఁడు
వుంజిత్సనరిత ప్రపంజరాత్మకమహా ముక్తియుక్తవిసేతిశక్తి తతులు
నుదససంతోషవాచ్ఛదయ శోననహారి పుస్తకదైవికాపాస్తిమతులు
హైరసర్వమణి సమీరిత సర్వపో హ్యత్వసము జసచతురరతులు
మహుదన్వవాయ స్థగురుడు విపావశ రాసనశస్త్రిఁ దుపాసమతులు
వృథకార్యసారుగ్ధ రసకలభా గజనివేదితవైరి కార్యభార
తీర్థసమానవామర్ధిత పశదనేముదుజాచిన పాత్రితటిదరవాస
సిద్ధితపాపవాఖార్ధ విదళనసీమగురుండ నటనెంచు మహాత్ముఁడున్ గ
తార్ధసమాననా తుర్ధనశివనతారకమంత్ర విధిరాప్తగంగఘనుఁడు

విశ్వతవైరా కలాశ్వకారణమహా కవిసుశాస్త్రత్వ సంకాశ మేశ
జక్రిత సామ్రాజ్య వాక్రయశస్సునీ తవిచరత్రీప్రలోక్యజయవనయాత్ర
యమితసర్వ స్పృహాహ స్తభాసురమహీముఖరమిత్రస్వరామోదితావి
లసితసత్వాశ్రితముస లక్ష్యపాశ్రిత మాశిరక్షత్వభాసాశనాప్త
క్షుత్త్యజాతిశయాధి గమ్యసుకస్వవైణికవాదసంచయ నిత్యగురులు
మత్యనూన విలాసమాధన మారలౌక్యవివర్ధితాళి న్యాయ్యకులు వరులు
నుత్యధిష్ఠిత వీరనూతన మోదకీ ముఖరాంచితక్షితి ముఖ్యములును
శ్రీత్యగుర్విత సారసేవిత శిష్టతానీకవిదుర్జయుల్ నియమములును
వరితమిత్రమృగాంక వాసవవారిజాలఘుపీఠకాది దైవఘనభములు
రరిత దైవతయోగ రాజితరైనిశాముదితాంచితాప్త సంపదశుభములు
దురితమారుతభేద దూరవిదూరకూ పవిశాలపాంథ స్తన్యకరణములు
డురితసారస సారడోల విదుత్తమా వనసర్వుడున్ రాశిఘనవితతియు
పద్మప్రియుడు శశిభోముండునున్ బుధుడమరగురుడు గురుడడు
[సురగురు
రిక్కగవియుశని యుక్కవిండరుక్కసోముని సేమ రాహువింకను ధ్వ
[జుడుం
పాపస్వభావంబు గోపస్వభావంబు ముష్కరభావంబు మూఢబుద్ధు
లిందుండనీ కసర్వేప్సితభాసస త్యప్రచారకులయి ధరణిదనుపు
చును నీవధూవరులను ననుపమగుడి ముఖగడిసం శీలవిఖులులుగను

గీ॥ గారవింపుచుం బ్రోతురుగాక వేద
శాస్త్రగీతాదిసర్వ భాషావిశేష
తమఘనం బైన నీసభాశ్రమవిలాస
లక్ష్మియశమును హెచ్చించు లలితముగను. 2.

ఈ సీసమాలిక ప్రతిపాద మందలి మొదటి యక్షరములను జదివిన
యెడల " వి, వేంకటసత్యనారాయణరావును, హైమవతీ సీతావిజయ లక్ష్మి

మను శ్రీ వరగుఁడు పరిపాలించుఁగాత" అనియు, ప్రథమదళముయొక్క యతిపర్ణములను జదివిన యెడల "ప్రమాదీచమార్గ శీర్షబహుళ పంచమీ గురు మఖాతులావాహము" అనియు, రెండవదళముయొక్క ప్రథమాక్షరములు చదివిన యెడల, "వజ్రము, వైడూర్యము, గోమేధికము, పుష్యరాగము, మరకతము, మాణిక్యము, నీలము, పవడము, ముత్యము" అనియు, రెండవ దళముయొక్క యతిస్థానాక్షరములను నాలుగు చరణముల కొక్కొకటి చొప్పునఁదీసి చదివినయెడల "భమిడిపాటి అయ్యపకవి" అనియు వచ్చునట్లు వ్రాయఁబడియున్నది.

శ్లో॥ శ్రీహేరంబగణాధి నాయక మహాశీస్సంయుత స్థైర్యసా
కర్తృప్రీత సమస్తసాధు సుగుణాతీత స్తవాక్రాంతధీః
రత్నస్థాపితరౌప్యచిత్రిత మహాపీఠస్థితా ర్యాదృతః
ముక్తిప్రాభవకారణః ప్రశమితాతౌకుర్వతు ప్వామినా. 3.

ఉ॥ అవనిసమస్తజీవముల హర్షముతో సృజియించు చుండి న్యా
య్యవరపథంబునంగు జయ మందుచు మోదముతోడ నెప్పు డో
ప్పవదనమందు వాణి వరభక్తుల కిష్టము లిచ్చు చుండు నా
క విహితధాతృసత్కృపను గాంతురు విద్యల నీవధూవరుల్ 4.

చ॥ వినయము సత్యశీలవము వీర్యము విత్తము బుద్ధి శాంత మీ
రనయముఁ గూడియుండుటయు హర్షము సత్సుతవృద్ధి గాంచి నూ
చివయము సర్వశక్తియును శ్రీహరిసత్కృపఁ బొంది పాధుచిం
తనయములై యజస్రమును ధన్యత్రశ్రేయముఁబొంది యుండుతన్.5.

చ॥ పరమముదంబునన్ హరుఁడు పార్వతినిం గని మున్ను నిన్ గజా
ద్యరివరులన్ జయించుటను దగ్గిలి శక్తినిఁ నాగ గౌరి దా
ముఱియుచు శక్తియై పతికి మోదముఁబెంచెను శీతదృష్టి మే
లురుతరశక్తి సత్కృప నొహొ యనఁ బొందుదురీవధూవరుల్ 6.

శ్లో॥ విభుధేశాది ప్రశస్తాస్సకలముని వరాశ్శేషముఖ్యాదిశిష్టాః
జరహీనాస్సర్వదేవాః కలిరహితజనాస్తార కాస్సిద్ధయోషాః
యమితౌకన్యావరౌతౌ కవిహితమనసౌ సిద్ధకార్యావిదోషౌ
ముదితౌవీరౌప్రకుర్వంతు రహితకఠినౌ మంత్రసిద్ధాప్రసిద్ధా. 7.

ఈ పయిశ్లోకములు బద్యములును, అయిదింటి ప్రతి చరణాక్షరములను జదివినయెడల, "శ్రీకరము, అయ్యప్పకవి రచితపద్యములు. విజయము" అని వచ్చునట్లు వ్రాసియుండిరి.

## 178. చక్రవర్తుల కృష్ణమూర్తి సిద్ధాంతిగారు.

ఉ॥ శ్రీసతిపాదసేవనముఁ జేయుచు నుండఁ బయఃపయోధి పై
భాసురలీల శేషఫణిఁబండిన శ్రీహరి సర్వమంగళా
వాసదృగంచలంబునఁ గృపామతితో శతవత్సరంబు సెం
తో సిరులిచ్చి నిత్యము పధూవరులం దగ నేలుఁ గావుతన్.

శా॥ శ్రీశెల్వారఁగ సూక్ష్మరేణువులలో శీతాద్రిలో శాల్మలీ
భూజంబందుఁ దృణంబులో నరలలోఁ బొల్పారు చల్పీమలో
తేజం బొక్కటి యై తనర్చునెవఁ డద్దేవుండు సంప్రీతుఁ డై
యోజన్ సాకెడుఁగాక దంపతుల శ్రేయోభీష్టసంప్రాత యై 2.

ఉ॥ శ్రీలలరన్ సువాసినులు జేతులనారతులెత్తి పాడఁదూ
ర్యాళులు మ్రోగభూసురులరావ మెసంగఁగ స్వస్తిఁజెప్ప సీ
తాలలనామణిన్ గదుముదంబునఁ బెండిలియాడురాముఁ డీ
బాలలనూత్న దంపతుల బాగుగఁ జేయుత సర్వకామమున్. 3.

చ॥ మసెదరుగాక ! చుక్కలుహిమాంశుఁడు మింటఁ జరించునంతకుం
గసెదరుగాక ! చెక్కరసుఖంబుగ నారఘునాథుకైవడిం

దినెదరుగాక! శ్రీరయుత దివ్యరసంబులఁ దృప్తిదీరఁగన్
వినెదరుగాక! దీనజనవేదన సాదరయుక్త చిత్తులై. 4.

ఉ॥ చుట్టములెల్లరుం గలసి చూచుచు నుండఁగఁ గాన్కలెన్నియో
బెట్టుదు రట్టి చేయుటకు విప్రుఁడఁ గావున సాహసంబుతో
దిట్టలనూరకుండఁగ నెద్దైనను గట్నమొసంగ నెంచి నే
నిట్టులఁ బద్యరత్నములనిచ్చితి నూత్నవధూవరుల్ గొనన్. 5.

## 179. భమిడిపల్లి సీతారామకవిగారు.

వీరు, ఉభయగోదావరీ మధ్యదేశంబున, ఆత్రేయపుర గ్రామమున జన్మించిరి. కాసలనాటి బ్రాహ్మణులు. భారద్వాజ గోత్రులు, ఆపస్తంబ సూత్రులు. సుబ్బారాయకనకాంబలకుఁ దృతీయ పుత్త్రులు. జననము, 10-4-1882 సంవత్సరము. సంస్కృతాంధ్ర భాషలన్ యథోచితజ్ఞానము కలవారు. పాఠశాలలందుఁగళాశాలలందుఁ దెనుఁగునందుందమతోడి విద్యార్థులలో నగ్రగణ్యులై యుండిరి. ఆంధ్రభాషా ప్రవీణతకు బహుమతులందుకొనిరి. కవియను నామంబునం జెన్నొందిరి. పట్టపరీక్షయం దాంధ్రభాషయందు రాజధానీ విద్యార్థులందఱిలో నగ్రగణ్యులగుటయేగాక సహపాఠకులకనేకులకు గురువులయి కృతార్థులఁజేయించిరి. సంస్కృతమునం దొకటియుఁ దెనుంగునం దైదారును అష్టకములును, వేంకటరమణ శతకంబును, రచియించి, ఆంగ్ల పాఠగ్రంథము (Readings in Poetry) నుండి యనేకములను దెలిఁగించిరి. పంచకాఖ్యానము, ఆంధ్రభూసుర సందేశము, ఆంధ్రయశోల్లాసము ట్రాయియుద్ధము, మొదలైన చిన్నపొత్తంబులు చేసిరి. పెక్కురపైఁ బ్రశంసాపద్యములం జెప్పి మెప్పువడసిరి. అష్టావధానం బొనర్చియిష్టుల స్తోత్రంబునకుఁ బాత్రులైరి. పోస్టాఫీసు డిపార్టుమెంటులో రాజమహేంద్రవరము హెడ్డాఫీసునందుద్యోగియులు.

మ॥ లలితౌదార్యయశోధురంధరులు సంశ్లాఘ్యప్రమేయప్రచా
రులు విద్యావినయప్రభుత్వగుణధుర్యుల్ వద్లమన్మాటిమం
త్రులు మంత్రిప్రెగడాన్వయప్రభువు లన్యోన్యంబు వియ్యంపు లై
యలరన్ బంగరుబంగరుంగదిసిన ట్లయ్యెం బ్రమోదంబుగన్. 1.

చ॥ వినయము నాభిజాత్యము వివేకము భవ్యకళానురాగమున్.
జనసుతవర్తనంబు నతికాంతరమా ప్రతిభాదిభద్రల
క్షణములు సర్వ మీనగుమొగంబులలోఁ బ్రతిబింబ మందుఁ గ
న్గొన నగు నవ్వి దంపతులకూరిమికిన్ స్ఫురణంబు లెంచఁగన్. 2.

ఉ॥ శ్రీయు యశంబనామయము శేసశుభంబులనూనకీర్తి దీ
ర్ఘాయువులన్ పరుండు నరహైమవతీశుభదృష్టిఁ గల్గి నా
రాయణసత్కృపన్ దనరి యానధువున్ మనుచుంద్రుగాత సు
శ్రేయముసజ్జనాభినుతశీలసమర్థత లొంది పొందుగన్. 3.

చ॥ ప్రభువును దైవముం గనినభంగి మనోహరునిన్ భజింపుమీ
శుభముఖుటిల్లు హైమవతి చూడుమనీసతి మంత్రినింబలెన్
విభవముగల్గు సత్యమ భువిం గదుఁ గీరితి హెచ్చెడు న్మహా
ప్రభుత తనర్చు నచ్చు భగవత్కృపజేకురుఁ బూరుషార్థముల్. 4.

## 180. దంటు లక్ష్మీకాంతముగారు.

వీరినివాసస్థలము గుంటూరివద్ద సిద్ధపల్లి. తెలుగాణి బ్రాహ్మణులు అపస్తంబసూత్రము. కౌండిల్యస గోత్రము. తండ్రి సంస్కృతాంధ్ర వేద్దియు గ్రామాధికారియు నగు సుబ్బారాయఁడుగారు. పితామహుండు వదాన్యులును శ్రీ యాంజనేయాలయ ప్రతిష్ఠాతలు గ్రామాధికారులునైన దేవయ్యగారు. మాతామహుఁడు భారద్వాజస గోత్రుండును తపస్వియునగు మున్నగు

నుద్యోగములు నొనర్చి బంటుమిల్లులో శ్రీ సీతారామస్వామివారి దేవాలయము ప్రతిష్ఠించిన భోనగిరి సుబ్బయ్యగారు. తల్లి మహాలక్ష్మమ్మగారు. 1860 సం|| 28 ఏప్రిల్‌కు సరియైన రౌద్ర సంవత్సర వైశాఖ శుద్ధ సప్తమి జన్మదినము. ఆంధ్రభాషా పరిచయము కలవారు. గుంటూరు జిల్లాయందు బదిసంవత్సరములు ప్రథమవిద్యా పాఠశాలా పరీక్షాధికారులు గను 8 సంవత్సరములు నూజవీటి సంస్థానమునందు తాసీల్దారు గను, ఇపుడు శ్రీరాజా పార్థసారథి అప్పారావు బహద్దరు జమీందారువారి సంస్థానంబున శతరూప్యమాస వేతనంబున వేజెంటుగ నున్నారు. వీరు రచించిన గ్రంథములు :— 1. పార్థసారథి శతకము; 2. కృష్ణవేణీ విలాస మనుపద్యగద్యాత్మిక నవల.

శా|| శ్రీకళ్యాణగుణాకరుండు వరలక్ష్మీ లక్షితుం డాత్మభూ
శ్రీకందర్పముఖప్రజానురతి సంప్రీతిం గటాక్షించు న
స్తోకశ్రీవిజయా యురున్నతి బలద్భోగ్యైకసౌభాగ్యవి
ద్యాకౌశల్యము లిచ్చిదంపతుల కంతఃప్రీతి వర్ధిల్లఁగన్. 1.

ఉ|| వక్షమునందు నాస్యమున కామశరీరతలంబునందుఁ బ్ర
త్యక్షము నిల్పి యోషల పరార్ధశరీరులఁ జేయు పుండరీ
కాక్షవిధాతశంకరులయాచితలక్ష్మిఁ జిరాయురున్నతుల్
దక్షత నిచ్చి సౌఖ్యములఁ దన్పి వధూవరుల న్భరించుతన్. 2.

ఉ|| కూరిమిఁ బెండ్లిపేరు వినఁ గోరికలీరికలెత్తుఁ బెండ్లినా
డారయ వృద్ధిఁ జెంది మదినల్లిప్రసూన ఫలోత్కరంబులై
నేరుగదంపతీ వరమనీషల నైక్యముఁ జేసి సౌఖ్యమిం
పారగ నిచ్చువట్లలరి వర్ధిలుత న్మనచిన్నిదంపతుల్. 3.

మ|| అరయం బెండిలివేళనుప్పతిలి యన్యోన్యానురాగాంకురం
బు రహి న్వర్ధిలి యోషవధూవరవయస్స్ఫూర్తి న్విజృంభించి స

ద్వరసౌఖ్యామృత సంగతి బ్రసవసంపత్ఫల్యసంతానముం
జిరసంతోషములొందుఁ గావుత యశశ్రీయుక్తి నెల్లప్పుడున్. 4.

ఉ॥ జీవనలందుదంపతులె దేవసతీపతు లాంధ్రభారతీ
సేవకపూరుషోత్తమవిశిష్టకవీశ్వరమంత్రివర్యమే
ధావిబుధాప్తమీసభ సుధర్మసభాసదు లెల్లఁ జూడఁగన్
దేవత లింద్రభోగములఁ దేలెడి గావుత నీసతీపతుల్. 5.

## 181. నారపరాజు లక్ష్మీకాంత కవిగారు.

వీ రారువేలనియోగిబ్రాహ్మణులు. ఆత్రేయసగోత్రులు. వీరినివాసస్థలము బాపట్లతాలూకాలోని యింకొల్లుగ్రామము. తండ్రి శ్రీరాములుగారు. తల్లి వెంకమాంబ. వీరి తండ్రితండ్రి యగు వేంకటామాత్యులు సప్తసంతానములఁగాంచి ప్రసిద్ధిఁజెందిన పురుషులు. అతిదాతలు. వీరు ప్రమాదీచ సంవత్సరమున జన్మించిరి. వీరికి అచ్చతెనుంగున నభిమానము మెండు. వీరు గుంటూరు టౌను హైస్కూలులో సహాయాంధ్రోపాధ్యాయులు గానున్నారు. బాల్యమున విద్యార్థిగానున్నతఱిఁ గవిజనచకోరచంద్రోదయ మను నాలుగాశ్వాసముల ప్రబంధమును రచించిరిగాని వంచనాప్రమాదవశంబున నప్పుడది యొకపుస్తక విక్రేత చేతికింజిక్కి సంస్కారముఁ బొందకయే ముద్రితమైనట్లును, ఇప్పుడాగ్రంథకర్తలగు వీరు దానిని చక్కగ సంస్కరించి తిరిగి ముద్రింపించుటకుఁ బ్రయత్నించుచున్నట్లును తెలియుచున్నది. మహాకవికాళిదాసము, ప్రతిజ్ఞావిజయము, రాఘవజననము, మున్నగు గ్రంథములను రచించిరి.

ఉ॥ శ్రీమహితప్రభావమునఁ జెల్వెసలారుచు లోకపాలనం
జేమదిఁగోరి యొండొరుల నెప్పుడు బాయక యుండునట్టి యా

హైమవతీశ్వరు ల్గడుదయం దమసౌఖ్య మొసంగి ప్రోచుతన్
హైమవతీశ్వరత్వమున నందముఁబొందు వధూవరద్వయిన్. 1.

ఉ॥ పాయక తానె దిక్కనెడివారి దొసంగులు వాయునట్లుగాఁ
జేయధరాధరేశునకుఁ జిత్తమురంజిలఁ బుట్టినట్టిమా
తోయజనేత్ర హైమవతి దోరపువైఖరిమీఱ సత్యనా
రాయణపాదపంకజమె యాదరువై విలసిల్లఁ గాలుతన్. 2.

ఉ॥ ప్రాయము రూపు తేజమును నన్నెయు వాసియు మేలిచిన్నెలున్
సోయగమున్ సమానముగఁ జొప్పడ జుట్టుఁటికంబుఁ గొన్ననా
రాయణమూర్తి సర్వవిబుధావళి తద్దయు సన్నుతింప వా
లాయము ప్రేమతో విజయ లక్ష్మిని నక్కున గారవించుతన్. 3.

చ॥ ఎలమినినింపుచెద్దుముల నెల్లజగంబులయందు నద్దుము
ద్దులఁదులకించు హైమవతిఁదోడినెలంతలు మెచ్చ సర్వమం
గళయయి తానిజేశునకు, క్ష్మాధరవర్యునకున్ మహాబుధా
వళికిని నెల్లకాలమును వారనిసంతస మీయుకుండునే. 4.

ఉ॥ ఈయమ కారయంగ నితఁ డీతనికిన్ మఱి యీ మెయే తగుం
గా యని చూపరు ల్వొగడఁగా నలరారు వధూవరద్వయం
చేయెడఁబండువెన్నెలయు నిందుఁడు వాక్యము దానియర్థముం
జాయయు రూపముంబలె ననారతముం బెడఁబాయకుండుతన్ 5.

మ॥ గన మొప్పారఁగ నొక్క హైమవతి తాఁ గాత్యాయనీదేవి య
య్యానరం జేయదసాధు, హైమవతి వే లొక్కర్తుమందాకినీ
వనజాతేక్షణ యయ్యు భర్తతలపై వర్తింపదే, యార్య ర్మై
మనశ్రీ హైమవతమ్మ యాత్మపతి ప్రేమం బొందు టబ్రంబొకో. 6.

చ॥ పెనిమిటిరొమ్ముఁ ద్రొక్కునల ప్రేయసికూరిమి యెట్టి దంచు సా
ధుని సునునాల్కమెట్టు నలదొయ్యలి పేరిమి యెట్టి దంచు భ
ర్తమఁ దలఁ దంపఁజేయు చెలిరాగ మదెట్టిది యంచు నవ్వి యీ
శుని దయఁ గాంచి హైమవతిచొక్కపుఁ గొత్తడినాఁ డెలంగుతన్.

ఉ॥ పాయనియట్టియానలుఁడు భామిని శ్రీదమయంతియట్టులున్
గాయజ శ్రీరతీసతులకైవడి వాసవుఁడుంబులోమజా
తోయజనేత్రయట్లు శశి, తొయ్యలిరోహిణి రీతి, సత్యనా
రాయణమూర్తి హైమవతి రంజిలు చుందురు గాత నెప్పుడున్.8.

ఉ॥ తీయమమీఱ హైమవతి దీర్ఘసుమంగలి యౌనుగాత నా
రాయణమూర్తికూర్మి మెయి నాయమఁ జూచుత మేలిదంపతీ
న్యాయము వారియందున ననారతము న్నివసించుఁగాత శ్రీ
కాయజుఁబోలునందనులఁ గాంచి సదాముద మొందుఁగావుతన్.

## 182. అడిదము రామారావుగారు.

వీరినివాసస్థలము విజయనగరము తాలూకా పూసపాటిరేగ. ఆఱు వేల నియోగులు. ఆపస్తంబసూత్రము. వసిష్ఠగోత్రము. తండ్రి వీరరాజు గారు. తల్లి సుందరాంబ. ప్రమాదీచసంవత్సర పుష్య శుద్ధ ౧౨ స్థిరవారము జన్మదినము. వీరు 1902 సంవత్సరము ప్రవేశపరీక్షయందుఁ గృతార్థులయి కొన్నిసంవత్సరములు విజయనగరమున రిపనుహిందూహైస్కూలులోఁ గ్రింది తరగతులకు సహోపాధ్యాయులుగానుండి యాకాలములోనే శ్రీవెలుటూరి లక్ష్మీపతిపంతులు గారియొద్దఁ గొన్ని తెలుఁగు సాహిత్యగ్రంథములు, వ్యాకరణము మొదలగునవి చదివిరి. వీరు ప్రస్తుతము శ్రీవిజయనగరము మహారాజా వారికాలేజిలో హైస్కూలు తరగతులకుఁ దెలుఁగుపండితులుగా నున్నారు. వీరు రచించిన గ్రంథములు :—1. డిలీదర్బారు. (పిలలనిమిత్తము వ్రాయఁ

బడినది.) 2. అడిదము రామకవిరచించిన "చెఱువుమీదిపద్యముల" పై విమర్శనము, 3. అడిదము సూరకవిజీవితము. (అచ్చుపడనున్నది.)

చ॥ స్థిరతరకీర్తిలోకములఁ జేసి చిరాయువొసంగుధాతయున్
సరసవచశ్శ్రవశక్తినిడి సన్నుతికెక్కుచరించువాణియున్
గరముశ్రితాళికోర్కులిడఁగాఁ బరగెత్తుకృపామతిన్ వధూ
వరులఁజిరాయురున్నతుల వాగ్విభవాఢ్యులఁ జేయుఁగావుతన్.

చ॥ కరిమసురక్తిలోకములఁ గాచిప్రమోదమొసంగు శౌరియుం
గురుతరవైభవోన్నతులఁ గూర్చిజనంబులఁ బ్రోచులక్ష్మియుం
గరముశ్రితాళికోర్కులిడఁగాఁ బరగెత్తుకృపామతిన్ వధూ
వరులఁబ్రమోదమానసులవైభవయుక్తులఁ జేయుఁగావుతన్. 3.

చ॥ తిరమగు సౌఖ్యమిచ్చి జగతీజనరక్షణ సేయుశంభుఁడున్
సురుచిరయుక్తి భద్రములశోభిలలోకము లేలునంబయున్
గరముశ్రితాళికోర్కులిడఁగాఁబరగెత్తు కృపామతిన్ వధూ.
వరులను సౌఖ్యసంయుతుల భద్రనిరూఢులఁ జేయుగావున్ త 4.

## 183. పీసపాటి వేంకటరమణయ్యగారు.

వీరి నివాసస్థలము రాజమహేంద్రనగమునకు సమీపమునసున్న మునికూడలి. వెలనాటి వైదికులు. అపస్తంబసూత్రము, గౌతమగోత్రము, తండ్రి సుబ్బావధానిగారు, తల్లి అచ్చమాంబ. విరోధినామ సంవత్సర చైత్రశుద్ధ సప్తమి జన్మదినము. ఆంధ్రకవిత్వమునందించుక పరిచయముగలదు. హూణభాషకూడఁ గొంతవఱకభ్యసించిరి ప్రస్తుతము కొవ్వూరుసబుమేజస్ట్రేటుగానున్న శ్రీ వైజర్సు అప్పారావు పంతులుగారి ముఖ్యాశ్రితులు. వీరురచించిన గ్రంథములు—1. సావిత్రీవిజయనాటకము, 2. పద్యమ్నోపాఖ్యానము, 3 జయసేనవిజయము.

శా॥ శ్రీమంత్రిప్రెగడాన్వయాంబునిధి సత్పీతాంశుఁడున్ ధన్యుఁడున్
ధీమంతుండు భుజంగరాట్ప్రభుఁడు తద్విజ్ఞాననిష్ఠాఫలం
బీమా పెండ్లికుమార్తె హైమవతి పేరే చేయు వేవేలు సౌ
ఖ్యామోదంబుల భర్తతో భువిసుపుత్రావాప్తి వర్ధిల్లుతన్. 1.

శా॥ శ్రీమీఁ అంగ సమస్తలోకములఁ గుక్షిందాల్చి రక్షించు శ్రీ
భామావల్లభుఁ డెల్లకాలమును సంపద్వైభవాయుష్యముల్
నేమంబుల్ మిగులంగఁగూర్చి యధిక స్నేహంబు దీపింపఁదా
నోముం గాతభువి న్వధూవరుల నత్యుత్సాహ మేపారఁగాన్. 2.

చ॥ తనసతి సర్వమంగళను దానెడఁబాయఁగలేక యాత్మసం
హననమునందు నర్ధముగ నామెను జేకొనిమించి భక్తర
క్షణ మొనరించు శంభుఁడు జగద్విదితంబుగ సర్వభద్రముల్
బొనరఁగనిచ్చి యెల్లపుడుఁ బ్రోచుత దంపతులన్ సుఖంబునన్. 3.

మ॥ పలుకుందొయ్యలి నెయ్యమొప్ప తనుసంభావించి సేవింపను
జ్జ్వలపద్మాసనమందునుండి జగముల్ సంసృష్టినింజేయు నా
నలుమోముల్ గలసామి మేటి కరుణం బాటించి ధీయుక్తులం
గలుగంజేయుత మావధూవరులకుం దత్కన్యకాత్యాగికిన్. 4.

చ॥ చటులమనీషి జంద్రుఁడును చంద్రికవోలెఁ బ్రియానుకూలరై
చిటిపొటిబిడ్డలంగనుచుఁ జెల్వుగ హైమవతీలలామతా
నటుహిమశైలమాదినిట నబ్ధిపరీతవ సుంధరాపరి
స్ఫుటపటుకీర్తిఁ గాంచుచును పూర్ణసుఖంబులఁ గాంచుఁగావుతన్. 5.

## వెంపటి రామనాథశాస్త్రిగారు.

వీరి నివాసస్థలము వెంకటగిరి. వెలనాటివైదికులు. ఆశ్వలాయన సూత్రులు. హారితసగోత్రులు తండ్రి సుబ్బాభట్టుగారు. తల్లి రామలక్ష్మదేవి.

రుధిరోద్గారి సంవత్సర ఆశ్వయుజ బహుళషష్ఠిజన్మదినము. వీరికి ఆంధ్రగీర్వాణములయందు సాధారణ పాండిత్యము. ఆంధ్రగీర్వాణ వ్యాకరణములయందు సామాన్యజ్ఞానము. ఉభయభాషలయందు కవనధోరణిగలదు. శ్రీరాజా వెలుగోటిముద్దుకృష్ణయాచేంద్ర బహదర్ వారి ప్రైవెస్కూలులో నాంధ్రపండితులు. వీరురచించిన గ్రంథములు—1. సంస్కృతమున కృష్ణచరిత్రము, 2. తెలుఁగున దశావతారచరిత్ర వచనకావ్యము

శ్లో॥ వాసుదేవస్సదాపాయా దిమానూతనదంపతీ
వైష్ణీసప్తపదీపాద సంస్పర్శనమహోత్సుకః

సీ॥ విజయలక్ష్మీ విధూ వేంకటసత్యనా
రాయణవరులకు రమ్యయశుల
కామ్నాయసంచోదితా యుఃవ్యసంతతు
లబ్జసూతియొసంగు నతులకృపను
సంతతారోగ్యంబు సారసమిత్రుండు
బలము నిచ్చుత మహాబలుఁ డనిశము
నవ్యాహతైశ్వర్య మమరాధినాధుండు
కరుణించుఁగాంతినిఁ గమలసదన

గీ॥ స్మృతియు మతిబుద్ధులను బృహస్పతి యొసంగుఁ
బ్రజ్ఞఁబ్రతిభను శ్రీచక్రరాజనిలయ
యర్థిజనులందుఁగరుణయు నచ్యుతుండు
నిర్మలయశంబు నిత్యంబునిఖిలభర్త. 2.

ఉ॥ చెలియా! పంతముచెల్లెశంకరుఁడు నీపెజ్జంబ్రకాశింప గో
మలహాస్తంబులఁదమ్మలంబొసఁగుమమ్మా యంచుఁ బల్కుంచెలుల్

లలితాస్యమ్మునమస్మితంబలరఁ బ్రోల్లాసంబునందేలున
జ్జలజాతేక్షణసర్వమంగళ మిమున్ సంప్రీతితోఁ బ్రోచుతన్. 3.

సీ॥ శ్రీహైమవతిరీతిఁ జెలఁగు నీ బిడయని
హైమవతీనామ మమరనిడిరి
సీతపోలికఁబతిఁ బ్రీతిఁ బాయదటంచు
సీతాభిధానంబుఁ జేసిరలమి
విజయంబు చేకూరు విద్యనీమెకనంచు
విజయాఖ్యనిచ్చిరి విమలమతిని
నారాయణునకీమె దారయౌననియెంచి
లక్ష్మి పేరిడి రహోలాక్షణికులు

గీ॥ కావనీరేడుజగముల దానకడుపు
లోన నిడుకొనికాపాడు లోకనాథుఁ
డయిదునతనంబు కొడుకులనాత్మజాలను
నవవధూటికి నిమ్ము ననారతంబు. 4.

ఉ॥ రాజభుజంగరావుమనరాజ్యము నందలితెల్గుభాషకున్
భోజుఁడు దేనభాషకునుబోలె నితోధికతంఘటింపఁగాఁ
బూజితులైనపండితులపుంజములం దగ గారవించి తా
భ్రాజితకీర్తియై చెలఁగ ధన్యగుణంబులు లోక మెన్నఁగన్. 5.

## 185. మధిర సుబ్బన్న దీక్షితకవిగారు.

వీరి జన్మగ్రామము తాళ్లపూడి. వెలనాటివైదికులు. ఆశ్వలాయన సూత్రము. ఆత్రేయగోత్రము. తండ్రికొండయ్యగారు. తల్లిసోమిదేవమ్మ. విభవసంవత్సర మార్గశిరశుక్ల ద్వితీయజన్మదినసము. కాటవరమను గ్రామమున,

ఇనటూరినాగలింగ శాస్త్రిగారియొద్ద పిరువిద్యాభ్యాసము గావించిరి. శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు వీరిసహాధ్యాయులు. కావ్యములు చదువునప్పుడే వీరుసంస్కృతమున కవిత్వము చెప్పుట ప్రారంభించిరి. ఇరువదవయేట అష్టావధానముగావించి యెర్నగూడెము తాలూకాతహశ్శీలు దారుగారగు సామినేని నరసింహారావు నాయఁడుగారివలన నత్యధికబహుమానములఁ బడసిరి. వీరికుభయభాషలయందు ననవద్యమగు సాహిత్యముగలదు. ఉభయభాషలయందును ప్రౌఢముగాఁ గవిత్వముచెప్పఁగలరు. వీరు ప్రస్తుతము రాజమహేంద్రవరమున నివసించియున్నారు. వీరురచించినగ్రంథములు:-1. శ్రీగౌతమీమాహాత్మ్యము ఉత్తరభాగము, పద్యకావ్యము, తెలుఁగు. 2. సప్తసాగరసంగమ మాహాత్మ్యము, పద్యకావ్యము. 3. భద్రాద్రిరామచరిత్రము, పద్యకావ్యము, 4. గౌతమీపుష్కరమాహాత్మ్యము, పద్యకావ్యము. 5. కాశీమజిలీకథలు, పదివాల్యములు, వచనము. 6. కాదంబరికి తెలుఁగు, వచనము. 7. శ్రీశంకరాచార్యచరిత్రము, వచనము. 8. రసికానందము, నాటకము. 9. కన్యా వరశుల్కనిరసనము, 10. నారదచరిత్రము, వచనము.

శ్లో॥ శ్రీమత్కళ్యాణభావప్రథితగుణగణస్ఫ్యాతభాస్వచ్చరిత్రౌ
దివ్యాలంకారశోభాసమధిక లలితస్వప్రతీకప్రకాశౌ
లక్ష్మీనారాయణౌతౌ భువనచయ పరిత్రాణసంసక్తచిత్తౌ
లక్ష్మీనారాయణాభ్యామరమిహదిశతాంమంగళందంపతీభ్యాం 1.

ఉ॥ శ్రీయురమందునందొదకరిత్రియు నీలయుఁగ్రాలఁజాలశో
భాయుతమూర్తియైభువనపాలన ఖేలనుఁడైనయాదినా
రాయణమూర్తి ప్రోచునలరామయు మంత్రితనూజుసత్యనా
రాయణరావుసద్గుణవిరాజితు హైమవతీవధూయుతున్. 2.

క॥ ద్విజవర్గాశీర్వాద
ప్రజనితవర మహిమవైభవముగభుజంగా

త్మజ హైమవతీసీతా
విజయను లక్ష్మ్యంబ చెలఁగు విభుఁగూడిమహిన్. 3.

ఉ॥ విప్రజనప్రకీర్తితవివేక విభాసిభుజంగరావుమం
త్రిప్రెగడాన్వవాయజలధి ద్విజరాజకళావిశాలుఁడా
త్మప్రియసూతి హైమవతి ధర్మరతిన్ మదనాభిరామరా
మప్రభుసూనుఁగూర్చెఁ గృతమంగళులై దురుగాకదంపతుల్. 4.

మ॥ అనురాగంబుననాథుతోఁగలిసి దివ్యప్రాభవోపేతయై
తనరన్ హైమవతీవధూటియును సీతాదేవియున్ లక్ష్మియున్
ఘనకారుణ్యముతోడఁ బ్రోవుదుర భిఖ్యాఖ్యాతినొప్పారఁగా
ధనధాన్యంబులఁగూడఁ హైమవతి సీతాలక్ష్మమాంబన్మహిన్. 5.

సీ॥ అతినిష్ఠమును హైమవతి తపంబొనరించి
పరమేశునర్ధాంగ పదవినొందె
సర్వసాధ్యపణప్రపయు సీతకళాభి
రాముశ్రీరాముభర్తగ భజించె
నవరాత్రములచండదివి జారితోఁబోరి
విజయయైకామేశ విభునిఁబొందె
లలితపాల్కడలిబల్తపముగావించివె
ల్వడిలక్ష్మిమురవైరి పక్షమెక్కె

గీ॥ జగతిఁదదభిఖ్యఁబూని భుజంగరాజ
కన్యశివుఁడును రాముఁడుగాముఁడగుచు
నలరు వెంకటసత్య నారాయణునివి
ఖరిణయంబయ్యెఁ బుణ్యవైభవముగాదె.

లయగ్రాహి.

దంపతులఁ బోతురని లింపులుతలంపులోన
రింపుమను బ్రీతిననుకంపదనరారన్
సంపదలనిచ్చికరుణింపుదురు లోకముస్పృ
జింపఁగను బెంపఁగ లయింపఁగగుణాళిన్
బెంపుగవహించుబలితంపుదొర లబ్ధిమురి
పెంపునుతగౌరి పటికంపురుచిమైదీ
పింపఁదగునాతియుసుఖింపఁ గనొనర్తురిల
జంపతులనొండొరులు సొంపులువహింపన్. 7.

## 186. నందూరి మూర్తిరాజుగారు.

వీరినివాసస్థలము రామచంద్రపురము తాలూకాలోని పాలతోడు. ఆఱువేలనియోగులు. అపస్తంబసూత్రము. శ్రీవత్సగోత్రము. తండ్రిసోమరాజుగారు. తల్లినరసమాంబ. వీరు 1904సంవత్సమున బి. ఏ. పరీక్షయందుఁగృతార్థులయిరి అందుఁదెలుఁగులో మొదటితరగతియందుఁజెన్నరాజధానికి మొదటివారుగాని లిచి బంగారుపతకమును బహుమానముగాఁబడసిరి. వీరికిఁజిన్ననాటనుండియుఁ దెలుఁగునందెక్కువ మక్కువ. వీరుప్రస్తుతము గోదావరి జిల్లాలో రెవిన్యూడిపార్టుమెంటులో నెలకు నలువది రూపాయల జీతముగల యుద్యోగములోఁ గాకినాడ పురముననున్నారు. వీరురచించిన గ్రంథములన్నియు హూణభాషనుండి యాంధ్రీకరణములు. 1. వివేకానందోపన్యాసములు. 2. సనాతన ధర్మములు, 3. జపానుచరిత్ర, 4. శుక్తిమతి, 5. భక్తియోగోపన్యాసములు. 6. కర్మయోగము. ఇవి అచ్చుపడియున్నవి. ఇదిగాక షేక్స్పియరు మహాకవికృతమైన Hamlet అనునాటకమును గూడఁదెనిగించి యున్నారు. అది యింకను ముద్రితముకాలేదు. రామానందమను పేరనొక నాటకమునుగూడ వ్రాసియు

న్నారు, ఇది భాషాంతరీకరణముగాక స్వకపోలకల్పిత మైనదిగా నున్నది. ఇదియును ముద్రింపఁబడ వలసి యున్నది. పైనుదహరించిన గ్రంథములలో మొదటిరెండింటికిని గోదావరిహిందూసమాజమువారి గ్రంథకర్త గారికి బహుమాన మొసంగిరి.

ఉ॥ శ్రీకరమైనచూపులను శ్రీలనుజల్లుచు శ్రేయమిచ్చుచున్
ప్రాకటవైభవోన్నతుల పారముగాఁ బ్రజకిచ్చి ప్రోచుచున్
లోకకుటుంబుఁడౌ తనమనో విభుహృత్కమలానువృత్తయౌ
శ్రీకమలాయతాక్షి కృపసేయుత నీమిధునంబునిత్యమున్. 1.

ఉ॥ తల్లులఁగన్న తల్లి నగతల్లజసూనయామనోల్లిహృ
ద్వల్లభునుల్లమున్వపువు తథ్యముదానగు శ్రీమతల్లి శ్రీ
పల్లవపాణికిన్ మునుపు వాంఛలొసంగినకల్పవల్లి నీ
కెల్లపుడున్ శుభంబులును గీర్తియుసంతతినిచ్చులక్ష్మిరో. 2.

సీ॥ పలుకు ఖేదములేక వల్లభునకునెప్డు
జిహ్వాగ్రముననుండు చిగురుబోడి
సంగీతసాహిత్య సరసవిద్యారస
స్ఫూర్తినిఁ బ్రజఁ బ్రోచు పుణ్యచరిత
మహితమహిమ గల్గుమహతి మ్రోయించుచుఁ
బ్రాణేశు నానందపరచు గరిత
అజ్ఞానతిమిరంబు నంతరింపఁగఁ జేసి
సుజ్ఞానదీపంబుఁ జూపుజనని.

గీ॥ వెలయవోముత సతముమా విజయలక్ష్మి
తన్మనోభవు నారాయణున్ముదభ్ధి

నోలలాడించిగయ మించి మేలొనర్చి
చిరతరాయురారోగ్యముల్ శ్రీలునించి 3.

గీ॥ బ్రహ్మయొసఁగుఁ గాక దీర్ఘాయువొనర
విష్ణువొసఁగుత సంతానవృద్ధియశము
శివుడొసంగుత నైశ్వర్యశ్రీసమృద్ధి
మనసులక్ష్మికి నారాయణునకుఁ బ్రేము. 4.

గీ॥ శారదాదేవి సద్విద్యనరగనిచ్చు
ధనమునొసఁగును లక్ష్మితాత్యాగమునకు
సకలసౌభాగ్యములనిచ్చు శర్వరాణి
మనసులక్ష్మికి నారాయణునకుఁ బ్రేమ. 5.

## 187. ముడుంబ కృష్ణమాచార్యులు గారు.

వీరినివాసస్థలముతాళ్లరేవు. శ్రీవైష్ణవబ్రాహ్మణులు. ఆశ్వలాయన సూత్రము. శ్రీవత్సగోత్రము. తండ్రి శ్రీమాన్ దొడ్డయాచార్యులుగారు. తల్లి సీతమాంబగారు. జయసంవత్సర జ్యేష్ఠశుద్ధదశమిజన్మదినము. వీరాంధ్రభాష యందత్యంతాభిలాషులై పదునాలుగేండ్ల వయస్సునుండి యుపదకవిత్వమును పద్యకవిత్వమును నేర్చియుండిరి. ప్రస్తుతముస్వగ్రామమునందే ప్రథమపాఠశాలలో సహోపాధ్యాయులుగా నున్నారు. విద్యార్థులకుపకరించుకథానాటకములు, కీర్తనలు, నీతిపద్యములు, మున్నగునవి కొన్నిరచించిరి.

క॥ శ్రీరమణుఁడు హైమవతీ
నారీరత్నంబు సత్యనారాయణునిన్
శ్రీరమ్యవిభవసంయుతు
లైరాజిలఁ జేయుఁగాత నశ్రాంతంబున్. 1.

స్రగ్విణి॥ జ్ఞానధారేయ శ్రీసత్యనారాయణా
దానసచ్ఛీల శాంతప్రభావుండవై
ధీనిధుల్ మెచ్చ సత్కీర్తి నిన్ గాంచుమా
మానుగానీ ధరామండలంబంతటన్. 2.

సీ॥ శతవత్సరంబు లీక్షితిశుభోపేతని
స్తులభోగములను బొందుదురుగాత
జనులెల్లరును మెచ్చుకొనుసుశీలముగల్గి
దిశలసత్కీర్తిఁ జెందెదరుగాత
సత్యవ్రతాసక్తి నిత్యంబురాజిల్లు
చిలనుగౌరవము వహింతురుగాత
ధనహేమవస్తు వాహనచయంబులతోడ
సుకృతాభి రక్తిగాంచుదురుగాత.

గీ॥ భువిని ననుకూల దాంపత్యమున శచీసు
రేంద్రులోయనమీరు చరింతురుగాత
వినుత హైమవతీసీత విజయలక్ష్మి
రమ్యవేంకట సత్యనారాయణాఖ్య 3.

## 188. చంద్రమౌళి చిదంబరరావుగారు.

వీరిజన్మస్థలము గుంటూరుమండలములోఁ జేరిన రేపల్లెతాలూకాలోని యాజలిగ్రామము. ఆర్వేలనియోగి బ్రాహ్మణులు. ఆపస్తంబసూత్రము కుత్ససగోత్రము. తండ్రిరామయ్యగారు. తల్లినరసమ్మ. వయస్సు 32 సంవత్సరములు. బాపట్లకోర్టులో న్యాయవాదిగనున్నారు. ఆంగ్లేయాంధ్ర భాషలలో నించుక పరిశ్రమముకలదు. విద్యార్థిగానున్న కాలములో « అష్టావధానము చేయుచువచ్చినారు. చిత్తూరుపట్టణ యజనోరా చరిత్రాంశకమగునాటక

మును, రాజుమూరుముట్టడియను నామాంతరముగల కృష్ణరాయవిజయమను మఱియొక చరిత్రాంశకమగు నాటకమును, వాసవీవిలాసమను నొకపురాణ కథాప్రయుక్తమగు నింకొకనాటకమును రచించినారు.

శా॥ శ్రీవాణీగిరిజాసరోరుహభవుల్ శ్రీశంకరశ్రీశరా
జీవాప్తేందుసురేశదేవగణముల్ శ్రీవాగ్ధనాయుర్వయో
భావస్ఫూర్తులనీవధూవరుల కవ్యాజానురాగోదయ
శ్రీవర్ధిల్లనొసంగి బ్రోచుతయశశ్శ్రీచంద్రికల్ బర్వఁగాన్. 1.

గీ॥ హైమవతిసీత, విజయలక్ష్మిమృగాక్షిఁ
బురుడుసేయఁగఁ జాలునీముద్దుగుమ్మ
హైమవతిసీత విజయలక్ష్మిమృగాక్షి
సత్యనారాయణేశ్వరు సకియయగుటఁ
బ్రమదమయ్యెడుహిత బుధవరులకెల్ల. 2.

ఉ॥ పాయనికూర్మి హెచ్చ నిరపాయముదంబలరార సత్యనా
రాయణరావుధర్మసతి హైమవతీ మణిఁగూడియర్థకా
మాయతధర్మమోక్ష పురుషార్థములన్విహరింపఁగాతదీ
ర్ఘాయువుఁబుత్త్రసంపద నిరామయదేహముఁగల్గిసర్వదా. 3.

ఉ॥ హైమవతీశశాంకధరులంబుధికన్యక చక్రపాణి ; పౌ
లోమియువజ్రపాణియునలోల పరస్పరమైత్త్రిఁగల్గిశో
భామహిమంబులో మెలఁగుభంగి నభంగపరస్పరానురా
గామితసౌఖ్యసంపదలనందెద రీశుభదంపతుల్ధరన్. 4.

మ॥ పరిపూర్ణాయువు, మైత్త్రి, పుత్త్రధనసౌభాగ్య ప్రభాకీర్తివి
స్ఫురణౌదార్యదయానుభావములు సంపూర్ణంబుగానీవధూ

వరులన్యోన్యసుఖానురాగ లగుచున్వర్ధిల్లఁ గాఁ బార్వతీ
పరమేశుల్దయఁ జూతురెల్లపుడు సద్భావంబు దీపింపఁగాన్. 5.

## 189. ముడుంబ నరసింహాచార్యులుగారు.

వీరివాసస్థలము తాళ్లరేవు. ప్రస్తుతము నీలపల్లి బాలికాపాఠశాలలో సహాయోపాధ్యాయులుగానున్నారు. శ్రీవైష్ణవబ్రాహ్మణులు. ఆశ్వలాయన సూత్రము. శ్రీవత్సగోత్రము. తండ్రి శ్రీమాన్ దొడ్డయాచార్యులుగారు. తల్లి సీతమ్మగారు. నందనసంవత్సర వైశాఖశుద్ధ తృతీయ జన్మదినము. వీరును శ్రీయేతేశ్వరపు సుబ్రహ్మణ్యశాస్త్రిగారును కవులు. నరసింహసుబ్రహ్మణ్యకవుల నుపేరంబరగుచున్నారు. వీరిరువురును కాకినాడయందు వసించి రెండు సంవత్సరములు నేత్రావధానము, వ్యస్తాక్షరి మున్నగు కష్టతరములగు కార్యములతో నష్టావధానము సేయుటయు నాశుప్రబంధములఁ జెప్పుటయుఁ గొంతవఱకభ్యసించిరి. వీరివిద్యాగురువులు బ్రహ్మశ్రీ శృంగారకవి సర్వారాయఁడుగారు. భుజంగరాడ్తత్త్వమాలయను నేకాశ్వాసముగల యొకపద్యకావ్యమును ప్రథమపాఠశాలలబాలికా బాలకులకుపయుక్తమగు రాజభక్తికీర్తనలు, అభినయగీతములు మొదలగుకొన్ని చిన్నపొత్తములను వీరుప్రత్యేకముగా రచించిప్రకటింపించిరి.

క॥ శ్రీవిభుఁడోముతనిత్యం
బావేంకట సత్యమూర్తి హైమవతీసీ
తావిజయలక్ష్మియనెడివ
ధూవరులఁ జిరాయువొసఁగి తోరపుగరుణన్. 1.

సీ॥ ఇంపుగాఁగనులనీక్షింపఁ గా నాశీర్వ
దింపఁగా సత్కవిశ్రేణిమిమ్ము
హాయిగా సురటీలు వేయఁగా మన్ననల్
సేయఁగా దాస దాసీజనంబు

సోనగాధృకాంతు లీనగామోమునం
గానఁగానొండొరులఁ పూనిమీరు
చల్లఁగాఁగరము నర్థిల్లగాసేసబాల్
చల్లఁగాఁ బెద్దవారుల్లసిల్లి

గీ॥ మీసతీపతులందిన యీసుఖంబు
యెపుడుఁగాంచుత శుక్లపక్షేందుగతిని
సతతమోనర్గమన్నాటి సత్కులప్ర
భారవహమూర్తి దంపతులార ! పేర్మి 2.

సీ॥ సద్గుణాఢ్యుండు నీజనకుఁడానందింప
విమలశీలుండవై వెలయుమయ్య
సత్కవిరాజునీశ్వరుఁ డౌననఁగనాంధ్ర
భాషాభిరతుఁ డవై పరగుమయ్య
సరససద్భావనీ సాధ్విసంతసమంద
ఘనసుధీయుతుఁడవై గాంచుమయ్య
భవ్యవర్తనులు నీబంధుగుల్వినుతింప
నమలవిఖ్యాతిచేవలరుమయ్య

గీ॥ మంచివారెల్ల నిన్నుఁబ్రేమించునటుల
శ్రితజనావనసంసక్తిఁ జెలఁగుమయ్య
వసుధనోవర్ణ మన్నాటివంశతిలక !
రమ్యవేంకట సత్యనారాయణాఖ్య ! 3.

సీ॥ భవ్యసతీత్వవైభవ హైమవతివోలె
నఖిలసంపూజ్యత నెగడుమమ్మ
గురుశుభోపేత సద్గుణజాతసీతవై
భూతదయాసక్తిఁ బొదలుమమ్మ

వీరజనారాధ్య విజయవిఖ్యాతివై
యొల్లెడసత్కీర్తి నొసఁగుమమ్మ
లలితవిలాసనిస్తుల కాంతిలక్ష్మివై
తులలేని సిరులచే నలరుమమ్మ

గీ॥ హైమవతి, సీత, విజయ, లక్ష్మ్యంబయనఁగఁ
జతురగతినినీయందుఁ బొసంగఁజేసి
నట్టినీతండ్రిగారి వాక్యముఫలింప
మనగదమ్మ భుజంగరాయని నిసుంగ. 4.

సీ॥ దీర్ఘాయురారోగ్య దివ్యప్రభలమీఱి
మీమేలిమూర్తులు మెఱయుఁగాత
దరిలేనిసిరులచేఁ దామరతంపరై
మీభూరిసంపద మీఱుఁగాత
సతతాభివృద్ధిచే జయరమావాసమై
మీమహావిభవంబు మించుఁగాత
జానొప్పివసుమతీ చక్రంబునిండార
మీకీర్తివల్లికల్ ప్రాకుఁగాత

గీ॥ భువిముదంబ నృసింహార్యక వియొసఁగిన
ప్రాకటాశీస్సులెల్లఁ దప్పక ఫలింపఁ
జెల్లుగావుత మీయభీప్సితములెల్ల
నవవధూవరులార! యుత్సవములార! 5.

## 190. అల్లమరాజు వేంకట గౌరీరాజుగారు.

వీరి నివాసస్థలము గోదావరి జిల్లాలోని చేబ్రోలు. ప్రస్తుతము పిఠాపురము. ఆరామద్రావిడబ్రాహ్మణులు. ఆపస్తంబసూత్రులు. హరితసగోత్ర

ము. తండ్రి పెద్దిరాజుగారను రాజయ్యగారు. తల్లి సూరాంబ. వికృతిసంవత్స రాషాఢశుద్ధ పంచమీభానువాసరము జన్మదినము, మహారాజరాజశ్రీ శ్రీ శ్రీ పీఠాపురము రాజావారి యాస్థానోద్యోగియులు. స్కూలు ఫైనలు క్లాసుజదువునప్పుడు (1911 ॥సం॥) ఆంగ్లేయకవి సార్వభౌముఁడగు టెనిసన్ ప్రభు విరచితమైన "డోరా"యను పఠనీయగ్రంథమును "తార"యను పేరిటనాంధ్రీకరించి ప్రచురించి యున్నారు. సావిత్రీ చరితము, (అముద్రితము.)

శా॥ శ్రీనొప్పారి పరస్పరంబువిపులంబ్రేమంబు మైనుండి భ
క్తానీకంబులు గొల్వవైభవముతోన శ్రాంతమున్నట్టుల
క్ష్మీనారాయణులాయువున్విభవమున్ శ్రీయున్సుఖంబిచ్చిల
క్ష్మీనారాయణులౌమిముం గనెదరీపృథ్వింగృపాదృష్టులన్. 1.

గీ॥ శాంతికరవును దయకువాసస్థలంబు
భక్తజనకల్పవృక్షమైనరలు రామ
నామనారాయణుఁడు నమ్మహామహుసతి
సీతయును మిమ్మునెపుడు రక్షింత్రుగాత. 2.

సీ॥ అలరజితాద్రిపై హైమవతీదేవి
వామభాగంబున వరలుచుండ
పుత్త్రరత్నంబు లిర్వురునంకతలమునఁ
గూర్చుండి మోదముగూర్చుచుండ
సంతతవిజయ రత్నణముందు కలనైన
లోనఁబరాకును బూనఁబోక
అమర, భుజంగరాయనితోడ సంబంధ
గరిమచేఁ బెంపుమగాంచితనరు

గీ॥ సామినారాయణుండైన శంకరుండు
సతవియర్ధాంగమూ హైమవతియుమీకు

వాయురారోగ్యభోగ్యభాగ్యములొసంగి
కరుణఁజల్లని చూపులఁగాంచుచుండ్రు. 3.

## 191. సూరివరపు సీతారామ సోమయాజులుగారు.

వీరినివాసస్థలము మైలవరము. తెలగాణ్యపు వైదికులు. ఆపస్తంబసూత్రము. వాధూలసగోత్రము, తండ్రి యజ్ఞనారాయణ సోమయాజులుగారు. తల్లిపిచ్చమ్మ సోమిదేవమ్మ. చిత్రభాను సంవత్సర చైత్ర శుద్ధ 2 జన్మదినము. ఆంధ్రగీర్వాణములయందు, జ్యోతిషమందు, ఆంధ్రకవిత్వమందుఁ బ్రవీణులు. శ్రీరాజాసూరానేని వేంకట పురుషోత్తమజగన్నాథ గోపాలరావు బహద్దర్ జమీందారు, శ్రీరాజా వేంకట పాపయ్యారావు బహద్దర్ జమీందారు, శ్రీరాజాసూరానేని వేంకట నారాయణరావు బహద్దర్ జమీందారుగార్ల ఆస్థాన పండితులు. నేటివఱకు చిల్లరగా రచించిన పద్యములు మాత్రమే కలవు.

శా॥ శ్రీమద్వేదమయు ప్రభావవరదా చిద్రూపసత్యవ్రతా
కామక్రోధ విదూరసర్వసమలోకస్త్రాత్యనిత్యాపరం
ధామాసద్గుణ నిర్వికల్పజగదాధారామహాదేవనీ
ప్రేమంజూపుమ యీవధూవరులపై ప్రీతిన్ శుభంబొప్పఁగన్ 1.

శా॥ శ్రీకళ్యాణగుణాకరస్తుతబుధ శ్రేష్ఠాళివాంఛప్రదా
లోకాతీతపురాణ పూరుషఘనాలోకోత్తరశ్రీయుతా
పాకారిప్రముఖాళిసేవితపదాబ్జద్వంద్వసంరాజితా
నీకారుణ్యము నీవధూవరులపైనిల్పంబ్రసాదింపుమా. 2.

ఉ॥ శ్రీరజితాద్రివాసనుర సేవిత పాదసరోజభక్తమం
దారభవాబ్ధిపోత పరితాప విదార నిరామయానిరా
కారనిరంజనా ప్రథితగౌరవదాయక యీవధూవరుల్
భూరికృపావిశేషమున భోగములందఁగఁ బ్రోవుమాభువిన్. 3.

ఉ॥ శ్రీకరమైచెలంగఁగ నశేషచరాచర జంతుజాలమున్
వీకసృజించి పెంచిమరపించినటించు మహానుభావుఁడ
స్తోకదయావిశేషమునతోషణ మొప్పఁగరాతలమ్మునన్
సాకుమనీవధూవరులు సౌఖ్యములొంద చిరాయువిచ్చుతన్. 4.

ఉ॥ శ్రీరమణీయసద్గుణవిశేషవిరాజిత సత్ప్రభావశృం
గారవిలాస సంస్తుత్యప్రకాశచరిత్ర సమస్త వైభవో
దారమహానుభావసుఖదాయక రక్షకదేవదేవని
భూరిదయన్ వధూవరులు భోగములొంద ననుగ్రహింపవే॥ 5.

చ॥ సకలగుణాభిరాములగు సత్సుతులన్ ధనధాన్యవృద్ధియుం
బ్రకటితమైనకీర్తియు నపారముగం బొదవంగ నెల్లకా
లికలొనగూర్చి తిద్దయుధరిత్రిని నిత్యమునీ వధూవరుల్
సుకరముగా సుఖింపవయ ప్రోవుమ సర్వశరణ్య నెమ్మదిన్. 6.

మ॥ సుతులన్ సంపదలన్ సమస్తశుభముల్ శోభిల్లఁగా నెంతయుం
జతురత్వంబునఁ గూర్చి సంతసము హెచ్చంజేసి యీనూత్నదం
పతులం బ్రోవుమునీకృపారసము బొల్పారం బ్రసాదించి శా
శ్వతసౌఖ్యాధిక చక్రవర్తి పరమేశా భక్తసంరక్షకా. 7.

ఉ॥ శ్రీయుతుఁడున్ సమస్తజనసేవితుఁడున్ ఘనలోకనాథుఁడున్
గేయచరిత్రుఁడున్ విమలకీర్తిధనుండగుసర్వరక్షకుం
డాయతసత్కృపన్ భువిని హైమవతీసతినల్లసత్యనా
రాయణరాయనిన్ సిరులఁ రంజిలఁ జేసిచిరాయువిచ్చుతన్. 8.

## 192. మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు.

వీరిప్రకృతనివాసస్థలము విజయనగరము. పూర్వనివాసస్థల మనకాపల్లి యనుగ్రామము. 1862 సం॥ లో వీరితండ్రిగారగు రఘునాథాచార్యులవా

రీవిజయనగరములో నుద్యోగమందుఁ బ్రవేశించుటచే నిచ్చట స్థిరపడిరి. వీరు గోలకొండ వ్యాపారివైష్ణవులు. భారద్వాజగోత్రము. యజుశ్శాఖ. ఆపస్తంబ సూత్రము. తల్లిపేరులచ్చమాంబ. వీరుబాల్యమందు విజయనగరములోనున్న యాంగ్లేయపాఠశాలలో నాంగ్లేయభాషనభ్యసించి 1883 సంవత్సరములో ప్రవేశపరీక్షయందు తీర్ణులయిరి. పైపరీక్షకుఁజదువుచుండఁగాఁ దండ్రిగారుస్వర్గస్థులగుటచే నా విద్యావ్యాసంగము మఱిజరుగలేదు. విజయనగర సంస్థానాధిపతులగు, ఆనందగజపతి మహారాజావారి యాస్థానాలంకారభూతులు. విద్వత్కవీంద్రులునగు శ్రీమన్మదుంబై నరసింహాచార్యస్వామివారియొద్ద సంస్కృత విద్యనభ్యసించిరి. ఆంగ్లేయసంస్కృత ద్రావిడాంధ్ర భాషలయందు వీరికి ప్రబలపాండిత్యముగలదు. ఆంధ్రగీర్వాణభాషలయందు సరసముగఁ గవిత్వము చెప్పఁగలవారు. పూర్వమీమాంసయందును అద్వైత విశిష్టాద్వైత వేదాంతములయందు నిరూఢప్రజ్ఞగలవారు. 1885 సం|| మొదలుకొని 1892 సం|| వఱకుపాఠశాల పుస్తకాలయాధ్యక్షుని యుద్యోగములోనుండి జ్ఞానసామగ్రిసంపాదించి యాసంవత్సరములో నె పాఠశాలసంస్కృతోపాధ్యాయ పదమందు నియోగించఁబడిరి. నాటినుండి నేటివఱకు నాయుద్యోగములోనే యున్నారు. దుందుభిసంవత్సర ఆషాఢబహుళచతుర్దశి వీరిజన్మదివసము. వీరు రచియించిన గ్రంథములు:—1. సంస్కృత గ్రంథములు:—1. శతగోపసహస్రము, 2. షేక్స్పియరు నాటకకథామంజరి 3. సంస్కృత కవిజీవితములు, 4. ఆర్యభాషా చరిత్రము, తెలుఁగుగ్రంథములు;—సత్యవ్రతి చరిత్రమను ప్రబంధము. 2. పార్థసారధి శతకము.

---

సీ|| ఏలేమకృపజల్లులీలా కటాక్షంబు
సురవాథవైభవ స్థూలలక్ష్మి
మేసాధ్వికుభనామ మేపారఁగాభువి
మంగళంబులకెల్ల మంగళంబు

పేదవికళిలేకుఁడిం పొందఁగాఁజేయు
  విశ్వసృష్ట్యాదులు వేడుకలగు
నేమాతనిజభర్తృ హృదయంగమతనొంది
  భక్తజనాళికిఁ బట్టుకొమ్మ.

గీ॥ ఆమహాలక్ష్మి సంప్రీతయాచునెపుడు
మంత్రిపెగడబుజంగ భూమండలేంద్రు
ననుగుకూఁతురు హైమవత్యంబవారుని
సత్యనారాయణాహ్వ యుసకలసంప
దాయురారోగ్యములనిచ్చి యనుపమాన
పుత్త్రసంతతినొడఁగూర్చిప్రోచుఁగాత. 1.

చ॥ జగతినవాదిదంపతులు శాశ్వతులున్ నిజసంశ్రితావన
ప్రగుణితసత్కృపానిధులు భారతిబ్రహ్మయులక్ష్మిమాధవుం
డగజహరుండుబ్రోచెదరనంతకృపన్ వధువున్ వరున్ జనా
తిగవిభవాయురున్నతులు తేజమరోగతనిచ్చినిచ్చలున్. 2.

శా॥ సీతారాములచాడ్పునన్ ఘనసునాసీరేంద్రపత్నీశ్రియం
బూతారుంధతిశక్తితాతలగతిన్ బొల్పారుననోన్యసం
ప్రీతస్వాంతతనీవధూవరులు నుద్వేలాయురారోగ్యసం
ప్రోత్తైశ్వర్యసుపుత్త్రసంతతి మహాభోగాప్తిశోభిల్లుతన్. 3.

## 193. వింజమూరి వేంకటసుబ్బారావుగారు.

వీరినివాసస్థలము పీఠికాపురము. జన్మస్థలము రాజమహేంద్రపురము తాలూకాలోని తొస్సిపూడుఅనుగ్రామము. తెలుఁగునాటివైదికులు. ఆపస్తంబసూత్రము. గౌతమగోత్రము. తల్లిలక్ష్మీనరసమ్మగారు. తండ్రి వేంకటేశముగారు. కీర్తిశేషులునుప్రస్తుతపు పీఠికాపురాధీశులజనకులును ఆగుశ్రీరాజారావు,

వేంకట మహీపతి గంగాధరరామారావు బహదరు జమీందారువారియొద్ద పెక్కుసారులు దివాన్, సర్వముక్త్యార్ పదవుల నలంకరించి, నిరతాన్నప్రదాతలయి కీర్తిశేషులయిన వేంకట సుబ్బారాయఁడుగారు వీరిపితామహులు. వీరిజన్మదినముస్వభాను సంవత్సర కార్తీక బహుళత్రయోదశీ జయవారమునకు సరియైనది 27-11-1883. వీరు, యెఫ్. ఏ. పరీక్షయందుఁ గృతార్థులయి బి. ఏ. పరీక్షలో రెండుశాఖలయందుఁ గడతేరిప్రస్తుతము గుంటూరులో ఏ. యి. యెల్. యం. గరల్సు హైస్కూలులో సహోపాధ్యాయులు గానున్నారు.

క॥ శ్రీకరమై పండితలో
వ్యాకరమై సర్వ సుజనహర్షాస్పదమై
మీకో మరిత పరిణయమ
స్తోకోదంచిత విభూతిశోభిలుఁగాతన్. 1.

క॥ వాణియుహరి రాణియుశ
ర్వాణియువిద్యా నిరంతరశ్రీసౌభా
గ్యానంతసంపదలఁగ
ళ్యాణంబులనొసఁగు గాత హైమవతికిలన్. 2.

క॥ శరణాగతవత్సలుఁడీ
శ్వరుఁడురుసంపద్గణముఁ బ్రసాదించిధరన్
జిరజీవిగ నొనరిచిసు
స్థిరకీర్తిసమన్వితునిఁగఁ జేయుతనరునిన్ 3.

గీ॥ ఆర్యవిధివిహితముగ బ్రాహ్మణమహీప!
భవదుపానీతమహనీయు వాక్ప్రభావ
మాయురారోగ్య పుత్త్రపౌత్రాభివృద్ధి
నెపుడుదంపతుల కనుగ్రహించుఁగాత 4.

మ॥ పరవిద్యాబలవృద్ధి, బుద్ధివిభవప్రాజ్యస్ఫురత్కీర్తిని
ర్భరభక్తిప్రథితాంధ్రమాతృ పరిచర్యాప్రాప్తవిఖ్యాతిసు
స్థిరదాంపత్యము సంగి ప్రోచుతనతక్షేమప్రగుండీంధూ
వరులన్ శౌరిసమస్తమంగళకరైశ్వర్యాతిరేకంబుగన్. 5.

చ॥ ప్రవిమలభక్తితోడనిజ భర్తనుగొల్చుచునార్యులందఱిన్
సువినయశాంతిసంయుతమనో విభవంబునఁబూజసేయుచున్
భువిజనియించెనేమొకొయనూన గుణాకరయైనయట్టిసై
మవతిరోయయంచుఁబల్కుమతి మన్ననిపాత్రముగమ్మమానినీ ! 6.

ఉ॥ ఆయుతకార్యశౌర్యప్రశమార్జవ ముఖ్యగుణప్రశస్తసు
శ్రీయుతకీర్తిలక్ష్మినిభరించి కరప్వయి నెత్తియాస్యమో
హోయనునట్లుసత్యనియమోన్నత పీఠిపసించిసత్యనా
రాయణనీదునాహ్వయముసార్థకమానటులంజరింపుమా 7.

## 194. కొండమూరి వెంకటరత్నశాస్త్రిగారు.

వీరి జన్మభూమి గుంటూరు జిల్లా ఒంగవోలుతాలూకా అద్దంకిగ్రామ సమీపమునంగల కొండమూరు. బడగల నాడికన్నడీ నియోగులు. శ్రీవత్సస గోత్రబుక్కాఖీయాశ్వలాయన సూత్రాన్వయాభిజాతులు తల్లి కామాక్షంబ. తండ్రి వెంకటప్పయ్యావధానులుగారు. వీరి జన్మము ప్రమాది సంవత్సరము. వీరు తర్కవేదాంతాది శాస్త్రములందు విద్వాంసులు. సంస్కృతాంధ్ర కవిత్వములందు నేర్పరులు. వీరు పెక్కురకు వ్యాకరణసాహిత్యవిద్యల నొసంగినవారు. వీరు ప్రకృతమునర్సారావుపేట బోర్డుసెకండరీ స్కూలులో సంస్కృత పండితులు. వీరురచించిన గ్రంథములు, తెలుగు గ్రంథములు:—1. వేదాంతచంద్రిక, (ఇదిసత్ చిత్ ఆనందం అనిమూఁడు భాగములుగలది) 2. జీవప్రశంస, 3. మాయానిర్వచనము, 4. గౌడపాదకారికలకు టీకాతాత్ప

ర్యములు, సంస్కృతగ్రంథములు:—1. కర్మయోగము, 2. దేహాదేహాభావ నిర్మూలనము ఇత్యాదులు.

శా॥ యోవిజ్ఞాననిధిర్నిధి స్సుమనసాంకల్యాణరత్నాకరో
నారీయస్య నిజాత్మనావిజయలక్ష్మీ సంజ్ఞికాశోభతే
లక్ష్మీ ర్భాగ్యనిధిర్నిధిస్సుకృతినాం యోభానిధిర్ధీనిధిః
సశ్రీమాఞ్జయతుశ్రియాప్రవిలసచ్ఛ్రీసత్యనారాయణః 1.

వ సం త తి ల క మ్.

కాన్తావిమా సుకృతినా బలసత్వభాజా
ప్రేమాన్వితావితత సాత్విక భావయుక్తా
శబ్దార్థసంగి వపుషాపరిపూర్ణకామా
నిత్యంశ్రియాహిజయతాం సుఖభోగరక్తా 2.

వంశస్థం॥ విశృఙ్ఖలోగాంసముపాగతారమా
ధ్రువంహియాభాతి మనోరమాపతేః
భుజంగరాయస్యసతీ ప్రియాత్మజా
దద్యాత్ శుభంశాంభవమూర్తిరస్యాః. 3.

శ్లో॥ ప్రియంవరంప్రాప్యనిజాత్మనశ్చయా
సరూపముర్వ్యాంలసతిప్రభావతీ
కళావతీహైమవతీ మనోరమా
శివోఽస్తుతస్యాస్సుఖ దోరమాపతీ. 4.

## 195. గొర్తి సూర్యనారాయణశాస్త్రిగారు.

వీరి నివాసస్థలము గంజాముమండలములోని ప్రియాగ్రహారము. వెల నాటి వైదికులు. ఆపస్తంబసూత్రులు, శ్రీవత్సగోత్రులు. తం[illegible]

శివశాస్త్రులవారు. తల్లి వేంకమాంబ. చిత్రభాను సంవత్సరా షాఢబహుళద్వాదశీ బుధవారము జన్మదినము. వీరు ఆంధ్రగీర్వాణములలో ననర్గళమైన పాండిత్యముగలవారు. కాశీసాహిత్యపరీక్షలోఁగృతార్థులు. ఉభయకవితాకోవిదులు. ప్రకృతము వీరు శ్రీశ్రీశ్రీ విజయనగర మహారాజకీయాంగ్ల కళాశాలలో నాంధ్రపండితులు. వీరు రచించిన గ్రంథములు:—సంస్కృత గ్రంథములు:— 1. విషమాయుధవిజయభాణము, 2. గణపతిస్తవరాజము, 500(శ్లోకములు) 3. అష్టకములు. ఆంధ్రగ్రంథములు:—1. ఉత్తరయాత్రాచరిత్రము, (వచనకావ్యము) 2. విజయవిలాసమునకు వ్యాఖ్యానము, 3. ఉద్యోగపర్వమునకు టిప్పణము.

శ్లో॥ సదాశివః పాతుసధూవరౌనవౌ
పరస్పరాలోకనజాతకౌతుకౌ
వివాహవేషోజ్వల దివ్యవిగ్రహౌ
శచీమహేంద్రా వినసంస్థితౌ ప్రియా. 1.

శ్లో॥ నానాదేశసమాగతాఖిలకవీంద్రాశీః ప్రభావాదియం
పాపక్ష్మాల్యాత్తపసఃఫ్సతే గుణవతీ భర్తుర్మనోహారిణీ
జీయాద్ధైమవతీత్వదీయవికృతిర్విద్యావతీ నాంమణీ
సౌభాగ్యస్యనిధిశ్చరిత్ర విమలా పుత్రైః ప్రపౌత్రైఃప్రభో! 2.

శ్లో॥ హైమవతీహైన్యశూన్యందీర్ఘాయుర్దిశతుతేజగత్స్రష్టా
కళ్యాణితద్వధూటీ దద్యాద్విద్యానుపాండితీంగుర్వీం. 3.

శ్లో॥ హైమవతి! దిశతుతేసాహాంగళ్యమనుత్తమంగౌరీ
కల్యాణి! భక్తవరదస్తత్పతిరపి సంపదోనంతాః. 4.

## 196. చీమలకొండ అద్వైతబ్రహ్మశాస్త్రిగారు.

వీరి నివాసస్థలము పీఠికాపురము. తెలగాణ్యులు. వైదికబ్రాహ్మణులు ఆపస్తంబసూత్రము. భారద్వాజగోత్రము. తండ్రిపద్మనాభ శాస్త్రిగారు. తల్లినరసాంబ. స్వభానుసంవత్సర మార్గశిరశుద్ధ షష్ఠిజన్మదినము. ఆంధ్రగీర్వాణభాషాసాహిత్యములను గవిత్వమునను బ్రవీణతగలవారు. అగ్రహారికులు, గీర్వాణభాషనుగొన్ని అష్టకములు, ఆంధ్రమునఁజాటువులును రచియించియున్నారు. ఇంతవఱకును సంసిద్ధమైన గ్రంథములేవియు రచించినవి సమగ్రముగా లేనందున వానినుదహరించలేదు.

సీ॥ సకలలోకైక రక్షకుఁడెవ్వఁడార్తజ
    నావనోద్యోగియైయలరు నెవఁడు
భానురతరసత్కృపాసింధుఁడెవ్వఁడు
    దీనులపాలిని ధానమెవఁడు
శిష్టరక్షణదుష్టశిక్షణచణుఁడెవ్వఁ
    డన్నిటఁబరిపూర్ణుఁడగు నెవండు
దాసులహృదయ నివాసుఁడెవ్వఁడవా
    ఙ్మానసగోచరమహిముఁడెవ్వఁ

గీ॥ డట్టిపద్మజవాసవాద్యమరమకుట
రాజితపదాబ్జుఁడాది నారాయణుండు
పరకృపామతినిష్వధూవరులకెపుడు
మానసాభీష్టము లొసంగి మనుచుఁగాత. 1

గీ॥ తనదుస్వాధీనవల్లభాత్వంబు, భర్త
యందుగాఢానురక్తినిత్యానపాయి

దివ్యకుసుమప్రస్ఫుటంబులై [illegible]
హరియురస్స్థలవాసినియైనలక్ష్మి
యువ్వధూవరులకు సిరులిచ్చుఁగాత. 2.

సీ॥ దోషాకరుండని ద్రోసిపుచ్చక వానిఁ
కరుణతోఁ దలపువ్వుగా ధరించి
కరమధోగతిపాలు గాఁ గోరు నవకగం
గను బ్రీతి నుత్తమాంగమునఁ బూని
కాలకూటంబని కలతనొందక దాని
గళమున నవలీల గాధరించి
విషమవిశిఖుఁ గన్ను ద్వర సవంబులని దూ
రక వానిఁ గంఠహారములఁ జేసి

గీ॥ యెట్టివారైనఁ దమనాశ్రయించువారి
నట్టిచేపట్టి రక్షించునట్టిశివుఁడు
కరుణతోఁ దుత నివ్వధూవరుల నెపుడు
కంటికిని రెప్పవిధమునఁ గాచుఁగాత. 3.

ఉ॥ అంగనలన్న భర్తలకు నర్ధశరీరిణులంచుఁ దెల్పు నా
భంగి, విశేషగాత్రమున భవ్యతరార్ధమునందు నిల్పియు
ప్పొంగెడు సర్వమంగళ యపూర్వదయామయమైన చిత్తవృ
త్తింగని యివ్వధూమణిని దీర్ఘసుమంగలిగా నొనర్చుతన్. 4.

గీ॥ కలిగిచేదోడువాదోడుగా మెలంగ
నలకతానందపదవా[illegible]
సెనసి, యీరేడు జగముల నేలుచున్న
బ్రహ్మ[illegible] వివ్వధూవరుల [illegible]. 5.

## 197 మచ్చె సూర్యారావుగారు.

వీరి నివాసస్థలము గంజాముమండలాంతర్గతమగు జలుమూరు. వీరి పూర్వులు మహమ్మదీయాంగ్లేయ ప్రభుపాలితహిందూసేనాంతరోద్యోగము లలో ప్రసిద్ధిఁజెందినవారు. తెలగాణంశము. 1904 సంవత్సరము, ఎమ్. ఏ. పరీక్షకు పఠనీయమగు "శ్రీశుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచన కుశచరిత్ర, శ్రీవైదర్భీ పరిణయాది మహాకావ్య ప్రణేతయు, పర్లాకిమిడి ఆంగ్లేయకళాశాలయం దాంధ్రపండితులును అగు మచ్చెవేంకటకవిగారు వీరి జనకులు. తల్లి వేంకట రత్నమాంబ. సహోదరుఁడు ఆనందరావు. దొరతనమువారి కహితుండగు నర్సిపట్టణనివాసి జర్దాసన్యాసిస్వామివీరుని నిర్జించినకతన విశాఖపట్టణమండ లపు జడ్జీగారివలన నొకకైజారు బహుమానముపడసి సీ పీ బ్రౌనుదొరగారి యాస్థానాంధ్రపండితులలో నొకరయి సుబేదారుబిరుదాంకితులగు మచ్చెగంగ య్య దొరగారు వీరికిఁబితామహులు. ప్రస్తుత ముద్రితములగు, ఆ రామ శ్రీ రామోత్కర్ష ప్రాస్తావిక పద్యావళ్యాది ప్రబంధనిబంధనులగు మచ్చెలక్ష్మీనా రాయణ కవివరుండీయన కొక్రేలు విడిచిన పినతండ్రి. వయస్సు ఇరువది రైదు సంవత్సరములకించుకమించునది. సంస్కృతాంధ్రాంగ్లేయ భాషాపరిచ యముగలవారు. ప్రకృతము కృష్ణాజిల్లా పెనుకొండగ్రామములో పోలీసుసబ్ ఇన్‌స్పెక్టర్ ఉద్యోగములోనున్నారు. వీరు రచించినవి. 1. శ్రీశంకరస్తోత్ర రత్నావళి, 2. సరోజినీపరిణయము. 3. ధ్వనిశ్లేషాన్వితమగు చంపకమాల-ముఖ్యములు.

గీ॥ విమలాకారమునిర్గుణ
మమలంబాద్యంబమేయమునై గమనం
తము "శ్రీశైవపరబ్ర
హ్మము" దంపతులఁగడునోముత క్రాంతమ్ముల్. 1.

గీ॥ జగతిరామాత్మజుండు భుజంగరాయ
సుతను గొనుట, పురాణసమ్మతము గాన
చెలిమి ననుకూల దాంపత్యమలరు నంచు
నీ లోకులెల్ల పరికింపనేల ! 2.

చ॥ అతులితశేముషీవిభవుఁడైన భుజంగమరాజకన్యకా
యుతమగుటన్ స్వనామముల నొప్పినదంపతులన్ శివారమా
పతిపురుషుల్ యశోధన మహాగము గాఁగ ననుగ్రహించుటన్
సతతము గాఁపురంబలరు సౌఖ్యసమేతము నైనసుందరిన్. 3.

(1) పద్యములో భుజంగశబ్దము సర్పమునందు వర్తించుచున్నది. ఆనాఁడు శ్రీరాముని కుమారుఁడగు కుశరాజు సర్పములకు రాజయిన తక్షకుని కుమార్తె కుముద్వతిని వరించి పరిగ్రహించినటులను వారి దాంపత్యము, అన్యోన్యముగా జరిగినటులను పురాణములే చెప్పుచున్నవి. కాన భుజంగ రాజకన్యకలను రామాత్మజులు వరించుట సహజమనియును, వారి శ్రేయోభివృద్ధికి మఱలఁబండి తాశీర్వాదములంతగా అవసరము లేదనియును, పద్యార్థము, "భుజంగరాజాది శబ్దము" లో శ్లేషను గ్రహించునది.

(3) పద్యము--భుజంగమరాజ(శేషుఁ డనియు, ప్రస్తుతజమీందారు, అనియు) శేముషీయుతుఁడనియు (శేముషీమతిః శేషుఁ డనియు, జమీందారు, కవి కాన శేముషీయుతుఁ డగుననియు) అతని దుహిత స్వభావసిద్ధముగఁ దండ్రి గుణగౌరవమును పొందునదియే కాక అట్టికాంత చే నిర్వహింపఁబడుట చేతను కుమారుని నామము (నారాయణశబ్దము శివవిష్ణులందు వర్తించుచుండుటం జేసియు, కుమార్తె నామము, పార్వతీ, (హైమవతి) లక్ష్ముల (లక్ష్మి) నామములతోఁ గలసి యుండుటం జేసియు తదభిమానయుతులై పార్వతీ శ్వరులు (శ్వేతదేవులు) శ్రీప్రదాయకులై లక్ష్మీవిష్ణువులు ధనప్రదాయకులై వరిం

చుటచేతను, వధూవరుల కాపురము (శేముషీయుతోన సమేతమగుటచే) నిత్యసౌఖ్యసమేతమగుననియు నాశయము.

## 198. పరిమి నరసింహముగారు.

శ్లో॥ శ్రీనివాసస్సదాపాతు
శ్రీభుజంగాధిపం ప్రభుం
శ్రీసమానాం వధూంచైవ
శ్రీవిష్ణుసదృశం వరం. 1.

శ్లో॥ విద్వద్రాజశిఖామణేశ్శివపదస్థో జాతేవనిత్యైకతా
సా నేశేవినివారితా తవరుచాద్విత్వం మృగాం జాప్యర్కయోః
త్రిత్వంచాప్యపనీత మగ్నిషు శుచిత్వేనర్షిషు ద్రాగగా
త్త్వద్భక్త్యాద్య చతుష్ట్వమిష్టకలనాత్పంచత్వ మింద్రద్రుషు. 2.

శ్లో॥ బృందావనాఖ్యనగరేనివసన్ త్సుఖేన
కాలవ్ననయామి ఫణిరాజ కృపావిశేషాత్
అనాయిమన్నికటమగ్య భవత్సుతాయాః
పాణిగ్రహోత్సవనివేదక పత్రికాసా. 3.

శ్లో॥ కార్యాన్తరస్యవశగోహమశక్నువన్ త్వ
న్నాగత్యవీక్షితుమహో సుమహోత్సవంతం
భావత్క నూతనవధూవరయోః కరోమి
హృద్యామకృత్రిమగిరాశిషమత్రతిష్ఠన్. 4.

శ్లో॥ భూంపత్యోర్వరనతయోస్సుఖంనితరతాత్సర్వేశ్వరస్సర్వదా
శేషోవ్యాద్ధాయు సౌఖ్యముర సావాక్పాటవంవాకృతిః

ఆయుష్యం కమలాసనో వితనుతా దారోగ్యమర్క స్సదా
దద్యాత్ప్రీతిమచంచలాం మనులభామార్ధాంగజానిశ్శివః. 5

శ్లో॥ యోలక్ష్మీంపరిహాయ సింధుతనయాంస్థాతుంనశక్తః క్షణా
త్రిద్వత్కృష్ణల ఏవసమ్యగుపదేశ్యానందమ గ్నోహ్యభూత్
స్తోతుంశ్రీరమణః కరోతి నితరాంప్రేమాతిరేకంమిథో
దంపత్యోరనయోః పరస్పరతపస్సంపత్ఫలీభూతయోః. 6.

శ్లో॥ ఇంద్రశ్శ్రేష్ఠంద్రవిణ నిచయంసన్నిధాత్వేతయోర్వై
తేజస్విత్వంవితరవిమలంతేజ అగ్నే నురేషు
ఆయుర్దాతాభవ సుమహావిహా సమ్యగిద్ధోఘృతేన
స్వీయాన్ పుత్రాన్ పితర ఇవతౌదంపతీ రక్షతాత్త్వం. 7.

శ్లో॥ ఆయుఃప్రపద్యస్వదనయోర్హుతాశో
ఘృతప్రతీకోఘృతయోనిరగ్నిః
ఘృతంచ పీత్వామధుచారుగవ్యం
పితేవపుత్రానభిరక్షతాదిమౌ. 8.

శ్లో॥ భువన విదితవంశే వర్ధమానాదభిఖ్యే
వరమము మభిజాతం కన్యకాంచప్రసూతాం
నృపవరతనవంశే శ్రీయుతేసందధానో
విధిరభవదిదానీంతుల్య సన్ధానకర్తా. 9.

శ్లో॥ బృందావనాఖ్యనగరస్థితపార్థసద్మ
న్యధ్యాపకేనపరిమిత్యుప నామభాజా
ఆశీః పురస్సరమియం వరసింహనామ్నా
ప్రాహీయతాత్రభవతాంభవతాంనుశేఖా 10.

## 199. మంచి శివరామయ్యగారు.

వీరి ప్రస్తుతనివాసస్థలము శ్రీవిజయనగరము. వేగినాటివైదికులు. ఆపస్తంబసూత్రులు. భారద్వాజసగోత్రులు. రామస్వామిశాస్త్రులవారి పుత్రులు. తల్లిగారిపేరు సరస్వతమ్మ. ప్రమాదూతసంవత్సర చైత్రశుద్ధ పంచమి జన్మదినము. వీరు ఆంగ్లేయ విద్యనభ్యసించి పట్టపరీక్షయందును, యల్. టి. యనునుపాధ్యాయ పరీక్షయందును కృతార్థులైయున్నారు. పట్టపరీక్ష కాఁగానే విశాఖపట్టణమండలమునఁ గలెక్టరు కచేరిలో నొక సంవత్సరముద్యోగముచేసి తరువాత ఖాసిముకోట జమీందారువారగు శ్రీమారెళ్ల వేంకటాచలము పంతులుగారికి నాలుగేండ్లు ట్యూటరను పేర నాంగ్లేయవిద్యాగురువులుగానుండి యిప్పుడు పదిసంవత్సరములయినది, శ్రీవిజయనగర మహారాజావారి యాంగ్లేయకళాశాలయందు విద్యార్థులకు ఆంగ్లేయభాషనుగఱపుచున్నారు. వీరితమ్ములును, సహాధ్యాయులునగు సుబ్బారావుగారు పట్టపరీక్షయందును బి. యల్. అను ధర్మశాస్త్రపరీక్షయందును కృతకృత్యులై విశాఖపట్టణమండలన్యాయసభలో న్యాయవాదిగానున్నారు. వీరితండ్రిగారు ఆంధ్రగీర్వాణ భాషాసాహిత్యముగలిగి యుభయకవిత్వములయందును ప్రవీణులై యుండుటంజేసి తద్వాసనాబలముచేతను చిన్నతనమునందు సంస్కృతవిద్యార్థులతోను, బిమ్మట విద్వాంసులతోను సహవాసము లభించుటచేతను వీరికి సంస్కృతమందుఁ గొంతపరిచయముగలదు. తెలుఁగుగ్రంథములను ఆసక్తితోఁ జదువుచుండుటచేత నొకరీతి కవితాధార యలవడినది. ఉత్సవసమయములయందు వీరు రచియించిన యుత్పలమాలికలు సంగీతకృతులు గొన్ని గలవు.

### ఉత్పలమాలిక.

శ్రీరమణీయలీలవిలసిల్లెడు పద్మభవుండు మేటిసిం
గారమెసంగ మానికముఁ గాంచనమున్ జతకూర్చినట్టి లీ

చారువధూవరాత్మక ప్రశస్తవిభూషణమెంచియిచ్చిబ
ల్పైరిమిరెండువంశములు పేరువహింపఁగఁజేసె, బంధువుల్
సూరిగణంబుసర్వజను లున్మదమందఁగమించుదంపతుల్
పారికుసజ్జనస్తుతుల సంతసమెచ్చఁజెలంగియాత్మలోఁ
గోరినకోర్కెలెల్లసమకూడుము నుండఁ జిరాయురున్నతుల్
భూరిశుభంబులందుచును బూవునుదావియునన్మెలంగఁగ
శ్రీమరమణుండొనర్చుతవిశేషకృపామతిఁ వేడ్కఁ జెందుమన్. 1.

ఉ|| వాణిహిరణ్యగర్భులవవాసిదలర్చి, శచీపురందరుల్
శ్రీకుజరించువట్టులయి సొంపులుగుల్క సతీమహేశ్వరుల్
బోణిమినంచు నెల్లరునుబోల్చ, నిజాశ్రితరాజిమెచ్చిమా
రాణియురాజనన్నిరులరాసియు సంతతిమీఱనిత్యక
ల్యాణవిలాసమైగృహమెలర్చ, మనన్వలెఁగూర్మిదంపతుల్. 2.

చ|| సిరులకుఁదావలంబులయి, చెల్మివెలుంగఁబరస్పరానురా
గరసఘనంబులై, హృదయకంజములచ్యుతసూర్యసత్కృపా
కిరణవిరాజమానరుచిఁ గీర్తిముదంబునుగూర్చ నీవధూ
వరులకుమేలుగావలెను వాసవముఖ్యసురానుకూలతన్. 3.

## 200. పాటిబండ సూర్యనారాయణరావుగారు.

వీరిజన్మస్థానము గుంటూరుజిల్లా సత్తెనపల్లితాలూకా పాటిబండయను గ్రామము. ఆఱువేలనియోగులు. ఆపస్తంబసూత్రము. భారద్వాజగోత్రము. తండ్రి వెంకటప్పయ్యగారు. తల్లిసుబ్బాంబ. వీరుక్రీ. శ. 1879-80. సం|| ల ఆప్రాంతములజన్మించిరి. వీరితండ్రిగారు గ్రామకరిణీకమును జేయుచుసహజ కవితాధురీణులై యాంధ్రమునఁ బ్రభులింగలీలాది పద్యకావ్యములరచించిరి.

క॥ ఆసర్వజ్ఞునిశాయు
న్యాసికలోనిల్చుసత్య నారాయణుతో
భాసిల్లుఁగాత! హైమవ
తీసీతావిజయలక్ష్మి స్థిరసంపదలన్. 2.

శా॥ భూతిస్ఫూర్తిపిలాసనద్భుజగిరా మృత్యుపోచిత్ర పేరణం
బ్రీతిన్ దంపతులైన హైమవతి నారీసత్యనారాయణుల్
స్వాతిప్రాభవశక్తమైనఫల దివ్యాపూర్వదాంపత్యవి
ఖ్యాతిన్ ధాత్రిని నిల్పియాత్మవిభయామోదంబుసంధించుతన్. 3.

## 201. మణికొండ శేషాచల గుప్తగారు.

వీరినివాసస్థలము కృష్ణాజిల్లా బెజవాడతాలూకా మైలవరము వైశ్య కులోద్భవులు. తండ్రి బాపయ్యగారు. తల్లిమాణిక్యమాంబ. ఇదివరలో మైల వరము యూనియన్ మెంబరుగాను, ప్రెసిడెంటుగాను న్నారు. ఇప్పుడు విలేజి మున్సిబుకోర్టులో బెంచిమెంబరుగానున్నారు. బాగుమ వెసల్ వస్త్ర ములవర్తకము. వీరిచేరచియింపఁబడిన గ్రంథములు:—1. అక్రూరోపాఖ్యా నము, 2. అనంతపద్మనాభోపాఖ్యానము. 3. నృగమహారాజచరిత్ర. 4. భళ్లాణరాజచరిత్ర హరికథలు వ్రాసియున్నారు. వామనచరిత్ర ద్విపద వ్రాయుచున్నారు.

శా॥ శ్రీకల్యాణగుణాకరుండు సురసంతీపుండు ధీరాత్ముఁడున్
సాకల్యంబుగనీనధునపరులకున్ సామ్రాజ్యసౌభాగ్యముల్
యేకాలంబునఁగల్గునంచుమఁ గృపతో నిందీవరాక్షుండుయా
లోకఖ్యాతిగనిచ్చుతాపరములన్ లోపంబు లేకుండఁగన్. 1.

మ॥ శతవర్షంబులుదీర్ఘమాయువనుచున్ శాసించిదీవించుచున్
సతతంబున్ ఘనహేమరత్నమయమైసత్కీర్తిచంద్రార్కమై

క్షితిలోనీమిధునంబు సంతతి శుభక్షేమంబు సంప్రాప్తమై
యతిసౌభాగ్యమునొందునంచుఁ బలికెన్ నాయిందిరాధీశుఁడున్. 2.

## 202. కోరాడ దుర్గానాగేశ్వరముగారు.

శ్లో॥ శ్రియంతనోతువాంసదా విదేహనాధనందినీ
ఘనస్తనాంతచర్చికామనోజ్ఞకుంకుమాంకితా
నవోపగూహలగ్న యాయయావ్యవిద్యుతాయధా
లలాసకాసరేయభూత్కలాపి బంధుబంధురం. 1.

శ్లో॥ శివాంవృష్ట్వాగంగోదక తరళచంద్రంపరవశాం
తమోభ్రాంత్యాభీతోవిధురతిహితౌమాబాధజుతితాం
అయంమూర్ధేపంధ్యానసర నటనోజ్జృంభితనదీ
విలోలచ్ఛుభ్రాంశుప్రతినిధిరితీశోవ్యస్తుయునకౌః. 2.

## 203. మంగు వేంకట లక్ష్మీనృసింహరావుగారు.

వీరి కాపురస్థలము తెనుకు తాలూకాలోని పాలమూరు. ఆనంద సంవత్సర ఫాల్గుణ శుద్ధ ౬ జన్మదినము గోలకొండ వ్యాపారి వైష్ణవులు. భారద్వాజ గోత్రము. ఆశ్వలాయన సూత్రము. తండ్రి భవానీరావు పంతులుగారు. తల్లి వేంకటరత్నాంబ. వీరు చేసిన గ్రంథములు:—1. శ్యమంతకోపాఖ్యానము, 2. శ్రీకృష్ణభక్త సంవాదము, 3. కేశవశతకము, 5. సూర్యశతకము, 6. శ్రీకృష్ణవిలాసము, 6. శశికళాపరిణయము, (శుద్ధాంధ్రనవకావ్యము) శ్రీకృష్ణవిలాసము, 50 పద్యములు మాత్రము, కట్టుపద్యములు. 7. శ్రీలక్ష్మీవిజయము, 49 ఫారముల గ్రంథము (అచ్చుకాలేదు.)

పద్యవృద్ధుల్ దనపాటి బంధులు సభన్ భాసిల్లు నాక్రాంతమౌ
భృత్యవర్గము వేదఘోషములతో మిన్నంటి దీపింపఁగా
హద్వారంబు మొదల్వివాహగృహపర్యంతంబు సంతుష్టులై
యుద్వాహోచితమైన కానుకలతో సువ్వెత్తుగా వచ్చిరి 6.

దుర్యద్వల్లినిభదేహా హైమవతికిం దుల్యుండు నారాయణుం
డీద్వంద్వంబు ఘటించు ధాతమతి సెంతే. నీద్యమానంచుఁదా
ముక్త్వేలాగ్రృతచిత్తులై జగములన్యోన్యంబు భాషింపఁగా
నుద్వాహంబొనరించె లక్ష్మికిని నిత్యోత్సాహసంపన్నుఁడై. 7.

క॥ వేంకటరామయ కొమరుఁడు
వేంకటనారాయణునకుఁ బ్రీతిని లక్ష్మీ
పంకజలోచనను సా
లంకృతగా నిచ్చెఁ బెగ్గడ భుజంగుండున్ 8.

గీ॥ హైమవతి, సీత, లక్ష్మిని, భీమునకును
రామునికిని క్రమమున నారాయణునకు
నగవరుఁడు జనకుఁడు పయోబ్ధి గడఁగి కడుఁ
బ్రేమతో నిచ్చి రానిందు వింతయేమి. 9.

గీ॥ హైమవతి సీతలక్ష్మిని భీమునకును
రామునికిని క్రమమున నారాయణునకి
(1) (2)
నగవరుఁడు జనకుఁడు పయోబ్ధిఁ గడిగియడు
కులవెలమితోడ నిచ్చెను గలదు వింత. 10.

సీ॥ శిష్టాగరిష్ఠులు విశ్వాగ్నిహోత్రులు
వ్యాయులు వడమునాటివారు

(1) నగమ్, (2) వరుఁడు=భర్త.

షట్కర్మసక్తులు శాస్త్రార్థవేత్త లె
న్నంగను వడ్లమన్నాటివారు
ధర్మాది పురుషార్థమర్మ విజ్ఞానాతి
నైపుణుల్వడ్లమన్నాటివారు.
విష్ణునిపైభక్తి వైష్ణవప్రతిపత్తి
బాటింత్రు వడ్లమన్నాటివారు

గీ|| ఇట్టి సకలగుణంబుల పుట్టినిల్లు
వడ్లమన్నాటివారల వంశమందు
జననమందిన వేంకట సత్యమూర్తి
గోరనారాయణుని లక్ష్మికూర్మితోడ. 11.

గీ|| హైమవతి కుంకుమంపు రేఖామహితని
టలయుగుడు వేంకటేశ్వరుఁడలికనేత్రుఁ
డాయెటో మ్మొక్క నిల్పినయాతనికిని
దంతయుంతు లెంతైనఁగావింత్రుపతుల. 12.

క|| మంగళసూత్రమ్మును శ్రీ
మంగళమునఁగట్టె సర్వమంగళ కరుణన్
మంగళదేవి నామకు
మంగళవార్ధయు శుభంబు వృద్ధింబొందన్ 13.

క|| ఓసీసేపాయీమా
యీసీతాయిమగనిపయి నెట్టలోకను మా
నేసలుజలైను నంచును
భాషింతురు [illegible]. 14.

సీ॥ ఒక క్రేంకఁగఁగట్టి తగతెయ్యిత్ధా తెయ్య
టంచుగణికలు నాట్యంబులాడ
నొకచోటనిటుగా శుకపికస్వరముల
వాంశికవైణికుల్పలికిపాడ
నొకదండ సందడి నొండొరులరాయుచు
ద్రోయుచు నెల్ల పౌరులును జూడ
నొకచెలవెన్నెల లుదయించు దీపాల
వెలుఁగున జానపదులును గూడ

గీ॥ నొకెడ నవవిధ వాద్యంబు లొప్పమీఱ
నొక్కప్రక్క బట్టులు నుతుల్పెక్కు చెప్ప
నింకనొకవంక వైదుపలెత్తినార
తులను జెలఁగెఁ బెండిలి దంపతులకుఁ దులను. 15.

క॥ తులచేరు దంపతులకని
తులమాచినటులుగఁ జేసెఁ దోయజభవుఁ జే
తుఁ తలమ పొగడఁగన్నియ
తులకుం దొలఁగంగ వశమె దొరలకునైనన్ 16.

గీ॥ రవిశశికుజ శశిజగురుకవిశనులుర
హుధ్వజాలు మూఁడిటను ఛాయమునను బదిఁట
గంటనాల్గిఁట వెండియుఁ గంటనెన్మి
దింటనైదింట నుబదునొకంటనుండ 17.

క॥ క్రమముగ నారోగ్యమ్మును
సుమనస్కత భూమి విద్య సుతసౌభాగ్య

మ్మమి తాయెూవు విక్రమముమ
హీమలు నవనధూనసుంకు నిమురుకటు చేన్ 18.

క॥ గురుహోర దులాలగ్నము
హరిణిజ శుక్రగురు చంద్రతరణులుశుభులై
పరుసంబంచేష్టిక ఫల
నరములగుదురు సతతంబు నధునరులకిలన్ 19.

క॥ బుధుఁడౌకఁ డెమింటను మృతాం
బుధులింపా ఔదనినిరఁట బుధులును నమృతం
బుధును లైకుక్కలు చిత్రం
బుధరపయిభుజంగరాజ పుత్త్రిక పెండ్లిన్. 20.

సీ॥ బూరెలుతింపువా బొజ్జ బాపడయున్న
పద్దనివి స్తరిపైనినంగు
గోధూమపూరీలు గాధిగోత్రుఁడయున్న
బదులు చెప్పఁడు పంచెనదులు చేరు
నేయిగానలయూ నేమో యెుజ్జనయ్యనా
శేయూతనిమ్మని చేయూసన్న
లడ్డులుబాగుండె నద్దంతువన్న సే
గుండెగొట్టుకొనును దిండిపోతు

గీ॥ చిక్కనౌపాలలో మంచిచక్కరయును
కేలకులఁగొట్టిపాడియును జాలఁగలిపి
చేసిరిపాపెముదినువా నీసమంత
రైునసందు లేదను గాక మానిద్విజుఁడు. 21.

క॥ మా బాబు నీకు దండము
మా బాగుగనుండె బెండ్లిమాటీ యుక్త్రిటలే
దిబూరెలు బాసిమ్మను
సేబాసయ పుణ్య మంద్రు సేనక జనముల్. 22.

మ॥ పతిశుశ్రూషను సత్త్రమాములకు సేవత్సేతలన్నాధ్వికిన్
సుతసౌభాగ్య చిరాయువుల్లలుగునంచుం జెప్పఁగా శేషులం
కృతరైయెవాణి సువర్ణమాలఁగొని లక్ష్మిన్ భర్తనారాయణుం
గుతుకమ్మాంతతఁగొల్వనచ్చెనఁగా గొండయ్యోనాప ద్దముల్ 23.

క॥ శుభదులు పురాణదంపతు
లభీప్సితార్థముక్తిదులు రభినవజాయా
విభులకు శ్రీభాషోమా
విభులనయము మనములందు బెరిగెడు పెరిమన్ 24.

క॥ పెన్నడుముగలిగినాక
న్నెన్నడు వడిగుదురగు నరునికి సత్పువికే
పెన్నఁగనిచ్చితి రేమిము
పెన్నఁడుగనలేదు నన్ను పెలమింగనుఁడీ. 25.

చ॥ కవితరచింపనేరనని కాదనకూరక యుండలేకయి
క్కవితము గాక చించితిని గైకొనుమయ్య భుజంగరాజనీ
కవితకవీశ్వరుండనెడు ఖ్యాతిధరిత్రిని నొప్పనింతజో
కవితవుగావచించినది గైకొననాను వదాన్యశోభితా 26.

క॥ తారావళిడివిగలదు కృ
తారావముతోడఁ బెండ్లియయ్యెనుగులని

స్తారావసరమి దెగడా
తారావళినే నొసఁగితి ధన్యుఁడ నైతిన్. 27.

## 204. కొండముది నరసింహకవిగారు.

వీరి నివాసస్థలము గుంటూరు మండలములోని బాపట్లకు సమీపమున నుండు అప్పికట్ల, ఆర్వేలనియోగులు. ఆపస్తంబసూత్రము కాశ్యపసగోత్రము. తండ్రిఅక్కయామాత్యుఁడు. తల్లిశాయమాంబ. శాలియుక్తి నామసంవత్సర మాఘ బ ౧౪ జన్మదినము. వీరికి ఆంధ్రవ్యాకరణ విశిష్టంబులగు సాహిత్యమునందును, కవిత్వమునందును జ్ఞానముగలదు. వీరికి సంస్కృతభాషాపరిచయమున్నది. 1890-91-92-93-94 సంవత్సరముల అముద్రితగ్రంథ చింతామణి మయూఖములఁబరిఖపరిఘాది శబ్దములయొక్క వివాదముల వీరు వ్రాసిన వ్యాసములు చాలకలవు. చిన్నతనమున విద్వాంసులుగల కొత్తపల్లిమున్నగుస్థలముల నష్టావధానము చేసినవారు. ఆశుకవిపింహుల సోదరకవులను, చీరాల, పూర్ల, బాపట్ల సభలయందు వారి యాశుధారా కవిత్వమును వీరి యాశుధారా కవిత్వముతోనే మిక్కిలి నుతించినారు. శ్రీహార్డింజి ప్రభువుగారి జన్మదినసోత్సవమున బాపట్ల మీటింగులోవారి యాదార్యాది గుణముల నాశుధారా కవిత్వముచేఁజక్కగావర్ణించిరారని 26జూన్ మద్రాసు మేయిలు హిందూ పత్రికలయందుపొందుపరచినారు. వీరికి భూజీవనము గ్రామోద్యోగముగలదు. వీరు రచించిన యాంధ్రగ్రంథములు:—1. వేంకటేశ్వరశతకము, 2. దుర్జనభంజనీ శతకము, 3. జగదీశ్వర శతకము, 4. వత్సలనీతి శతకము, 5. పాంచాలీ పరిణయనాటకము, 6. సైంధవ పరాభవనాటకము, 7. కవిచర్యప్రహసనము, 8. ఆత్మారామచరిత్రము, 9. భోజచరిత్రము. 10. శ్రీరాణీ చక్రవర్తినిగారి ట్రిమేసనుకు సరియైనతెలుఁగుపద్య కావ్యము, శ్రీయెడ్వర్డు చక్రవర్తి శ్రీజార్జిచక్రవర్తి గార్లమీఁదఁగృతినిచ్చినవి. మఱియుఁగొన్ని చిల్లరవి.

శా॥ శ్రీమద్దివ్యచిరాయువున్ స్థిరతరశ్రీయున్ వదాన్యత్వమున్
సామాన్యేతరదైవభక్తియు సదాసత్సంగతిన్ సత్కీమున్
నేమంబొప్పఁగనిచ్చి హైమవతినిన్ శ్రీసత్యనారాయణున్
బ్రేమన్ రక్షణసేయుఁ గాతవిభుఁడా శ్రీశంకరుం డర్మిడన్ 1.

చ॥ నిరుపమభక్తి నేసతి వినిర్మలపాదసరోజమున్ వధూ
వరులువివాహ కాలమున వాంఛదలిర్పఁగఁగొల్చి సౌఖ్యముల్
స్థిరముగఁబొందుచుందురిల సిద్ధయశోయుతులై నితాంతమా
గిరిసుతయీవధూవరులఁగీర్తి విశాలుర సేయుఁగావుతన్ 2.

మ॥ ధరణిన్ దంపతిభావమెవ్వరు యథార్థంబైతగందాల్చుచుం
జిరజీవిత్వముభక్తసంతతులు సంసిద్ధంబుగానిత్తురా
స్థిరకారుణ్యులు నాదిదంపతులు నాశ్రీపార్వతీశంకరుల్
ధరదాంపత్య సుఖంబునిచ్చెదరు గాతన్ బ్రీతినశ్రాంతమున్. 3.

క॥ శ్రీసర్వేశ్వరుఁ డిడునా
నాసంపద్గరిమ సత్యనారాయణకున్
భాసురతరముగ హైమవ
తీసీతావిజయలక్ష్మి దేవికి నెపుడున్ 4.

క॥ జనమాన్య సులక్షణములఁ
దనరారు వధూవరులకు ధనధాన్యకళా
ఘనపుత్రపౌత్రబలముల
మునుకొనిదయ సేయుదురుత్రిమూర్తు లనిశమున్ 5.

---

## 205. క్రొత్తపల్లి సూర్యరావుగారు.

వీరు గోదావరిజిల్లా పిఠాపురము డివిజనులోని చెందుర్తిలో శ్రీముఖ సంవత్సర చైత్ర బహుళ ౧౨ గురువారము సూర్యోదయ సమయమున జన్మించిరి. కౌండిన్యసగోత్రము. తెలుగాణివైదికులు. ఆపస్తంబసూత్రము. తండ్రి రామన్నగారు, తల్లిసుబ్బమ్మ. వీరు 17 సంవత్సరము మొదలుకొని నాఁడెలో రాజయోగి ముద్రాక్షరశాలలోను, సరస్వతీ ముద్రాక్షరశాలలోను పనిచేయుచుండియిప్పుడుచెన్నపురి ఆంధ్రసాహిత్య పరిషత్కార్యస్థానము మేనేజరుగానున్నారు. వీరికి సంస్కృతము, తెలుఁగు, ఇంగ్లీషు, హిందుస్థాని కన్నడము, ఓఢ్రముమొదలైన భాషలలోవ్రాయను, జదువను, మాటలాడను, నేర్పుగలదు. తెలుఁగున రసవంతముగాఁ గద్యపద్యములలో వీరుస్వకపోలకల్పితముగా గ్రంథములు రచింపఁగలరు. వీరు రచించిన గ్రంథములు:—1. సంస్కృతనాటక కథాసారము, 2. దుర్యోధనాభిమానము, 3. కన్యకాపరమేశ్వరీనాటకము, 4. కపిలగోవు, 5. ఫసానేఅజాయుబ్, 6. జపానుదేశచరిత్ర 7. ఆనందసాగరము, 8. గుణమంజరి, 9. శుద్ధాంధ్రనిరోష్ఠ్య నిర్వచనకుచేలచరిత్ర, 10. హరిశ్చంద్ర మహారాజుకథ, 11. త్రిలోకసుందరి, 12. నైవేద్యము, 13. వీరస్త్రీలు, 14. కాంత, 15. సత్యవాక్యము మొదలైన గ్రంథములు దాదాపు ముప్పదినలుబది గ్రంథములు.

శా॥ శ్రీమద్భక్తభుజంగరాడ్వరునిసు శ్రీమించుతత్సంతతిన్
గోమొప్పన్ శిరసావహింతుసెటివక్కుం జేర్చిలాలింతునేన్
బూమెల్గావిదెదాన కంకణమునామున్జే వటంచుఁదునం
దామోదార్థమునిల్పినట్టులభుజంగాంకంబుఁ గావించునా
సీతాతీతదయాస్వరూపుని శతంజీవత్వసౌభాగ్యసు
త్రామైశ్వర్యదృఢానుకాగవిలస ద్దాంపత్యముంజెల్వమున్
శ్రీమద్భూధరరాజ కన్యయొవిపేర్మిన్ సత్తపః ప్రాప్తిచే

భూమైశ్వర్యశివున్ వరించెననుచున్ ముల్లోకముల్ లౌకిక
వ్యామోహంబునమంచు హైమవతి శశ్వత్పుత్రపౌత్రాదికే
తోమాంగల్యము నెల్లకాలమును సంతోషంబు సద్వృత్తియ
త్యామేయార్థము లీవధూవరుల కీయంగోరి ప్రార్థించెదన్
శ్రీమద్రామచరిత్రమట్లు మృదులస్ఫీతంబు బాల్యంబునన్
శ్రీమద్భారతమట్లుయౌవనమునన్ శ్రీకృష్ణలీలాగతిన్
గౌమారంబునవార్ధకంబునఁ ద్రయీకాండాంత వాక్పైపుణిన్
సామర్థ్యంబునఁబల్కునేర్చి జనకుల్ సంబంధులున్ మిత్రముల్
ప్రేమింపన్నుతిపాత్రమౌత మెపుడున్ శ్రీయుక్తమీద్వంద్వమెం
తేమోదంబుననీసభాసదులు సద్వృత్తాన్వయాచారవా
ణీమాధుర్యవినోదులిచ్చెదరుసస్నేహంబునన్ దీవనల్
రామంబైనకురంగశాబకము, స్ఫూర్జచ్ఛూలముంజేతులన్
గోమాభాగశిశుంద్రిశూలమును దత్తుండెవ్వఁడేతాల్పెనో
కామాతీతుఁడుప్రోచువీరినల మార్కండేయ సర్వేశుఁడౌ.

(1) శ్రీమద్భూధరరాజకన్య=పార్వతి, 2. హైమవతి=పెండ్లిపార్వతి, 3. మార్కండేయసర్వేశుఁడు=మార్కండేయేశ్వరుఁడు, ఏశుఁడు=ఏను.

## 206. పంగులూరి రామచంద్ర శర్మగారు.

వీరి నివాసస్థలము గుంటూరు డిస్ట్రిక్టు వంగోలు తాలూకా పంగులూరు గ్రామము. ఆఱువేలనియోగులు. ఆపస్తంబసూత్రము. కౌండిన్యస గోత్రము. తండ్రి నరసయ్యగారు, తల్లి సీతమ్మ. జన్మదినము:-సిద్ధార్థిసంవత్సర కార్తీక శుద్ధపూర్ణిమ. నాటకాలంకార ప్రకరణ సాహిత్యసహితముగు గీర్వాణపాండిత్యముగలవారు. ఛందోవ్యాకరణలక్షణ విశిష్టవివిధకవిత్వ ప్రయుక్తముగునాంధ్రపాండిత్యముగలవారు. వీరిచే రచింపఁబడిన తెలుఁగుగ్రంథములు:—
1. దధిమథనవిలాసము, (గీతప్రబంధము) 2. ప్రద్యుమ్న విజయము, (గద్య

పద్యాత్మక శ్రవ్యప్రబంధము) 3. విచిత్రరాఘవము, (గద్యపద్యరూపకదృశ్య ప్రబంధము, 4. ఆంధ్రీకృతోత్తర రామచరితము, (గద్యరూపకదృశ్య ప్రబంధము.)

ఆర్యాగీతి॥ శ్రీహైమవతీసీతా జయలక్ష్మీనామ కన్యకాంశికః
వేంకటసత్యోపపదం నారాయణనామకం వరంచాప్యాత్॥ 1.

శ్లో॥ సుకృతయశోధన వంతౌ సుపుత్రసంతౌ సుగుణగణనిశాంతౌ
పూర్ణసుఖాయుష్మంతౌ భూయాస్తాం ధ్రువమిమావధూకాంతౌ 2.

క॥ రహివిఖ్యముదగ వెలసెన్
మహిమంత్రి ప్రెగడవడ్లమన్నాటికులో
ద్వహులగు భుజంగరాడ్ధూ
ర్వహ వేంకటరామమంత్రి వరులిరువురకున్. 3.

క॥ వారలసుకుమారీసుకు
మారులు కళ్యాణదివ్యమంటపమునఁ జె
ల్వారుదురుగాత యీసుకు
మారులరతీ రమాకుమారులభాతిన్. 4.

సీ॥ ధన్యుఁడీవరుఁ డఘుధ్వంసియాశంకరు
వంశముసత్యాత్ముఁడైవరాము
వంశము నరసమూహోధారుఁడగు విష్ణు
వంశమునుంబూనియవతరించె
నాగ వెంకటసత్యనారాయణాభిఖ్యఁ
దాల్చెనీకన్యకతదను గతిని
గిరిజవలెన్ జానకి రమాంశములను
గాంచియాలొండ సత్యవించెనాగ

గీ॥ ఖ్యాతిఁగని హైమవతియన సీతయనఁగ
విజయలక్ష్మియనంగను వేఱులేని
పేరునొకదానిదాల్చెనీ పెండ్లికొమరు
లఖిలజనలోకరంజకులగుటకరుదె. 5.

సీ॥ వీరిదాంపత్యమిర్విని పార్వతీమహే
శ్వరమాత్ర సత్యమైపరగుఁగాత
వీరివాల్లభ్యమిర్విని భార్గవీచక్ర
ధరమాత్రలభ్యమై తనరుఁగాత
వీరిసౌభాగ్యమిర్విఁబులోమజాపురం
దరమాత్ర భోగ్యమైపరలుఁగాత
వీరిసౌందర్యమిర్విని రతీశంబర
హరమాత్రధార్యమైయలరుఁగాత

గీ॥ వీరి పూతస్వభావమిర్వినరుంధ
తీవసిష్ఠైకజీవమై దేలుఁగాత
వీరియాయుః ప్రమాణమిర్వనిసరస్వ
తీవిధాత్రైకమానమై తనరుఁగాత. 6.

## 207. నందిరాజు చలపతిరావుగారు.

వీరి వయస్సు సుమారు 35 సంవత్సరములు. తండ్రి సుబ్బారాయఁడుగారు. తల్లిసుబ్బమ్మ. వీరు రచించినగ్రంథములు:—(పద్యకావ్యము) విజ్ఞానదీపము, 600 నూతనమైనట్టి శాస్త్రవిషయములతోఁ గల్పింపఁబడిన, అద్భుతకథాసంవిధాన విలసితమైనది. (గద్యము) ఉపవ్యాసదర్పణమనఁబడు ఆంధ్రసాహిత్య దర్పణము, (నాటకములు) చిత్రాంగి, నలనాటకము, రాజ

కళింగగంగు, ఇంగ్లీషుతెలుఁగుభాషానిఘంటువు. ఇండస్ట్రీమున్నగు విషయిక గ్రంథములు.

ఉ॥ శ్రీయుతుఁడాద్యుఁడవ్యయుఁ డశేషవిలాసుఁడజుండుసత్యనా
రాయణుఁడర్ధిరక్షణకళామర భూజుఁడు నైగమోక్తదీ
ప్తాయతతేజుఁడంచితశుభావహుఁడో మెడుగాత మెప్డుదీ
ర్ఘాయురవాప్తసంపదలు రంజిల దంపతులన్ ముదంబునన్. 1.

సీ॥ శ్రీమన్మహాజనాశీర్వాద పదమూర్తి
సకలదిగంత విశ్రాంతకీర్తి
సాహిత్యసాహిత్య చాతుర్యవిస్ఫూర్తి
యార్యానుకూల చర్యానువర్తి
భూజన స్తవనీయరాజ కీయానేక
కార్య వినిర్వాహధుర్యశక్తి
కరుణామృతాసార భరితకనీనికా
మానితదీనావనానురక్తి

గీ॥ ఆత్మవత్సర్వభూతాని యనుచుఁదలఁచు
మాభుజంగునిపుత్త్రి హైమవతి పెండ్లి
ఆదిమిథునంబులగు గిరిజామహేశు
పరిణయంబువిధంబునఁ బరగుగాత. 2.

గీ॥ మొనసినూరేండ్లు రైదువతన మహిని
శ్రేష్ఠముగు పుట్టినింటి ప్రతిష్ఠఁగాచి
యత్తమామలు కన్నుల నొత్తుకొనఁగ
శ్రీలనేలుము హైమవతీలలామ. 3.

గీ॥ ఆత్మవత్సర్వభూతాని యనెడునీతి
యరయమిచ్చెను నీతండ్రి యద్దిగొనుచు
పతియె దైవంబటంచు సంపదలఁబొదలి
మించియుండుము వ్రేలు వంపించుకొనక 4.

ఉ॥ ఖవ్వను బెట్టియాపయిని పాయసమాదిగ నేదియేదిరా
యొవ్వఁగఁజేరఁబెట్టియదిగో శ్వశురోత్తమసద్గృహంబునీ
వవ్వుడెపోదువేయనినయంతఁ గికాకికలాడుచుండుచి
న్నప్పుడు నేడుతద్గతిఁజనంగదె ముద్దులపెండ్లికూఁతురా 5.

ఉ॥ ఆయతధర్మమార్గమువిరంతరమున్ గమికొంచుసత్యవా
రాయణసద్వరుండు విమలామృత రాగరస ప్రవాహమున్
బాయకగొల్వ హైమవతిఁ బాలనజేయుత మెప్పుడున్ జగ
ద్గేయవివేకధుర్యుఁడయి కీర్తిధనంబుల పెంపుఁగాంచుచున్ 6.

మ॥ ధరవాత్స్యాయన సూత్రధర్మములు విద్యాప్రౌఢిమీఱన్ మహా
దరమొప్పన్ జటిపించుచున్ బరహితార్థంబుల్ నడింజేయుచున్
దిరమొప్పన్ దనుపుత్రపౌత్త్రికలతో దివ్యోపభోగంబులన్
ధరనూరేడులు కుంకుమాంకముఖ సౌందర్యమ్ముతో నుండుమా 7.

శా॥ ఆశీర్వాదముఁగోరి వ్రాసిన శుభాహ్వానంబుఁగైకొంచువి
ప్రాశీః పాత్రములైనదంపతుల కళ్యానందముంగూర్పఁగా
నీకున్వేడెదసర్వసంపదలతోం జేయిచ్చువాఁడౌటది
ద్దేశాయాతకవీశ్వరాళిమదువుల్ గీర్తిద్యుతుల్వెంతకే 8.

## 208. బొమ్మకంటి నృసింహశాస్త్రిలుగారు.

వీరి నివాసస్థలము గోదావరిజిల్లా ర్యాలిగ్రామము. వీరు త్రివింగవైదికులు. ఆపస్తంబసూత్రము. హరితసగోత్రము. తండ్రిపేరు శాస్త్రులుగారు. తల్లి సుభద్రమ్మగారు. నలసంవత్సర మాఘ శుద్ధ ౧౧ జన్మదినము. జగ్గంపేట సంస్థానపండితులు. కావ్యనాటకాలంకారాది సమస్తసాహితీ గ్రంథాధ్యాపకులు. మహాభాష్యాంత వ్యాకరణ శాస్త్రమును, అనయవాంతము నలుకుదర్క గ్రంథమును, వ్యుత్పత్తివాదము, మంజూష మొదలయిన శబ్దఖండ గ్రంథములును, సూత్ర భాష్యమును, గురుముఖముగాఁ జదివిన వారు. తరుచుసంస్కృతమందు మాత్రముకవితారచన చేయుచున్నవారు. 1. తిలకసహస్రము, 2. మణిమంజరీ విశ్లేషమనుద్వైతమత ఖండనగ్రంథమును గ్రమముగా శ్లోకరూపముగాను, వాక్యరూపముగాను రచించిరి.

శ్లో॥ శ్రీమన్ భుజంగ విభువత్సత వాత్మజాయా
వైవాహికోత్సవ సమాగమ బోధవాచ
యత్రేషితంవినయ వాగ్వితతంసుపత్రం
తత్రేక్ష్య మోదభరితం మమచిత్తమాసీత్ 1.

శ్లో॥ తాదృఙ్మహోత్సవ నిరీక్షణకౌతుకేన
సంచోద్యమానహృదయోపిరుజానశాంగః
నైశేతదాభి గమనాయసుధీ ప్రయాసః
కల్యాణపద్య సరణింకలయేసుధాస్వం 2.

శ్లో॥ గుణాలవాలస్యత వాత్మజాయాః
పత్యుశ్చతస్యాశ్శుభ మేవసిద్ధం
తథాపిమాధ్వ గ్వచసాంఛనోద
స్వస్యానువాదోస్తు ముదావహస్సన్ 3.

శ్లో॥ కల్యాణలక్ష్మీ కలయాసమగ్రా
కన్యావశాస్తాం కమనీయమూర్తీ
ఆయుర్బలారోగ్యసుఖానురాగ
ప్రజానుకూల్యాది శుభాన్వితాతే 4.

శ్లో॥ బ్రహ్మాద్యుక్కుల భవేనన్పసింహ
భిఖ్యయావిలసితేన బుధేన
ఆశిషశిఫణితి రల్పపదీయం
నిర్మితాకృతి పతేశ్శుభసృధ్యై 5.

## 209. తిరుమల ఉప్పరపల్లె రంగాచార్యులుగారు.

వీరి నివాసస్థానము, అనంతపుర మండలములోని యుప్పరపల్లెయను చిన్నగ్రామము. అనంతపురమున సైతము పెద్దయిల్లును, శిష్యులునుగలరు. శ్రీ వైష్ణవబ్రాహ్మణులు. శఠమర్షణగోత్రము. తండ్రి కృష్ణమాచార్యులుగారు. తల్లి లక్ష్మమ్మ. ప్రకృత కాపురస్థలముగుత్తి. కాళయుక్తి సంవత్సర ఆశ్వయుజ శుద్ధనవమి జననము. లండన్ మిషన్ హైస్కూలునందు 1888వ సంవత్సరము మొదలిప్పటివఱకుఁదెనుఁగు పండితులుగానుండిరి. రసాలంకార సాహిత్యమందును, వ్యాకరణమందును తెలివిగలవారు. ఆంధ్ర గీర్వాణములందు సమాన పాండిత్యముగలవారు. చాటుకవిత్వమునందు శక్తిగలవారు. తెలుఁగున బురంజనోపాఖ్యానమును నాటకరూపమున రచించినవారు. వీరిపూర్వీకులు తర్క వ్యాకరణ సాహిత్యకవిత్వములం దసమాన పాండిత్యముగలవారు. ఆచార్య పురుషులైనందున శిష్యసంపదచేతను, జీవించుచు, అనంతపురప్రభువుల యాస్థాన పండితులైమాన్యములు సంపాదించుకొన్నవారు.

క॥ శ్రీమద్భుజంగరాయా
ధీమహితయశోవిశాల దీపితతేజా

కామితకల్ప కభూజా
సేమంబుగుఁగాతమీకు శ్రీహరికరుణన్ 1.

క|| రాజామంత్రి ప్రెగ్గడ
భోజాధీమంతకల్ప భూరుసూతేజా
పూజాపరులిద మెచ్చఁద
నూజాపరిణయ మొనర్చిసూర్జిత కీర్తి 2:

క|| శ్రీలక్ష్మీ హైమవతీ
శీలంబులుగల్గియుంటి సిరిపలెతానుం
జాలంగశుభము నొందుత
బాలామణివిజయలక్ష్మి పరమాత్మకృపన్ 3.

క|| నారాయణ రాయనినిద
నారాయణుఁడెపుడు మిగుల నచ్చికతోషన్
పారత రాదరణంబున
ధీరమతింబ్రోచుఁ గాతధీరు లుమెచ్చన్ 4.

క|| ఈ దంపతులకు నాయువు
మోదంబలరారు సిరులుముఖ్యసుఖంబా
మోదంబుత్త్రిప్రాప్తివి
నోదంబులుగల్గుచుండు నూర్జితకీర్తి 5.

క|| కవిపండిత సంఘంబిట
సువిమలమతితోడ మీరుసోదరబుద్ధిన్
శివిలాసంబునఁ గూర్పితి
రవిథమునంగూడి యుండుమార్యులు మెచ్చన్ 6.

క॥ ఈ యాంధ్రభాష నెచ్చెలి
నీయింటంజరుగు పెండ్లి నెమ్మదిలోఁ బ్రేమై
సాయమొనర్చిన రీతిగ
నాయమవిచ్చె నసభకు నధిక ప్రీతిన్ 7.

క॥ పేరంటంబిదె పెండ్లికి
నూరందఱువచ్చుచుండ నోపికతోడన్
గోరంతకొఱఁత లేకను
పేరంటమువచ్చెబాస పేరిటిసతియున్ 8.

క॥ శ్రీలొసఁగు మీకు నెప్పుడు
చాలగమీపుత్త్రపుత్త్రి జామాతృలకుం
బోలఁగసౌఖ్య పరంపర
లోలింగలిగింపుఁగాత లోకేశుఁడొగిన్ 9.

## 210. దంతుర్తి సుబ్బారాయశాస్త్రిగారు.

వీరు రాజాప్రోలు తాలూకాలోని పల్లెలనివాసి. త్రైలింగ్య వైదిక బ్రాహ్మణులు. ఆపస్తంబసూత్రులు. ఆత్రేయగోత్రము. తండ్రి గోపాలయ్యగారు. తల్లి సీతమాంబ. జన్మదినము దుందుభిసంవత్సర శ్రావణశుద్ధపంచమి. సంస్కృతాంధ్రహిందీ హూణభాషాప్రవీణులు. ప్రస్తుతము పెద్దాపురస్థిత మిషను మహాపాఠశాలయందు సంస్కృత పండితులు. వీరు రచియించిన గ్రంథములు:— 1. భావశతకము—ఇది నాగరాజ విరచితసంస్కృతము నకునాంధ్రీకరణము, 2. పరమహంస విలాసము,—స్వకల్పితము. 3. ఆత్మ రణత్వము, ఇది వచనము. సంఘసంస్కరణము, సంస్కృతభాషాధ్యయన ములోనగు నుపన్యాసములు. (ఇవి తెలుఁగువి) సంస్కృతకావ్యము

లిప్పటికి రచియింపలేదు. రాజుప్రోలు, పల్వలమునను శబ్దములకుఁ గ్రమంబుగ రాజోలు, పలివెలయని వ్యావహారికనామములు.

గీ॥ శ్రీకరుఁడుభక్తవశుఁడులోకైకగురుఁడు
గురుకృపామతి నిత్యవధూవరులనెలమి
ముదముగదురఁగ ననురాగమెదలఁబొదల
నాయురారోగ్యములొసంగి యరయుఁగాత. 1.

క॥ మిక్కిలిమక్కువనెక్కొన
నక్కనసిరిపడఁతిఁ దాల్చియలరెడివేల్పు
చక్కనిచిఱుదంపతులకు
నొక్కటిసరివలపులెసఁగ నొసఁగుతఁగోర్కుల్. 2.

క॥ కలుషలచెలి నొదలవలి
మలసుతపామేనఁ దాల్చిమలగెడిశివుఁడీ
కలికివధూవరులకుబలు
కలిమిచెలిమికలిమిదొలుకఁ గావుతమెపుడున్. 3.

మ॥ సమశీలవ్రతయుక్తులంచిత సదాచారప్రచారాన్వితుల్
విమలోదాత్తగుణాకరుల్ వరశుభావిర్భూతిసంశోభితుల్
సుమనస్సంచయశస్తనిస్తులకులుల్ శుంభద్యశోభాసురుల్
కమనీయాకృతులీ వధూవరులుసౌఖ్యంబిమ్ములంగాంచుతన్ 4.

ఉ॥ భావములొక్కటన్ సరసభావ నిరంతరలాలితంబుగాఁ
బావనులీవధూవరులు పాలునునీరునుబోలెనేకమై
పూవునుదావియుంబలెనుబోల్పగఁ గూడికఁజెందిపూర్ణసం
భావితసర్వభోగములవారికఁగాంతురుగాతనిచ్చలున్ 5.

గీ॥ కలితశుభయుత మంత్రి పెగడభుజంగ
రాయకవిరాజ పుత్రీవిరాజమాన
పరిణయోత్సవవేళను బరిఢవిల్లు
పండితకవీంద్రమండితోద్దండసభకు. 6.

గీ॥ అమరదంతుర్తి సుబ్బరాయాహ్వయుండు
సుమహితంబుగఁ బెద్దాపురముననుండి
పంచరత్నంబులివి పంచెనంచితముగఁ
బెండ్లికానుకగాఁ గడుఁబ్రియముదనర. 7.

## 211. పండిట్. వి. యజ్ఞేశ్వరశాస్త్రిగారు.

గీ॥ మూర్తిభేదంబుచేతఁ ద్రిమూర్తులైన
దివ్యమూర్తులదంపతుల్ దీప్తమాను
లఖిలసుఖములనందిచ్చు హైమవతికి
రమణ వేంకట సత్యనారాయణునికి. 1.

గీ॥ నిత్యమంగళకరులును నిర్మలాత్ము
లాదిపూజ్యులుశివ నామమందువారు
హైమవతిసత్య నారాయణాఖ్యవరుల
కాయురారోగ్యపుత్ర పౌత్రాదికమిడు. 2.

గీ॥ తాతతాతలనామంబు దరలఁజేయు
సత్యనారాయణునిగోము సర్వమంగ
ళార్పునామోద హైమవత్యాఖ్యకన్య
కమలసౌభాగ్యపుత్ర పౌత్రాదికమిడు. 3.

## 212. అక్కరాజు లక్ష్మీ నృసింహారావుగారు.

వీరి నివాసస్థలము వంగోలు. నియోగిశాఖ. ఆపస్తంబసూత్రము. హరితసగోత్రము. తండ్రి రామకృష్ణయ్యగారు. తల్లి చెంచులక్ష్మమ్మ. వీరివయస్సు 26 సంవత్సరములు. వీరి కాంధ్రాంగ్లేయములయందుఁ గొంతవఱకుఁ బరిచయముగలదు. ఆంగ్లేయమున మెట్రిక్యులేషన్ పరీక్షయందుఁదేలిరి. ఆంధ్రకవిత్వమునందుఁ బరిశ్రమ చేసిరి. వీరు 5 సంవత్సరములనుండి ఈ పట్టణమందలి, పి. వి. ఆర్. హిందూ సెకండరీస్కూలునం దుపాధ్యాయులుగ నున్నారు. వీరు రచించినగ్రంథములు:—నాటకములు. 1. రుక్మిణీపరిణయము, (2) సులక్షణ (ధర్మాంగద) 3. రంభారావణ సంవాదము. (అంకము) 4. రామచంద్రవిజయము, (పూర్వమువంగోలునేలి ప్రసిద్ధికెక్కిన మందపాటిసీరుల చరిత్ర) 5 శ్రీరామతీర్థస్వామివారి జీవితమును ("యజ్ఞభావము" అనివారియుపన్యాసమున కాంధ్రీకరణము) ఇంకనుగొన్ని చిల్లరవి.

శా॥ ఆనందంబులసద్గతిం జెలఁగ శ్రీరాంభోధిపైనప్సరో
గానంబుల్ చెలఁగన్ రమామణి వెసంగైపట్టిమార్గింపుల
క్ష్మీనారాయణుఁడెల్లవేళలనుగూర్మిం గూర్చెడుంగాత ల
క్ష్మీనారాయణనవ్య దంపతులకున్ గీర్తిప్రమోదంబులన్. 1.

ఉ॥ హైమవతీశులట్టులిట హైమవతీశులు సర్వమంగళా
ధామవిభూషణాఢ్యతసతంబుఁ బరస్పరమైత్రిఁ జూపిసౌ
ఖ్యామృతపూర మానియుననంత యశంబువహించి మంచియీ
భూమిగృహస్థధర్మముల బోధలకిచ్చుత పెల్లలక్ష్యముల్. 2.

ఉ॥ అర్ధశరీరిభార్యయను నార్యపదంబు శరంబుధారుణిన్
సార్థముగాఁగనీతవయ సాధ్వులసాధ్వియు గాంతుకౌస్తుభ

ర్వార్థములిచ్చు కాంతమునునై మనుచుండఁదదీయభర్తయు
ర్వార్థులదేవభూజసముఁడైసుకృతోన్నతుఁడైచెలంగుతన్ 3.

మ॥ కొడుకుల్ కూఁతులు మోదమీనఁగ వెసంగోడండ్రునల్లుండ్రునై
వ్వడిసమ్మాన మొనర్ప బందుగులు మేల్ వాత్సల్యమున్ జూపుచున్
నడువన్నన్నలు మన్మరాండ్రుమునిమన్మల్ మన్మరాండ్రొప్పనై
వ్పుడువీరల్ సుఖవార్ధిఁదేలనగుతన్ ముజ్జోలలంబాడుచున్. 4.

## 213. శ్రీడింగరభట్టుస వేంకటాచార్యులయ్యవార్లంగారు.

వీరుమున్ను "సింహపురి" యను నెలూరు పట్టణమును బరిపాలించిన "చింతపట్ల" వారికి ఆచార్యులయిన శ్రీడింగరుభట్టరు రాఘవాచార్యులయ్య వార్లంగారివంశీకులు. నివాసస్థలము శనివారపుపేట. శ్రీవైష్ణవులు. ఆపస్తంబ సూత్రము. శ్రీవత్సగోత్రము. తండ్రి తిరుమలాచార్యులయ్యవార్లంగారు. తల్లి వేంకటనరసమ్మ అమ్మ వార్లంగారు. సృష్ట్యాది 1955884988 సంవత్సర ములు గతించినపిదపసర్వజిత్తునామసంవత్సర భాద్రపద శుద్ధనవమి శనివా రము జన్మదినము. వీరు జ్యోతిషశాస్త్రప్రవీణులు. ఆంధ్రగీర్వాణభాషలలో గవిత్వముచెప్పువారు. వీరురచించిన గ్రంథములు:—1. సౌరసిద్ధాంత దర్పణ ము, 2. జ్యోతిషబాలబోధ.

గీ॥ సత్యనారాయణునతని సతిని హైమ
వతిని శ్రీగౌరి శ్రీలక్ష్మి పతులనిశము
పుత్త్రపౌత్త్రాయురారోగ్య భోగభాగ్య
సిరులొసంగుచు వేగ రక్షింత్రుఁగాక. 1.

## 214. ప్రయాగ ప్రకాశ రావుగారు.

వీరి జన్మస్థలము ఎలమంచిలి సమీపముననుండు కొత్తపోలు. తండ్రి రామమూర్తి. తల్లి సుబ్బమ్మ. తెలగాణి వైదికులు. ప్రస్తుతము గుంటూరు కాలేజి బ్రాంచిపాఠశాలలో నుపాధ్యాయులుగా నున్నారు. ఇదివఱకు దైవభక్తియను నొకపాటల పుస్తకమును, ప్రభుభక్తియనునొక పాటలపుస్తకమును; వ్రాసియుండిరి. మఱియుఁ బాఠశాలల బాలురకుపయోగమగు కొన్నిపుస్తకములనే వ్రాయుట వాడుకయయినను ఇప్పుడిప్పుడు పద్యరచనయందును నభిలాషవృద్ధియై కొన్నిగ్రంథములను వ్రాయుచున్నారు.

సీ॥ శ్రీరస్తు విజయోస్తు శ్రేయోస్తుధనమస్తు
 శాశ్వతవిభవోస్తు జ్ఞానమస్తు
శుభమస్తు సంతతసుఖమస్తు బలమస్తు
 సామ్రాజ్యవిభవోస్తు శాంతిరస్తు
కౌస్తుభమాణిక్య ఖచితముక్తాహార.
 భూషాస్తువిజయోస్తు పుణ్యమస్తు
ఆరోగ్యమస్తు దీర్ఘాయుష్యమస్త్వవ్య
 రాగోస్తుధీరోస్తు రాజ్యమస్తు

గీ॥ భూరినిర్మలవిద్యా ప్రపూర్ణతాస్తు
వినయవితరణమస్తు వివేకితాస్తు
సరససద్గుణ సంపత్ప్ర శస్తిరస్తు
ధర్మరతిరస్తు నూతనదంపతులకు. 1.

సీ॥ జన్నంపువేడ్కతో జనకుండుకృషిసేయ
 దొరకిన చక్కని సరసిజాక్షి

సుందరీమణులలోఁ జందురునిం బోని
నూత్నంపుకళల సన్నుతిపహించి
చెలులతో నాడెడు చిలుకగోర్వంకల
మృదుమధురోక్తులఁ గుశరుపరచి
తనసువర్తనమునఁ దలిదండ్రుఁలలరంగ
భక్తి విష్ణుని పయిఁబరగనిల్పి

గీ॥ పిన్నవయసున రాముని బెండ్లియాడి
ప్రజకుసంతోష మొదవించుపరమపూత
చరితసద్గుణభరిత భూజాతసీత
ప్రోచుసీతా విజయలక్ష్మిఁ బుణ్యవతిని. 2.

శా॥ శ్రీలక్ష్మిసహితుండు ప్రేమనొసఁగున్ శెస్నారశ్రీసంపదన్
భూలావణ్యవతీసమేతుఁ డిడుఁతన్ భూచక్ర సల్లాభమున్
నీలంగూడిన శోభనాంగుఁడు దయన్మించు మాంగళ్యమున్
శీలంబొప్పఁగనూత్న దంపతులవాసిం బ్రోచుదేవుండిలన్.

సీ॥ చిలువయున్నలువయుం జేతోముదంబునఁ 3.
జిరతరాయుష్యంబుఁ జేర్పఁగాత
మణియును నలనభోమణియును స్థిరమైన
దేదీప్యకాంతులఁ దేల్పఁగాత
ఇంద్రుఁడున్ హిమకరసాంద్రుఁ డౌచంద్రుఁడుం
జల్లదనంబు లొసంగుఁగాత
గురుఁడును నలపరాశరుఁడును నీతిలో
విదులఁగాదయనుగావింత్రుగాత

గీ॥ పద్మమున్నాటివంశాబ్ధి బాలచంద్రుఁ
డైనవేంకట సత్యనారాయణుండు

బాల(శ్రీహైమవతి కేలుపట్టుసెడల
(శ్రీమనోహరుఁ డాశీర్వదించుఁగాత. 4.

## 215. అబ్బరాజు హనుమంతరావుగారు.

వీరి నివాసస్థానము నరసారావుపేట తాలూకా వేలూరు. పితామహులుజ్యోతిశ్శాస్త్ర లక్షణవేదియైన నృసింహామాత్యులు. జనకుఁడు మాఘపురాణవైకృత కావ్యనిర్మాణచణులగు శేషాచలామాత్యులు. వీరివయస్సు ముప్పదిసంవత్సరములు. వీరిచే రచింపఁబడిన గ్రంథములు:- 1. వాణీశతకము, 2. హరిహరనాథశతకము, 3. నిరోష్ఠ్యపితృశతకము, 4. అచ్చాంధ్ర నిరోష్ఠ్యనిర్గద్య నృగచరిత్రము, 5. కవికర్ణపేయము, 6. అంబరీషచరిత్రము, 7. సుగ్రీవపట్టాభిషేకము, 8. అచ్చాంధ్రనిరోష్ఠ్యనిర్గద్యదాశరథి చరిత్రము. ఇప్పుడు, ఐలవరము బోర్డుస్కూలు హెడ్మాస్టరుగా నున్నారు.

ఉ॥ (శ్రీయుతవతిన్ స్వనక్షతుల సీదళపుం బెనుపేరుటుయ్యెలం
బాయక నిల్పియూమటకుఁ బక్షములం జెలిజంటనిల్పెనా
నేయొడపక్ష పక్షములసేర్పుశ లక్ష్మినిభామినీశనుం
దాయఁగఁజేర్చి కుల్కు హరిదంపతు లౌజయలక్ష్మిసత్యనా
రాయణరావుఁ గూర్మిమెయిరత్నపుఁబోవులనిచ్చిప్రోవుతన్ 1.

మ॥ ఘృణనారాయణుఁ జేర్చియాత్మసుతలక్ష్మిం బెద్దలెన్నన్నదీ
ధనకాంతాభుజగేట్రపుధాని తమినుద్వాహంబుఁగావింపఁగా
ఘృణనారాయణుఁజేర్చి యాత్మసుతలక్ష్మిం బెద్దలెన్నన్పుధా
వనుఁడౌశ్రీభుజగేట్రపు ధానితమినుద్వాహంబుగావించెనా 2.

ఉ॥ [illegible]ంచుభుజంగ రాజమణిమెచ్చుగఁ బండితపాళికిచ్చెఁబ
ట్టంచుల పచ్చడాలు జరబోలు సరాల్పతకాలు వేలువే

లించుక పేరుగల్గు కవి నేనియుఁ బండితు నేనిఁబిల్వనం
పించుచు విందుఁబెట్టుచును విందులకుం బలెఁగూఁతు పెండ్లిలోన్. 3.

## 216. ప్రత్తిపాటి కామేశ్వరకవిగారు.

వీరు ఆఱువేల నియోగిబ్రాహ్మణులు. ఆపస్తంబ సూత్రులు. ఆత్రేయముని గోత్రులు. తండ్రి రామదాసుగారు. తల్లి సీతమాంబ. జన్మదినము తారణసంవత్సర ఫాల్గున బహుళపంచమి. వాసస్థలము గుంటూరు జిల్లా సత్తెనపల్లి తాలూకా దమ్మాలపాడు. వీరు కొన్ని శతకములు మాత్రమే రచించిరి. అష్టావధానమున సమర్థులు దాంభికుల స్పృధావలేపనము సవిమర్శముగా నిష్పక్షపాతబుద్ధితో నడంచు, దేశోపకారులు.

శా॥ శ్రీరామాంశజ రుక్మిణీ రమణి యార్తిన్ విప్రుఁదోతెంచినం
గారుణ్యామృతదృష్టిఁజూచిరిపులంగన్నారఁగాఁ జేసిత
న్నారీరత్నము కేలుఁగేలఁగొని యానందాబ్ధిఁదేలార్చునా
ధీరగ్రామణి యివ్వధూవరులకెంతే గూర్చుఁగళ్యాణముల్. 1.

మ॥ తరుణీరత్నము ప్రాణనాథుమెయినర్ధంబందు రప్పల్కునో
ర్కరితన్నెగ్రహించితిన్ విభుఁడునన్గామించె మందాకినీ
శిరముంజేరితి నంచుఁగ్రుళ్లకమదిన్ సిగ్గందుమీయంచుఁదాఁ
బరిహాసంబొనరించు శాంకరిమిముంబాలించుతన్ దంపతుల్ 2.

క॥ సిరిఁగల దొరకూఁతురుసతి
సిరిఁగల దొరకొమరుఁడీవచెల్లుననియెచే
సిరిబాంధవ్యము పెద్దలు
సిరిఁగల ఫలమనుభవించి చెలఁగుమువత్సా! 3.

చ॥ జనపతినింటి బిడ్డనని సర్వజనస్తుతి పాత్రినంచుఁగాం
తునినొక తీరుజూడక సతుల్ చరియించిన మార్గమూనిపూ

వును మకరందమన్న నుడిపొల్పు నెఱుంగుచునాధునిన్ సుధీ
జనవరు సేతుమమ్మ విలసన్మతుతౌననలత్మ్మమాంబికా 4.

సీ|| అవధానకార్యమ్ము లాచరించితివి మే
 లనితత్సభాజను లభినుతింప
గ్రంథంబులెన్నేని కల్పించితివి స్వీయ
 మతమన్యమత మనుమాటలేక
లకవరాదిపురపాలనముఁ జూపితివాది
 రాజులఁబోలి ధర్మంబు నెరపి
ఆశ్రితసులభుఁడవ్యాఘాతసద్వ్రతుం
 డవుయశంబందితివఖిలదిశల

గీ|| నింతకునుమున్న నేడు కవీంద్రపండి
తేంద్రులంగూర్చి భాషాభివృద్ధిఁదేర్చి
నందనివివాహమద్భుతా నంద మెసఁగఁ
జేయునిను మెచ్చకుండిరఁ జెవఁటిగాడ
ప్రకటగుణదీప శ్రీభుజంగ కవిభూప. 5.

## 217. పోతరాజు రామకవిగారు.

వీరి నివాసస్థలము గుంటూరుజిల్లా నర్సారావుపేటతాలూకా యేరు చూరుగ్రామము. ఆఱువేల నియోగిబ్రాహ్మణులు. ఆపస్తంబసూత్రులు. శ్రీవత్సమునిగోత్రులు. తండ్రి వరదరాజుగారు. తల్లి పుల్లమాంబగారు. జన్మదివసము హాలాణశకము 1838 సంవత్సరముకు సరియగు హేమలంబి సంవత్సర శ్రావణశుద్ధదశమి. సంపన్నగృహస్థులు. గొప్పసంతతివారు. వీరి యగ్రజులగు 1. శాయనకవిగారు 2. నరసయ్యగారు, 3. లక్ష్మయ్యగారు, వివిధవిద్యాప్రవీణులు, వీరికవనముగోస్తనీ పాకమునఁ బండితపామరరంజకమైనది. వీరి

కవనము వినినవారు వీరి నల్లపానిపెద్దనతోఁ బోల్చుచుందురు. వీరనేక విషయములఁ జాలమంది శిష్యుల సమర్థులనుజేసిరి. వీరికి బోధకతాశక్తి హెచ్చు కలదు. వీరి శిష్యులేకాక పుత్త్రులును, అవధానాశు కవిత్వములే నిపుణులు. శ్రీమదాశుకవి చక్రవర్తి అవధానపంచాననాది బిరుదవిరాజితులును, జగత్ప్రసిద్ధులగు కొప్పరపు సోదరకవులకు వీరు గురువులు. వీరి వంశము సుకవివంశము. వీరురచించిన గ్రంథములు:—1. కుచేలోపాఖ్యానము, 2 సావిత్రీచరిత్రము, 3. నరసింహదండకము, 4. నిరోష్ఠ్యనృసింహశతకము, 5. నీలకంఠశతకము, 6. నృకేసరీశతకము, 7. గర్భబంధచిత్రకవితానియమబంధుర పద్యప్రపంచము, 8. కాశీక్షేత్రాభిగమనము, 9. రామేశ్వరయాత్రాభి వర్ణనము, 10. సుకవితోదయము, మఱియు ననేకములగు పాటలును, గీర్తనలును రచించిరి. సంస్కృతమునను దేవతాస్తోత్ర శ్లోకములను రచించిరి, మఱియు, 1. ఇతిహాసము, 2. ఆగమము. 3. కావ్యము, 4. సంగీతము; 5. కవిత్వము, 6. లిపికర్మము, 7. దేశభాషాలిపిజ్ఞానము, 8. వాచకము, 9. అష్టావధానము, 10. శాకునము, 11. సాముద్రికము, 12. సూదకర్మము, 18. అగ్నిస్తంభము, 14. జలస్తంభము, 15. చిత్రక్రియ, 16. లోహక్రియ, 17. అశ్మక్రియ, 18. దారుక్రియ, 19. కృషిక్రియ మొదలగు పలువిద్యల నెఱింగిరి. మఱియు భారత, భాగవత, రామాయణాదికములగు ననేకదివ్యప్రబంధములు తాళిపత్రములఁ జక్కనియక్షరములతో లిఖించిరి.

సీ॥ శ్రీమద్రమాచిత్త జీవనజార్కుండు
దేవేంద్రముఖదేవ భావితుండు
భోగిలోకాధీశ భోగశయానుండు
వికసితసితపద్మవీక్షణుండు
పత్రిలోకేశ్వరప్రకట గంధర్వుండు
జాంబూనద ప్రాంచితాంబరుండు

శంఖచక్రాదికసాధనో పేతుండు
బరిచితకైలాస పాలకుండు

గీ॥ సదయహృదయుండు గాంభీర్యసాగరుండు
మహితచారిత్రుఁడైన రమావిభుండు
హైమవతిని శ్రీసత్యనారాయణాఖ్యు
సంపదలొసంగినిరతంబు సాకుఁగాత. 1.

## 218. పెళ్లూరు శ్రీనివాస రంగేశ్వర శర్మగారు.

వీరు పెళ్లూరువంశశుక్తి ముక్తాఫలంబగు శేషయామాత్యపుత్త్రులు. బాపట్ల గ్రామనివాసులు. కౌండిన్యసగోత్ర పవిత్రులు. 22 సంవత్సరముల యీడుగలవారు. షట్సహస్రనియోగివంశజులు. చిఱుత ప్రాయమునుండి యాంగ్లేయవిద్యాభ్యాస మొనరించిస్కూలుపైనలు పరీక్షలోఁగడ తేరినపిదప కవితాప్రసక్తి యందించుక యాసజనింప నచటనచట బుధోత్తమసాంగత్య వశంబుననించుక కవిత్వము నలవరచుకొనిరి. తదుపరి, తద్వృద్ధిఁగావించి అష్టా వధానశతావ ధానంబులఁ జెన్నపుర్యాది పుటభేదనంబులయందు సల్పియశం బుఁగాంచిరి. ప్రస్తుతము వీరు నరసారావుపేటలో సాల్టు డిపార్టుమెంటులోఁ గొలువున నున్నారు. ఆదినుండియు వీరిని బెనిచిపెద్దవారినిజేసి విద్యజెప్పిం చిన వారు వీరి పితృవ్యులు నీలంరాజవంశ క్షీరసాగరశశాంక శేయ రాయమ నీషి. వీరు రచించిన నాటకములు. -1. కుముదవల్లీ విజయము, 2. వంగవో లు రాజులచరిత్ర, 3. భావనభద్రావతీయము. సంస్కృతంబునఁగూడఁ గవిత్వ ము చెప్పఁగలరు.

సీ॥ తర్కాదిశాస్త్ర ధౌరేయులైన స
త్పండితులొకచోటఁ బ్రబలుమండ

స్వీయకవిత్వనిర్జిత కాళిదాసులౌ
కవివరులోక యొడ్డ్రగాలుచుండ
గాంధర్వవిద్యా ధురంధరలైనవా
రాంగనలోకచక్కిఁ బ్రభలునూప
మృగమదశ్రీఖండ మిళితసువాసనల్
పంతసంబెంతో యొసంగుచుండ

గీ॥ నృత్యగీతస్వనంబులు నేర్పుఁజెలఁగ
భేరికాహాళనాదముల్ మేరమీఱ
జనకపుత్రీ వివాహయశంబు దోఁపఁ
గనులపండువుగాసుండెఁ గాంచినంత. 1.

చ॥ వరకవితాప్రసక్తులు నివారిత శత్రుసమూహులున్ బ్రభా
కరసమతేజులౌ నృపులఖండయశుల్ మతిగాయకోత్తముల్
సరసతనీవివాహమున సంబరమెంతయొగల్గఁజేరిరా
రరో!గనవద్భుతంబు మదిరంజిలు దీనినిఁగూర్చివిన్నచో 2.

ఉ॥ శ్రీయుతసద్గుణాఢ్యుని వశీకృతమానవవర్గుసత్యవా
రాయణపాదనీరజవిరాజిత మానసకంజవిన్ బుధున్
న్యాయపథప్రవర్తకుఁ గవితామృత పారపిపాసుసత్యనా
రాయణమూర్తి ధారుణివిరాజిలుఁగావుత శాశ్వతంబుగన్. 3.

క॥ భాసురగాత్రిని హైమవ
తీసీతావిజయలక్ష్మిఁ దీరనితుష్టిన్
శ్రీసరసిజాత రాణులు
వాసిగనేలుదురుగాత ! వైభోగములన్. 4.

## 219 కానుభట్ల పద్మనాభ శాస్త్రిగారు

వీరు గంజాముజిల్లా శ్రీపర్లాకిమిడి మహారాజావారి సంస్థానమునందుం డెలుఁగు బాలికాపాఠశాలలో నుపాధ్యాయతవలన కృతార్థతనొందిన వారు. ఈసంస్థానమందలి రామనగర ప్రసిద్ధాగ్రహార వాస్తవ్యులు. వేగినాటిఋగ్వేదులు. కాశ్యపగోత్రులు. సంస్కృతాంధ్ర కవితావిచక్షణులు. వీరి జన్మపూర్వతము కీలకసంవత్సరము వీరిచే "శర్వాణీపార్వతీవల్లభా" అనుమకుటముగల శతకము, ఆంధ్రమునఁబూరోక్తగిర పద్యసందర్భముగ శార్దూల మత్తేభవృత్తములతో వ్రాయఁబడినది. మఱియు సర్వేశ్వరా అనుమకుటముతో సర్వలోకోప యోగప్రార్థనము మీఁదివృత్తములతోనే వ్రాయఁబడినది. మఱియు సంస్కృతమున బాలాస్తవము వ్రాయఁబడినది. మఱియును దత్తత్కాలోచిత చాటుగ్రంథములు వ్రాయఁబడుచు వచ్చినవి.

శ్లో॥ దంపతీమా వాదిమాతా
దంపతీ జగతాంపతీ
శివాయా నర్పితశివా
రక్షేతాం పితరావరా. 1.

## 220. శ్రీపాదపాపయ్య శాస్త్రిగారు.

వీరి నివాసస్థలము కోపూరు. వెలనాటివైదికులు. అపస్తంబసూత్రము. కాశికగోత్రము. తండ్రి మందయ్య శాస్త్రిగారు. తల్లి యజ్ఞసోమదేవ్యంబ. సర్వజిత్సంవత్స రాశ్వయుజ శుద్ధపూర్ణిమా భానువారము జన్మదివసము. ఆంధ్రగీర్వాణములయందు వ్యాకరణజ్ఞానమును, సాహిత్యమును గలవు. ఉభయకవితా రచనాసామర్థ్యముకలదు. సంహితాపదములు మాత్రము వేదము నం దభ్యసింపఁబడినవి. యాజుషస్మార్తము తెలిసినవారు. మఱికొన్ని చిల్లర యు తెలియును. శ్రీకళ్యాణా నందాంగ్లసంస్కృత పాఠశాలలో నంస్కృతో

పాధ్యాయులు. ప్రకృతము ఉండూరులో శ్రీరాజా యినుగంటిరాజగోపాలరామసూర్య ప్రకాశరావుగారి యొద్ద నాస్థానపండితులు. వీరురచించిన గ్రంథములు: -1. దేవకీ నందనశతకము, 2. సత్యనారాయణశతకము, తెలుఁగు:- చిల్లరచాటుధారలు.

శ్లో॥ విశ్వంప్రియంభవతు వాంగిరిజాప్రసాదాత్
విష్ణుప్రియావసతువాం హృదయేనికాయే
భూయాస్త మాత్మజనతోత్తమ కీర్తియుక్తా
సంపత్సమృద్ధి పశుసృద్ధి యుతౌకుమారౌ. 1.

అత్రవిశ్వప్రియమాశాస్తే ఇతిమంత్రార్థవివృతిః.

శ్లో॥ అశ్మాయథాస్వంగుణ ముజ్ఝిహీతే
నోత్వంతథా హైమవతీప్రసాదాత్
త్వదీయ హృద్వారిజ చంచరీకే
మాత్వం విమోచీః ప్రణయంకుమార. 2.

అతిష్ఠేమమస్యాపం ఇతిమంత్రార్థ స్పష్టీకృతిః.

శ్లో॥ యథాప్రసిద్ధా లసలీలవంగా
పరస్పరాభ్యా మలిముచ్యమానా
సంకల్పయంతౌ సుమనస్యమానా
ఇష్టాదియుక్తౌ భవతంకుమారౌ 3.

సఖాసప్త పదాభనమంత్రాంశో నిరూపితః.

శ్లో॥ ధర్మార్థకామాఖ్య సుపాశజాత్రై
రాకృష్టచిత్తోపి నవిస్మరేరిమాం

అనువ్రతాం త్వచ్చరణాంబుజార్ధే
గౌరీసమాంపాలయ శంభుతుల్యః. 4..

ధర్మేచ, అర్థేచ, కామేచ, త్వయేషానాతిచరి తవ్యాఅగ్నేరనువ్రతా
ఇతిమంత్రార్థాప్రదర్శితా.

శ్లో॥ వర్ధతాం ధరణితలేసదాభవంతౌ
వైదేహీదశరథ పుత్రతుల్యరాగౌ
సాయుష్యౌ ధనపశుపుత్ర పౌత్రయుక్తౌ
యద్వత్తౌ భవత ముమాగిరీశగేహే. (ఇతి) 5..

శ్లో॥ శ్రీపాపశాస్త్రీ శోభ్పూరుగ్రామేవాసీ శుభాశిషః
అచాదుండూరు సంస్థానపండితో సౌవధూవరౌ.

## 221. గరిమెళ్ల శివరామయ్యగారు.

వీరినివాసస్థానముచెల్లూరు. వెలనాటివైదిక బ్రాహ్మణులు. ఆపస్తంబ సూత్రులు. శాండిల్యస గోత్రికులు. తండ్రిగారు జ్యోతిషభాగత్రయముల యందును, వేదాంతమందునుపూర్ణమైనప్రజ్ఞగల గౌరీపతిసిద్ధాంతి గారు. తల్లిగారు పేరమాంబ. వీరి జననకాలము, ఈశ్వరబహుధాన్య సంవత్సరములలో నొక టయి యుండవచ్చును. వైశాఖబహుళ ౧౨ జన్మనక్షత్రము రేవతి. వీ రాంధ్ర భాషాభిసేవకులు. సామాన్య జనరంజకంబులగు కొన్నిగ్రంథములు రచించిరి. ప్రస్తుతము ప్రధానోపాధ్యాయులై యున్నారు. వీరుముద్రింపించిన గ్రంథ ములు:—1. హరికథేతి హాసమంజరి, 2. భగవన్నామ సమ్మేళనమాటలు, 3. జనరంజనీటప్పాలు, 4. చెల్లూరు నూతనమనోరంజనీమట్లు, 5. రైలు కీర్తనలు, 6. పదవపాటలు, ముద్రించఁబోవునవి:—1. రైలునాటకము, 2. సముద్రమథననాటకము, స్కూళ్లకుఁబనికి వచ్చునవి:—1. శిశుతరగతి

భూషణము, 2. ఒకటవతరగతి భూషణము, 3. రెండవతరగతి భూషణము, మున్నగునవి.

గీ॥ అమరకీర్తి మార్కండేయ నాయునయును
భామతేజంబునిందిరా భాగ్యమంది
హైమవతిసత్య నారాయణాఖ్యదంప
తులుసతంబిష్టసిద్ధి నొందుదురుగాత. 1.

గీ॥ ప్రభగుణోన్నతికీర్తి సౌభాగ్యగరిమ
వినుత హైమవతీ సీతవిజయలక్ష్మి
వినుత హైమవతీ కుజావిజయలక్ష్మి
యైతలిర్చుత నెల్ల వారభినుతింప. 2.

## 222. కన్నేపల్లి సాంబశివ రఘురామస్వామిగారు.

వీరి నివాసస్థలము గంజాము మండలాంతర్గత ప్రియాగ్రహారము. విదర్భ దేశీయులగు వెలనాటి బ్రాహ్మణులు. గౌతమగోత్రము. ఆపస్తంబసూత్రము, తల్లి కామేశ్వరి. తండ్రి లక్ష్మినరసయ్యగారు. చలమరపాలవలస హుందామాల్కుదారులు. ఆశుకవులనివాడుక. ఆంధ్రకవి. ఇంగ్లీషుభాష ధారాళముగ మాటలాడను, వ్రాయనుతెలియుగుదురు. వీరు రచించిన గ్రంథములు:—స్త్రీ సాహసము. (నాటకము) 2. పద్మినీప్రభాకరము, 3. విఘ్నేశ్వరజననము, జననదినము విరోధిసంవత్సర ఫాల్గుణబహుళ చతుర్దశి.

మ॥ భవవాక్యప్రతికూల కారణముచే దక్షాధ్వరంబందు మే
నువిసర్జించిగిరీంద్రుసద్గృహము నందుంబుట్టితద్భక్తిపు
ణ్య విశేషంబుననీశ్వరుంగని వివాహంబాడుకొన్నట్టిహై
మవతీకాంతభుజంగరాయసుతకున్ మాంగళ్యమైయుండుతన్ 1.

సీ॥ హైమగర్భుండు బ్రహ్మంబు మీకెప్పుడు
దీర్ఘాయురారోగ్య దీప్తినొసఁగు
మహితకారుణ్యసంభావితుం డీశుండు
శాశ్వతైశ్వర్య విస్తారమొసఁగు
వసుమతీభారంబు ధరియించువిష్ణువ
న్యోన్యానురాగ విన్యాసమొసఁగు
తివిరివిఘ్నంబులఁ దీర్చెడుగణపతి
పుత్త్రపౌత్త్రాదిసంప్రాప్తినొసఁగు

గీ॥ సత్యమేమీకుఁగోరిన సౌఖ్యమొసఁగు
దేవునారాధనముసర్వధీ యొసంగు
వినయనయవృత్తమాత్రసద్విదితులార!
హైమవతిసత్య నారాయణాఖ్యులార ! 2.

మ॥ కవిసంతోషణభాజనంబు విబుధౌఘప్రాప్తసమ్మోదమున్
వివిధస్తోత్రసమంచితంబును సుదృగ్విన్యాసమున్ దివ్యమా
నవసంపూజ్యముపుష్పధర్మ మహితానందంబునైనట్టిహై
మవతీభూరివివాహశోభనముసంభావ్యంబు కాదేకనన్ 3.

## 223 చించినాడ వేంకటరత్నశాస్త్రిగారు.

వీరి నివాసస్థలము బృందావనపుర శాఖానగ తింత్రిణీగర్తపురము (బందరు చింతగుంట పాలెము) వెలనాటివైదికులు. ఆపస్తంబసూత్రము. కౌశికసగోత్రము. తండ్రి లింగయ్యగారు. తల్లి రామమ్మగారు. సుమారు 25 సంవత్సరములవయస్సు. వీరు సంస్కృతాంధ్రములయందు సాహిత్యముకలిగి అవధాన నైపుణ్యము ధారణాశక్తియుం గలిగినవారు. వీరు కొన్నిప్రసిద్ధ సంస్థానములయందుఁ దమపాండిత్యమును జూపిబహుమతులందినవారు. ప్ర

కృతము విజయవాడయందు నివసించియున్నారు. అద్భుతోత్తర రామాయ ణాది బహు గ్రంథకర్తలగు బ్రహ్మశ్రీనాదెళ్ల పురుషోత్తమ శాస్త్రులవారి శిష్యులు. వీరు రచించిన గ్రంథములు:- 1. శ్రీరాఘవాశ్వమేధనాటకము. 2. ఆంధ్రీకృతసప్తశతి, 3. దుర్గాశతకము, 4. నాగేశ్వర శతకము, 5. కుశ్యా మఅనునవలమొదలగు గ్రంథములును, రసవంతములగు ననేక చాటుపద్యము లును జెప్పియున్నారు.

సీ॥ చెలువొప్పుకైలాస శిఖరభాగమున ని
ర్మలమణిమయ భర్మనిలయమునను
విలసితశశికాంత వేదిపైసకలశృం
గారంబుమీఱఁగా గారవమున
సురసిద్ధసాధ్య కిన్నరమానిగంధర్వ
వరులునుబ్రమధులు వరుసఁగొలువ
మేఘుంబుమీఁది క్రొమ్మించుతేజంబునా
భూషణద్యుతి మేనఁ బొల్పుమీఱ

గీ॥ నిండుకొలువుండి కన్నుల పండువుగను
నచ్చరలయాట పాటల నలరుచుండు
మంచుమలపట్టి హరుఁడు మన్నించురాణి
గాచుఁగాతమిమ్ముల సదా కరుణవెలయ. 1.

## 224. పెళ్లూరి శ్రీరామశర్మగారు.

వీరి నివాసము నరసరాట్పురము. వీరు పెళ్లూర్య న్వయసౌధరాజ లక్షిప్తరత్నదీపంబగు వేంకట రత్నమంత్రికి దనయులు. కౌండిన్యస గోత్రోద్భవులు. షట్సహస్ర నియోగి మహాన్వయసంజాతులు అనాదినుండి యు నీవంశీకులు కవిత్వంబున పన్నెక్కినవారగుటచే వీరును దత్సానంబం

చుదు రని వేఱేచెప్పనక్కఱలేదు. ఈయన నర్సారావుపేటలో హిందూ పాఠశాలాధ్యాపకులుగాఁ బనిఁజేయుచున్నారు.

వ॥ సిరిహరులున్ సరస్వతియుఁ శ్రీకరుఁడిల్లపితామహుండునీ
శ్వరియు శివుండు సంతతము సంతసమిచ్చును గాతనీపధూ
వరులను సౌఖ్యదాయులయి వర్ధిలఁజేయుచు నుండ్రుగాత నే
కొఱఁతలు గల్గకుండ ననుకూలముగాదయఁ జూచుచుండెడున్

## 225. పి. వెంకటరామప్ప పంతులుగారు.

" శ్లో॥ మహారాజౌఘమాన్యస్య విద్వత్కల్పావనీరుహః
లసద్వనీపకాఘూకక్షీజీవం జీవకళానిధేః
రమారమణపాదాబ్జ సపర్యాసక్తచేతసః
తటాకదేవగేహాదిసప్తా పత్యవిథాయినః

అఖర్వగర్వసర్వారిశౌర్యదావ పయోముచః
పంగ్వంధబధిరానాథాధనావన కనద్ధియః
దేశికాంఘ్రిసరోజాతభక్తి మారందపాయినః
ప్రత్యర్ధ్యుద్యమకాలాంభోధర రాజనభస్వతః

హూణభాషాలతోపఘ్న కాయమానితమేధసః
ప్రతీపధూవముకుటీ ఘృష్టపత్సరసీరుహః
కౌండిన్యమానిగోత్రాబ్ధి రాకాకైరవిణీవిభోః
అపస్తంబమునిప్రోక్తా సూత్రమార్గావలంబినః

శిరోభూతయజుర్వేదశాఖినః కృష్ణిపోషిణః
వెంకటాధ్వరిపాత్రస్య వి శేషనయ వేదినః

శ్రీశాగమవస్త్రచ్ఛీమచ్ఛ్రీశగో హావిధాయినః
బళ్ళారినగరాధీశమహో ద్యోగానలంబినః

న్యాయమార్గపరిష్కృతుః నయశాస్త్రార్థవేదినః
శ్రుత్యర్థజ్ఞానినోనిత్యంసూనో ర్వేంకటభూభృతః
వేంకట్రామప్రధానీశసన్ని ధేస్స న్ని ధేస్సతాం" ౧.

శ్లో॥ శ్రియంకరోతు సస్సదాపయోధిరాజనందనీ
కపోలభాగసత్ర చిత్రలేఖనైకతత్పరః
విరాజదబ్జ చక్రహేతిభాసిపాణిపంకజః
ప్రదీప్తచక్రపీడితే ధరాడ్భయాబ్ధిబాడబః. 1.

శ్లో॥ ఆయురారోగ్యమైశ్వర్య సంపదంవిపులాంయశః
వేంకట్రామప్రధానీశ దదాతుభవతీరిహః 2.

శ్లో॥ పరాయుఃకారుణ్యాద్యమ భటభ్రాంతమనసం
జపంతంపంచార్ణగ్రథిత మనురాజంజటిసుతం
యధావీచ్ఛీమద్వేంకట కలితరామాఖ్యసచివం
తథావ్యాద్గౌరీశోజగ దవనరక్షాతినిపుణః 3.

శ్లో॥ గంగాపూరప్రచలిత జటాస్రస్తభోగీంద్రభీతా
మాలింగంతీమచలతనయాం పస్మితంవీక్షమాణః
లీలాపాంగైః ప్రణతజనతాం నందయంశ్చంద్రమౌళి
స్సర్వాభీష్టందిశతుభవతే వేంకటేశార్యమాశే. 4.

శ్లో॥ కుంభత్పరాక్రమనికుంభ విశుక్లఛండ
ఛండాస్రబీజమహిషాసుర గర్వహంత్రీ

శ్రీవేంకటేశభవతే సకలార్థసిద్ధిం
దుర్గాదదాత్వవితదేవ మునీంద్రవర్గా. 5.

చ॥ వలువసురద్రుపంచకమునం గ్రమపద్ధతివేఱువేఱఁగా
ఖలనయిదింటిజేకొని జగమ్ము నగమ్మన నాత్మసజ్జనో
త్స్వలతకు వేంకటేశ కరసర్గము జేసి నిసర్గపాణిమం
జులతరపంచశాఖి పద సూనృతమాసె నటందురీవులన్. 6.

చ॥ చతురుఁడు నీతివిద్యలను జాలబరేంగిత భావబోధలన్
రతుఁడుపరోపకారములఁ బ్రౌఢుఁడు రాజ్యరమావిభూతులన్
హితుఁడతిదీనరక్షణల నేర్పరి యర్థముగూర్చుచోనవన్
వితరణి వేంకటేశుఁడు వివేకిశశాంకుఁడు ధాత్రిలోపలన్. 7.

శ్లో॥ కైలాసవాసీభగవాన్ కాళహస్తీశ్వరశ్శివః
కరోతుతవకల్యాణం కరుణాకరుణాలయః. 8.

## 226. కాశినాధుని బ్రహ్మయ లింగారాధ్యులుగారు.

వీరి నివాసస్థలము మచిలీపట్టణము బచ్చుపేట. భైరవమూర్తి అయ్యవారి కుమారులు. ఆపస్తంబులు. ఆత్రేయగోత్రము. యజాశ్శాఖ. 86 సంవత్సరములు వయస్సు. 52 సంవత్సరములు బృందావన పట్టణమందలి హిందూహైస్కూలులో సంస్కృతాంధ్రపండితులుగానుండి సుమారు పదిసంవత్సరముల క్రిందట అందునుండి విరమించియున్నారు. చాలవృద్ధులు. శివపూజాధురంధరులు. ఇప్పటికిని కార్తికమాసమంతయు నక్తముఉండి మాహేశ్వర పూజచేయుచున్నారు. శివరాత్రియునట్లే.

శ్లో॥ ఆపస్తంబ మునిప్రోక్తసూత్ర మార్గాను గామినః
శిరోభూతయజుర్వేద శాఖినశ్శిష్టపోషిణః. 1.

భుజంగరాయ భూజానేన ప్రీంగార్యర్చనోత్సుకాం
మల్లికార్జున గోత్రేశః పౌత్రీం శుభగుణాన్వితాం. 2.

భుజంగరాయసత్పృథ్వీశః పుత్రీం సుగుణసంయుతాం
కన్యాం హైమవతీం సీతాంవధూం సౌభాగ్యశాలినీం. 3.

వేంకటోప పదాన్విత సత్యనారాయణంవరం
రక్షతాం కృపయాజస్రం పార్వతీపరమేశ్వరౌ. 4.

## 227. సి. హెచ్. అచ్యుత రామశర్మగారు.

ఉ॥ శ్రీయుతు లయ్యదంపతులు చెల్వముగల్గియు శేత ప్రాయులై
యాయువు దీర్ఘమై దనరియక్షరునందున భక్తియుక్తులై
న్యాయపువర్తనం జెలఁగియద్భుత సత్యమునందు నిల్వనా
ధీయుతమూర్తి బ్రహ్మమిల దీవనలిచ్చుచుఁ బోచుఁగావుతన్. 1.

సీ॥ అలవడ్డమన్నాటి యబ్ధిసోముండైన
సత్యనారాయణస్వామికిలను
హైమవత్యంబయునర్ధాంగి యాయెను
సంతోషమొందంగ సభ్యులెల్ల
నాయురారోగ్యంబు లైశ్వర్యయుతులయ్యుఁ
బుత్రపౌత్రులనొంది భోగులనుచు
వర్ధిల్లుచుండి యపారప్రేమముగల్గి
మెలఁగుచుచుండి యీమిథునమిపుడు

ఆ॥ హరునియందు భక్తినద్భుతంబుగనిల్పి
సత్యకీర్తులగుచు శాంతవృత్తి
నతిథిపూజసల్పు నాదిదేవుండును
దీవనలనొసంగుఁ జిరముగాను. 2.

శ్రీవేంకటేశభవతే సకలార్థసిద్ధిం
దుర్గాదదాత్వవితదేవ మునీంద్రవర్గా. 5.

చ॥ నలువసురద్రుపంచకమునం గ్రమపద్ధతివేఱువేఱుగా
ఖలనయిదింటిఁజేకొని జగమ్ములగమ్మున నాత్మసజ్జనో
త్స్వలతకువేంకటేశ కరసర్గముజేసి నిసర్గపాణిమం
జులతరపంచశాఖి పద సూనృతమూనె నటందురీవులన్. 6.

చ॥ చతురుఁడు నీతివిద్యలను జాలబరేంగిత భావబోధలన్
రతుఁడుపరోపకారములఁ బ్రౌఢుఁడు రాజ్యరమావిభూతులన్
హితుఁడతిదీనరక్షణల నేర్పరి యర్థముగూర్చుచోననన్
వితరణి వేంకటేశుఁడు వివేకిశశాంకుఁడు ధాత్రిలోపలన్. 7.

శ్లో॥ కైలాసవాసీభగవాన్ కాళహస్తీశ్వరశ్శివః
కరోతుతవకల్యాణం కరుణాకరుణాలయః. 8.

## 226. కాశినాధుని బ్రహ్మయ లింగారాధ్యులుగారు.

వీరి నివాసస్థలము మచిలీపట్టణము బచ్చుపేట. భైరవమూర్తి అయ్యవారి కుమారులు. ఆపస్తంబులు. ఆత్రేయగోత్రము. యజుశ్శాఖ. 86 సంవత్సరములు వయస్సు. 52 సంవత్సరములు బృందావన పట్టణమందలి హిందూ హైస్కూలులో సంస్కృతాంధ్రపండితులుగానుండి సుమారు పదిసంవత్సరముల క్రిందట అందుమండి విరమించియున్నారు. చాలవృద్ధులు. శివపూజాధురంధరులు. ఇప్పటికిని కార్తికమాసమంతయు నక్తములుండి మాహేశ్వర పూజచేయుచున్నారు. శివరాత్రియునట్లే.

శ్లో॥ ఆపస్తంబ మునిప్రోక్తసూత్ర మార్గాను గామినః
శిరోభూతయజుర్వేద శాఖినశ్శ్రుష్టిపోషిణః. 1.

భుజంగరాయ భూజానేన శ్రీంగార్యర్పనోత్సుకాం
మల్లికార్జున గోత్రేశః పౌత్రీం శుభగుణాన్వితాం. 2.

భుజంగరాయగృహ్వేశః పుత్రీం సుగుణసంయుతాం
కన్యాం హైమవతీం సీతాంవధూం సౌభాగ్యశాలినీం. 3.

వేంకటోప పదాన్విత సత్యనారాయణంవరం
రక్షతాం కృపయాజస్రం పార్వతీపరమేశ్వరా. 4.

227. సి. హెచ్. అచ్యుత రామశర్మగారు.

ఉ॥ శ్రీయుతు లయ్యదంపతులు చెల్వముగల్గియు లేత ప్రాయులై
యాయువు దీర్ఘమై దనరియక్షరువందున భక్తియుక్తులై
న్యాయపువర్తనం జెలఁగియద్భుత సత్యమునందు నిల్వనా
ధీయుతమూర్తి బ్రహ్మమిల దీవనలిచ్చుచుఁ బోఁచుఁగావుతన్. 1.

సీ॥ అలవడ్లమన్నాటి యబ్ధిసోముండైన
సత్యనారాయణస్వామికిలను
హైమవత్యంబయునర్ధాంగి యారెను
సంతోషమొందంగ సభ్యులెల్ల
నాయురారోగ్యంబు లైశ్వర్యయుతులయ్యుఁ
బుత్రపౌత్రులనొంది భోగులగుచు
వర్ధిల్లుచుండి యపార ప్రేమముగల్గి
మెలఁగుచుమండి యీమిధునమిపుడు

ఆ॥ హరునియందు భక్తినద్భుతంబుగనిల్పి
సత్యకీర్తులగుచు శాంతవృత్తి
నతిథిపూజసల్పు నాదిదేవుండును
దీవనలొసంగుఁ దిరముగాను. 2.

## 228. కూచిపూడి రాజరత్నముగారు.

వీరి తండ్రిసమయేలు. తల్లి హన్నమ్మ. కాపురము తెనాలితాలూకా కూచిపూడిగ్రామము. ఆ 1888 సంవత్సరము శుక్రవారమున జన్మించిరి. శాఖ అబ్రహాము. జీవనము స్వహసాయము తల్లియుఁ దండ్రియు, ఏ. ఇ. యల్. యం. సువార్తసేవకులు, మతభక్తిగల కుటుంబములో జన్మించిభయభక్తులతో పెంచఁబడి 1898 సంవత్సరములో గుంటూరు బోర్డింగులోఁ జేర్పఁబడిమూఁడవ తరగతి మొదలు మెట్రిక్యులేషను తరగతివఱకును జదివి 1908 సంవత్సరము జనవరి నెలలో వేదపారాయణమునకై ప్రత్యేకించఁబడిరి. డాక్టరు ఆబర్లీ, రివరెండు కెన్నడీదొరగార్ల యాజమాన్యముక్రింద థియలాజికల్ సెమినరీ (వేదవిద్య) లోఁ గృతార్థులై 1910 వ సంవత్సరము జనవరి నెలలో సువార్తికులుగా గుంటూరుజిల్లా రేపల్లెపట్టణమున నుంచఁబడిరి. ప్రస్తుతము మిషనుకు సంబంధించిన సంఘసూపరువైజరు, తాతకు విద్యలేదు. తల్లిదండ్రులతో నారంభము. తల్లి, తమ్ముఁడు, చెల్లెలు, భార్య, కుమార్తె, వీరిమరణము వలనఁగలిగిన మనశ్చింతల యనుభవమే శోధనలు, బ్రదుకుయొక్క యుద్దేశ్యములు:—1. కొరింతి, 9-16-17 వాక్యములు. సువార్తను ప్రకటింపవలసిన భారము వీరిమీఁదనున్నది. కవిత్వము:—ఇది నేర్పవలనఁగాక స్వాభావికముగా మొదట చిన్నచిన్నకీర్తనలతోఁ బ్రారంభింపఁబడి ఒడిలోఁబయితరగతులలో ఛందస్సునేర్పుమండఁగా వృద్ధిపరుపఁబడినది. దానియందెక్కువ కృషిచేయనందునను, ప్రోత్సాహపరచు వారెవరును లేనందునను, అదియాలాగైనది. సువార్తికమయిన సేవకుఁదగినంత కావ్యజ్ఞానముంటే అదే చాల తృప్తికరమనితరుచుగాఁ దలంపుగలుగును. వీరు రచించినగ్రంథములు:—1. క్రీస్తమనుకీర్తనలు. 1905. 2. క్రీస్తు జన్మవిలాసము, 1913. 3. అగ్రెజులకు సంబంధించిన పద్యములు, కీర్తనలు మొదలైనవి. అచ్చువేయఁవలసినవి:—1. ద్రాక్షతోట, ఉపమానవిలాసము, 2. యాత్రికుని ప్రయాణము, సంభాషణ, 3 పూవులగంపచరిత్ర, కథారూపము, 4. బడుల కుపయోగించు పాటలు,

. నలుగు మొదలగు ప్రత్యేక సంపర్కపాటలు. వీరికి తెలుగు, ఇంగ్లీషు, ము, హిందూస్తాని భాషలువచ్చును. సంగీతమందు చాలయాశకలదు. వాద్య ములయందు చాలయిష్టము. ప్రస్తుతమునివసించుచున్న కుటుంబము, సువార్తికుఁ యివతండ్రిసమువేలు, విద్యార్థియగుతమ్ముఁడు, అబ్రహాము. కుమారుఁడగు ర్జి బెన్ని. భార్యకృపమ్మ సువార్తికమయినసేవను రేపల్లెలోనే ప్రారంభించి ంతవఱకు నక్కడనే పని చేయుచున్నారు. రివరెండు బర్గరు దొరగారి ర్జిలోఁబనిచేసిరి. ఇండియన్ క్రిస్టియన్ మేరేజిఆక్టు ననుసరించి గౌనర్ న్సిల్ వారు వివాహ రిజస్ట్రారుగా లైసెన్సు ఇచ్చినారు. తెనాలి, రేపల్లె లూకాలసెక్రటరీగాను, తెనాలిలోని లైబ్రరీకికూడ కార్యదర్శిగాను నిచేయుచుండిరి. శూద్రజాతివారిమధ్య జరుగుచున్న పనియొక్కువ.

ఉ॥ శ్రీరమణీయుకారణుఁడ శ్రీప్రభువాసకలాంతరాత్మసం
సారవిదూరఘోరకలుషవ్రజ నాశసమస్తజీవనా
ధారయశోవిహారవిబుధ స్తవనీయచరిత్రదీనమం
దారకయీవధూవరుల ధాత్రినిజీవనలొందఁజేయుమా. 1.

గీ॥ ఘనులుశ్రీరావు బహదరు వినయగుణులు
పేరుగణగణమ్రోగుచు వెలయుచున్న
రాజశ్రీమాన్య సుభుజంగరాయపుత్రి
బాలికామణియగు హైమవతియకాద. 2.

గీ॥ ఇలనుగీర్తికెక్కిన మహదిష్టమతులు
సకలసౌభాగ్యముల నొందుసత్యనుతులు
ధరమరాజవంశంబు శ్రీసన్యపితలు
రాజశ్రీభుజంగేంద్రులే రమ్యమతులు. 3.

దశ్కర॥ శుభసోమసుసామధేయాన్వితాత్మజానుగుణశీల
విభవాకృతాత్మతాపంబుఁబుత్రికావినయశాల

సభబూజనీయురాలైన ధీమతిసదయవ
శుభశోభనునీతిసీతాభి ధానకీనుజనకీర్తి. 4.

క|| శుభములు కలుగును గావుత
శుభములుమీదంపతులకు శోభిలఁగలుగున్
విభవాలంకృత పరిణయ
శుభములుమీకగును గాత సుఖముగధరలోన్ 5.

## 229. వింజమూరి వేంకటనృసింహాచార్యులుగారు.

వీరి నివాసస్థానము విజయనగరము దగ్గఱసత్తెయ్యపేట. వయస్సు 53 సంవత్సరములు. విశిష్టాద్వైతులు. యజుశ్శాఖ, కాశికస గోత్రులు. నాటు పురముద్రావిడులు, తండ్రిశ్రీనివాసాచార్యులుగారు, తల్లిమంగాంబ. అద్వైత, విశిష్టాద్వైత వేదాంతశాస్త్రములు ప్రధానవిద్యలు. అలంకార జ్యోతిశ్శాస్త్రాదు లుపసర్జనవిద్యలు.

సీ|| వర్ణమున్నాట్యన్నవారయ్యఁడౌ వేంకట
సత్యనారాయణ సత్తమునకు
నాతనిపత్నియౌ హైమవతీసీత
విజయలక్ష్మీరూఖ్య చేవెలయుసతికి
నాయువృద్ధిర్ఘ్యమబ్జాసనుండిచ్చుత
నారోగ్యమొసఁగుతనబ్జసఖుఁడు
ఐశ్వర్యమిచ్చునయ్యబ్జధరుఁడుచాల
సామ్రాజ్యమొసఁగుత శచిమగండు
నీతినిచ్చుమచాలనిర్జర. గురుఁడెప్డు
విద్యలెల్లనిడు విధిసుపత్ని

భూరియశంబిచ్చుఁ బురుషోత్తముం డెప్డు
వాజైన్ల పుణం బిచ్చువాయుసుతుఁడు

గీ॥ ననుచు నాశీర్వచించెదు నమలమతిని
వింజమూర్యన్వయుండైన వేంకటనర
సింహగురువరుఁ డెప్పుడుసిద్ధసాధ్య
వినుతుఁడైవట్టివిష్ణుని వినతిఁజేసి. 1.

## 230. మాంఖిళ్లపల్లి సూర్యనారాయణమూర్తిగారు.

వీరి నివాసస్థానము గోదావరిజిల్లా పెద్దాపురం తాలూకా ధర్మవరము. హరితసగోత్రము తండ్రినారాయణగారు. తల్లి వెంకటరమణమ్మ. వీరు ధర్మవరము బోర్డుస్కూలుమాస్టరుగా నున్నారు. సంస్కృతాంధ్రభాషాజ్ఞానము కలవారు. వీరి జననము, సర్వధారి నామ సంవత్సర జ్యేష్ఠ బహుళ పాడ్యమి. వీరు రచించిన గ్రంథములు:—హరిహరస్తుతి వారణమాల (స్తోత్ర గ్రంథము) 2. జానకీపరిణయము. (హరికథ)

చ॥ అలఘుభుజంగరాజ గుణమాశ్రిత కోటికి మేలొసంగనా
నలవిబుధాళి పుణ్యజనులచ్యుతు సత్కృపఁజెందిరందునం
బలువిబుధుల్సుధాప్రమద వైభవమొందిరి తద్గుణంపు మే
లలయచలాప్తినింగనెడు నద్రిరధీరభుజంగరాడ్వరా. 1.

1. భుజంగరాజగుణము. { శేషుఁడనెడు రజ్జువు, భుజంగరావుగారి సుగుణము.

2. విబుధాళి ... { దేవతాసమూహము. పండితసముదాయము.

3. పుణ్యజనులు ... { రాక్షసులు. / పుణ్యసంతులు.

4 సుధాప్రమదవైభవము. { అమృతసంపాదన జన్యసంతుష్టి. / అమృతసంపాదన సమానసంతుష్టి.

5. అచలాప్తి ... { పర్వతప్రాప్తి. / భూమండలవ్యాప్తి.

ఉ॥ ఇండఱు పండితుల్ కులుకు చెన్నడునొక్కటనుండురోయనన్
అందముమీఱఁ బెండ్లిగను నాతఁడుజేసెడు చోటఁగాకయీ
చందమదట్లుగల్గు భువిసారముగల్గు భవాద్భుతుండునీ
చందముజేయుగాన ఘనశాశ్వత కీర్తినిగాంచితొబలీ 2.

సీ॥ సకలచరాచరస్థప్రపంచంబువి
రించిరూపాన సృష్టించునెవఁడు
స్థావరజంగమాత్మక జగత్తులవ్యాప్తి
కేశురూపాన రక్షించునెవఁడు
సంఖ్యారహితమైన సర్వలోకములను
హేశురూపానలయించునెవఁడు
జననప్రభృత్యవస్థలఁగాంచిజననాద్య
వస్థలఁగాంచని వాఁడెవండు

గీ॥ అట్టిపరమేశ్వరుండు దాసనవరతము
హైమవతి, సీత, విజయులత్మాత్మజఖ్యసద్గు
ణాఢ్యు వెంకటసత్య నారాయణాఖ్యు
నవెడుదంపతులమ్మ్రోచి యలరఁగాక. 3.

శ్లో॥ సత్యనారాయణంశ్రీశః పాయాద్వేంకటపూర్వకం
ఘూయోహైమవతీయుక్తాం సీతావిజయలక్షణాం. 4.

గీ॥ అనుమనీరీతిదీవించు నమరతుల్య
శైనవిబుధులవాక్యంబు లగునుగాక
యంటిమానందమొందిత దాప్తిఫలము
సౌఖ్యరూపావఁగాంగ్రతు నిస్సంశయముగ. 5.

## 231. తిరుపతి వేంకటేశ్వరులు

### శతావధానులు.

ఇందు మొదటివారు వెలనాటి బ్రాహ్మణులు. జల్లి సీమకాపురస్థులు. ఎండగండినివాసులు. ప్రస్తుతము కాకినాడలో శ్రీపోలవరము జమీందారువారి యాస్థాన విద్వత్కవులు. వీరిజననము ప్రమోదూతనామ సంవత్సర ఫాల్గున శుద్ధ అష్టమి

సీ॥ సతతాన్నదాన దీక్షాశాలిధన్యుఁడం
తర్వేదియొవని ముత్తాతతాత
ఎవనితాతకుతాత యాశేదువిద్యల
పాటవమ్మునమించు పానకాలు
చదువుమైతండ్రితో సముఁడువేంకటజోగి
తతకీర్తియొవ్వాని తాతతండ్రి
సాంగవేదాధ్యేత యనఘుచేర్యుండుసుం
దరరాముఁడెవ్వాని తండ్రితండ్రి

గీ॥ సర్వశర్మస్వతంత్రుండు శాస్త్రవేత్త
యనఘుఁడుత్రయీమయుఁడు వేంకటావధాని

యువనిజనకుండు, శేషపయోవనితల్లి
మాగురన్న లెవనికి తమ్ముండో కండు.

సీ॥ హారితసగోత్రంబు యాజుషశాఖది
వాకర వంశమెవ్వానికలరు
ఉప్పులూర్యన్వయుండు రామశోగిని
ధ్ధాంతిపర్యుండు మాతామహుండు
జనకుండు శంకరశాస్త్రి సుబ్బమతల్లి
సూర్యప్రకాశుండు సోదరుండు
గాఁగలసాధ్వి వేంకటలక్ష్మి యనఘచే
నలివంశజాత యెవ్వానితరుణి

గీ॥ గౌతమీమండలాంతర కలితమెంచ
గండితయనుగ్రామమెవ్వాని కాపురంబు
వెలయు వెలనాటివాఁడను వితతయశుఁడఁ
బేరుతిరుపతి పండితులార! నాకు.

సీ॥ హరిదశ్వపూజా పరాయణత్వము పసం
గమువాఁడు శంద్రి వేంకటనధాని
అన్నమెన్నండేరికైన లేదవనియు
త్తమురాలునైన శేషమసుసాధ్వి
అజన్మధర్మవిధ్యధ్యా పకత్వమిం
పగువాఁడుగురువు బ్రహ్మయ్యశాస్త్రి
గోచిపెట్టకమున్న కోమలకవితచె
ప్పినవాఁడు సహపాఠివేంకటకవి

గీ॥ కలితకవితావిలాసిని వలపుసాని
లలితకళ్యాణి వేంకట లక్ష్మిపత్ని
యుండునటువంటి గ్రామమదెండగండి
పేరుతిరుపతి పండితులార! నాకు ”

రెండవవారుప్రస్తుతము బందరు హిందూహైస్కూలు ప్రధానాంధ్రో పాధ్యాయులు. వీరితండ్రిగారు కామయ్యగారు, తల్లిగారు రామచంద్రమ్మ. వీరిజననము, ప్రమోదూతనామ సంవత్సరశ్రావణశుద్ధ త్రయోదశి సోమ వారము.

శా॥ భూమిన్ బ్రాహ్మణ శాఖలందొకటియై
పొల్పొందు వెంతేని వా
రామద్రావిడ శాఖదానఁగవితా
రంభప్రియం భావుకం
బైమావంశమువోల్చు యాజుషసుశా
ఖాంతర్గతంబైసదా
రామంబై తెగతెంపులేక తగుభా
రద్వాజ గోత్రంబునన్.

గీ॥ అందుఁబెక్కుమహా మహులనతరించి
పేరుఁగాంచిరిగుణరత్న పేటులనఁగఁ
దనరిరవ్వారిలోన ముత్తాతలగుచుఁ
గామయాన్వయ వరసయఘనులునాకు.

గౌతమీ మండలాంతర్గతంబగు తుల్యాతీరంబునందనరు కడియంబను గ్రామంబునం బొల్పు మూర్తిత్రయ మునుఁబోని యమ్మువ్వురందు.

సీ॥ పెద్దకవీంద్రుఁడై పేరుఁగాంచినవాఁడు
పిన్నముత్తాత నర్సన్నగారు
ప్రతిలేనిసంపత్తి పరిఢవిల్లినవాఁడు
తాత వెంకన్న విఖ్యాతికరుఁడు.
కామమ్మమనుమండు రామాంబకొమరుండు
తండ్రికామయ్య సత్యనిరతుండు
తదనుగుణప్రవర్తనగల్గి వర్తించు
సాధ్విచంద్రమ్మ మజ్జననియేను

గీ॥ వెంకటేశుండలక్ష్మీ నావెలదికులవి
ధమ్మ చెల్లెను చిన్నముత్తాతతనదు
గ్రంథమునవిస్తరించెనా కన్నయింటి
పేరెఱుఁగఁజెప్పెదను చెళ్లపిళ్లవారు."

వీరిపిన్నముత్తాత యామినీపూర్ణ తిలకావిలాసము, వెంకటేశ్వర శతకమును రచించిన నరసకవిగారు.

వీరు రచించిన గ్రంథములు —1. శ్రవణానందము, 2. పాణిగృహీత, 3. లక్షణాపరిణయము, 4. శ్రీనివాస విలాసము, 5. ఏలామాహాత్మ్యము, 6. బుద్ధచరిత్ర, (కావ్యములు) 7. పాండవజననము, 8. పాండవప్రవాసము, 9. పాండవోద్యోగము. 10. పాండవవిజయము, 11. పాండవాశ్వమేధము, 12 రాఘవజననము, 13. రాఘవప్రవాసము, 14. రాఘవోద్యోగము, 15. రాఘవవిజయము. 16. రాఘవాశ్వమేధము, (ఒరిజినలు నాటకములు) 17. బాలరామాయణము, 18. ముద్రారాక్షసము, 19. మృచ్ఛకటికము, (ట్రాన్సులేషనులు) 20. పండిత రాయచరిత్ర, 21. ఎడ్వర్డుపట్టాభిషేకము, 22. అనర్ఘనారదము, 23. దంభవామనము, 24. సుకన్య, 25. సుపర పాత్రికము, 26. విక్రమాంకదేవచరిత్ర, 27. చంద్రప్రభచరిత్ర, 28. గీరతము,

ప్రథమభాగము. (అధిక్షప్రసంగదమనము) ద్వితీయభాగము (గురుదక్షిణ) తృతీయభాగము, (విగ్రహారాధన) చతుర్థభాగము, (లోకాభిరామాయణము) 29. గుంటూరుసీమ, పూర్వభాగము, ఉత్తరభాగము, 30. శుకరంభాసంవాదము, 31. రసికానందము, 32 శనిగ్రహము, 33. కామేశ్వరశతకము, మొదలైన పెక్కు తెలుఁగు గ్రంథములును కాళీసహస్రము, ధాతురత్నాకరము, వీధినాటకము, మొదలైన సంస్కృతగ్రంథములును, ఆంధ్రీకృతదేవీభాగవతము, మొదలైనపెక్కు సంస్కృతాంధ్ర గ్రంథములు, నానారాజ సందర్శనము, శతావధానసారము, కలహూరగంప, మొదలైనప్రాస్తావిక గ్రంథములు.

శ్లో॥ సమస్తామరసంపూజ్య సంపదావాదిదంపతీ
పాతాంహైమవతీంకన్యాం సత్యనారాయణంవరం 1.

శ్లో॥ పురాశనంజగత్పూజ్యం సమస్తంచసుమానుషం
పాతుహైమవతీకన్యాం సత్యనారాయణంవరం. 2.

సూమానుషం = దాంపత్యము.

శ్లో॥ పురాహైమవతీవవ్రే శంకరంసాద్యజన్మని
సత్యంనారాయణంవవ్రే యతోభూన్నాగకన్యకా 3.

1. నాగకన్యక = భుజంగరాయపుత్రి)
2. అగకన్యక = పార్వతి
3. నాఅగకన్యక = నాగకన్యక.

శా॥ శ్రీమత్తాపురుషాయుషంబులు సుతశ్రీమత్త్వసౌభాగ్యముల్
క్షేమాధిక్యముసౌమనస్యము గతారిత్వంబువాల్లభ్యమా
రామాదుల్దయనిచ్చిప్రోచెదరు శ్రీరాముండుభూపుత్రియున్
శ్రీమద్హైమవతీవధూమణియుతున్ శ్రీసత్యనారాయణున్ 4.

## 232. ఆకొండి వ్యాసమూర్తిశాస్త్రిగారు.

వీరి నివాసస్థానము తణుకుతాలూకాలోని కాకరపఱ్ఱు. ఆరామద్రావిడవైదికులు. ఆశ్వలాయన సూత్రము. ఆత్రేయ గోత్రము. తండ్రి వేంకటశాస్త్రిలుగారు తల్లివేంకటాంబ. సౌమ్యసంవత్సర ఆషాఢ బహుళ పాడ్యమి జన్మదినము. వీరు ఆంధ్రగీర్వాణములయందు ఉభయవ్యాకరణవిశిష్టంబులగు సాహిత్యములయందును, ఉభయకవిత్వములయందును, ప్రవీణులు. వీరు అనేకులను సాహిత్యపంతులుగాఁ జేసిన విద్యాగురువులు. 1880 సంవత్సరము మొదలు 1915 మార్చి ఆఖరువఱకు రాజ మహేంద్రవరమున హైస్కూలు ట్రయినింగు ఆర్ట్సుకాలేజిలలో 35 సంవత్సరము లవ్యాఘాతముగా బి. ఏ. క్లాసువఱకు సంస్కృతాంధ్రోపాధ్యాయులైయుండిరి. ప్రస్తుతము ఉపకృతి వేతనమును బొందియున్నారు. వీరు మహారాజశ్రీ శ్రీరాజామంత్రి ప్రెగడ భుజంగరావుబహద్దరు జమీందారువారి ఆస్థానపండితకవులు. వీరు రచించిన గ్రంథములు:—1. మయూరసూర్యశతకము, 2. జగన్నాథపండిత భామినీ విలాసము, 3. గంగాలహరి, 4. మురారిఅనర్ఘరాఘవము, 5. ప్రబోధచంద్రోదయము, 6. పరాశరస్మృతిగద్యము, 7. శుద్ధాంధ్రబుుతుసంహారము, 8. తెనుఁగుభారతము, 9. శ్రీహర్షనైషధమునకు, ఆంధ్రనైషధము అనునాంధ్రీకరణములు.

సీ॥ శ్రీహిమగిరికుమారీ చంద్రమౌళులు
మంగళదేవతామా దయితులు
వాణీచతుర్ముఖుల్ వైదేహిరాముఁడు
రతిమనసిజులు సుత్రామశచులు
శ్రీరాజరాజమంత్రి ప్రెగడభుజంగ
రావుప్రభుదుహితృ రత్నమునకు

హైమవతికివారిజామాత సత్యనా
రాయణునకునుదీర్ఘాయురాది

గీ|| సకలశుభవృద్ధియన్యోన్యసఖ్యసుగుణ
పుత్త్రలాభాదివాంఛిత పూర్తిగలుగఁ
గొలుచుచున్నాఁడు కులదేవతలనిరతము
మోదవశుఁడగుచు న్వ్యాసమూర్తిశాస్త్రి

ఈ క్రిందిపుష్పగుచ్ఛ బంధపద్యములను బంపినవారి
నామము తెలియలేదు. దొరకినయెడ ముందుకూ
ర్పులో వారి జీవితముతోఁ బ్రచురింతుము.

## 233. పుష్పగుచ్ఛబంధము.

చ|| పరమరమారతుల్ విభవభద్రభరుల్ గవనీవధూవరుల్
పురహరశారదేశపురుపుణ్య పురుల్ మనుభానుసూనులై
ధరస్థిరసారసంపదపద భద్రదయుల్ భుజగాజరాజను
స్థిరతరసారభూపతిగతి స్థితినొందుదురిందు పొందుగన్. 1.



S. Murthy & Co., Madras.

# ఇతరాంధ్ర గ్రంథములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | సంస్కృతభాషా వాఙ్మయము | ... | 0 | 2 | 0 |
| 2. | ఆంధ్రభాషా వాఙ్మయము | ... | 0 | 2 | 0 |
| 3. | జార్జిచక్రవర్తి పట్టాభిషేక పద్యములు | ... | 0 | 2 | 0 |
| 4. | విక్టోరియా తారావళి | ... | 0 | 1 | 0 |
| 5. | మార్కండేయ తారావళి | ... | 0 | 1 | 0 |
| 6. | శంకర తారావళి | ... | 0 | 1 | 0 |
| 7. | మార్కండేయ చరిత్ర | ... | 0 | 2 | 0 |
| 8. | రామదాసు నాటకము | ... | 0 | 8 | 0 |
| 9. | లంకాదహనము (నాటకము) | ... | 0 | 8 | 0 |
| 10. | సీష్వానారాయణ నాటకము | ... | 0 | 8 | 0 |
| 11. | గానామృతము (సంగీత గ్రంథము) | ... | 0 | 4 | 0 |
| 12. | సంఘసంస్కరణము 1-భాగము | ... | 0 | 2 | 0 |
| 13. | డిటో. 2-భాగము | ... | 0 | 2 | 0 |
| 14. | పరమానందయ్య శిష్యులకథలు | ... | 0 | 4 | 0 |
| 15. | గలివర్సుట్రావెల్సు (ఆంధ్రీకరణము) | ... | 0 | 4 | 0 |

ఇవియేగాక మాయొద్ద ననేక సంస్కృతాంధ్ర గ్రంథములు కలవు. కావలసిన జాబితా కోరినవారికి పంపఁబడును.

వర్తకులకు సరసమైన వెలలువేసి వందలకొలఁది గ్రంథములనేక పట్నములలోను, పల్లెలలోను విరివిగా విక్రయించుచున్నాము.

భారతీవేర్‌హౌస్,

ఏలూరు, కృష్ణాజిల్లా.

# బైబిలు పద్యకావ్యము.

శ్రీరాజా భుజంగరాయ ప్రణీతము.

ప్రపంచమునందుగల మతములు పెక్కులు. సర్వ మతసారమును గ్రహించుట మనకు ముఖ్యము. సర్వ సాధారణముగా లోకమున జనులు మూడువంతులు క్రైస్తవ మతావలంబకులైయున్నారు. ఇట్టివ్యాప్తిం జెందియున్న యీమతసారముంగూర్చి గ్రహించుట యందఱికి నవసరము. ఇదివరకు బైబిలు వచనము మంచి తెలుగులో లేకుండుటచే నాంధ్రులు చదువుకొని యానందించుటకు వీలగునట్లు పద్యకావ్యములో నిర్దుష్ట మయిన యాంధ్రభాషలో వ్రాయఁబడినది. కావున భాషా భిమానులు, మతాభిమానులునగువారు చదివి యా మోదింతురు గాకయని కోరుచున్నాము.

| | | | |
|---|---|---|---|
| 1. | మత్తయిసువార్త | ... | 0—4—0 |
| 2. | మార్కుసువార్త | ... | 0—4—0 |
| 3. | లూకాసువార్త | ... | 0—4—0 |
| 4. | యోహానుసువార్త | ... | 0—4—0 |
| 5. | అపొస్తలులకార్యములు | | 0—4—0 |
| 6. | రోమీయులు | ... | 0—2—0 |
| 7. | గలతీయులు | ... | 0—0—6 |
| 8. | నీతివాక్యరత్నావళి | ... | 0—0—6 |

**పోస్టుకర్చులు కొనువారే భరించవలెను.**

భారతీ వేర్ హౌస్, ఏలూరు, కృష్ణాజిల్లా.

# SHAKESPEARE.

## చారుమతీపరిణయనాటకము.

కాళిదాసునితో సమానుఁడని ప్రసిద్ధిం గాంచిన షేక్స్పియరు మహాకవి నాటకములు ప్రపంచమునం దెల్లెడల మెప్పువడసినవి. అందు గొన్నిటి నాంగ్లభాషలోనికి గొందఱు భాషాంతరీకరించిరిగాని మన దేశీయులకు రుచించురీతిని చేయకుండుటచే నవి విశేషించి వెల్లడిలోనికి రాలేదు. అందు మనదేశమున కనుగుణమగు స్వల్పమార్పులఁజేసి తెలిగించిన బాగుండునని యెంచియు నామహాకవియూహలును, రచనా నైపుణియు, మనదేశీయులకుఁ దెలుపఁ దలంచియు మేమీపనికిఁ దొరకొంటిమి "As you like it" అనునాటకమును పైఁజెప్పినరీతిని నాంధ్రీకరించుచున్నాము. ఇది మన తెనుఁగువారికందఱికి నానందసంధాయకము కాఁగలదని నిశ్చయముగఁ జెప్పఁగలము. అందఱునుదీనిని చదివి వారియభిప్రాయముల దెలుపఁగోరెదము. ఇయ్యది సకలజనాదరణీయమగు నేని నాలుగుమాసములకొక నాటకముచొప్పున నొకదానివెనుక నొకటి తెల్గించి ప్రచురింపఁ దలంచితిమి. ఈనాటకమునకు "చారుమతీ పరిణయము" అని పేరిడితిమి. సులభసాధ్యముగ నుండుటకును వెల రు. 0—6—0 లు మాత్రమే యేర్పరచితిమి. భాషాభిమానులందఱు నీనాటకముల నాదరింపఁ బ్రార్థితులు. (అచ్చులోనున్నది)

భారతీ వేర్ హౌస్,

ఏలూరు, కృష్ణాజిల్లా.